# తా ప్రవచనములు

ఆచార్య వినోబా భావే




అనువాదము

డాక్టరు. వెంపటి సూర్యనారాయణ

# గీతా ప్రవచనములు



★

రచన

ఆచార్య వినోబా భావే

అనువాదము

డాక్టరు వెంపటి సూర్యనారాయణ

★

ఐదవ కూర్పు : 20,000 ప్రతులు

★

ప్రకాశకులు

గ్రామసేవామండలి, నాల్‌వాడీ - వార్ధా

క్యాలికో 1–12–0 1956 మూల్యము ~~1–0–0~~ 1-4-0]

| | | |
|---|---|---|
| 1949 | మొదటి కూర్పు వినయాశ్రమము | 1,000 |
| 1–10–1955 | రెండవ కూర్పు స్వతంత్ర అనువాదము | 5,000 |
| 25–11–1955 | మూడవ కూర్పు | 10,000 |
| 3–3–1956 | నాలుగవ కూర్పు | 15,000 |
| 11–9–1956 | అయిదవ కూర్పు | 20,000 |

★

ప్రతులకు:
డాక్టరు వెంపటి సూర్యనారాయణ
శ్రీ కృష్ణా కన్నుఆసుపత్రి, తెనాలి.
(గుంటూరు జిల్లా)

★

ముద్రణ
ది ఓరియంట్ పవర్ ప్రెస్,
తెనాలి.

# విజ్ఞప్తి

వెనుకటి సంస్కరణముల యెడ ఆంధ్రమహాజనులు చూపిన ప్రేమాదరణలే నన్నీ ఆయిదవ కూర్పు వెలువరించుటకు ప్రోత్సహించినవి. ఈ సంస్కరణముపట్ల కూడ ఆంధ్రమహాజనులు హృదయపూర్వకమైన ఆదరణను జూపి, యందలి అమూల్యభావములు వ్యాపకమగుటకు సహకరించెద రని ఆశించుచున్నాను. నూతనమైన టైపును ఉపయోగించుటవలన ఈ సంస్కరణములో చర్చలు - ఉదాహరణములు జోడించు అవకాశము లభించినది.

ఈ గ్రంథమును పూజ్య వినోబాజీ అఱువదిరెండవ జన్మదినోత్సవ సందర్భమున వెలువరించగలిగినందులకు చాల సంతసించుచున్నాను.

పుస్తకమును సుందరముగా ముద్రించిన తెనాలి ఓరియంటల్ పవర్ ప్రెస్ వారికి నా ధన్యవాదములు.

తెనాలి
11—9—56

ఇట్లు, విన్నవించు
(సం.) వెంపటి సూర్యనారాయణ

# प्रस्तावना

गीता-प्रवचन के तेलुगु अनुवाद की दूसरी आवृत्ति प्रकाशित हो रही है, यह खुशी की बात है। वास्तव में यह नया ही अनुवाद है। मेरे सूचनानुसार भाई सूर्यनारायणने यह परिश्रम किया। इस अनुवाद में केवल हिन्दी अनुवाद पर आधार नहीं रखा है, बल्कि मूल मराठी से भी मिला लिया है। सूर्यनारायण केलिये यह केवल एक प्रेम-कार्य था।

इधर हिन्दी प्रदेश में भूदान-यज्ञ का बीज लोक-हृदय में बोने का काम गीता-प्रवचन ने किया और उसकी हजारों प्रतियाँ गाँव गाँव पहुँची। मुझे उम्मीद है कि आंध्र देश में भी यही अनुभव आयेगा और इससे व्यक्तिगत, और सामाजिक चित्त-शुद्धि में मदद मिलेगी। मैं चाहता हूँ कि विशाल आंध्र के हर गाँव में इसका श्रवण, पठन, चिंतन चले। जहाँ यह चलेगा—

"तत्र श्रीर् विजयो भूतिर् ध्रुवा नीतिर् मतिर् मम"

बिहार का आखिरी पड़ाव
३१.१२.५२

विनोबा

# ప్రస్తావన

'గీతా ప్రవచనము' యొక్క ఆంధ్రానువాదమునకు రెండవకూర్పు జరుగుచున్నది. ఇది సంతోషకరమైన విషయము. వాస్తవముగ [illegible]ధమే! నా సూచన ననుసరించి సోదరుడు సూర్యనారాయణ శాస్త్రి పరిశ్రమ చేసెను.

ఈ యనువాదముపట్ల కేవలము హిందీ యనువాదముపై ఆధారపడక మహారాష్ట్ర మూలముతో పరిపోల్చి చూచుటయు జరిగినది. ఇది సూర్యనారాయణున కొక ప్రియతమమైన పని.

ఇచటి హిందీ ప్రాంతమునందలి ప్రజల హృదయములో భూదాన యజ్ఞబీజము నాటుటకు "గీతా ప్రవచనము" సాయపడెను. దీని ప్రతులు వేలకువేలు గ్రామగ్రామమునను ప్రవేశించినవి. ఆంధ్రదేశమునందును ఈ యనుభవమే కలుగునని నేను నమ్ముచున్నాను. వ్యక్తిగత జీవితమునందును, సామాజిక జీవితమునందును చిత్తశుద్ధి యేర్పడుటకీ గ్రంథము తోడ్పడగలదని నా విశ్వాసము. విశాలాంధ్రలోని ప్రతి గ్రామమునందును దీని శ్రవణము, పఠనము, చింతనము జరుగుగాక యని నే నభిలషించుచున్నాను.

ఎచట నిది జరుగునో

"తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ."

బీహారులోని చివరమజిలి,
౩౧-౧౨-౫౪

వినోబా

# వెనుకటి కూర్పుల విజ్ఞప్తి

గీతా ప్రవచనములు మొదటి, రెండవ సంస్కరణముల యెడ ఆంధ్ర మహాజనులు చూపిన ప్రేమయే యీ మూడవ సంస్కరణమునకు కారణము. నా మొదటి కూర్పు 5000 ప్రతులు అయిదువారములలో ఖర్చుకాగా రెండవ కూర్పు 10000 ప్రతులు ప్రచురితము లయ్యెను. సామాన్య ప్రజకు దీనివెల అందుబాటులో నుండవలెనన్న పూజ్య వినోబాజీ సూచనపై ఈ మూడవ కూర్పున విషయమును తగ్గింపకుండ 'ఇండెక్సు'ను మాత్రమే తగ్గించి వెనుకటి టైపులోనే స్థలమును పొదుపుచేసి కొన్నిపుటలు తగ్గింపగల్గితిని. ఈ సంస్కరణముపట్ల ఆంధ్రమహాజనులు పూర్వముకంటె హెచ్చు ఆదరమును చూపి ఇంటింట ఈ గ్రంథమునకు ప్రవేశము కలిగించగలరని ఆశించుచున్నాను.

1932 వ సంవత్సరమున ఆచార్య వినోబాభావే ధూలియా జైలులో నుండి మహారాష్ట్రభాషలో కావించిన భగవద్గీతోపన్యాసములను శ్రీసానేగురూజీ గ్రంథస్థము చేసిరి. ఆ పుస్తకము 'గీతాప్రవచనము' అనుపేర హిందీ, గుజరాతీ, తమిళము, మళయాళము, సింధి మొదలగు భాషలలోనికి అనువదింపబడి బహుళ ప్రచారము పొందినది.

ఈ గ్రంథమునకు సోదరులు శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడు గారి సహాయముతో 'గీతా ప్రవచనములు' అనుపేర ఆంధ్రానువాద మొనరించి 1955 వ అక్టోబరు 1 వ తారీఖున మొదటి సంస్కరణము వెలువరించితిని. మా మిత్రులు శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు దీనిని లాక్షణికముగా పరిశీలించి అన్ని కూర్పులందును ఎంతో శ్రమించి సాయపడిరి. ఈ యుభయులకు నా కృతజ్ఞతా పూర్వక వందనములు సమర్పింతును.

ఈ పుస్తకమును ప్రచారము చేయుటలో మొదటినుండియు శ్రద్ధతో సహకరించుచున్న ఆంధ్ర, హైదరాబాదు భూదానసమితులవారికి నా వినయాంజలులు.

ద్వితీయ సంస్కరణను అందుకొనుచు పూజ్యవినోబాజీ నాకిట్లు వ్రాసిరి: "ఉత్తరము పుస్తకములు అందినవి. నేటిసభలో అవి ఉపయోగపడినవి కూడ. ప్రప్రథమమున నాతరపున ముద్రణాలయము వారికి నా ధన్యవాదముల తెలుపుము. వారు వ్యవధి తక్కువయినను పనిమాత్రము చక్కగా జేసిరి. ఇది కేవలము పరోపకారముతో కూడినపని. ఇందు ముద్రణాలయమువారి నుండి ప్రేమపూర్వకమైన సహకారము ఎల్లపుడు లభించుచుండుననే ఆశించితిని."

పూర్వముకంటె మిక్కిలి శ్రద్ధతీసికొని ఈ గ్రంథమును సుందరముగ ముద్రించిన భారతీముద్రణాలయమువారి సౌజన్యమును మఱవజాలను.

తెనాలి
8—8—1956

ఇట్లు విన్నవించు
(సం) వెంపటి సూర్యనారాయణ

/

# విషయసూచిక

పేజి

1

# గీతా ప్రవచనములు

## మొదటి అధ్యాయము

### ప్రస్తావరూపమైన కథ - అర్జున విషాదము

**1.** మహాభారతములో మధ్యభాగము

ప్రియ సోదరులారా! నేటినుండి నేను భగవద్గీతనుగూర్చి చెప్పెదను. గీతకును నాకును గల సంబంధము తర్కాతీతమైనది. తల్లిపాలవలన నా శరీర మెంతగా పోషింపబడినదో, అంతకు చాలరెట్లు నాహృదయము, బుద్ధి గీతామాత యొక్క పాలతో పోషింపబడుచున్నవి. హృదయసంబంధమున్నచోట తర్కము నకు చోటులేదు. తర్కమును వదలి శ్రద్ధ, ప్రయోగము అను రెండు రెక్క లతో నేను గీతాగగనములో యథాశక్తి విహరించుచుందును. నేను సామాన్య ముగ గీతయొక్క వాతావరణములోనే యుందును. గీతయన్న నా ప్రాణ తత్త్వమే. గీతనుగూర్చి నే నెవరితోనైన మాటలాడునప్పుడు గీతాసాగరము మీద ఈదుచుందును; ఒంటరిగా నున్నప్పుడు ఆ యమృత సాగరమునందు లోతున మునిగి కూర్చుందును. గీతామాత చరిత్రమును ప్రతి-ఆదివారమును నేను మీకు వినిపించుటకు ఏర్పాటు జరిగినది. గీత మహాభారతమునం దమర్ప బడి యున్నది. అది మహాభారతముయొక్క మధ్యభాగములో ఎత్తైన దీపమువలె నిలిచియున్నది: దాని వెలుగు మహాభారతమునకెల్ల సోకుచున్నది. ఒకవైపున ఆరు పర్వములు, మరియొక వైపున పండ్రెండు పర్వములు, ఒక పక్షమున ఏడక్షౌహిణులు, రెండవపక్షమున పదునొకొం డక్షౌహిణులు – వీని మధ్యమున గీత యుపదేశింపబడినది.

మహాభారతము, రామాయణము మన రాష్ట్రీయ గ్రంథములు. వానియందు వర్ణింపబడిన వ్యక్తులు మన జీవితముతో ఏకరూపమై పోయినారు. రాముడు, సీత, ధర్మరాజు, ద్రౌపది, భీష్ముడు, హనుమంతుడు మొదలైన రామాయణ మహాభారత పాత్రల చరిత్రలవలన భారతీయుల జీవితమంతయు వేలకొలది సంవత్సరములనుండి అభిమంత్రితమై యున్నది. ప్రపంచమునం దితర మహా కావ్యములలోని పాత్ర లీ రీతిగా ప్రజా జీవితములో కలసిపోయినట్లు కనబడదు. అందువలన రామాయణ మహాభారతములు నిస్సందేహముగ అద్భుతమైన గ్రంథ ములు. రామాయణ మొక మధురమైన నీతి కావ్యమైనచో, మహాభారత మొక

వ్యాపకమైన సామాజిక శాస్త్రము. వ్యాసదేవుడొక లక్ష సంహితలను వ్రాసి, అసంఖ్యాకములైన చిత్రములను, ప్రవర్తనములను మిక్కిలి కౌశలముతో యథాతథముగ చిత్రించినాడు. పరమేశ్వరు డొక్కడు తప్ప కేవలము నిర్దోషి యైనవాడు ఎవ్వడును ఉండడు; ఆ విధముగనే కేవలము దోషభూయిష్ఠుడు కూడ ఈ ప్రపంచమునం దెవ్వడును ఉండడు. ఈవిషయమును మహాభారతము బాగుగ స్పష్టపరుచుచున్నది. ఇందు భీష్ముడు, ధర్మరాజు మొదలగు వారి దోషములు కనుపరుపబడినట్లే కర్ణదుర్యోధనాదుల సద్గుణములుకూడ చూపబడినవి. మానవజీవితము తెలుపు నలుపు దారములతో నేయబడిన యొక వస్త్రమని మహాభారతము నిరూపించుచున్నది. వ్యాసదేవుడు నిర్లిప్తతతో ఈ మహాప్రపంచ జీవితమును చీకటి వెలుగులతో కూడిన చిత్రముగ ప్రదర్శించి వాడు. మిక్కిలి నిర్లిప్తము, ఉదాత్తము అయిన వ్యాసదేవుని గ్రంథకౌశలము వలననే మహాభారత మొక పెద్ద బంగారు గనియైనది. దీనిని శోధించి, కావలసి నంత బంగారమును మనము హస్తగతము చేసికొందము గాక !

వ్యాసదేవు డింతటి మహాభారతమును రచించెను, కాని యందు తానుగ చెప్పవలసిన దేమైన నుండెనా లేదా ? తానేదైన ప్రత్యేక సందేశమును ఆ గ్రంథ ములో నెక్కడనైనను ఇచ్చియుండెనా ? తాను గ్రంథముతో నేకరూపమైన చోటెక్కడ ? ఎక్కడి కక్కడ తత్త్వజ్ఞానమును, ఉపదేశములును కుప్పలు తిప్పలుగ మహాభారతములో నిండియున్నవి. ఈ తత్త్వజ్ఞానమునకును, ఉప దేశమునకును, గ్రంథమున కెల్లను సారభూతమైన రహస్యము నెక్కడనైన వ్రాసెనా ? ఆఁ ! వ్రాసియున్నాడు. మహాభారతమునుండి నవనీతమును తీసి దానిని వ్యాసుడు భగవద్గీతా రూపమున మన కందించినాడు. గీత వ్యాస దేవుడు మనకు నేర్పిన ముఖ్యమైన గుణపాఠము. అది అతని చింతనయొక్క సారసంగ్రహము. దీనిని బట్టియే "మునులలో నేను వ్యాసుడను" అనువిభూతి అక్షరశః సార్థక మగుచున్నది. ప్రాచీనకాలమునుండియు గీతకు ఉపనిషత్తను పదవి లభించియున్నది. గీత ఉపనిషత్తుల కుపనిషత్తు; ఎందువలన ననగా ఉపనిషత్తు లన్నింటినుండి పిదికిన గీతాక్షీరమును భగవంతుడు అర్జునుని నిమిత్తముగ జేసికొని, ప్రపంచమున కందించినాడు. జీవిత వికాసమున కవ సరమైన ముఖ్యభావము లన్నియు గీతలో వచ్చివేసినవి. కావున అనుభవజ్ఞులు గీతను ధర్మజ్ఞానమునకు నిఘంటువనుట యథార్థమే ! చిన్నదైనను గీత హిందూధర్మమున కొక ముఖ్యగ్రంథము.

గీతను శ్రీకృష్ణుడు చెప్పినాడని అందరెరిగిన విషయమే. ఈ మహాబోధనమును వినిన భక్తుడైన అర్జునుడు దీనితో నేక రూపమైనాడు. అందుచేత అతనికి కూడ "కృష్ణుడు" అను పేరు లభించెను. భగవంతునకును, భక్తునకును హృద్గతమైన భావములను ప్రకటించుచు వ్యాసదేవుడు వారితో ఏకరూపమైనాడు. అందువలన ప్రజ లతనినికూడ కృష్ణుడనియే పిలిచినారు. చెప్పువాడు కృష్ణుడు, వినువాడు కృష్ణుడు, రచించువాడు కృష్ణుడు – ఈ విధముగ ముగ్గురిలో అద్వైత ముత్పన్నమై వా రేకరూపమును పొందిరా యన్నట్లున్నది. గీత నభ్యసించుట కిట్టి యేకాగ్రతయే అవసరము.

## 2. అర్జునునికి గీతకు గల సంబంధము

గీత రెండవ యధ్యాయముతో ప్రారంభమైనట్లు భావింపవలెనని కొందర మతము. రెండవ యధ్యాయములోని పదునొకొండవ శ్లోకమునుండి ప్రత్యక్షముగ ఉపదేశము ప్రారంభమగును. కనుక అక్కడనుండియే గీత ఆరంభమైనట్లు ఎందులకు భావింపరాదని కొందరందురు. ఒకరు నాతో "అక్షరములలో 'అ' కారమును ఈశ్వరవిభూతిగా భగవంతుడే చెప్పినాడు కదా! "అశోచ్యా నన్వశోచస్త్వం" అను శ్లోకారంభములో అప్రయత్నముగ అకారము వచ్చినది. అందువలన అక్కడనుండియే గీత ప్రారంభమైనట్లుగ భావింపవలె" నన్నారు. ఈ వాదమును మనము వదలివేసినను, ఇదే గీతారంభమనుకొనుట అనేక విధముల ఉచితము. ఐనను దాని పూర్వమందున్న ప్రస్తావమునకు కూడ మహత్త్వము ఉండనే యున్నది. అర్జును డేభూమికపై నిలిచినాడో, ఏ సిద్ధాంతమును ప్రతిపాదించుటకు గీత పుట్టినదో – ఈ విషయములను ప్రస్తావ భాగము లేనిచో మనము బాగుగ గ్రహింపలేము.

అర్జునుని పిరికితనమును పోగొట్టి అతనిని యుద్ధ ప్రవృత్తుని చేయుట కొరకే గీత చెప్పబడినదని కొందరందురు. గీత కేవలము కర్మయోగమునే కాక యుద్ధయోగమునుకూడ ప్రతిపాదించుచున్నదని వారి మతము. కాని కొంచెము విచారించినచో ఇందలి దోషము మన కవగతము కాగలదు. పదునెనిమిది యక్షౌహిణుల సేన పోరాటమునకు సిద్ధమై యుండెను. కాగా ఆ సేనకు తగిన నాయకునిగ చేయుటకే యందురా భగవంతుడు గీతను అర్జునునకు బోధించినది? భయపడిన దర్జునుడుకాని సేనకాదు. అట్లని అర్జునుని యోగ్యతకంటె సేన యోగ్యత యెక్కువదా ? ఎక్కువ దనుకొనుట ఊహాతీతము. అర్జునుడు పోరాటమునకు విముఖుడగుట భయమువలన కాదు. వందలకొలది యుద్ధములలో తన

శౌర్యమును ప్రదర్శించిన మహావీరు డతడు. ఉత్తరగోగ్రహణ సందర్భమున అత డొకడే భీష్మ, ద్రోణ, కర్ణాదుల నందరిని ఓడించెను. సదా విజయుడు. నరులలోనెల్ల నిజమైన నరుడు అత డొక్కడే. వీరవృత్తి యతని రోమరోమము నుండియు ఉట్టిపడుచుండును. అర్జుననకు పౌరుషము తెప్పించుట కొరకును, అతనికి ఉత్తేజము కలిగించుట కొరకును కృష్ణుడుకూడ అతనిలో పిరికితనము నారోపించి చూచినాడు. కాని కృష్ణుని యా ప్రయోగము నిరుపయోగమయ్యెను. అందుచేత నితర హేతువాదములను ప్రయోగించి జ్ఞానవిజ్ఞాన సంబంధమైన యుపదేశములను అర్జునునికి చేయవలసివచ్చెను. కనుక కేవలము అర్జునుని పిరికితనమును పటాపంచలు చేయుట కొరకే గీత చెప్పబడలె దనుట సువిదితము.

అర్జునునిలోనున్న అహింసావృత్తిని తొలగించి అతనిని యుద్ధప్రవృత్తుని చేయుటకొరకు గీత చెప్పబడెనని మరికొందరందురు. నా దృష్టిలో ఈమాటకూడ సరికాదు. ఈ విషయవిచారణ చేయుటకు ముందు మన మర్జునుని భూమికను తెలిసికొనవలె. ఇందు నిమిత్తము మొదటి యధ్యాయమును, రెండవ యధ్యాయములో దానికి సంబంధించిన మొదటి పది శ్లోకములును మనకు చాల సాహాయ్యపడును.

అర్జునుడు కృతనిశ్చయుడయి కర్తవ్యభావముతోనే సమరభూమికివచ్చి నిలబడినాడు. క్షాత్రవృత్తి యతని స్వభావమునందేయుండెను. యుద్ధములోనికి దిగకుండుటకుగాను పాండవులు చేయదగిన ప్రయత్నము చేసిచూచినారు. కాని యుద్ధము తప్పినదికాదు. కనీసపు కోరికల ప్రస్తావన, శ్రీకృష్ణునివంటివాని మధ్యవర్తిత్వము రెండును విఫలమై పోయెను ఇట్టి స్థితిలో అనేక దేశముల రాజులను ప్రోగుచేసి, తనసారథిగా నుండుటకు శ్రీకృష్ణుని ఒప్పించి, తాను రణరంగమున నిలిచి వీరోచితమైన యుత్సాహముతో అర్జునుడు శ్రీకృష్ణునితో ఇట్లన్నాడు : "కృష్ణా, రెండుసేనల మధ్యను నా రథమును నిలుపుము. నాతో యుద్ధముచేయ సిద్ధమై వచ్చిన వారి ముఖవైఖరి నొక్కసారి చూచెద గాక!" కృష్ణుడట్లె చేసెను. అర్జునుడు నలువైపులకును దృష్టిసారించెను. అప్పుడతనికి కనిపించినదేమి ? ఇరుపక్షములయందును ప్రచండమైన బంధుమిత్రుల సమూహములే కానిపించెను. చచ్చుటకును, చంపుటకును అంతిమ నిశ్చయముతో వచ్చి చేరిన నాలుగుతరముల ఆప్తులను. స్వజనులను, తాతలను, తండ్రులను, కుమారులను, మనుమలను అతడక్కడ చూచెను. ఇంతకు పూర్వము అత డూహింపని స్థితి కాదది. కాని ప్రత్యక్ష దర్శనము వలన కలుగు పరిణామము

ప్రత్యేకముగనే యుండును. స్వజనముల సమూహమును చూచిన మీఁదట అతని హృదయములో అశాంతి వ్యాపించెను. అతడు ఖిన్నుడయిపోయెను. నేటివర కతడనేక యుద్ధములలో అసంఖ్యాకులగు వీరులను సంహరించియే యుండెను. అప్పు డతడు ఖిన్నుడు కాలేదు; అతని గాండీవము చేతినుండి జారిపడలేదు; శరీరము కంపించియుండలేదు. నేత్రములు చెమ్మగిలి యుండలేదు. కాని ఇప్పు డట్లెందులకయినది ? అశోకునివలె అతని మనస్సులో అహింసావృత్తి యుద యించెనా ? లేదు. అది కేవలము స్వజనాసక్తి. ఈ సమయమునకూడ గురు వులు, ఆప్తులు, బంధువులు ఎదుటలేకుండినచో అతడు శత్రువుల తలలను బంతులవలె ఎగురగొట్టి యుండెడివాడే. కాని ఆసక్తిజనితమైన యీ మోహము అతని కర్తవ్యనిష్ఠను మ్రింగివేసెను. అప్పు డతనికి తత్త్వజ్ఞానము జ్ఞప్తికి వచ్చెను. కర్తవ్య నిష్ఠకలవాడు మోహగ్రస్తుడైనప్పుడుకూడ నగ్నరూపములో కర్తవ్యచ్యుతుడగుట సహింపలేడు. అప్పుడతడు ఆ పతనమున కేదో యొక ధర్మసూత్రపు బురఖా తొడుగును. ఇక్కడ అర్జునున కిదే స్థితి కలిగినది. అసలు యుద్ధమే పాపకార్యమని అత డొక కృత్రిమ ప్రతిపాదనను లేవదీసెను. యుద్ధమువలన కులక్షయమగునని, ధర్మము నశించునని, స్వేచ్ఛాచారము ప్రబలునని, వ్యభిచారవృత్తి వ్యాపించునని, క్షామము వచ్చిపడునని, రకరకము లగు సంకటములు సమాజము నావరించునని, అనేక యుక్తివాదములతో అర్జునుడు కృష్ణునికే నచ్చజెప్ప నారంభించెను.

ఇక్కడ నాకొక న్యాయాధికారిని గూర్చిన కథ జ్ఞప్తికి వచ్చుచున్నది. ఒక న్యాయాధీశు డుండెను. అతడు వందల కొలది నేరగాండ్రకు ఉరిశిక్ష విధించి యుండెను. కాని యొక దినమున న్యాయమూర్తియొక్క కుమారుడే హత్యా దోషారోపణమీద అతనియొద్ద హాజరుపెట్టబడెను. కుఱ్ఱవానిపై మోపబడిననేరము రుజువయ్యెను. న్యాయాధిపతి తన కుమారునికే తాను ఉరిశిక్ష విధింపవలసి వచ్చెను. అప్పుడతడు ముందువెనుకలాడ జొచ్చెను. ఇక బుద్ధివాదమును లేవ నెత్తి" ఉరిశిక్ష చాల అమానుషకృత్యము. ఇట్టి శిక్ష విధించుట మానవునికి శోభనీయదు. దీనివలన అపరాధి సంస్కరింపబడునను ఆశకు తావులేదు. హంత భావోద్రేకములో హత్యచేయును. కాని హత్యచేసినప్పటి యుద్రేకము దిగిపోయిన తరువాత వానిని యథావిధిగ ఉరికంబ మెక్కించి ప్రాణము తీయుట సభ్యత కల మానవునికి గొప్ప కళంకము, లజ్జాకరమైన పని" యని యీ విధముగ న్యాయాధిపతి యుక్తివాదము చేయ నారంభించెను. తన కుమారుడే నేర

గాడుగ తన యెదుటికి తేబడకుండినచో న్యాయాధీశుడు జంకుగొంకులులేక ఉరిశిక్షలు విధించుచునే యుండువాడు. కాని న్యాయాధిపతి తనకు కుమారుని యందుండిన మమకారము వలన ఈవిధమైన మాటలు మొదలుపెట్టినాడు. ఇవి హృదయములోనుండి పుట్టినవికావు, ఆసక్తినుండి పుట్టినవి. 'వీడు నా కుమారుడు' అను మమకారమునుండి ఈ వాఙ్మయము వెలువడినది.

అర్జునుని స్థితికూడ ఈ న్యాయాధీశుని స్థితివంటిదే. అతడు చేసిన వాదము తప్పుకాదు. కడచిన మహాయుద్ధములో ప్రపంచమంతయు సరిగా నీపరిణామము లనే కన్నారచూచెను. కాని అర్జునునికి పుట్టినది తత్త్వజ్ఞానము కాదని, కేవలము ప్రజ్ఞావాదమని మనము గమనింపవలసి యున్నది. కృష్ణునికిది తెలిసిన విష యమే. అందువలన నతడు అర్జునుని వాదము నించుకయు సరకుగొనక మోహనాశకమగు ఉపాయమును సూటిగా బోధింప మొదలు పెట్టినాడు. అర్జును నిది నిజముగ అహింసావాదమే యయినచో అతని కెవరెన్ని జ్ఞానవిజ్ఞానోపాయ ములు చెప్పినను, అసలు విషయమును గూర్చి సరియగు జవాబు లభింపనంత వరకు అతనికి తృప్తికలిగి యుండెడిదికాదు. కాని గీతయందు ఈవిషయమును గూర్చిన జవాబెక్కడను ఈయబడకపోయినను అర్జునుడు తృప్తిపడెను. అర్జు నుని దహింసావృత్తి కాదనియు, అతనిది యుద్ధప్రవృత్తియే యనియు దీనిలోని భావార్థము. యుద్ధ మతని దృష్టిలో స్వభావసిద్ధము, అనివార్యము అయిన నిశ్చిత కర్తవ్యము. మోహవశుడై దాని నతడు తప్పించుకొన జూచెను. గీత యొక్క గదాప్రహరణము ముఖ్యముగ నీ మోహముమీదనే.

### 3. గీతాప్రయోజనము : స్వధర్మవిరోధియగు మోహమును నిరాకరించుట

అర్జునుడొక అహింసాధోరణినేకాక సంన్యాసపు ధోరణిని కూడ మాటలాడ నారంభించెను. రక్తపాతముతో గూడిన క్షాత్రధర్మముకంటె సంన్యాసమే మేలని యతడనెను. కాని యది అర్జునుని స్వధర్మమా ? అతని కా మనోవృత్తి కలదా ? అర్జునుడు సంన్యాసి పాత్రను మిక్కిలి సమర్థతతో ధరింపగలడే కాని ఆ మనోవృత్తి యతని కెట్లబ్బగలదు ? సంన్యాసముపేరిట అతడొకవేళ అరణ్యమునకు వెళ్ళియున్నను అతడక్కడ మృగములను చంపియుండెడివాడే. అందువలన భగవంతు డతనితో " అర్జునా, ' యుద్ధముచేయ'నని నీవు చెప్పుట వట్టిభ్రమ. నేటివరకు కేది నీ స్వభావమైయుండెనో, అది నీచేత యుద్ధముచేయించ కుండ నిన్ను విడిచిపెట్టదు " అని స్పష్టముగ చెప్పివేసెను.

అర్జునునికి స్వధర్మము పరధర్మముగ గోచరించెను. కాని స్వధర్మ మెంత విగుణమై కనిపించినను, మానవుడు స్వధర్మమునందే నిలిచి తాను వికాసమును పొందవలెను. ఎందువలన ననగా స్వధర్మ నిర్వహణమునందే అతడు వికాసమును పొందగలడు. ఇందు దురభిమానమున కేమియు తావు లేదు. వికాసమున కిదే సూత్రము. గొప్పదని తలచి స్వీకరింపవలసినదియు కొలదిదని చెప్పి విసర్జింప వలసినదియు కాదు స్వధర్మము. వస్తుతః అది గొప్పదియుకాదు. కొలదిదియుకాదు. అది మనకు సంప్రదాయసిద్ధముగ సంక్రమించునది. "శ్రేయాన్ స్వధర్మోవిగుణః" అను గీతావాక్యములోని 'ధర్మము'నకున్న అర్థము హిందూ, క్రైస్తవ, ఇస్లామ్ మొదలగు ధర్మముల అర్థమువంటిది కాదు. ప్రతివ్యక్తికిని తన ప్రత్యేక ధర్మముండును. ఇక్కడ నా యెదుట నున్న రెండువందలమందికి రెండువందల ధర్మము లున్నవి. పది సంవత్సరములకు పూర్వ మేది నా ధర్మమో ఈ నా డది కాదు. నేటిది పదిసంవత్సరముల తరువాత ఉండబోదు. ఆత్మనిరీక్షణమువలన అనుభవమువలన మనోవృత్తులు మారుచుండునట్లే, మొదటి ధర్మము వదలిపోయి నూతనధర్మము ప్రాప్తించుచుండును. మొండిపట్టుతో దేనినిగూడ సాగింపరాదు.

మరియొకని ధర్మ మెంత శ్రేష్ఠముగ కనిపించినను, దానిని స్వీకరించుట నాకు శుభప్రదముకాదు. సూర్యుని ప్రకాశము నాకు ప్రియము. దానివలన నేను వృద్ధిచెందుచున్నాను. సూర్యుడు నాకు వందనీయుడుకూడ. కాని పై కారణములవలన నేను పృథ్విని వదలిపెట్టి సూర్యుని సమీపించుటకు పరిశోధన చేసినచో కాలి భస్మమై పోదును. అట్లుగాక ఈ పృథ్విపై నివాస మెంత విగుణముగ తోచినను, సూర్యుని యెదుట భూమియెంత అల్పమైనదయినను, భూమి స్వయంప్రకాశము కాకున్నను, సూర్యుని తేజస్సును సహింపగలుగు సామర్థ్యము నాకు కలుగనంతవరకును సూర్యునికి దూరముగ ఇక్కడనేయుండి నేను వికాసము పొందవలసియుండును. "నీటికంటె పాలు విలువగల వస్తువు, కనుక మీరు పోయి పాలలో నివసింపుడు" అని యెవడైన చేపలతో అనినచో అవి అందులకు సమ్మతించునా? చేపలు నీటిలోనే బ్రతుకగలవు, పాలలో చనిపోవును.

మరియొకని ధర్మము సులభమనిపించినను దానిని స్వీకరింపరాదు. తఱచుగా ఆ సరళత ఆభాస మాత్రమే. ఎవడైన గృహస్థు తన బిడ్డలను సరిగా పోషింపలేక విసుగుజెంది సంన్యాసమును తీసికొన్నచో ఆ సంన్యాస మతనికి బరువగుటయేకాక కపటనాటకముకూడ నగును. అవకాశము కలిగినంతనే

వాని వాసన లతనిని గట్టిగా పట్టివేయును. కుటుంబభారము మోయలేక అడవి లోనికి పోవు మానవుడు మొదట నక్కడ నొక చిన్నకుటీరమును నిర్మించు కొనును. తరువాత దాని రక్షణకొఱకై చుట్టును నొక కంచెవేయును. తరువాత నక్కడ సంసారభారము మరింత పెంచుకొనవలసిన స్థితి వానికేర్పడును. మన సులో నిజముగ సంన్యాసవృత్తియే యున్నచో సంన్యాసము మాత్ర మేమి కష్టము ? సంన్యాసమును సులువుగ పాలించుటకు సాయపడు స్మృతివచనము లుండనే యున్నవి. కాని ముఖ్యమైనది మనోవృత్తి. ఎవనియందెట్టి నిజమైన వృత్తికలదో దాని ననుసరించియే వాని ధర్మముండును. గరిష్ఠము, కనిష్ఠము, సరళము, కఠినము అను ప్రశ్నయే లేదు. నిజమగు వికాసము కలుగవలె. నిజ మైన పరిపక్వస్థితి కలుగవలెను.

కాని కొందరు ఆవేశపరులు ఇట్లందురు. "యుద్ధధర్మముకంటె నెప్పటి కైనను సంన్యాసమే శ్రేష్ఠమైనచో, భగవంతు డర్జునుని నిజమైన సంన్యాసిగ నేల చేసియుండలేదు ? ఆయన కది యసాధ్యమైన పనియా ?" భగవంతుని కేదియు అసాధ్యముకాదు. కాని అందులో అర్జునునికి పురుషార్థ మేమున్నది ? పరమేశ్వరుడు మానవుని స్వతంత్రునిజేసినాడు. కనుక ప్రతివానికిని స్వప్రయ త్నములోనే రుచి యున్నది. చిన్నపిల్లలు తమంత దాము బొమ్మలు గీయు టలో ఆనందమును పొందుదురు. మరొకరు తన చేయి పట్టుకొని గీయించుట కుఱ్ఱవాని కిష్టముకాదు. ఉపాధ్యాయుడు తన ప్రశ్నలకు తానే జవాబులు చెప్పుచుపోయినచో నిక విద్యార్థుల బుద్ధి వికసించుటెట్లు ? కనుక తల్లి దండ్రు లును గురువును చేయవలసిన పని విద్యార్థికి మార్గము చూపుట మాత్రమే. పరమేశ్వరుడు లోపలినుండి మనకు సూచనల నిచ్చుచుండును. ఇంతకుమించి అతడేమియు చేయడు. భగవంతుడు కుమ్మరివలె మనలను తపతప కొట్టి అంద ఱను ఒకరకపు పోతబొమ్మలుగనే తయారు చేయుటలో సారమేమున్నది ? మనము మృన్మయులము కాము, చిన్మయులము.

స్వధర్మమునకు ప్రతిబంధకమగు మోహమును నివారించుటకే గీత జన్మించినదని పై వివేచననుబట్టి మీరు గ్రహించియుందురు. అర్జునుడు ధర్మసమ్మూఢుడయి యుండెను. స్వధర్మ విషయమున నతని మనస్సున మోహ ముదయించి యుండెను. మొదట శ్రీకృష్ణు డతనియందు నిందారోపణ చేసిన తరువాత అర్జును డీ విషయమును తనంతట తానే ఒప్పుకొనెను. ఆ మోహమును, మమత్వమును, ఆసక్తిని తొలగించుటయే గీతయొక్క ముఖ్యమైన

వని. ఇందుచేతనే భగవంతుడు గీత నెల్లను వినిపించి, "అర్జునా, ఇప్పుడు నీ మోహమంతయు తొలగిపోయెనుగదా!" అని యడిగెను. "ఔను ప్రభూ, తొలగిపోయినది. స్వధర్మము నాకు బోధపడినది" అని యర్జునుడు జవా బిచ్చెను. ఈ విధముగ గీతయొక్క యుపక్రమణమును, ఉపసంహారమును కలిపి చూచినచో మోహనిరసనమే గీత వలని ఫలితమని తేలును. గీతయేకాదు, మహాభారతమంతయు ఈ యుద్దేశమునే వెలిపుచ్చుచున్నది. మానవుని హృద యము నావరించియున్న మోహమును తొలగించుటకే ఈ యితిహాస దీపమును వెలిగించుచున్నానని వ్యాసుడు భారత ప్రారంభమునందే చెప్పియున్నాడు.

**4. ఋజుబుద్ధికలవాడే యధికారి**

ముందున్న గీతనెల్లను అవగాహన చేసికొనుటకు అర్జునుని యీ భూమిక మనకు చాలఉపకరించును. అందుచేతనే మన మతనికి కృతజ్ఞులము. ఈ భూమికవలన నిదికాక మరియొక ఉపకారముకూడ కలదు. అర్జునుని భూమిక వలన అతని మనస్సు మిక్కిలి ఋజువృత్తి కలది యని మనకు తెలియగలదు. అసలు 'అర్జున' శబ్దమునకే 'ఋజువైన వాడు – లేక – సరళస్వభావుడు' అని యర్థము. తన మనస్సునం దుత్పన్నమైన వికారములను ఆలోచనలను అన్ని టిని అర్జునుడు హృదయమును విప్పి భగవంతునియెదుట పెట్టెను. మనస్సు నందు దేనినిగూడ అతడు దాచియుంచుకొనలేదు; చివర కతడు శ్రీకృష్ణుని శరణు జొచ్చెను. నిజమున కతడు మొదటినుండియు శ్రీకృష్ణుని శరణుజొచ్చియే యుండెను. అర్జునుడు శ్రీకృష్ణుని తన సారథిగా జేసికొని, రథాశ్వముల కళ్ళెపు త్రాళ్ళ నతనిచేత బెట్టినప్పుడే తన మనోవృత్తుల కళ్ళెపుత్రాళ్ళనుగూడ కృష్ణుని చేత బెట్టుటకు సంసిద్ధుడై యుండెను. రండు, మనమును అట్లే చేయుదము. "అర్జునునికి కృష్ణుడు దొరకెను. కాని మనకు కృష్ణుడెక్కడ దొరకును ?" అని మనము అనకుందముగాక! కృష్ణుడను వ్యక్తి యొక డున్నాడను ఐతిహాసిక భ్రమలో మనము పడకుందముగాక! కృష్ణు డంతర్యామిగ ప్రతి హృదయము నందును విరాజమానుడై యున్నాడు. అన్నిటికంటెను మనకు దగ్గరనున్న వాడతడే! కనుక మన హృదయ మాలిన్యమంతయు ఆయన యెదుటబెట్టి, "ప్రభూ, నీకు నేను శరణాగతుడను, నీవు నాకు అనన్యగురుడవు. నాకు మేలుచేయు మార్గమును చూపుము. నీవు చూపు మార్గమునే నేననుసరింతును" అని యతనితో అందముగాక! మన మిట్లు చేసినచో ఆ పార్థసారథి మనకుగూడ సారథ్యము చేయును. తన శ్రీముఖమునుండి మన కతడు గీతను వినిపించి, విజయలాభమును చేకూర్చును. (21–2–32)

# రెండవ అధ్యాయము

## ఉపదేశసారము - ఆత్మజ్ఞానము, సమత్వబుద్ధి

### 5. గీతయొక్క పరిభాష

సోదరులారా! వెనుకటి యధ్యాయములో మన మర్జున విషాదయోగ మును చూచితిమి. అర్జునునికున్న ఋజువర్తనమును, హరిపరాయణత్వముమ ఉన్నచోట విషాదముకూడ యోగమే యగును. దీనినే హృదయమథన మందుము. ఈ భూమికకు కారకుడైన వ్యాసుడు దీని కిచ్చిన అర్జున విషాద యోగ మను ప్రత్యేక నామమును వే నీయలేదు. గీత కర్జునుడు నిమిత్త మాత్రుడు కనుక దీనికి విషాదయోగమను సాధారణ నామమును నే నిచ్చి యుంటిని. పండరిపురమున పాండురంగడు కేవలము పుండలీకుని కొఱకే యవతరించినాడని మన మనుకొనరాదు. ఎందుల కనగా పుండలీకుని నిమిత్త మాత్రునిగా జేసికొని, మనవంటి జడజీవుల యుద్ధరణకొఱకు వేలాది సంవత్సర ముల నుండి అతడు నిలిచియున్నట్లు మనమెఱుగుదుము. ఈ విధముగనే గీతా మాత అర్జునుని నిమిత్తముగ జేసికొని మన యందఱిమీదను దయను ప్రసరింప జేయుచున్నది. కనుక గీతలోని మొదటి యధ్యాయమునకు విషాదయోగ మను సాధారణ నామమే బాగుగనుండును. గీత యను వృక్షము ఇక్కడనుండి పెరిగి పెరిగి చివరియధ్యాయములో ప్రసాదయోగమను ఫలమును (ప్రసన్నత్వమును) మన కందించుచున్నది. ఈశ్వరేచ్ఛ యైనచో మనముకూడ ఈ కారాగారవాసపు గడువులోపల చివరకు చేరగలుగుదుము.

రెండవ అధ్యాయముతో గీతాశిక్షణ ప్రారంభమగును. దీని మొదటనే భగ వంతుడు జీవిత మహాసిద్ధాంతములను బోధించుచున్నాడు. జీవితసౌధమును నిర్మించుటకు ఆధార భూతములయిన యీ ముఖ్యసిద్ధాంతములు ప్రారంభము లోనే హృద్గతమైనచో, ముందుమార్గము సరళమగునని భగవంతుని యాశ యము. రెండవ యధ్యాయములో వాడబడిన 'సాంఖ్యబుద్ధి' యను శబ్దమున కర్థము జీవితము యొక్క మూలభూత సిద్ధాంతముల నెఱుంగుట యని నా భావము. ఈ మూలసిద్ధాంతములేవో మనమిప్పుడు చూడవలసియున్నాము. కాని దీనికిముందు సాంఖ్యమను మాటను పురస్కరించుకొని గీతలోని పారిభాషిక శబ్దార్థముల స్పష్టీకరణ కొంతచేసిన మంచిదని నా కనిపించుచున్నది.

పురాతన శాస్త్రీయ శబ్దములకు క్రొత్తయర్థములనిచ్చి వ్రాయుట గీతకు పరిపాటి. సనాతన శబ్దములకు క్రొత్తయర్థములను కల్పించుట భావ విప్లవమునకు అహింసాత్మక సాధనము. ఈ ప్రక్రియలో వ్యాసదేవుడు సిద్ధహస్తుడు. ఇందువలన గీతలోని శబ్దములకు విశాలమగు అర్థములు మనకు లభించినవి. ఇట్లు గీత నిత్య నూతనత్వమును కాపాడుకొన గలిగినది. అనేకులగు వ్యాఖ్యాతలు తమతమ ఆవశ్యకములను, అనుభవములనుబట్టి అనేకార్థములను చెప్ప గలిగిరి. తమతమ భూమికల ననుసరించి యీ యర్థములన్నియు నుచితములే కావచ్చును. మూలమునకు వైరుధ్యము కలుగకుండ స్వతంత్రములగు అర్థములను మనముకూడ చెప్పుకొనవచ్చును.

ఈ సందర్భమున ఉపనిషత్తులోని సుందరమైనకథయొకటి జ్ఞప్తికి వచ్చుచున్నది. ఒకప్పుడు దేవతలు, దానవులు, మానవులు ఉపదేశమును పొందు నిమిత్తము ప్రజాపతి యొద్దకు వెళ్ళిరి. వారందరికిని ప్రజాపతి 'ద' అను ఒక అక్షరమునే ఉపదేశించెను. "మనము కాముకులము, విషయభోగముల వ్యసనము మనల నంటియున్నది. కనుక 'ద' అను అక్షరముద్వారా బ్రహ్మ మనకు దమనము యొక్క ఆవశ్యకమును బోధించెను" అని దేవతలనుకొనిరి. రాక్షసులు "దానవులమైన మనము తీవ్రక్రోధాన్వితులమును, దయాహీనులమునై యున్నాము. 'ద' అను అక్షరముద్వారా ప్రజాపతి మనకు దయాగుణమును బోధించినాడు" అని యనుకొనిరి. ఇక మానవులు "మానవులమైన మనము అతి లోభులము, ధనసంచయాభిలాష వలన ఉన్మత్తులమైపోయితిమి. 'ద' అను అక్షరముద్వారా దానము చేయుడని ప్రజాపతి మన కుపదేశించె" ననుకొనిరి. ఈ ముగ్గురు చెప్పుకొనిన యర్థములును సరియైనవని బ్రహ్మ తలచెను. ఎందుచేత ననగా వారందరును తమతమ యనుభవములనుబట్టియే పై గుణపాఠములను తీసికొనిరి. గీతలోని పరిభాషకు అర్థము చెప్పుకొనునప్పుడు ఉపనిషత్తులోని యీ కథను మనము జ్ఞప్తియం దుంచుకొనవలెను.

## 6. జీవన సిద్ధాంతము, దేహముతో స్వధర్మాచరణ

రెండవయధ్యాయములో జీవితమునకుగాను మూడు మహా సిద్ధాంతములు ప్రతిపాదింపబడినవి. (1) ఆత్మయొక్క అమరత్వము, అఖండత్వము, (2) శరీరముయొక్క క్షుద్రత్వము, (3) స్వధర్మముయొక్క అనివార్యత. వీనిలో స్వధర్మసిద్ధాంతము కర్తవ్యరూపమైనది. మఱి మిగిలిన రెండును జ్ఞానముచేత గ్రహింపవలసినవి. వెనుకటి యధ్యాయములో స్వధర్మవిషయమయి కొంత

చెప్పియున్నాను. స్వధర్మము ప్రకృతిసిద్ధముగనే మనకు ప్రాప్తమగుచున్నది. స్వధర్మమును వెదకిపట్టుకొనుటకు ఎక్కడికిని వెళ్ళనవసరములేదు. మన మేకా కులమై ఆకాశమునుండి ఊడిపడలేదు. మనము జన్మింపకముందే ఈ సమాజ మిక్కడ నుండెను; మన తల్లిదండ్రులు, ఇరుగుపొరుగువారలు ఉండిరి. ఈ ప్రవాహములో మనకు జన్మకలుగుచున్నది. కనుక నన్నుగన్న తల్లిదండ్రు లను సేవించు ధర్మము జన్మసిద్ధముగనే నాకు లభించినది. నేను జన్మించిన సమాజమును సేవించుధర్మము కూడ ఈరీతినే తనకుతానుగ నాకు లభించి నది. మన జన్మతోనే స్వధర్మముకూడ జన్మించినదనుట సత్యమే. అంతేకాదు. మనము పుట్టకముందే మనకుగాను స్వధర్మము తయారై యున్నదనికూడ చెప్పవచ్చును. ఎందులకనగా మన జన్మకుగల హేతువే యది; దాని పరిపూర్తి కొఱకే యీ జన్మము. కొందరు స్వధర్మమును పత్నితో పోల్చుచుందురు; సతీ పతుల సంబంధమెట్లు అవిచ్ఛిన్నముగ తలపబడినదో ఇదియు నట్లే. నాకుమాత్ర మీ యుపమానము గౌణముగ తోచుచున్నది. స్వధర్మమును నేను తల్లితో పోల్చెదను. నాతల్లి 'ఫలానా' యని నిర్ణయించుకొనుపని నాకులేదు. అది మొద టనే నిశ్చితమయ్యెను. ఆమె స్వభావ మెట్టిదైనను నా తల్లి కాదనుటకు వీలు లేదు. స్వధర్మముకూడ నిట్టిదే. ఈ జగతిలో స్వధర్మము వినా మనకు మఱి యే యితరాశ్రయమును లేదు. స్వధర్మమును తప్పించుకొని తిరుగుట తన్ను దాను కాదనుకొను ఆత్మఘాతుక కృత్యమువంటిది. స్వధర్మముయొక్క సాహా య్యముతోనే మనము పురోగమించగలము. కాబట్టి ఎవరును ఎప్పుడును దాని యాశ్రయమును విడనాడజనదు. ఇదే మనజీవితమున కొక మూలభూతసిద్ధాంత ముగ స్థిరమగుచున్నది.

సహజముగ తనంతట తాను ఆచరణలోనికి వచ్చునదే స్వధర్మము. కాని రకరకములైన మోహపుంజములు కారణముగ అట్లు జరుగుటలేదు. లేదా బహుకష్టముతో జరుగుచున్నది. జరిగినను అది విషకలితమై, అత్యంత దోషభూయిష్ఠమై యున్నది. స్వధర్మమార్గములో ముండ్లను వెదచల్లు ఈ మోహజాలము తాల్చు బాహ్యరూపములకు లెక్కలేదు. అయినప్పటికిని మనము వానిని లోతుగా పరిశీలించినట్లయిన వానియన్నిటి యడుగున కానవచ్చునది ఒకవస్తువే; అది సంకుచితమును, క్షుద్రమును అయిన దేహ బుద్ధి. నేను, మఱి నా రక్తసంబంధులు – అంతే. ఇంతవరకే నావ్యాప్తి, ఇంతే నాప్రపంచము. ఈ యావరణకు బయటనున్న వారందరును నాకు పరాయి

వారు, లేక శత్రువులు. దేహబుద్ధి భేదమను గోడను నిర్మించును. 'నేను, నా వారు' అని యనుకొనుచోట కూడ ఈ దేహబుద్ధియే పనిచేయుచుండును. ఇదెంత హాస్యాస్పదము! దేహబుద్ధివలన కలిగిన 'నేను, నావారు' అను ద్వంద్వమున చిక్కుకొని రకరకముల గూడులను మనము నిర్మించుకొనుచున్నాము. తఱచుగ చాలమంది ఈ కార్యక్రమముననే పడియుందురు. ఇందులో ఒకనిగూడు పెద్దదయిన మఱియొకనిది చిన్నది. ఏమైననేమి? ప్రతిదియూ గూడే. చర్మ సంబంధమునుబట్టి యీ గూండ్లలోతు ఏర్పడును. ఒకనిది కుటుంబాభిమానపు గూడైన, మఱియొకనిది దేశాభిమానపుగూడు. బ్రాహ్మణ-బ్రాహ్మణేతర కక్షదొకటి, హిందూ-ముసల్మాను కక్షది మఱియొకటి – ఈ విధముగ నొకటికాదు, రెండుకాదు, లెక్కలేనన్ని గూడులు! ఎటుచూచినను గూడులే గూడులు! ఇక్కడ మన జైలులోకూడ రాజకీయ ఖైదీలని, మఱొకరకపు ఖైదీలని, గూండ్లు ఏర్పడినవి. ఇవిలేనిచో మనము జీవింపనే లేమన్నట్లున్నాము. కాని దీనిపరిణామ మేమి? ఒక్కటే పరిణామము-హీనవికారములను కలిగించు కీటాణువులవృద్ధి, స్వధర్మరూపమైన ఆరోగ్యము నశించుట.

## 7. జీవన సిద్ధాంతము, దేహాతీతమైన ఆత్మజ్ఞానము

ఇట్టిస్థితిలో ఒక్క స్వధర్మనిష్ఠయే చాలదు. అందులకుగాను మఱిరెండు సిద్ధాంతములను శ్రద్ధతో గమనింపవలసియుండును. "మరణశీలమైన ఈ దేహమును నేనుకాను. ఇది కేవలము క్షుద్రమైన పైతొడుగు మాత్రమే" అను సిద్ధాంతమొకటి. "ఎప్పటికిని చావులేనిది, అఖండమును, వ్యాపకమును అయిన ఆత్మను నేను" అనునది రెండవది. ఈ రెండును కలిపిన పూర్ణతత్త్వజ్ఞానము లభించును.

ఈ తత్త్వజ్ఞానము గీతదృష్టిలో అత్యంతము అవశ్యకమైనది. కాననే గీత ముందుగ దీనినే ఆవాహన చేయుచున్నది. తదుపరి స్వధర్మమును బోధించుచున్నది. తత్త్వజ్ఞాన సంబంధమైన యీ శ్లోకములు ప్రారంభములోనే యెందులకని కొందరడుగుదురు. గీతలో నెంతమాత్రమును స్థానము తప్పింపరాని శ్లోకములేవైన నున్నచో అవి యివేయని నా కనిపించును.

ఈ మాత్రపు తత్త్వజ్ఞానము మనస్సునందంకితమైయున్నచో స్వధర్మమేమాత్రమును భారమనిపించదు. ఇంతేకాదు, స్వధర్మ విరుద్ధముగ నేమిచేయవలెనన్నను భారమనిపించును. ఆత్మతత్త్వముయొక్క అఖండత్వము, దేహముయొక్క క్షుద్రత్వము – వీనిని గ్రహించుట యేమాత్రమును కష్టముకాదు. ఈ రెండును సత్యవస్తువులగుటయే దీనికి కారణము. కాని మనము వాని పరి

శీలన మాత్రము చేయవలసియుండును. తిరిగి తిరిగి మనస్సులో వానిని మథింప వలసి యుండును. చర్మముయొక్క మహత్త్వమును తగ్గించి ఆత్మకు మహత్త్వము నిచ్చుట వేర్చుకొనవలసి యున్నాము.

ఈ శరీరము క్షణక్షణమును మార్పుచెందుచుండును. బాల్యము, యౌవనము, వార్ధక్యము –ఈ చక్ర మందఱ యనుభవములో నున్నదే. ప్రతియేడేండ్లకును శరీరము పూర్తిగ మాఱుననియు, ప్రాతరక్తమునందలి ఒక్కబొట్టయినను మిగిలి యుండదనియు అధునిక శాస్త్రజ్ఞు లనుచుందురు. పండ్రెండేండ్లకొకసారి ప్రాత శరీరము నశించిపోవునని మన పూర్వుల నమ్మకము. కావుననే వారు పండ్రెండేండ్ల కొకసారి ప్రాయశ్చిత్తము, తపశ్చర్య, అధ్యయనము మొదలయిన కర్మకాండలు నియమించి యుండిరి. అనేక సంవత్సరముల వియోగముతర్వాత కుమారుడు తల్లిని కలిసికొన్నచో తల్లి వానిని గుర్తింపజాలదు. ఇట్టి కథలను మనము వినుచుందుము. కాని ప్రతిక్షణమును మార్పుజెందుచు, ప్రతిక్షణమును నశించు ఈ శరీరమేనా నీ రూపము ? రేలుంబగళ్ళు మలమూత్రనాళికలు ప్రవహించు శరీరమా నీవు ? గట్టిగాతోమి కడుగు నీవంటి మొనగాడు దొరకినను అస్వచ్ఛతా వ్రతమును వదలిపెట్టని యీ శరీరమేనా నీవు ? అది మలినము, దానిని శుభ్రపరుచువాడవు నీవు; అది రోగి, దానికి మందు మాకులిచ్చువాడవు నీవు. మూడు మూళ్ళున్నరలో ఇమిడిపోవునదది, నీవో త్రిభువనవిహారివి. నిత్య పరివర్తనయే స్వభావముగా కలదది, దాని మార్పులను గమనించు ద్రష్టవు నీవు. అది మృతి నొందునది, మృత్యువును శాసించి నడుపువాడవు నీవు. నీకును దానికిని మధ్య ఇంత స్పష్టమైన భేద మున్నప్పటికిని ఇంత సంకుచితత్త్వము నీ కెట్లబ్బినది ? ఈ దేహముతో సంబంధ మున్నవారే నా వారని యనుట యేమి ? దేహమునకు ప్రాప్తించు మృత్యువు కొఱ కింత శోకముమాత్ర మెందులకు ? "ఓరీ, దేహపతన మెక్కడనైన శోకింపదగినదా ?" యని భగవంతుడు ప్రశ్నించుచున్నాడు.

దేహము వస్త్రము వంటిది. ప్రాతవస్త్రములు చినిగిపోవును. కనుకనే క్రొత్తవి ధరింతుము. ఒక్కశరీరమే శాశ్వతముగ ఆత్మనంటిపెట్టుకొని యున్నచో ఆత్మకు దుర్గతి కలుగును. వికాసమంతయు ఆగిపోవును. ఆనందము లోపించును. జ్ఞానప్రభ మందగించును. అందువలన దేహనాశము శోచనీయము కాజాలదు. నిజమే, ఆత్మ నశించువదైనచో అది తప్పక శోచనీయమే యగును. కాని ఆత్మ నాశరహితము. అదియొక అఖండ నదీప్రవాహము. దానిపైని అనేక

దేహములు వచ్చుచు పోవుచునుండును. ఇందు వలన దేహసంబంధమను చక్రముున చిక్కుకొని శోకించుట, 'వీరు నావారు, వీరు పరాయివారు' అని యెక్కడికక్కడ వేరుచేయుట కేవల మనుచితము. ఈ బ్రహ్మాండమంతయు చక్కగా నేసిన యొక వస్త్రము. చిన్నకుఱ్ఱవాడు కత్తెరను తీసికొని వస్త్రమును ముక్కముక్కలుగ కత్తిరించినట్లే మనము దేహమను కత్తెరతో విశ్వాత్మయను వస్త్రమును తునుకలుచేయుట ఎంత కుఱ్ఱతనము! ఎంత హింస!

బ్రహ్మవిద్యను కని పెంచిన భారతభూమిలోనే చిన్న, పెద్ద భేదములు, వర్గ, సంప్రదాయ, జాతిభేదములు నిండిపోవుట నిజముగ నెంత దుఃఖకరమైన విషయము! దీనికి తోడు మఱి యేచోటను కనబడనంత మృత్యుభయము మన మనసులో పాదుకొని యున్నది. ఈ దురవస్థ దీర్ఘకాలిక పారతంత్ర్యమునకు ఫలమనుట నిస్సంశయము. ఇంతేకాక మన పరాధీనతకు ఇదొక కారణమనియు మనము మఱవరాదు. మరణ మను మాటకూడ మనకు సరిపడదు. మృత్యు వనగనే అమంగళముగ తోచును. 'మరణ మను శబ్దమును సహించము; ఎవరైన మరణించినచో విలపింతుము' అని జ్ఞానదేవు డెంతోదుఃఖముతో వ్రాయవలసి వచ్చెను. ఎవరైన మరణించినపుడు ఇది మనకొక కర్తవ్యము కాదా యన్నట్లు ఎంతెంత యేడ్పులు, పెడబొబ్బలు పెట్టుదుము! ఏడ్చుటకు కూలివాండ్రను పెట్టునంతవఱకు పోయిన దీ విషయము. మృత్యువాసన్నమైనను రోగి కాసంగతి చెప్పరు. బ్రతుకడని వైద్యుడన్నను కూడ రోగి కా మాట చెప్పనే చెప్పరు. అసలు వైద్యుడుకూడ ఉన్నదున్నట్లు చెప్పడు. ప్రాణము పోవువఱకును రోగియొక్క పొట్టలో మందులు పోయుచునే యుండును. ఇట్లుగాక ఉన్నదున్నట్లుచెప్పి, రోగికి ధైర్యస్థైర్యములు గొల్పి, ఈశ్వరుని స్మరించుమనుట ఎంత యుపకారము! కాని ఉన్నదున్నట్లు చెప్పుట వలన, బెంగచేత ముందెప్పుడో పగులనున్న కుండ ఇప్పుడే పగులునేమో యని అతనిభయము. కాని నిర్ణీత సమయమునకు ముందది పగులునా? అదియునుగాక రెండుగంటలలో బ్రద్దలుకానున్న భాండము కొంచెము ముందుగ పోయి నంతమాత్రమున రాగల నష్టమేమి? ఇట్లనుటచే మనము ప్రేమవిహీనులము, కఠినహృదయులము కావలెనని నా తలంపు కాదు. కాని దేహాసక్తిని ప్రేమ యనలేము సరికదా ఆ యాసక్తిని తొలగింపనంత వఱకు నిజమగు ప్రేమ యుదయింపదు.

దేహాసక్తి పోయినప్పుడు దేహము సేవకొక సాధనమని, దేహమున కర్హమైన ప్రతిష్ఠకూడ ప్రాప్తించునని మనకు విదితమగుచున్నది. కాని యీనాడు

మనము దేహపూజనే లక్ష్యముగ జేసికొని కూర్చున్నాము. స్వధర్మాచరణయే లక్ష్యమనుమాట మఱచితిమి. దేహమున కన్నపానీయములిచ్చి పోషింపవలసిన అవసర మున్నదనిన అది స్వధర్మాచరణకొఱకేకాని కేవలము జిహ్వాచాపల్య మును తీర్చుకొనుటకుగాదు. గరిటెతో హల్వావడ్డించినను, లేక అన్నము, పప్పు వడ్డించినను ఒకటే; ఒకదానివలని సుఖముగాని రెండవదానివలని దుఃఖముగాని దానికిలేదు. నాలుకకుకూడ ఈస్థితియే రావలెను. దానికి రసజ్ఞాన ముండవలసి నదే. కాని సుఖదుఃఖములుమాత్ర ముండరాదు. శరీరమున కీయవలసిన బాడుగ నిచ్చివేసితిమా మనపని తీరినట్లే. రాట్నముతో నూలువడుకవలె అందులకని దానికి చమురువేయుట అవసరము. ఈ విధముగనే శరీరముతో పనిచేయవలె. అందుల కని ఈ యింజనునకు బొగ్గువేయుట అవసరము. ఈ రీతిని మనము దేహమును ఉపయోగపరచితిమేని, అది క్షుద్రమయ్యు విలువ గలది ప్రతిష్ఠ గలది యగును.

కాని మన మీ శరీరమును సేవకై వినియోగింపకుండ, దానిలోనే మునిగి తేలుచు, ఆత్మను సంకుచితపరచుకొనుచున్నాము. ఇందువలన వస్తుతః నికృష్ట మైన యీ దేహము మరింత క్షుద్రమై పోవుచున్నది. ఇందుచేతనే దేహము, దేహసంబంధములు నింద్యములనియు, శునక సూకరాదులు వంద్యము లనియు మహాత్ములు ఘంటాపథముగ చెప్పుచుందురు. "ఓరీ, నీవీదేహమును, దేహముతో సంబంధించిన వారిని రేపగళ్ళు పూజింపకుము. ఇతరులనుగూడ నీవారని గుర్తించుట నేర్చుకొనుము. ఈ విధముగ విశాలహృదయుడవు కమ్ము" అని మహాత్ములు మనకు బోధించుచున్నారు. కాని మనకిష్టులైన ఆప్తులనుతప్పించి, మరెవరికైనను మన హృదయములో తావిచ్చుచున్నామా? "ప్రాణముతో ప్రాణమును ఆత్మతో ఆత్మను కలుపుము" అన్నట్లు మనము మెలగు చున్నామా? దేహపంజరమునకు వెలుపలనున్న గాలి నేమైన ఆత్మ హంసకు సోకనిచ్చుచున్నామా? నీవు నిర్మించుకొన్న ఆవరణను ఛేదించుకొని, 'నిన్న నేను పదిమంది క్రొత్తమిత్రులను సంపాదించితిని. ఈ రోజున వారు పదునైదుగురైనారు. రేపు ఏబదిమంది యగుదురు' అని యెప్పుడైన అను కొన్నాడవా? 'ఈ విశ్వమంతయు నాది, నేను దానివాడను' అనెడి యనుభవ మును నీ వెన్నడైన పొందితివా? మనము జైలునుండి మన దగ్గరబంధువు లకు నుత్తరములు వ్రాయుదుము. ఇందువిశేషమేమున్నది? కాని, జైలునుండి విడుదలయైన రాజకీయ-ఖైదీకి కాక ఒక దొంగఖైదీకి వానిని మిత్రునిగా భావించి లేఖ వ్రాయుదుమా?

మనయాత్మ విశాలమగుటకు తహతహ లాడుచుండును. యావజ్జగత్తును కౌగిలించుకొనగోరును. కాని మనముమాత్రము దానిని గోడలమధ్య బంధించు చుందుము. ఆత్మను మనము ఖైదీనివలె చేసి పడవేసితిమి. కాని ఇట్లుచేసితి మను స్ఫురణకూడ మనకులేదు. ఉదయము మొదలు సాయంకాలము వర కును మనము దేహసేవయందే పడియుందుము. ప్రపంచములో మఱి యే యానందమును లేదా యన్నట్లు నా శరీరమెంత పెరిగినది, యెంతతరిగినది? అని అహర్నిశమిదేచింత. భోగలాలసలో, జిహ్వాచాపల్యములో నుండు ఆనందమును పశువులుకూడ అనుభవించుచున్నవి. కాబట్టి త్యాగము, జిహ్వను జయించుట – వీనిలోని యానందముకూడ చవిచూచెదవా చూడవా ? నీవు ఆకలిబాధ పడుచునే నీకై వడ్డించిన విస్తరిని ఆకలిగొన్న మఱియొకనికి పెట్టుటలోగల ఆనందము ననుభవింపుము; అందులోని రుచిని చూడుము. బిడ్డకొఱకై కష్టము లనుభ వించు తల్లికి దీని రుచి కొంత మట్టునకు లభించుచున్నది. తనదని చెప్పి మను ష్యుడు కట్టుకొను సంకుచితమైన ఆవరణలోకూడ ఆత్మవికాసముయొక్క రుచి ననుభవింపవలెనన్న యుద్దేశము తెలియకుండగనే పనిచేయుచుండును. ఎందుల కనగా దేహబద్ధమైన ఆత్మ ఏ కొంచెముసేపో దేహమునుండి బయటికి వ్యాప్తమగును. కాని, యీ వ్యాపనమెటువంటిది ? జైలుగదిలోని ఖైదీ జైలు – ఆవరణలోనికి వచ్చుటవంటిది. కాగా ఇంత మాత్రమున ఆత్మకు తృప్తిలేదు. ఆత్మకు కావలసినది ముక్తానందము.

సారాంశమిది, (1) సాధకుడు అధర్మ పరధర్మముల వక్రమార్గమును వదలి స్వధర్మముయొక్క సహజ సరళ మార్గమును పట్టుకొనవలె. స్వధర్మ మను కామధేనువును అత డెన్నటికిని వదలరాదు. (2) దేహము క్షణభంగుర మని యెఱిగి స్వధర్మముకొఱకే దాని నుపయోగింపవలె. అవసరమైనప్పుడు స్వధర్మముకొఱకే దాని నాహుతి చేయవలె. (3) ఆత్మయొక్క అఖండత్వమును, వ్యాపకత్వమును నిరంతరమును స్మరించుచు స్వ పర భేదములను మనస్సు నుండి పెఱికివేయవలె. భగవాను డీముఖ్య జీవిత సిద్ధాంతములను బోధించు చున్నాడు.ఈ విధానము ననుసరించి పోవు మానవుడు నిస్సందేహముగ ఈ నరదేహముతోనే సచ్చిదానంద పదమును హస్తగతము చేసికొనును.

## 8. పైరెండు సిద్ధాంతములకును సామరస్యమును సాధించుయుక్తి : ఫలత్యాగము

భగవంతుడు జీవనసిద్ధాంతములను చెప్పినాడు సరే – కాని కేవలము సిద్ధాంతములను చెప్పినంతమాత్రమున పని పూర్తికాజాలదు. గీతలో వర్ణింప

బడిన సిద్ధాంతములు ఉపనిషత్తులలోను, స్మృతులలోను అంతకుముందే యున్నవి. గీత వానినే తిరిగి ప్రతిపాదించినచో అందు గీతయొక్క ప్రత్యేకత ఏమున్నది ? ఈ సిద్ధాంతములను అనుష్ఠానములోని కెట్లుతేవలయునో తెలుపుట లోనే గీతయొక్క విశిష్టత యున్నది. ఈ మహాసమస్యను పరిష్కరించుటలోనే గీతా కౌశలమున్నది.

జీవనసిద్ధాంతముల నాచరణములోనికి దెచ్చుకళనే – లేక యుక్తినే యోగ మందురు. సాంఖ్యమనగా సిద్ధాంతము – లేక శాస్త్రము. యోగమనగా కళ. యోగులు జీవనకళను సాధించినారని జ్ఞానదేవుడు సాక్ష్యమిచ్చుచున్నాడు. సాంఖ్యము, యోగము (అనగా శాస్త్రము, కళ) – ఈ రెంటితో గీత పరిపూర్ణత పొందినది. శాస్త్రము, కళ వీని సంయోగమువలన జీవనసౌందర్యము ప్రకట మగును. కేవల శాస్త్రము గాలిలోని మేడ. సంగీతశాస్త్రము నవగతము చేసి కొన్నను, పాడి వినిపించగల కళ సిద్ధింపకుండ నాదబ్రహ్మకు శోభలేదు. ఇందువలన భగవంతుడు సిద్ధాంతములతోపాటు వాని వినియోగమును తెలుపు కళనుగూడ చెప్పినాడు. ఆ కళాస్వరూప మెట్టిది ? దేహము తుచ్ఛమని తలచి, ఆత్మయొక్క అమరత్వమునెడ అఖండత్వము మీద దృష్టినిలిపి, స్వధర్మాచరణ గావించు ఆ కళ యెట్టిది ?

కర్మ నాచరించువారి మనోవృత్తి రెండువిధములుగ నుండును. "కర్మ నాచరించువారము మనమే. దాని ఫలము ననుభవించు వారమును మనమే. ఇందులకు మన కధికారమున్నది." అనునదొక మనోవృత్తి. ఇందులకు విరుద్ధముగ 'ఫలానుభవము లభింపక పోయినచో అసలు కర్మలేచేయము' అనునది రెండవ మనోవృత్తి. గీత మఱియొక మూడవ మనోవృత్తిని చెప్పు చున్నది. "కర్మను మాత్రము తప్పక ఆచరింపుము. కాని ఫలముమీద అధి కార ముంచుకొనవలదు" అని గీతయనును. కర్మచేయువానికి ఫలముమీద అధికారము అవశ్యముగ నున్నది. కాని నీ వా యధికారమును ఇచ్ఛాపూర్వక ముగ వదలిపెట్టుము. "కర్మలను స్వీకరించినచో ఫలసహితముగనే స్వీక రింపుము" అని రజోగుణమనును. "ఫలమును వదలిన, కర్మనుసైతము వదల వలెను" అని తమోగుణ మనును. ఈ రెండును అన్నదమ్ములే. కనుక నీ వీ రెంటిని అధిగమించి, శుద్ధ సత్త్వగుణుడవు కమ్ము. అనగా కర్మ మాత్రము చేయుము, ఫలాసక్తిని విడిచిపెట్టుము. ఫలమునువదలి కర్మ నాచరింపుము. ఆదియందును, అంతమునందును, ఎక్కడనుగూడ ఫలాశ వలదు.

ఫలాశ వలదని చెప్పుచు కర్మను ఉత్తమరీతిని దక్షతతో చేయవలెనని గీత గట్టిగా హెచ్చరించుచున్నది. సకామపురుషుని కర్మకంటె నిష్కామ పురుషుని కర్మ యెక్కువ యోగ్యమైనదిగ నుండవలె. ఈ కోరిక సముచితమే. ఏల యన సకామ పురుషుడు ఫలాసక్తుడు కనుక ఫలసంబంధమయిన స్వప్న చింతలోనే కొంతమట్టునకు వాని సమయమును శక్తియు విధిగా ఖర్చుపడును. కాని ఫలేచ్ఛను వదలినవాని ప్రతిక్షణమును, యావచ్ఛక్తియు కర్మయందే లగ్నమైయుండును. నదీ ప్రవాహమునకు విరామము లేదు. వాయువునకు విశ్రాంతి లేదు, సూర్యుడు నిరంతరమును వెలుగు చుండుటయే యెఱుగును. ఈ విధముగనే నిష్కామకర్త యెడతెగని సేవాకర్మనే యెఱుగును. ఇట్టి నిరంతర కర్మరతుని కర్మ ఉత్కృష్టమైనది కాకున్నచో మరి యెవరిది కాగలదు ? ఇదిగాక చిత్తసమత్వము నిస్సందేహముగ నొక గొప్ప కల్యాణ గుణము. అది నిష్కామ పురుషుని స్వత్వము. చిత్తశుద్ధితో సంబంధములేని వట్టి కర్మకౌశలము కార్మికుని చేతియందుండ వచ్చును. ఆహస్తకౌశలముతోపాటు చిత్తసమత్వముకూడ కలిసిన, ఆ పని మఱింత సుందరమగుట సువిదితము. సరే, మఱియొక సంగతి : కర్మాచరణనుగూర్చి సకామ నిష్కామ పురుషుల దృష్టిలో భేదమున్నది. ఈ భేదముకూడ నిష్కామపురుషుని కర్మకు చాల అనుకూలము. సకామపురుషుడు కర్మను స్వార్థదృష్టితో చూచును. "కర్మనాది, కర్మఫలమును నాదే" యను దృష్టికలవానికి పనిలో కలుగు కొలదిపాటి నిర్లక్ష్యము నైతికదోషముగ కనిపించదు. దోషమేయైన వ్యావహారిక దోషమనుకొనును. కాని నిష్కామ పురుషునికి తన కర్మవిషయమున నైతిక కర్తవ్యబుద్ధి యుండును. కనుకనే తన పనులలో వేమాత్రపు లోటుపాటు లుండరాదని అతడు చాల మెలకువతో నుండును. ఇందువలనకూడ వానిపనులు మిక్కిలి దోషరహితముగ నుండును. ఏ విధమున చూచినను ఫలత్యాగ మత్యంత కల్యాణదాయకము, యశస్కరము అయిన తత్త్వమని ఋజువుకాగలదు. కనుక ఫలత్యాగమును యోగమని – లేక – జీవితకళ యని యనవలె.

నిష్కామకర్మమాట యటుండనిచ్చినను, అసలు కర్మలో నున్న సహజానందము దాని ఫలములో లేదు. తమ కర్తవ్యకర్మ నాచరించుచుండగా కలుగు తన్మయత్వము ఒక ఆనంద ప్రవాహమే. "చిత్రపటములను వ్రాయవలదు. నీకు కావలసినంత ధనమును నే నుచితముగ నిత్తును." అని చిత్రకారునితో చెప్పుడు. అతడు మీ మాట నంగీకరింపడు. "పొలమునకు పోవలదు, ఆవులను

మేపవలదు, మోట తోలకుము, నీవడిగినంత ధాన్యమిచ్చెదను." అని యొక రైతుతో అని చూడుడు. అతడసలైన రయితయినచో అతని కీ బేరము గిట్టదు. సేద్యగా డుదయముననే పొలమునకు పోవును. సూర్యనారాయణుడు వానికి స్వాగతమిచ్చును. వానికొఱకు పక్షులును పాటలు పాడును. ఆవులును ఎద్దులును అతనిని చుట్టి యుండును. అతడు వానిని ప్రేమతో నిమురును. తాను నాటి పెంచిన చెట్టు చేమలను కన్నారా చూచుకొనుచుండును. ఈ పనులన్నిటిలో నొక సాత్త్వికానంద మున్నది. ఈ యానందమే ఆ కర్మలకు ముఖ్యమైన, నిజమైన ఫలము. దీనితో పోల్చిచూచినచో దాని బాహ్యఫలము కేవలము గౌణమే.

గీత మానవుని దృష్టిని కర్మఫలమునుండి తొలగించి, ఆ యుపాయము ద్వారా వాని కర్మతన్మయత్వమును నూరురెట్లు పెంచును. ఫలాపేక్షలేనివాని కర్మతన్మయత సమాధిశ్రేణికి చెందును. ఇందుచేత వాని యానందము తదితరుల ఆనందముకంటె నూఱు రెట్లధికముగ నుండును. ఈదృష్టితో చూచిన నిష్కామకర్మ స్వతః మహాఫలమే యని వెంటనే మనకు స్ఫురించును. "వృక్షమునకు ఫలము పండ్లు. మఱి పండ్లకింకను ఫలమేమిటి ?" యని జ్ఞానదేవుడు సరిగానే యడిగినాడు. దేహమను నీ వృక్షమునకు నిష్కామస్వధర్మాచరణ వంటి సుందరమైన పండ్లు ఫలించిన తరువాత ఇతర ఫలముల యాశ యింకెందులకుండవలె ? రైతులు పొలములో గోదుమలు పండింతురు. వాని నమ్ముకొని జొన్నరొట్టె తినుట యెందులకు ? మధురమైన అరటిపండ్లను పండించి వానినమ్మి మిరెపకాయ లెందులకు తినవలె? సోదరా, అరటిపండ్లనే తినరాదా ? కాని ప్రజాభిప్రాయమున కిది సరిపడదు. అరటిపండ్లను తినుభాగ్యము కలిగి యుండియుకూడ, మనుష్యులు మిరెపకాయలమీదికే యెగబడుచుందురు. "నీవట్లు చేయవలదు. కర్మనే భుజింపుము, కర్మనే త్రాగుము, కర్మనే జీర్ణించుకొను" మని గీత బోధించుచున్నది. కర్మ నాచరించుటవలననే సర్వమును సమకూరగలదు. పిల్లవాడు ఆటలోని యానందముకొఱకే ఆడుకొనును. దీని వలన వానికి వ్యాయామఫలము అప్రయత్నముగనే కలుగును. కాని ఆ ఫలముమీద వానికి ధ్యానముండదు. వాని యానందమంతయు ఆటమీదనే యుండును.

**9.** ఫలత్యాగమునకు రెండుదాహరణములు

మహాత్ములు తమ జీవితములద్వారా పై విషయమును ఋజువు చేసినారు. తుకారాములోని భక్తి భావమునుచూచి శివాజీ మహారాజునకు అతడనివ

నెంతయో ఆదరణ కలిగెను. శివాజీ యొకసారి తుకారామునింటికి ఒక పాలకీని పంపించి, అతనికి స్వాగతమిచ్చుటకు ఏర్పాటులన్నియు చేసెను. కాని తన గౌరవార్థము చేయబడిన యేర్పాటులను చూచి తుకారామునకు చాల దుఃఖము కలిగెను. "నా భక్తికి ఫలమా యిది? ఇందులకా నేను భక్తిమార్గమున నుంట?" అని యత డనుకొనెను. భగవంతుడు గౌరవప్రతిష్ఠ లను ఫలము నతనిచేతబెట్టి అతనిని తననుండి దూరముచేసికొనుచున్నాడా? యని తుకా రామునకు తోచెను.

> 'మన యిరువురి నడుమనున్న భేదమును తెలిసికొని యీ పీడను వదలించుకొన గోరితివా? ఇది నీదోషము. పాండురంగా! నీవు చాల మోసగాడవు.' —తుకారామ్.

"ప్రభూ! నీపద్ధతి యేమియు బాగుగానుండలేదు. నాకు లంచమిచ్చి నన్ను త్రోసివేయదలచితివా? ఈ పీడ నెట్లైన వదల్చుకొనవలె ననుకొంటివేమో! నే నంతనేర్పులేని గురువునకు శిష్యుడనుగాను. నీపాదములను గట్టిగాపట్టుకొని కూర్చుందును. భక్తియే భక్తుని స్వధర్మము. భక్తిమార్గములో మధ్యవచ్చు ఫలము లను ముండ్లపొదలు పుట్టకుండ చేయుటయే భక్తుని కళాకౌశలము" అని తుకారా మనెను.

ఫలత్యాగములో నింతకంటెను గభీరమైన ఆదర్శమును పుండలీకుని చరిత్ర మనకు నిరూపించుచున్నది. పుండలీకుడు తన తల్లిదండ్రుల సేవచేయు చుండెడివాడు. అతని సేవవలన ప్రసన్నుడయి పాండురంగ డతని యొద్దకు పరుగెత్తుకొని వచ్చెను. కాని పుండలీకుడు పాండురంగని స్తుతించు వ్యసన మున జిక్కి చేతిలోనున్న సేవను వదలుట కిష్టపడలేదు. మాతాపితలసేవ యత నికి మధురమైన ఈశ్వరభక్తియయ్యెను. కుఱ్ఱవాడెవడైన పరులసొత్తు నపహ రించి తన తల్లిదండ్రులను సుఖపెట్టుచున్నా డన్నను, లేక దేశసేవకు డెవడైన మరియొక దేశమునకు ద్రోహముచేసి స్వదేశమునకు మేలుచేయుచున్నా డన్నను, దానిని భక్తియనుటకు వీలులేదు. అది యాసక్తియగును. పుండలికు డిట్టి ఆసక్తిలో చిక్కుకొనలేదు. "ఇప్పుడు నా యెదుటనున్న రూపమేనా పర మాత్మ స్వరూపము? పరమాత్ముడనగా ఇంతేనా? ఈ రూపమున నితడు కన బడక పూర్వము సృష్టి ప్రేతవలె పడియుండెనా?" యని పుండలీకు డనుకొనెను. "హేభగవాన్, నాకు దర్శనమిచ్చుటకు నీవు స్వయముగ దయచేసియున్నావు. కాని నేను 'ఈ' లేక 'ఉ' (ఇదీ—అదీ లేక ఇదియు—అదియు) సిద్ధాంతములో నమ్మకము కలవాడను. నీ వొక్కడవే భగవంతుడవని నే ననుకొనుటలేదు.

నీవును నా పాలిటి భగవంతుడవే. ఈ నా మాతాపితలును భగవంతులే. నేను వీరి సేవలో నిమగ్నుడనయితిని. కాన నీసంగతి చూడలేను. ఇందులకు నన్ను క్షమింపుము '' అని భగవంతునితో ఆత డనెను. ఇట్లనుచునే భగవంతుడు నిల బడుటకొఱకు ఇటికరాతిని ముందుకు త్రోసి, పుండలీకుడు తిరిగి మాతాపితల సేవలోనే నిమగ్నుడయ్యెను. ఈ ప్రసంగమును పురస్కరించుకొని తుకారాము సంతోషముతో పరిహాసముగ ఇట్లనును.—

'ఓరీ నీవెంత వెఱ్ఱిభక్తుడవు! పాండురంగని సైతము యిటికరాతిపై నిలువబెట్టితివి, ఎంత మొండి సాహసము !'

పుండలీకు డుపయోగపరచిన 'ఈ' లేక 'ఉ' సిద్ధాంతము ఫలత్యాగమును సాధించుట కొక పద్ధతి. ఫలత్యాగియొక్క కర్మ – సమాధి గంభీరమైనట్లే అతని మనోవృత్తివ్యాపకము, సమదృష్టి కలదియునై యుండును. ఈ కారణమువలన నది తత్త్వసంబంధమైన చర్చలలో చిక్కుకొనదు. తన సిద్ధాంతమునుకూడ వదలిపెట్టదు. '' నాన్యద స్తీతి వాదినః '' – ఇదేసరి, మఱొకటి కానేరదు అను వివాదలోనికి దిగదు. '' ఇదియుసరే, అదియునుసరే '' అనియే దాని వినమ్ర పద్ధతి. ఒక నాడొక గృహస్థు డొక సాధువునొద్దకు వెళ్ళి, మోక్షప్రాప్తికి ఇల్లు వాకిలి వదలిపెట్టుట అవసరమా ? '' అని యడిగెను. '' లేదే, చూడుము, జన కునివంటివారు రాజభవనములలో నుండుచునే మోక్షము పొందియుండగా ఇల్లు విడిచిపోవలసిన యగత్యము నీకేమివచ్చినది ? '' అని సాధువు జవాబిచ్చెను. సాధువు నొద్దకు మఱియొకడువచ్చి, '' స్వామీ, ఇల్లు వాకిలి విడువకుండ మోక్షములభించునా ? చెప్పుడు ! '' అని యడిగెను. '' ఆ విధముగ ఎవరన్నారు? ఇంటిలోనుండగనే శ్రమలేకుండ మోక్షము ప్రాప్తించినచో, ఇల్లు వాకిలి వదలి పెట్టిన శుకునివంటివారు వట్టిమూర్ఖులా ? '' అని సాధువనెను. తరువాత ఈ వ్యక్తు లిద్దరును ఒకరి నొకరు కలిసినప్పుడు ఇద్దరిమధ్యను పెద్ద జగడము బయలుదేరెను. సాధువు ఇల్లువాకిలి వదలు' మనెనని ఒకడనును. ''లేదు, వదల వలసిన యవసరము లే'దనె నని రెండవవాడనును. అప్పుడిరువురును తిరిగి సాధువునొద్దకు వచ్చిరి. 'ఇద్దరిమాటయు న్యాయ్యమే! ఎవనిభావన యెట్లుండునో వాని మార్గమును అట్లే యుండును. ఎవని ప్రశ్న యెట్లుండునో దానికి సమా ధానముకూడ అట్లే యుండును. ఇల్లువదలిపెట్టవలసిన అవసరమున్నదని చెప్పినదినిజమే. మరి వదలవలసిన యవసరము లేదన్నదికూడ నిజమే. '' అని సాధువు వారిని సమాధాన పరచెను. దీనినే 'ఈ' లేక 'ఉ' సిద్ధాంతమందురు.

ఫలత్యాగమెంత యెత్తునకు లేవగలదో పుండలీకుని యుదాహరణవలన మనకు తెలియగలదు. తుకారామునకు భగవంతుడు కల్పించిన ప్రలోభనము కంటె పుండలీకుని కతడు కల్పించిన పేరాస అత్యంత మోహజనకమైనది. కాని అతడు దానివలనకూడ విమోహితుడు కాలేదు. అయినచో పడిపోయి యుండు వాడే. అందుచేత ఒకసారి సాధనమార్గము నిశ్చితమైనమీదట చివరవరకును దాని ననుసరించుచునే యుండవలె. మధ్యలో భగవద్దర్శనమువంటి విఘ్నములు ప్రత్యక్షముగ అడ్డుతగిలినను, వానిమూలమున సాధన వదల వలసిన అవసరము కలుగరాదు. దేహముండుట సాధనకొఱకే! భగవద్దర్శన మెప్పుడును హస్తగతమయియే యున్నది! అదెక్కడికి పోవును ?

"నీ భక్తిలో నామనసు లీనమైయున్నప్పుడు ఇంక నా సర్వాత్మ
భావమును ఎవరు నా నుండి వేరుచేయ గలరు ?"

ఇట్టి భక్తిని లభింపజేసికొనుటకే మన కీ జన్మకలిగినది; 'మా తే సంగోఽస్త్వకర్మణి' నిష్కామ కర్మచేయుచు, అకర్మ యొక్క అనగా అంతిమ కర్మముక్తియొక్క, అనగా మోక్షము యొక్క వాసనకూడ దరికి రానీయ వలదను వంతవరకు పై గీతా వచనము యొక్క అర్థము చెప్పవచ్చును. వాసనావిమోచనయే మోక్షము. మోక్షమునకు వాసనలతో నేమిపని ? ఫలత్యాగ మీ యంతస్తును చేరినపుడు జీవిత కళయొక్క పూర్ణిమ వచ్చినదని తెలిసికొనుము.

## 10. ఆదర్శ గురుమూర్తి

అర్జునునకు శాస్త్రము చెప్పబడినది, కళకూడ చెప్పబడినది. కాని యింత మాత్రమున తత్త్వమంతయు చిత్రపటమువలె స్పష్టముగా కనబడలేదు. శాస్త్రము నిర్గుణము, కళ సగుణము. అయినను సగుణముకూడ సాకారమైనప్పుడు గాని వ్యక్తముకాదు. నిర్గుణము రూపరహితముగ కేవలము గాలిలో నున్నట్లే, సగుణము కూడ నిరాకారముగ నున్నంతవరకు ఈ స్థితిలోనే యుండును. మూర్తీభూత సద్గుణుడైన మహాత్ముని దర్శించుటయే దీని కుపాయము. ఇందులకనియే అర్జును డీ విధముగ అడుగుచున్నాడు:– "ఓ దేవా! జీవిత ముఖ్యసిద్ధాంతములను, వానిని సాగించుకళను చెప్పియుంటివి. అయినను దీని రూపము స్పష్టముగ కన్నులకు కట్టినట్లులేదు. కనుక ఇప్పు డుదాహరణ పూర్వకముగ దీని రూపమును నాకు చిత్రించి చూపుము. బుద్ధియందు సాంఖ్యనిష్ఠ సుస్థిరమై యున్నట్టి, ఫలత్యాగరూపమైన యోగము రోమరోమమునందును వ్యాప్తమై యున్నట్టి పురుషుల లక్షణము లెట్టివో చెప్పుము. ఫలత్యాగము యొక్క లోతుపాతులను పూర్తిగ చూపగలిగినవారు, కర్మసమాధిలో నిమగ్న

లైనవారు, ఆత్మనిశ్చయములో మహా మేరువులు, స్థితప్రజ్ఞులు అనబడువారు ఎట్లు మాటలాడెదరో, ఎట్లు కూర్చుందురో, ఎట్లు సంచరింతురో – ఇదంతయు నాకు తెలియజెప్పుము, స్వామీ!"

ఇందులకనియే భగవానుడు రెండవఅధ్యాయము చివరి పదునెనిమిది శ్లోకములలోను స్థితప్రజ్ఞుని గంభీరమైన, ఉదాత్తమైన చరిత్రమును చిత్రించినాడు. ఈ పదునెనిమిది శ్లోకములలో గీతయొక్క అష్టాదశాధ్యాయముల సారమంతయు ఇమిడ్చి పెట్టినట్లున్నది. స్థితప్రజ్ఞుడు గీతలోని ఆదర్శమూర్తి. ఈ శబ్దముకూడ గీతయొక్క స్వతంత్రకల్పన. ఈ విధముగనే అయిదవ అధ్యాయములో జీవన్ముక్తుని యొక్కయు, పంత్రెండవ దానిలో భక్తుని యొక్కయు, పదునాల్గవదానిలో గుణాతీతుని యొక్కయు, పదునెనిమిదవదానిలో జ్ఞాననిష్ఠుని యొక్కయు వర్ణన చేయబడినది. కాని స్థితప్రజ్ఞుని వర్ణన వీనియన్నిటికంటెను విస్తరముగ విప్పి చెప్పబడినది. ఇందు సిద్ధుని లక్షణములతోపాటు సాధకుని లక్షణములుకూడ చెప్పబడినవి. వేలకొలది స్త్రీపురుష సత్యాగ్రహులు సాయంకాల ప్రార్థనలో ఈ లక్షణములను పఠించుచుందురు. ఆశ్లోకములను ప్రతిగ్రామమునకును ప్రతి గృహమునకును అందింపగలుగుట యెంత ఆనందదాయకము! అవి మొదట మన హృదయములలో నెలకొనినచో, తదుపరి తమంతట తామే బయటివారి హృదయములలో ప్రవేశింప గలవు. నిత్యము పఠించునది వట్టి చిలుకపలుకైనచో అది హృదయములో అంకితమగుటకుబదులు, ఉన్నభక్తిభావమునుకూడ తుడిచివేయును. ఇది నిత్య పఠనమువలన వచ్చుదోషము కాదు. మననము చేయకుండుటవలన వచ్చుకీడు. నిత్య పఠనముతోపాటు నిత్యమననమును, నిరంతరాత్మ పరీక్షయు అవసరము.

స్థితప్రజ్ఞుడనగా స్థిరబుద్ధికలవాడు. అస లాపేరులోనే యీ యర్థమున్నది. కాని సంయమము లేకుండ బుద్ధియెట్లు స్థిరపడును? కనుకనే స్థితప్రజ్ఞుని సంయమమూర్తి యన్నది గీత. బుద్ధి ఆత్మనిష్ఠ కలదయి యుండవలె. అంతర్బాహ్యేంద్రియములు బుద్ధికి అధీనములు కావలె. సంయమ మనగా ఇది. స్థితప్రజ్ఞుడు సమస్తేంద్రియములకును కళ్ళెమువేసి కర్మయోగమను క్షేత్రమును దున్నును. ఇంద్రియములనెడి ఎద్దులతో అతడు నిష్కామ స్వధర్మాచరణమను సేద్యమును కట్టుదిట్టముగ చేయును. తన యుచ్ఛ్వాస నిశ్శ్వాసములన్నియు పరమార్థమునకే వినియోగించుచుండును.

ఇంద్రియ సంయమము సులువైనదికాదు. ఇంద్రియముల నసలే ఉపయోగింపకుండుట ఒకవిధముగ సులువు కావచ్చును. మౌనము, నిరాహారము మొదలైనవి యంత కఠినమైనవి కావు. అట్లే యింద్రియములను యథేచ్ఛముగ

వదలివేయుటకూడ అందరికిని సులువే. కాని తాబేలు ప్రమాదస్థితిలో తన యవయవముల నన్నిటిని ముడిచి దాచుకొనుచు, నిర్భయ స్థలములలో వాని నుపయోగించుకొనుచున్నట్లు ఇంద్రియములను విషయభోగముల వైపునకు పోకుండ ముడుచుట, వానిని పారమార్థిక కార్యములలో ఉచితరీతిని ఉపయోగించుట లెస్స. ఈ సంయమము కఠినమైనది. దీనికి అత్యంతమైన ప్రయత్న మవసరము. జ్ఞానముకూడ అవసరము. కాని ఇవన్నియు ఉన్నను అది యెల్లపుడును సుసాధముకాదు. అట్లని మనము నిరాశచెందవలసినదేనా ? చెందరాదు. సాధకు డెన్నడును నిరాశ చెందరాదు. సాధకుడు సమస్తోపాయములద్వారా ప్రయత్నించియు సంయమ స్థితిని చేరలేకపోయినచో, అతడు భక్తియొక్క ఆశ్రయమును పొందవలె. అమూల్యమైన ఈసూచనను భగవంతుడు స్థితప్రజ్ఞుని లక్షణములలో ఇచ్చియున్నాడు. దీనిని తూచినట్లు క్లుప్తముగ చెప్పినాడు. బండెడు వ్యాఖ్యానములకంటె దీని విలువహెచ్చు. ఎందులకనగా, భక్తికి సరిగా అవసరమున్న చోటనే దీనికి స్థానమీయబడినది. స్థితప్రజ్ఞుని లక్షణములను సవిస్తరముగ ఇక్కడ మనము వర్ణింపనక్కరలేదు. కాని మనము ఈ సాధనలన్నిటిలోను భక్తియొక్క నిశ్చితస్థానమును మఱవకుండుటకు దీనిని జ్ఞప్తికి తేవలసి వచ్చినది. ఈ జగత్తులో కేవల స్థితప్రజ్ఞు డెవడయినాడను విషయము భగవంతునికే యెఱుక. కాని సేవాపరాయణుడైన స్థితప్రజ్ఞునికి ఉదాహరణగా పుండలీకునిమూర్తి యెల్లపుడును నా యెదుట కనబడుచునే యుండును. దానిని నేను మీా యెదుట పెట్టనే పెట్టితిని.

సరే యిప్పుడు స్థితప్రజ్ఞుని లక్షణములును, వానితో రెండవ అధ్యాయమునుకూడ సమాప్తి చెందినవి

(నిర్గుణ) సాంఖ్యబుద్ధి + (సగుణ) యోగబుద్ధి + (సాకార) స్థితప్రజ్ఞ.



కలసి

సంపూర్ణ జీవితశాస్త్రము.

దీనిలోనుండి బ్రహ్మనిర్వాణము – లేక – మోక్షము గాక మరేమి ఫలమూ రాగలదు ? (28–2–32).

# మూడవ అధ్యాయము

## కర్మయోగము

### 11. ఫలత్యాగికి ఫలము లనంతముగ లభించును

సోదరులారా! రెండవ యధ్యాయములో సంపూర్ణ జీవిత శాస్త్రమును మనము పరిశీలించినారము. మూడవ అధ్యాయములో ఈ జీవిత శాస్త్రమే స్పష్టీకరింపబడినది. ఇంతకు పూర్వము తత్త్వమును తెలిసికొంటిమి. ఇక దాని వివరణలను పరిశీలింపవలె. వెనుకటి యధ్యాయములో కర్మయోగమునుగూర్చి వివేచనచేసియున్నాము. కర్మయోగములోని ఉత్కృష్ట విషయము ఫల త్యాగము. కర్మయోగమునకు ఫలత్యాగ మవసరమే. అయినను కర్మయోగికి ఫలమేమైన లభించునా ? లేదా ? కర్మఫలములను త్యజించుటవలననే కర్మ యోగికి ఫలము పలురెట్లుగ లభించునని మూడవ యధ్యాయము చెప్పుచున్నది.

ఇక్కడ లక్ష్మి కథ నాకు జ్ఞప్తికి వచ్చుచున్నది. ఆమె స్వయంవరము వచ్చెను. దేవదానవులందరును పెద్దఆశతో వచ్చిరి. లక్ష్మి తన ప్రతిజ్ఞను ముందుగ ప్రకటింపలేదు. సభామంటపమునకువచ్చి "నన్ను కోరుకొననివానికి నేను వరమాల వేయుదును" అన్నది. వచ్చినవా రందరును పేరాసకలవారు! కనుక లక్ష్మి తన్ను కోరని వరుని వెదక నారంభించెను. శేషతల్పముపై శాంత చిత్తుడై పరుండియున్న విష్ణుమూర్తి యామెకు కనబడెను. ఆయన కంఠమున వరమాలవేసి ఆమె నాటినుండి నేటివరకును ఆయన పాదసేవచేయుచునే యున్నది. "కోరనివారికే లక్ష్మి దాసి యగును." ఇదే విశేషము.

సామాన్య మానవుడు తనకు లభించు ఫలముచుట్టును ముండ్లకంచెవేసి దానిని కాపాడుకొనును. కాని యిందువలన పలురెట్లుగ పొందవలసిన ఫలము నతడు కోల్పోవును. ప్రాపంచిక ధోరణిలోని మానవుడు కర్మల నపారముగ నాచరించి ఫలమును అల్పముగ పొందును. కాని కర్మయోగి కర్మలను కొలదిగ నాచరించినను ఫలము పెక్కురెట్లుగ పొందును. తన భావన ననుసరించియే యీ భేదము కలుగుచుండును. ఒకచోట టాల్‌స్టాయి యిట్లన్నాడు: "లోకులు ఏసుక్రీస్తు బలిదానమును హెచ్చుగ స్తుతింతురు. కాని ప్రాపంచిక మానవులు నిత్యమును ఎన్ని యొడుదొడుకులతో అగచాట్లు పడుచుందురో చెప్పనలవి కాదు. రెండు గాడిదలబరువు మీద వేసికొని మితిలేని ప్రయాసపడుచుందు ఈ

ప్రాపంచిక జీవుల కష్టములును, బాధలును ఏసుక్రీస్తు పడినవానికంటె ఎన్నో రెట్లు హెచ్చు! అయినను వీరెంత అధోగతిపా లగుచున్నారు! వీరు తాముపడు కష్టములో సగమైనను భగవంతునికొరకు పడినచో నిశ్చయముగ క్రీస్తుకంటెను గొప్పవా రగుదురు.]

ప్రాపంచిక మానవుల తపస్సు గొప్పదే. కాని అదియంతయు క్షుద్రఫలముల నిమిత్తమే. వాసనలనుబట్టియే ఫలము. మన వస్తువులకు మనము కట్టినట్టి విలువను మించిన విలువ ప్రపంచము ఈయదు. కుచేలుడు అటుకులు తీసికొని భగవంతునియొద్దకు వెళ్ళినాడు. ఆ పిడికె డటుకులు దమ్మిడీయైన చేయవు. కాని కుచేలుని కవి అమూల్యముగ కనబడెను. ఎందుచేతననగా వానిలో భక్తి మిళితమై యుండెను. అవి మంత్రింపబడిన యటుకులు. అందున్న ప్రతిగింజలోను భావన యుండెను. వస్తు వల్పమైనను మంత్రబలముచేత దాని విలువయు, సామర్థ్యమును పెరుగును. కరెన్సీనోటు బరువెంత? దానితో మంటపెట్టిన గరిటెడు నీరుకూడ వెచ్చబడదు. కాని దానిమీద ఒక మోహరున్నది. ఆ మొహరునుబట్టియే దాని కా విలువ.

కర్మయోగములోనున్న విశేషముకూడ ఇదే. కర్మ యీ నోటువంటిది. విలువ భావన యను మొహరునకు గాని కర్మయను కాగితపు ముక్కకు కాదు. ఒక విధముగ మూర్తి పూజలోని రహస్యమునే ఇక్కడ చెప్పచున్నాను. మూర్తి పూజయొక్క కల్పనలో గొప్ప సౌందర్యమున్నది. ఈ మూర్తి నెవరు విరిచి ముక్కలు చేయగలరు? ఈ మూర్తి ఆదిలో నొక ఱాతిముక్కయే. నేను దానికి ప్రాణప్రతిష్ఠ చేసితిని. నా భావన నందు చొప్పించితిని. నా భావనను ఎవరు తునియలు చేయగలరు? ఱాయి ముక్క లగును. భావన కాదు. మూర్తినుండి నా భావనను తొలగించిన తక్షణమే, ఱాయి మిగులును. అప్పుడే అది ముక్కలు కాగలదు.

ఇప్పుడు ఱాయి-లేక-కాగితపుముక్కవంటిదే కర్మయని తేలినది. తల్లి కాగితపుముక్కమీద మూడునాలుగు వంకరటింకర పంక్తుల లేఖ యొకటివ్రాసి కుమారునికి పంపిన దనుకొనుడు. మఱియొక డేదో వ్రాసి యేబదిపుటలకట్ట పంపినాడనుకొందము. కాగా ఇప్పుడు వీనిలో దేని తూకమెక్కువ? తల్లివ్రాసిన ఆ నాలుగు పంక్తులలోని భావము అమూల్యము, పవిత్రము. రెండవ వ్యక్తి పంపిన ఆ పనికిరానికట్ట దీనితో సాటికాదు. కర్మకు ఆర్ద్రత కావలెను; భావన యుండవలెను. మనము కూలివానిపనికి విలువగట్టి మజూరీ నిచ్చివేయుదుము.

కాని దక్షిణ విషయ మట్టిదికాదు. అది నీటితో తడిపి యీయబడును. దక్షిణా విషయమున ఎంత యిచ్చినార మనునదికాదు ప్రశ్న. అందులో ఆర్ద్రత యున్నదా లేదా యనునదే ముఖ్యవిషయము. మనుస్మృతిలో మిక్కిలి మనో రంజకమైన ఘట్టమొకటున్నది. పశుతుల్యుడైన శిష్యుడొకడు పన్రెండేండ్లు గురు గృహమున వసించి మనుష్యుడయ్యెను. అప్పు డతడు గురుదక్షిణ యేమీయవలె? ప్రాచీన కాలమున ముందే జీతములు వసూలుచేయుకట్టడలేదు. పన్రెండేండ్ల చదువు పూర్తియైన తరువాత గురుకట్న మిచ్చివేయు పద్ధతి యుండెను. "గురుదేవునికి పత్రమో, పుష్పమో, విసనకఱ్ఱయో, పావకోళ్ళో లేక నీరు నింపిన కలశమో సమర్పించు" మని మనువు చెప్పెను. ఇదేమియు పరి హాసముకాదు. ఇచ్చునది శ్రద్ధతో నీయవలె. పుష్పమునకు బరువులేదు. కాని దానిలోని భక్తిభావమునకు బ్రహ్మాండమంత బరువున్నది.

'రుక్మిణీదేవి ఒక్క తులసీదళముతోనే గోవర్ధనపర్వతము నెత్తిన కృష్ణ పరమాత్మను తూచ గలిగెను.'

సత్యభామ పుట్టె డాభరణములను వేసికూడ పనిని సాధింపలేక పోయెను. కాని రుక్మిణీమాత భక్తిభరితమైన ఒక్కతులసీ దళమును త్రాసులో వేసినంతనే పని పూర్తియయ్యెను. ఇప్పుడది సామాన్యపు తులసియాకు కాదు; అభిమంత్రిత మైన తులసీదళము. కర్మయోగి చేయు కర్మవిషయముకూడ ఇంతే.

ఇద్దరు వ్యక్తులు గంగాస్నానము నిమిత్తము వెళ్ళినారను కొనుడు. అందొకడిట్లనును: "జనులు 'గంగ, గంగ' యందురు. అందులో ఏమున్నది? 'హైడ్రోజన్' అను గాలి రెండుభాగములు, 'ఆక్సిజన్' అను గాలి ఒకభాగము, ఈ రెండును కలిసి గంగయైనది. ఇంతకుమించి అందులో నేమున్నది." ఇక రెండవవాడనును:" కృష్ణభగవానుని పదకమలములనుండి ఇది బయలుదేరి శంక రుని జటాజూటమున వాసముచేసినది. వేలకొలది బ్రహ్మఋషులును, రాజఋషు లును దాని యొడ్డున తపస్సుచేసిరి. అనేక పుణ్యక్రతువులు అక్కడజరిగినవి. అట్టిపవిత్ర గంగామాతయిది." ఇట్టి పూర్ణభావముతో వాడు నదిలో స్నానము చేయును. హైడ్రోజన్-ఆక్సిజన్ సిద్ధాంతికూడ స్నానముచేయును. ఇప్పుడు దీనివలన దేహపారిశుధ్యమను ఫలము మాత్రము ఇద్దరికిని రానేవచ్చినది. కాని ఆ భక్తునికి దేహపారిశుధ్యముతోపాటే చిత్తశుద్ధి యను ఫలముకూడ లభించినది. వట్టి స్నానమేమైనచో, గంగలో ఎద్దులుకూడ స్నానముచేయును. వానికికూడ శరీరమాలిన్యము వదలిపోవును. కాని చిత్తమాలిన్యము వదలు

టెట్లు? ఒకనికి దేహశుద్ధి యను అల్పఫలము మాత్రము లభించినది. రెండవ వానికి దానికితోడు చిత్తశుద్ధి యను అమూల్య ఫలము చేకూరినది.

స్నానముచేసి సూర్యనమస్కారములు చేయువానికి వ్యాయామఫలము కలిగితీరును. కాని వాడారోగ్యముకొఱకు ఆ పని చేయడు, ఉపాసనకొఱకు చేయును. దీనివలన శరీరమున కారోగ్యలాభము విధిగా కలుగును, బుద్ధి యొక్క తేజస్సుకూడ పెరుగును. ఆరోగ్యముతోపాటే చురుకుదనమును, బుద్ధి వికాసమునుగూడ సూర్యనారాయణుని వలన లభించును.

కర్మయొకటే; కాని భావనాభేదమువలన దానిరూపములు భేదించును. పారమార్థిక మానవునికర్మ ఆత్మవికాసమును కలిగించును. ప్రాపంచిక మనుష్యునికర్మ ఆత్మను స్థిరముగ బంధించును. కర్మయోగి కర్షకుడైనచో స్వధర్మభావనతో సేద్యము చేయును. దీనివలన అతని యుదరపోషణ విధిగా జరిగిపోవును. కాని పొట్టకొరకై అత డీపని చేయడు. సేద్యము చేయగలశక్తిని సంపాదించుటకే అతడు భుజించును. స్వధర్మము వానికి లక్ష్యము. భోజనము దానికి సాధనము. ఇక కర్మయోగికాని రైతునకు ఉదరపోషణ లక్ష్యము. సేద్యము దానికి సాధనము. ఇట్లే స్థితులు పరస్పర విరుద్ధముగ నుండును.

రెండవ యధ్యాయము స్థితప్రజ్ఞుని లక్షణములను వర్ణించుచు, ఈ విషయమును బాగుగ చిత్రించినది. ఇతరులు మేల్కొనియున్నపుడు కర్మయోగి నిద్ర పోవుచుండును. ఇతరులు నిద్రపోవుచున్నపుడు కర్మయోగి మెలకువతో నుండును. ఉదరపోషణకై మనము జాగ్రత్తపడుచుండగా కర్మయోగి కర్మ రహితముగ నొక్కక్షణముకూడ పోకూడదను మెలకువలో నుండును. తప్పని సరికనుక అతడు భుజించును. ఈ కడుపను హండీలో నింత పడవేయవలెను కనుకనే పడవేయును. ప్రాపంచిక మానవునికి భోజనములో ఆనందమున్నది. యోగికి భోజన మనిన కష్టము కలుగును. కావున నతడు రుచు లెంచుకొనుచు భుజింపడు. సంయమముతో సంచరించును. ఒకనికేది రాత్రియో అది రెండవ వానికి పగలు. ఒకనికేది పగలో అది రెండవవానికి రాత్రి. అనగా ఒకని కేది యానందమో అదే రెండవవానికి దుఃఖము. ఒకని కేది దుఃఖమో అదే రెండవ వాని కానందము. సంసారి, కర్మయోగి – ఈ యిరువురి పనులును ఒకరకము గనే కనిపించును. కాని ఫలాసక్తిని వదలి కర్మలోనే రమించుట కర్మయోగి యొక్క విశిష్టత. సంసారివలెనే యోగియు భుజించును, త్రాగును, నిద్రించును.

కాని తత్సంబంధమైన భావన వానిలో భిన్నముగ నుండును. ఇందుచేతనే మతి పదునారధ్యాయములు ముందుండగనే ఆరంభములోనే స్థితప్రజ్ఞుని సంయమ మూర్తి చిత్రింపబడెను.

ప్రాపంచిక మానవుడు, కర్మయోగి – ఈ యిరువురి కర్మలలోని సామ్యమును, వైరుధ్యమును ఎప్పటికప్పుడు కనుపించుచునే యుండును. కర్మయోగి గోసేవచేయుచున్నా డనుకొనుడు. అత డే దృష్టితో పనిచేయును? గోసేవవలన సమాజమునకు సమృద్ధిగ పాలు లభింపవలెనవియు, గోవునెపమున మానవశ్రేణికి క్రిందనున్న పశుసృష్టితో ప్రేమసంబంధ మేర్పడవలెననియు అతని భావన. ఇంతేకాని వేతనము దొరకుననికాదు. వేతన మెక్కడికిని పోదు. కాని నిక్కమైన యానందము, నిజమైన సుఖము ఈ దివ్యభావనలో నున్నది.

కర్మయోగి చేయు కర్మ అతని నీ విశ్వముతో నేకరూపము చేయును. మనము తులసికి నీరుపోయకయే భోజనము చేయము. ఇట్లు వనస్పతిసృష్టితో మనము ప్రేమసంబంధము కలుపుకొన్నారము. తులసిని ఆకలితోనుంచి ముందు నేను తినగలుగు టెట్లు? ఈ విధముగ గోగణముతో నేకరూపము, వనస్పతులతో నేకరూపము పొందుచు సర్వవిశ్వముతో ఏకరూపమును పొందవలసియున్నది. భారతయుద్ధములో సూర్యాస్తమయము కాగానే అందరును సంధ్యావందనమునకు పోయెడువారు. కాని కృష్ణభగవానుడు రథాశ్వములను విప్పి వానికి నీరు పెట్టుట, దాణావేయుట, వాని శరీరములో గ్రుచ్చుకొన్న బాణములను తీసివేయుట – ఈ పనులలో నుండువాడు. ఆ సేవ అతని కెంతయు నానందదాయకమైయుండెను. ఈ వర్ణనతో కవి తృప్తినొందలేదు. తన పీతాంబరములో దాణా వేసికొని వెళ్ళి గుఱ్ఱములకు పెట్టిన ఆ పార్థసారథి చిత్రపటమును మీ మనస్సులో దర్శింపుడు. అప్పుడు కర్మయోగియొక్క ఆనందమును మీరూహించుకొనగలరు. ప్రతి పనిని ఆధ్యాత్మికము, ఉచ్చతరము నగు పారమార్థిక కర్మగా తలంపుడు. ఖద్దరు విషయమును తీసికొనుడు. ఖాదీమూట భుజముపై వేసికొని తిరిగి అమ్మువాడు విసుగుపొందునా? పొందడు. ఎందులకనిన దేశములో అన్నవస్త్రములు లేని కోట్లకొలది సోదరీ సోదరుల కించుక అన్నము కల్పించు భారము తనదను భావనలో అతడు నిమగ్నుడై యుండును. అతడొక్క గజము ఖద్దరమ్మినను అది యతనిని సమస్త దరిద్రనారాయణులతో నేకరూపము చేయును.

## 12. కర్మయోగమువలని వివిధ ప్రయోజనములు

నిష్కామకర్మయోగములో అద్భుతమైన సామర్థ్యమున్నది. ఇట్టి కర్మ వలన వ్యక్తికిని సమాజమునకునుగూడ పరమ కల్యాణము చేకూరును. స్వధర్మము నాచరించు కర్మయోగికి శరీరయాత్ర జరుగుచునేయుండును. సర్వదా శ్రమజీవియై యుండుటవలన అతని శరీరము నీరోగముగను, స్వచ్ఛముగను ఉండును. ఇంతేకాక వాని కర్మద్వారా సమాజముకూడ సురక్షితమగును. కర్మయోగియైన రైతు హెచ్చులాభము వచ్చునని నల్లమందును, పొగాకును ఉత్పత్తిచేయడు. ఎందులకనగా అతడు తన కర్తవ్యకర్మను సమాజ క్షేమముతో కలిపి చూచుకొనును. స్వధర్మమైన కర్మ సమాజమునకు హితకారిగనే యుండును. తాను సాగించువ్యాపారము ప్రజాహితము కొఱకే యని విశ్వసించు వర్తకుడు విదేశవస్తువుల నెన్నటికిని విక్రయింపడు. అత డే వ్యాపారము చేసినను అది సమాజోపకారిగ నుండును. తన్ను దాను మఱచి, తన యిరుగుపొరుగులతో నేకరూపమగు కర్మయోగి పుట్టిపెరిగిన సమాజము సువ్యవస్థకును, సమృద్ధికిని, సౌమనస్యమునకును నిలయమై యుండును.

కర్మయోగియొక్క కర్మకు ఫలముగ వాని శరీరయాత్ర జరుగును. దానితోపాటు వాని దేహమును బుద్ధియు తేజస్వంతములగును. సమాజ కల్యాణముకూడ చేకూరును. ఈ రెండుఫలములకును తోడు చిత్తశుద్ధి యను మహాఫలము వానికి లభించును. 'కర్మణాశుద్ధిః' అని యన్నారు. చిత్తశుద్ధికి సాధనము కర్మ. కాని అది అందరును చేయు సాధారణకర్మ కాదు. కర్మయోగి యాచరించు అభిమంత్రితకర్మనుండి చిత్తశుద్ధి కలుగును. మహాభారతములో తులాధరుడను వైశ్యునికథ యున్నది. జాజలియను బ్రాహ్మణు డొకడు జ్ఞానప్రాప్తికొఱకు తులాధరునియొద్దకు పోయెను. తులాధరుడు "సోదరా, ఈ తరాజుదండెను నిరంతరమును సరిగా మొగ్గులేకుండ ఉంచుటయే నా పని" యనెను. ఈ బాహ్యకర్మ చేయుచుండగనే తులాధరుని మనస్సుకూడ నిష్కపటము, సరళము అయ్యెను. దుకాణమున కొక చిన్నకుఱ్ఱవాడువచ్చినను, లేక పెద్దవాడు వచ్చినను, ఆ తరాజుదండె యందఱకును ఒకరీతిగనే మొగ్గ లేక ఉండును. పనియొక్క ప్రభావము మనస్సుమీదకూడ పడుచుండును. కర్మయోగిచేయుకర్మ ఒక రకముగ జపమేయని తెలిసికొనుడు. దానివలన వానికి చిత్తశుద్ధి కలుగును. అట్టి నిర్మల చిత్తమున జ్ఞానము ప్రతిబింబించును. తమతమ భిన్నభిన్న కర్మలద్వారా కర్మయోగులు చివరకు జ్ఞానమును పొందు-

దురు. తరాజుదండెవలన తులాధరునికి సమబుద్ధి కలిగెను. సోనా యను మంగలి క్షురకర్మ చేయుచుండువాడు. అనేకులకు తలపనిచేసి మాలిన్యమును పోగొట్టుచుండగా అతనికి జ్ఞానోదయమయ్యెను. "నే నితరుల తలల మాలిన్యమును పోగొట్టుచున్నానేకాని, నా తలకును నా బుద్ధికిని పట్టిన మైల నెన్నడైన వదలగొట్టుకొంటినా ?" – ఇట్టి ఆధ్యాత్మికభాష యతనికి తన వృత్తినుండి స్ఫురించెను. పొలములో కలుపుతీయుచుండు కర్మయోగికి తన హృదయమున కంటిన వాసనావికారరూపమైన మాలిన్యమును తీసివేసికొను బుద్ధిపుట్టును. మట్టిని మెత్తగా మర్దించి, బాగుగ కాలినకుండలను సమాజమున కందజేయు కుమ్మరి గోరా, జీవితము లను కుండలనుకూడ గట్టిగా తయారుచేయవలెనని మనస్సులో దృఢపరచుకొనెను. అప్పు డతడు చెక్క చేతబట్టుకొని 'కుండ పచ్చిదా కాలినదా ?' యని యనుచు మహాత్ముల తలలు తట్టి వారిని పరీక్షించు పరీక్షకు డయ్యెను. దీనినిబట్టి కర్మయోగి తన వృత్తికి సంబంధించిన పారిభాషిక శబ్దములను వాడుచు, ఆ వృత్తి నిర్వహణద్వారముననే జ్ఞానమును పొందుచుండు నను విషయము స్థిరపడుచున్నది. ఇట్లతడు పనిచేయునది వట్టి కర్మాగారముగాక ఆధ్యాత్మిక శిక్షణాలయ మగుచున్నది. అత డాచరించు కర్మ ఉపాసనామయము, సేవామయము. బయటినుండి చూచిన నది కేవలము వ్యావహారికముగనే కనబడును. కాని లోపలినుండి చూచిన నది ఆధ్యాత్మికము.

కర్మయోగియొక్క కర్మవలన మఱియొక ఉత్తమ ఫలముకూడ లభించును. సమాజమున కొక ఆదర్శము లభించుటయే ఆ ఫలము. ఒకడు ముందు పుట్టుట, మఱియొకడు తరువాతపుట్టుట – ఈ భేదము సమాజములో ఉండనే యున్నది. తన తరువాత పుట్టినవానికి తానొక యాదర్శముగ నిలువవలసిన బాధ్యత ముందుగా జన్మించినవాని కున్నది. ప్రత్యక్షమైన అనుష్ఠానముద్వారా తానొక ఆదర్శమును చూపవలసిన బాధ్యత తమ్మునియెడల అన్నకును, బిడ్డలయెడల తలిదండ్రులకును, అనుచరులయెడల నాయకునికిని, శిష్యునియెడల గురువునకును ఉన్నది. ఇట్టి యుదాహరణను కర్మయోగులుగాక మరెవరు చూపగలరు ?

కర్మలోనే ఆనందము ననుభవించుటవలన కర్మయోగి యెల్లపుడును కర్మ నాచరించుచునే యుండును. అందువలన సమాజమున మోసము పెరుగదు. కర్మయోగి స్వయంతృప్తుడు. అయినను కర్మ నాచరింపకుండ ఉండలేడు.

" మొదట మహాత్ములతో సాంగత్యము కల్గించితివి, తుకారాము
పాండురంగనితో ఏకరూపమయ్యెను. ఇట్లని భజన చేయుట ఏల
మానవలె? మూలస్వభావము నేలవదలవలె." —తుకారామ్

భజనవలన భగవంతుడు లభ్యమైనాడని నేను నేడు భజనను మాను దునా? భజన యిప్పుడు నాకు సహజధర్మమైనది" అన్నాడు తుకారాము.

కర్మయోగి కర్మయను మెట్టునెక్కి శిఖరమును చేరుకొనును. అయినను శిఖరమును చేరికూడ కర్మ యను మెట్టును వదలడు. అతడు దానినుండి విడి వడనేలేడు. ఇట్లు కర్మవైపునకు మొగ్గు సహజస్థితి వాని యింద్రియములకు కలుగును. ఈ రీతిగ నతడు స్వధర్మకర్మరూపమైన సేవామహత్త్వమును సమాజమునకు నచ్చునట్లును, అనుకరణీయముగను చేయును.

సమాజములోని మోసమును నిర్మూలించుట యెంతో గొప్పవిషయము. కపటమువలన సమాజ మధోగతిపా లగుచున్నది. కాని జ్ఞాని యూరక కూర్చుండినచో అతనినిచూచి యితరులుకూడ చేతులుముడుచుకొని కూర్చుం దురు. జ్ఞాని నిత్యతృప్త డగుటవలన ఆత్మసుఖోన్మత్తుడును, శాంతుడునై యుండును. కాని యతనిని చూచి మఱియొకడు లోలోన అసంతృప్తితో విలపించుచునే కర్మశూన్యుడగును. ఒకడు అంతస్తృప్తుడయి స్వస్థుడగును. మరియొకడు క్రోధముతో లోలోపల రగులుచుకూడ స్వస్థునివలె కానిపించును. ఈ స్థితి భయంకరమైనది. దీనివలన దంభము అధికమగును. కాని సత్పురుష లందరును శిఖరము నధిష్ఠించియు తమ సాధనయొక్క విశిష్టత వలన కర్మ నాశ్రయించియే యుందురు. మరణ పర్యంతమును స్వకర్మ నాచ రించుచునే యుందురు. పిల్లల బొమ్మలాటలలో తల్లికూడ భాగస్వామిని యగు చుండును. అవి వట్టి పిల్లలయాటలని ఎరిగియు తల్లి పిల్లలతోకలిసి యాడుచు ఆ యాటల కొక రుచిని కల్పించును. తల్లి యాక్రీడలలో భాగస్వామినికానిచో పిల్లల కందు రుచియేయుండదు. కర్మయోగి 'నేను తృప్తుడనుకదా' యని కర్మను వదలిపెట్టినచో ఇతరులు అసంతృప్తితో నుండికూడ కర్మను వదలు దురు. కాని వారు వాంఛలు తీరక ఆనందరహితులై యుందురు.

అందువలన కర్మయోగి సామాన్యమానవునివలె కర్మ నాచరించు చుండును. 'నాలో నొక ప్రత్యేకతయున్నది' అని యతడనుకొనడు. ఇతరుల కంటె చాలరెట్లతడు శరీరపరిశ్రమచేయును. 'ఇవి పారమార్థిక కర్మ'లని వేని కిని ముద్ర వేయవలసిన పనిలేదు. తన పనినిగూర్చి బహిరంగ ప్రకటన చేయ

నవసరములేదు. నీ వుత్కృష్టబ్రహ్మచారి వైనచో ఇతరులకంటె నూరురెట్లు ఉత్సాహమును నీపనిలో చూపుము. తగినంత ఆహారము దొరకకపోయినను పని మాత్రము త్రిగుణీకృత మగులాగున చూడుము. నీద్వారా సమాజసేవ అధిక మగునట్లు చూడుము. నీ బ్రహ్మచర్యమును నీ యాచార వ్యవహారములలో చూపించుము. చందన సుగంధమును బయటికి వెదచల్లుము.

సారాంశమిది : కర్మయోగి ఫలాశను వదలుటవలన నిట్టి యనంతఫలము లను పొందును. అతని శరీరయాత్ర నడచుచునే యుండును. దేహమును బుద్ధియు తేజస్వంతములై యుండును. తా నుండుసమాజము సుఖవంతమయి యుండును. అతనికి చిత్తము పరిశుద్ధమయి, జ్ఞానముకూడ లభించును. ఇంతే కాదు, సమాజ జీవితములో మోసమును కపటమునుపోయి పవిత్రాదర్శము చేజిక్కును. కర్మయోగి కీ మహిమ అనుభవసిద్ధము.

## 13. కర్మయోగవ్రతమున కంతరాయములు

కర్మయోగి తన కార్యములను ఇతరులకంటె ఉత్కృష్టరీతిని నిర్వహిం చును. అతనికి కర్మయే యుపాసన, కర్మయే పూజ. మనము భగవంతుని పూజించి అతనికి సమర్పించిన నైవేద్యమును తిరిగి ప్రసాదముగ తీసి కొందుము. కాని ఈ ప్రసాదము ఆ పూజయొక్క ఫలమా? ప్రసాదమునిమి త్తము పూజచేయువానికి అది వెంటనే లభించును. కాని కర్మయోగి పూజారూప మైన కర్మలద్వారా భగవద్దర్శనమను మహాఫలమును వాంఛించును. ప్రసా దము దొరకిననే చాలునన్నంత తక్కువ విలువను అతడు కర్మకీయడు. కర్మ యొక్క విలువను తగ్గించుట కతడేమాత్రమును సమ్మతింపడు. స్థూలమైన కొలతబద్దతో దాని నత డెప్పుడును కొలువడు. స్థూల దృష్టి కలవానికి లభించు ఫలముకూడ స్థూలముగనే యుండును. 'లోతుగా నాటుము, కాని తడిపి నాటుము' అని రైతులలో నొక సామెత యున్నది. లోతుగా దున్నినంతమాత్ర మున ప్రయోజనములేదు. అడుగున తడికూడ నుండవలె. లోతు, తడి రెండును ఉన్నచో మణికట్టులావున వెన్ను వేయును. కర్మ గభీరమై అనగా ఉత్కృష్టమై యుండవలె. దానికితోడు ఈశ్వరభక్తి, ఈశ్వర పరాయణత యను తడికూడ దానిలో నుండవలె. కర్మయోగి కర్మ నుత్కృష్టముగ నాచరించి ఈశ్వరార్పి తము చేయును.

పరమార్థమునుగూర్చిన కొన్ని యపోహలు మనలో వ్యాపించియున్నవి. పరమార్థసాధకుడు కాలు, చేయి కదప నక్కరలేదని, పనిపాటలతో వానికి నిమి

త్తములేదని లోకాభిప్రాయము. భూమిదున్నుట, ఖద్దరునేయుటకూడ పరమార్థమా యని లోకులు ప్రశ్నింతురు. కాని భోజనముచేయుటకూడ పరమార్థమా యని ఎవ్వరును ప్రశ్నింపరు. కర్మయోగులలో కర్మయోగియైన పరమేశ్వరుడు గుఱ్ఱములకు దాణా పెట్టినాడు. రాజసూయ యజ్ఞములో ఎంగిలివిస్తళ్ళు ఎత్తివేసినాడు. అడవిలో ఆవులను మేపినాడు. ఆ ద్వారకానాథుడు మరల నెప్పుడైన ద్వారకకు వచ్చినచో పిల్లనాట్యములు చేయుచు వేణువూదుచు గోవులను కాచును. కనుక గుఱ్ఱములకు దాణాపెట్టువాడు, గోవుల కాపరి, రథసారథి, ఎంగిలి విస్తళ్ళ నెత్తివేయువాడు, నేల నలుకువాడు అయిన కర్మయోగిని మహాత్ములు పరమేశ్వరునిగ నిరూపించినారు. మహాత్ములుకూడ స్వయముగ కుట్టుపనియో, కుమ్మరిపనియో, లేక నేతపనియో, తోటమాలి పనియో, లేక ధాన్యమును దంచుపనియో, పిండివిసరుటయో, వర్తకమో, లేక మంగలిపనియో, చెప్పులు కుట్టుపనియో చేయుచు ముక్తిని పొందినారు.

కాని మానవులిట్టి దివ్యమయిన కర్మయోగవ్రతమునుండి పడిపోవుచున్నారు. దీనికి కారణములు రెండు : ఇంద్రియముల విశిష్టస్వభావమును మనము జ్ఞప్తియం దుంచుకొనవలె. మన యింద్రియము లెల్లపుడును 'ఇది కావలెను, అది యక్కరలేదు' అను ద్వంద్వములచేత చుట్టబడియుండును. కావలసినదానియెడల అనురాగము, అక్కరలేనిదానియెడల ద్వేషమును మనస్సులో ఉత్పన్నమగును. ఇట్లీరాగద్వేషములును, కామక్రోధములును మనుష్యుని పీకుకొని తినుచుండును. కర్మయోగము స్వయముగా శ్రేష్ఠమును, రమణీయమును, అనంతఫలదాయకమును అయియున్నది. కాని యీ కామక్రోధములు 'ఇది తీసికొనుము, అది వదలిపెట్టుము' అను పోరాటమును మన గొంతుకకు చుట్టి మనలను విడువక బాధించును. కనుక ఈ యధ్యాయము చివర "వీని సంపర్కమును వదలుకొనుము, వీనినుండి బయటబడుము, అపాయము, జాగ్రత్త!" అని భగవానుడు హెచ్చరించుచున్నాడు. స్థితప్రజ్ఞుడు సంయమమూర్తియైనట్లే కర్మయోగి కూడ కావలె. (6-3-22)

# నాల్గవ అధ్యాయము

## కర్మయోగమునకు సహకరించు సాధనము వికర్మ

### 14. కర్మకు వికర్మయొక్క సహకారము కావలెను

సోదరులారా! కడచిన యధ్యాయములో నిష్కామకర్మ యోగమును గూర్చి వివేచన చేసితిమి. స్వధర్మమునకు స్వస్తిచెప్పి, మధ్యవచ్చిన ధర్మమును మనము స్వీకరించినచో నిష్కామరూపమైన ఫలము పొందనేలేమని తెలిసికొనవలయును. స్వదేశ వస్తువుల విక్రయము వర్తకునికి స్వధర్మము. కాని వర్తకు డీ స్వధర్మమును విడిచి, సప్త సముద్రముల కావలనున్న విదేశ వస్తువులను తెప్పించి విక్రయించును. దీనికి హేతువు అధికలాభ వాంఛయే. ఆ కర్మ నిష్కామకర్మ యెట్లుకాగలదు ? అందువలననే కర్మకు నిష్కామరూపమిచ్చుటకు స్వధర్మ పాలనము అత్యంతావశ్యకము. కాని స్వధర్మాచరణకూడ సకామము కావచ్చును. అహింస విషయమును తీసికొందము. అహింసోపాసకునికి హింస వర్జనీయమేకదా! కాని బయటికి అహింసావాదిగ నుండియు వాస్తవమున కతడు హింసామయుడు కావచ్చును. ఏలయనగా హింస బయటి కగపడని యొక మానసిక ప్రవృత్తిగదా! బహిరంగముగ హింసాకార్యములు చేయ నంతమాత్రమున మనస్సు అహింసామయ మయినదని చెప్పలేము. చేతిలో కత్తినుంచుకొన్నవానిలో హింస బాహాటముగా ప్రకటమగును. కాని కత్తివదలివేసినంత మాత్రమున మానవుడు అహింసామయుడయినాడని చెప్పలేము. స్వధర్మాచరణ విషయముకూడ సరిగా ఇంతే. నిష్కామత్వప్రాప్తికొరకు పరధర్మమునుండి విముక్తులమయి తీరవలె. ఐనను ఇది నిష్కామసాధనకు ప్రారంభము మాత్రమే. దీనివలన మనము లక్ష్యము నందుకొన్నట్లుకాదు.

నిష్కామత్వ మొక మానసికవృత్తి. ఈ వృత్తి కలుగుటకు స్వధర్మాచరణరూపమైన సాధన యొక్కటే చాలదు. ఇతర సాధనల సహకారము కూడ తీసికొనవలె. ఒక్క చమురువత్తితోనే దీపము వెలుగదు. దానికొక జ్యోతికూడ ఉండవలె. జ్యోతి యుండిననే అంధకారము తొలగిపోవును. ఈ జ్యోతిని వెలిగించుట యెట్లు? దీనికి మానసిక సంశోధన అవసరము. ఆత్మపరీక్షణద్వారా చిత్తమాలిన్యమును కడిగిపారవేయవలె. మూడవ అధ్యాయము చివర ఈ ముఖ్యవిషయమునే భగవంతుడు చెప్పినాడు. దాని నుండియే నాల్గవ అధ్యాయము పుట్టినది.

గీతయందు 'కర్మ' శబ్దము 'స్వధర్మము' అను అర్థముతో వ్యవహరింపబడినది. మనము తిందుము, త్రాగుదుము, నిద్రింతుము — ఇవియు కర్మలే; కాని గీతలోని కర్మశబ్దమువలన ఈ పనులేవియు సూచింపబడవు. కర్మయనగా స్వధర్మాచరణ యనియే అక్కడి యర్థము. కాని ఈ స్వధర్మము నాచరించుచు నిష్కామత్వమును పొందుటకు మరియొక వస్తువుకూడ అవసరము. కామక్రోధములను జయించుటయే అది. మనస్సు గంగాజలమువలె నిర్మలమును ప్రశాంతమును కానంతవరకు నిష్కామత్వము సిద్ధింపనేరదు. ఈ విధముగ చిత్తసంశోధననిమిత్తము చేయు కర్మలనే గీత వికర్మయనును. కర్మ, వికర్మ, అకర్మ— ఈ మూడుశబ్దములును నాల్గవ అధ్యాయములో చాల మహత్త్వము గలవి. కర్మ యనగా స్వధర్మాచరణయొక్క స్థూలరూపము. ఈ బాహ్యకర్మలో చిత్తమును లగ్నము చేయుటయే వికర్మ. మన మెవరికైనను నమస్కరించినపుడు శిరస్సును వంచు బాహ్యక్రియతోపాటే లోపలి మనస్సును కూడ వినయముతో వంచక పోయినచో ఆ బాహ్యక్రియ వ్యర్థము. అంతర్బాహ్యములు రెండును ఒకటి కావలె. తెంపులేని జలధారలతో శివలింగమునకు అభిషేకము చేయవచ్చును. కాని ఆ ధారతోపాటే మానసిక చింతనమను ధారకూడ అఖండముగ ప్రవహింపక పోయినచో ఆ యభిషేకమునకు విలువ యేమున్నది? ఇట్టి స్థితిలో ఆ శివలింగమును ఱాయియే. నేనును ఱాయినే. ఱాయి కెదురుగ ఱాయి కూర్చున్నదనియే దీని యర్థము. మన బాహ్యకర్మతో లోపలినుండి చిత్తశుద్ధి యనుకర్మకూడ కలిసినప్పుడే నిష్కామకర్మ సిద్ధించును.

నిష్కామకర్మ యను శబ్దప్రయోగములో 'కర్మ'శబ్దముకంటె 'నిష్కామ' శబ్దములోనే ఎక్కువ మహత్త్వమున్నది. 'అహింసాత్మకమైన అసహయోగము' అనుదానిలో 'అసహయోగ' శబ్దముకంటె 'అహింసాత్మక' అను విశేషణములోనే అధిక మహత్త్వమున్నది. అహింసను దూరమునబెట్టి కేవల సహాయ నిరాకరణ క్రియకు పూనుకొన్నచో అదొక భయంకరవస్తువు కాగలదు. ఈ విధముగనే స్వధర్మము నాచరించుచు, మానసిక వికర్మను దానితో జోడించక పోయినచో, అట్టిస్వధర్మాచరణ వట్టి మోసమగును.

నేడు సార్వజనికసేవ చేయువారు స్వధర్మమే ఆచరించుచున్నారు. దుఃఖములలోను కష్టములలోను పడియున్న బీదలకు సేవచేసి, వారిని సుఖపెట్టుట సహజప్రాప్తమైన ధర్మము. కాని యింత మాత్రమున సార్వజనికసేవ చేయువారందరును కర్మయోగులైనారని యూహింపరాదు. లోకసేవచేయుచు,

మనస్సులో పరిశుద్ధమైన భావన లేకపోయినచో అట్టిసేవ భయానకమగుట కవకాశమున్నది. స్వకుటుంబసేవ చేయుచుండగా పుట్టు అహంకారము, ద్వేషము, మాత్సర్యము. స్వార్థప్రీతి మొదలుగాగల వికారములన్నియు లోక సేవలోకూడ పుట్టుచునేయుండును. నేటి లోక సేవా సమాజములలో దీనికి ప్రత్యక్షనిదర్శనము కనబడుచునేయున్నది.

## 15. కర్మవికర్మల సంయోగమున భగ్గుమను జ్వాలయే అకర్మ

కర్మతో మనస్సు ఏకరూపము పొందవలెను. ఈ యేకీభావమునే గీత వికర్మయనును. ఒకటి బాహ్యకర్మ, అనగా స్వధర్మ రూపమైన సామాన్య కర్మ; రెండవది ఆంతరిక కర్మ, అనగా విశేషకర్మ. వికర్మ లేక విశేషకర్మ మానసికావసరములనుబట్టి వేరువేరుగ నుండును. వికర్మయొక్క వివిధరీతులు ఉదాహరణపూర్వకముగ ఈ యధ్యాయములో చెప్పబడినవి. ఈ విషయమే అరవ యధ్యాయములో విపులీకరింపబడినది. కర్మతో ఈ విశేషకర్మ కలిసినంతనే, అనగా ఈ మానసి కానుసంధానము ద్వారానే నిష్కామత్వమనెడు జ్యోతి వెలుగును. కర్మతో వికర్మ కలిసినప్పుడు నెమ్మదినెమ్మదిగ నిష్కామత్వము మనలో నెలకొనును. శరీరము, మనస్సు వేరువేరు వస్తువులైనయెడల, తన్నిమిత్తమైన సాధనలుకూడ వేరువేరుగనే యుండును. ఈ రెంటికిని సంయోగము కుదిరినప్పుడు లక్ష్యము మనకు చాల సులభమగును. మనస్సొక వైపునను, శరీరము మరొక వైపునను విడివడియుండకుండ శాస్త్రకారులు ద్విముఖమార్గమును సూచించినారు. భక్తియోగములో బయటినుండి తపస్సును, లోపలినుండి జపమును సూచింపబడినవి. ఉపవాసాది బాహ్యతపస్సు జరుగుచున్నను అంతరమునుండి మానసికజపము లేక పోయినచో ఆ తపస్సంతయు వ్యర్థము. తపస్సంబంధమైన భావన నిరంతరమును రగులుచుండవలె. ఉపవాసమనిన భగవంతుని సమీపమున కూర్చుండుట. పరమాత్మ సన్నిధానములో చిత్తము ఉండవలెననిన, బాహ్యభోగముల కవాటమును మూసివేయుట అవసరము. కాని విషయభోగములను బాహ్యముగ త్యజించినను, మనస్సునందు భగవచ్చింతన లేకపోయిన ఈ బాహ్యోపవాసమునకు విలువ యేమున్నది? భగవచ్చింతన చేయవలసిన సమయమున భోజనపదార్థముల చింతన చేయుచున్నచో అది మహాభయంకర భోజనమగును. ఈ మానసిక భోజనమును, ఈ విషయచింతనను మించిన భయంకరవస్తువు మరియొకటి యుండదు. తంత్రముతోపాటు మంత్రముకూడ నుండవలె. కేవలము బాహ్యతంత్రమునకు మహత్త్వమేమి

యనులేదు. కర్మహీనమైన మంత్రమునకుగూడ ఏమియు విలువలేదు. చేతిలోను సేవ యుండవలె; హృదయమునందును సేవయుండవలె. అప్పుడే మనము నిజమైన సేవ చేయగలుగుదుము.

బాహ్యకర్మలో హృదయమార్దవము లోపించిన యెడల ఆ స్వధర్మాచరణము రసవిహీనమై యెండిపోవును. నిష్కామత్వమను పుష్పములును, ఫలములును దానినుండి యుద్భవింపవు. మన మొకరోగికి సేవయొనరించుచున్నామనుకొనుడు. ఆ సేవాకర్మతోపాటు మనస్సులో కోమలమైన దయాభావము లేకున్నచో, ఆ సేవ రసవిహీనమై విసుగుపుట్టించును. అట్టిసేవ చేయువానికిని రోగికినిగూడ బరువే యనిపించును. సేవలో మానసిక సహకారము లేకున్నచో; దానినుండి యహంకారము పుట్టును. "నే నీ రోజున వానికి పనిచేసిపెట్టితిని. అవసరమైనపుడు తిరిగి వాడు నాకు సాయము చేయవలె, నన్నుస్తుతింపవలె, గౌరవింపవలె" – ఇత్యాది వాంఛలు వానిలో ఉత్పన్నమగును. లేదా, వాడు విసుగుజెంది, "ఇంతసేవ నేను చేయుచున్నాను. అయినను ఈ రోగి చిరచిరలాడుచునే యున్నాడు" అని యైన యనుకొనును. చిరచిరలాడుట రోగికి సహజమే. ఇందువలన నిజమైన సేవాభావము లేని సేవకుడు మరింత విసుగుజెందును.

కర్మతో అంతరికభావము మిళితమైనపుడు ఆ కర్మయొక్క రూపమే మారిపోవును. నూనె, వత్తి – ఈ రెంటికిని జ్యోతి తోడయినపుడు ప్రకాశము కలుగును. కర్మతో వికర్మ కలిసినప్పుడు నిష్కామత్వము సిద్ధించును. తుపాకి మందునకు నిప్పు ముట్టించినప్పుడు, అందొకశక్తి యుత్పన్నమయి ఆ మందు దడాలున ప్రేలును. కర్మ తుపాకిమందు వంటిది. దానిలో వికర్మయను అగ్ని పడుటతో కార్యము సిద్ధించును. వికర్మ కలియనంతవరకు ఆ కర్మ జడస్వరూపమే. దానిలో చైతన్యముండదు. వికర్మయను నిప్పురవ్వ ఒక్కసారి అందులో పడినంతనే ఆ కర్మనుండి యుద్భవించు సామర్థ్యము వర్ణింప నలవికానిది. చిటికెడు తుపాకిమందు జేబులోనున్నను, చేతిలో నున్నను దానిని మనము లెక్కచేయము. కాని నిప్పురవ్వ పడినవెంటనే శరీరమంతయు కాలి, ప్రేలిపోవును. స్వధర్మాచరణయొక్క అనంతసామర్థ్యము ఈ విధముగ మరుగుపడియుండును. దానితో వికర్మను జోడించి చూడుడు. అపుడు ఎంతెంత నిర్మాణము, వినాశము జరుగగలదో తెలియును. ఆ వికర్మయొక్క ప్రేలుడువలన అహంకార, కామ, క్రోధాదులలోని శక్తి పటాపంచలగును. దానినుండి యుత్కృష్టమైన జ్ఞానము సిద్ధించును.

కర్మయనగా జ్ఞానమునకు నిప్పంటించువత్తి. ఒక పెద్ద కొయ్యదుంగ యున్నది. దానిని కాల్చిన కణకణలాడు బొగ్గగును. ఇప్పు డా కట్టెకును బొగ్గులకును ఎంత యంతరమున్నది! అయినను బొగ్గయినది ఆ కట్టెయే. కర్మలో వికర్మను చొప్పించినందువలన కర్మ దివ్యరూపమును దాల్చును. పిల్లవీపు మీద తల్లి చేతితో నిమురును. వెలుపలినుండి చూచినచో వీపుమీద చేయి అటునిటు తిరుగుటయే కనబడును. కాని ఈ సామాన్యకర్మద్వారా ఆ తల్లిబిడ్డల మనస్సులో ఉత్పన్నమగు బావనల నెవరు వర్ణింపగలరు ? ఇంతవైశాల్యముగల వీపుమీద ఇంతబరువైన మృదుహస్తముతో నిమిరినచో, ఇంత యానందము కలుగునని లెక్కకట్టినచో, అది హాస్యాస్పదమే యగును. చేతితో నిమురుట యను క్రియ అతిసామాన్యమైనది. కాని, అందులో తల్లిహృదయము చొప్పింపబడినది. అనగా వికర్మ చొప్పింపబడినది. ఇందుచేతనే అట్టి యపూర్వమైన ఆనందము సంప్రాప్తమైనది. తులసీరామాయణములో నొక ఘట్టమున్నది. రాక్షసులతో పోరాడి వానరులు తిరిగివత్తురు. వారిశరీరములు గాయపడి రక్తము స్రవించు చుండును. కాని యొక్కసారి రామచంద్రప్రభుని ప్రేమవీక్షణము వారిపై బడినంతనే వానరుల వేదనయంతయు అదృశ్యమయ్యెను. ఎవడైనను శ్రీరాముని ఆ కన్నులు, ఆ చూపు 'ఫోటో' తీసి, తానును సరిగ నదేవిధముగ మఱెవరివంకనైన చూచినచో, ఆ ప్రభావము కలుగునా ? అట్లనుకరింపవలెనన్న ప్రయత్నముకూడ హాస్యాస్పదమగును.

కర్మతో వికర్మ కలిసినప్పుడు, శక్తి యుద్భవించి, దానినుండి అకర్మ వెలువడును. కట్టె కాలి బూడిదయగును. మొదట నెంతో పెద్దదయియుండిన దుంగ చివరకు, పాపము! చిటికెడు బూడిదయైపోవును. ఇప్పుడు దానిని సులువుగ చేతదీసికొని, శరీరమం దంతటను పూసికొనవచ్చును. ఈ విధముగ కర్మకు వికర్మయను జ్యోతిని అంటించుటవలన చివర కది యకర్మగా మారును. ఆకట్టె యెక్కడ, ఈ బూడిద యెక్కడ ? కః కేనసంబంధః! ఇప్పుడా రెంటి గుణధర్మములకును పోలిక యేమియులేదు. కాని ఆ బూడిద ఆ కొయ్యదుంగదే యనుటలో నేమియు సందేహములేదు.

కర్మలో వికర్మను చొప్పించుటవలన అకర్మయగును. దీని యర్థమేమి? కర్మ యేమియు చేసినట్లే అనిపించదని దీని భావము. అదొక భారమే యనిపించదు. కర్మ చేసికూడ తాను అకర్త యగును, 'నీవు చంపినను చంపినవాడవుకావు' అని గీతావాక్యము. తల్లి బిడ్డను కొట్టునని నీవును ఆ బిడ్డను కొట్టి

చూడుము. నీవు కొట్టినచో ఆ బిడ్డ సహింపదు. తల్లి కొట్టినను, బిడ్డ తల్లిపైట కొంగులోనే తల దాచుకొనును. ఎందుచేత ననగా తల్లియొక్క బాహ్య కర్మలో చిత్తశుద్ధి కలిసియున్నది. తల్లి కొట్టుటలో నిష్కామభావ మున్నది. అందులో ఆమె స్వార్థమేమియునులేదు. వికర్మవలన, మనశ్శుద్ధివలన కర్మలోని కర్మభావము ఎగిరిపోవును. శ్రీరాముని ఆ దృష్టి ఆంతరిక వికర్మవలన కేవలము ప్రేమసుధాసాగరమైపోయెను. కాని రాముని కా పనిలో శ్రమ యేమియు కలుగలేదు. చిత్తశుద్ధితో చేసిన కర్మ కర్త నంటదు. అందువలన పాపపుణ్యము లేమియు మిగులవు. అట్లు కాకపోయినచో ఆ కర్మ బుద్ధికిని, హృదయమునకును ఎంత బరువు! ఎంత యొత్తిడి! రాజకీయ – ఖైదీలందరికిని రేపే విడుదల యను వార్త ఈ మధ్యాహ్నము తెలియవచ్చినయెడల నలువైపుల నుండియు ఎంత జనసమూహము జైలుబయట చేరునో చూడుడు! నలుదిక్కులను ఎంత సంచలనము, ఎంత గడబిడ! మనము కర్మయొక్క మంచిచెడ్డ పరిణామముల వలన కలత జెందుచుందుము. కర్మ నలువైపులనుండియు వచ్చి గొంతు నొక్కునా యన్నట్లు మనలను ముట్టడించును. బాధించును. సముద్రపుపోటు భూమిలోనికి జొచ్చి అఖాతములను కల్పించినట్లే, కర్మయను జంజాటము మదిలో ప్రవేశించి క్షోభ కలిగించును. అపుడు సుఖదుఃఖము లను ద్వంద్వములు నిర్మాణమగును. శాంతియంతయు నష్టమైపోవును. కర్మనాచరించుట, అది సమాప్తమగుట జరిగినను దాని వేగము మిగిలియే యుండును. కర్మ చిత్తమును వశపరచుకొనును. చివరకు నిద్రను గూడ హరించును.

కాని ఇట్టి కర్మతో వికర్మను జోడించి తరువాత నెన్నికర్మ లాచరించినను శ్రమ యనిపించదు. మనస్సు ధ్రువ నక్షత్రమువలె శాంతము, స్థిరము, తేజోమయము నగును. కర్మలో వికర్మను చొప్పించుటచేత అది యకర్మ యగును. అపుడు మానవుడు కర్మ నాచరించియు ఆచరింపనట్లే యుండును.

## 16. అకర్మ యను కళ యెట్టిదో మహాత్ముల నడుగవలెను

కర్మ అకర్మ యెట్లగును? ఈ కళ యెవరియొద్ద లభింపగలదు? మహాత్ములయొద్ద. "మహాత్ములయొద్దకు వెళ్ళి కూర్చుండి వారియొద్ద శిక్షణ పొందుము" అని భగవానుడీ యధ్యాయము చివర చెప్పుచున్నాడు. కర్మ అకర్మ యెట్లగునదియు వర్ణించుటకు భాష చాలదు. దాని సరియైన భావన రావలెననిన మహాత్ములయొద్దకు వెళ్ళవలె. పరమేశ్వరుని వర్ణనకూడ ఇట్లే యున్నది. "శాంతాకారం భుజగశయనం" వేయిపడగల శేషునిపై పరుండి.

కూడా పరమేశ్వరుడు శాంతుడే! ఈ విధముననే మహాత్ములు వేలకొలది కర్మలాచరించుచు కూడ తమ మానస సరోవరములో క్షోభతరంగములను కొంచెమయినను లేవనీయరు. ఈ విశిష్టత మహాత్ముల సన్నిధికి వెళ్ళకయే అవగతము కాజాలదు.

ప్రకృతకాలమున పుస్తకములు చాల చౌకయైపోయినవి. ఒకటి రెండణాలకు గీత, 'మనాచే శ్లోకములు' (సమర్థరామదాసు రచించిన భక్తిగీతములు) మొదలైనవి దొరకుచున్నవి. గురువులకు గూడ కొరతలేదు. శిక్షణ ధారాళముగను, చౌకగను లభ్యమగుచున్నది. విద్యాపీఠములు జ్ఞానదానము చేయుచున్నట్లే కనబడును. కాని జ్ఞానామృత భోజనము వలన కలుగు త్రేనుపు ఒక్కనికిని వచ్చుటలేదు. గుట్టలుగా పెరిగిన ఈ పుస్తకరాశిని చూడగా, మహాత్ములను సేవింపవలసిన ఆవశ్యకము ఆ రోజున కారోజు అధికముగ కనిపించు చున్నది. పుస్తకములమీది గట్టిగుడ్డబైండును దాటి, జ్ఞానము బయటికి వచ్చుటలేదు. అట్టి సందర్భములలో నొక యభంగము నా కెప్పుడును జ్ఞప్తికి వచ్చుచుండును. "కామక్రోధము లను పర్వతములకు ఆవలివైపున నారాయణు డున్నాడు.' ఆ విధముగనే ఈ పుస్తక రాసులకు వెనుకనే జ్ఞానరాజు దాగియున్నాడు. గ్రంథాలయములు నలుదిశలను వ్యాపించియున్నను, మానవుడు నేటివరకును సంస్కారము, జ్ఞానములేని కేవల వానరునివలె సర్వత్ర కనబడు చున్నాడు. బరోడాలో చాల పెద్ద గ్రంథాలయ మున్నది. ఒకసారి యొక పెద్ద మనుష్యుడు ఒక పెద్ద గ్రంథమును పట్టుకొని వెళ్ళుచుండెను. దానిలో బొమ్మలుండెను. అది యింగ్లీషు పుస్తక మనుకొని అయన తీసికొని వెళ్ళుచుండెను. 'అదేమి పుస్తక' మని నే నడిగితిని. ఆయన పుస్తకమును నా చేతికందించెను. "ఇది ఫ్రెంచి గ్రంథమే!" అని నేనంటిని. "బాగుగానున్నది! ఫ్రెంచిపుస్తకము వచ్చినదా!" అని ఆయన యనెను. పరమ పవిత్రమైన రోమనులిపి, చక్కని బొమ్మలు, అందమైనబైండు. ఇంక జ్ఞానమునకు లోటేమి ?

ఆంగ్లమున ప్రతివత్సరము ఏ పదివేలపుస్తకములో తయారగుచుండును. తదితరభాషలలోగూడ ఇంతే. ఇంతగా జ్ఞానప్రసారము జరుగుచున్నను మనుష్యునిబుద్ధి యింతవరకును డొల్లగానే యెట్లున్నది ? జ్ఞాపకశక్తి తగ్గినదని యొకడనును. ఏకాగ్రత యుండుటలేదని ఒకడనును. చదివినదంతయు సత్యముగనే కనబడుచున్నదని యొకడును, ఆలోచనకు సమయమే దొరకుటలేదని మరియొకడును అనును. శ్రీకృష్ణు డన్నాడు : "అర్జునా, విని విని నీబుద్ధి తబ్బిబ్బ

యినది. అది స్థిరపడనంతవరకు నీకు యోగప్రాప్తి కలుగనేరదు. వినుటయు, చదువుటయు ఇక కట్టిపెట్టి మహాత్ముల శరణుపొందుము. వారి జీవితగ్రంథమే నీవు పఠింపదగినది. దాని 'మౌనవ్యాఖ్యానము'ను విని నీవు 'ఛిన్నసంశయుడ' వగుము." తెంపులేని సేవాకర్మ నాచరించునపుడును మనస్సు ఎట్లత్యంత శాంతితో నుండగలదో, బయట నెంతవేగముతో కర్మ జరుగుచున్నను హృదయమున నెట్టి యఖండ వీణాగానము వినబడగలదో మహాత్ములయొద్దకు వెళ్ళిన తెలియగలదు. (13-3-32)

# ఐదవ అధ్యాయము

## అకర్మావస్థ రెండువిధములు : యోగము, సంన్యాసము

### 17. బాహ్యకర్మ మనస్సునకు అద్దము

సోదరులారా! ప్రపంచము మిక్కిలి భయానక వస్తువు. తరచుగా దీనిని సముద్రముతో పోల్చుచుందురు. సముద్ర మెక్కడ చూచినను అంతులేని జలరాశిగా కనబడును. ప్రపంచమును అంతే. ప్రపంచ మెటుచూచినను మోహముతో నిండియున్నది. ఒక డిల్లు వాకిలి విడిచి సార్వజనికసేవలో నిమగ్నుడయి యున్నను, అక్కడ కూడ అతని మనస్సులో సంసారము పీఠమేర్పరచుకొని యుండును. ఒకడు గుహలోనికివెళ్ళి కూర్చున్నను వాని బెత్తెడు లంగోటిలో సంసారము ఓతప్రోతమయి నిండియుండును. ఆ లంగోటి వాని మమకారమునకు సర్వస్వమయి కూర్చుండును. ఒక కరెన్సీనోటులో వేయిరూపాయ లిమిడియున్నట్లే, ఆ చిన్న లంగోటీలోకూడ అపారమైన ఆసక్తి నిండియుండును. ఇంటి జంజాటము వదలినను, బహు వ్యాపకత్వమును తగ్గించుకొన్నను, అంత మాత్రమున సంసారము తగ్గిపోదు. $\frac{10}{25}$, $\frac{2}{5}$ ఈ రెంటికిని ఒకటే యర్థము. ఇంటిలోనున్నను అడవియందున్నను, ఆసక్తి మనల నంటియేయుండును. సంసారము లేశమాత్రమును తగ్గదు. ఇద్దరుయోగులు హిమాలయగుహలలోనికి పోయి కూర్చున్నారనుకొందము. కాని అక్కడకూడ ఒకనికీర్తి యొకని చెవిని పడగానే శ్రోత మండిపడును. సార్వజనిక సేవలోకూడ ఈ రీతియే కనబడుచుండును.

ఈ విధముగ నీ సంసారము వదలకుండ మన వెంటబడుటచేత స్వధర్మాచరణకు కట్టుబడియున్నను దానినుండి విముక్తి కలుగదు. లౌకిక వ్యాపార

ములు, జంజాటాములు తగ్గించినను, సంసారసంబంధములు తగ్గించినను సర్వదా మమత్వము వెన్నంటియేయుండును. రాక్షసు లొకప్పు డంగుష్ఠ మాత్రులు, మరియొకప్పుడు మహాకాయులు అయినట్లే, ఈ సంసారముకూడ తన రూపములను మార్చుచుండును. ఆకారము చిన్నదైనను, లేక పెద్దదయి నను, రాక్షసులు రాక్షసులే. అట్లే మేడలోనున్నను, గుడిసెలోనున్నను, ఈ సంసార మొకరీతినే అనివార్యముగ మనల నంటియుండును. స్వధర్మము యొక్క కట్టడలో నుండి, సంసారమును సమదృష్టితో చూచు చున్నను, అప్పుడు కూడ అనేక కలహము లుత్పన్నమయి ప్రాణము విసిగిపోవుచుండును; అక్కడ కూడ ననేక సంస్థలతోడను, వ్యక్తులతోడను సంబంధ మేర్పడి విసుగు చెందు దువు. 'ఎందుల కీ యాపదలో చిక్కుకొంటినా' యని యనుకొందువు. కాని నీ మనస్సున కదే గీటురాయి. కేవలము స్వధర్మాచరణను అలవరచు కొన్నంత మాత్రమున నిర్లిప్తతరాదు. మానవుడు కర్మయొక్క వ్యాప్తిని తగ్గించినంత మాత్రమున నిర్లిప్తుడు కాజాలడు.

మరి నిర్లిప్తత యెట్లు ప్రాప్తమగును? దానికి మానసిక ప్రయత్న మవ సరము. మానసిక సహయోగము లేనంతవరకు ఏపనియు నెరవేరదు. తల్లి దండ్రులు తమ కుఱ్ఱవానిని ఒక సంస్థకు అప్పగించినా గనుకొందము. వాడ క్కడ వేకువజామున నిద్రలేచును, సూర్యనమస్కారములు చేయును, తేనీరు త్రాగడు. కాని తిరిగి యింటికివచ్చిన రెండుమూడు దినములలో ఈ పద భ్యాసము లన్నిటిని వదలివేయును. ఈ యనుభవము మనకున్నదే. మనుష్యు డనగా వట్టి మట్టిగడ్డ కాడు. మన మతని మనస్సునకు కల్పింపదలచిన యాకా రము అతని మనస్సునందు ముందుగా అంకితమై యుండవలెనుగదా! మనస్సు ఆకారముతో లగ్నము కానిచో, బాహ్యముగ కనబడు శిక్షణ విధానమంతయు వ్యర్థమైనట్లే. ఇందుచేతనే సాధనలో మానసిక సహయోగము అత్యావశ్యకము.

సాధనకు బయటనుండి స్వధర్మాచరణ, లోపలినుండి వికర్మ, రెండును కావలె. బాహ్యకర్మకూడ అవసరమే. కర్మ నాచరింపకయే మనస్సునకు పరీక్ష లేదు. ప్రశాంతమగు ప్రాతస్సమయములో మనస్సు అత్యంత ప్రసన్నముగ నుండును. కాని ఇంటిలో కుఱ్ఱవాడు కొంచె మేడ్చుసరికి మన మనశ్శాంతియొక్క నిజమైన విలువ తెలిసిపోవును. అందుచేత కర్మను తప్పించుకొనుట వలన ప్రయోజనము లేదు. బాహ్యకర్మలవలన మనస్సుయొక్క స్వరూపము ప్రకటిత మగును. నీరు బయటికి చదునుగా కనిపించును. కాని దానిలో నొకఱాయివిసు

రుడు; వెంటనే అడుగు బురద పైకి వచ్చును. మనస్సుయొక్క స్థితికూడ నింతే. మనస్సను అంతస్సరోవరము యొక్క అడుగున మోకాలిలోతు బురద పేరుకొని యుండును. బాహ్యవస్తు స్పర్శ దానికి కలుగగానే దాని స్వరూపము బహిర్గత మగును. ఫలానా వానికి కోపము వచ్చినదని యనుచుందుము. ఈ కోపము బయట నెక్కడనుండి యైన వచ్చినదా? అది లోపల నున్నదే. అది మనస్సులో నుండనిచో బయటికి కనబడి యుండదు.

"తెల్లని ఖాదీ మాసిపోవును కనుక అది మా కక్కరలేదు. రంగుఖాదీ మాయదు" అని యనుచుందుము. కాని అదికూడ మాయును. కాని దాని మాపు కనబడదు. తెల్లఖాదీ మాపు కనబడును. "నేను మాసియున్నాను, ఉతికి శుభ్రపరచు" మని యది యనుసు. ఉన్నదున్నట్లు చెప్పెడు ఈ తెల్లఖాదీ లోకమునకు ప్రియముకాదు. మన కర్మకూడ నిట్లే యనును. "నీవు క్రోధివి. స్వార్థప్రియుడవు. ఇం కేవేవో అవగుణములు కలవాడవు" అని కర్మ చెప్పుచుండును. కర్మ మన స్వరూపమును మనకు పట్టి చూపించు అద్దము వంటిది. కనుక మనము కర్మయెడల కృతజ్ఞులమై యుండవలె. ముఖమునకు పట్టిన మాలిన్యమును చూపించునని అద్దమును పగులగొట్టుదుమా? పగులగొట్టము సరిగదా, దానికి కృతజ్ఞతను చూపుదుము. ముఖము బాగుగ కడుగుకొని తిరిగి యద్దములో చూచుకొందుము. ఈ విధముగనే కర్మలద్వారా మనస్సులోని దోషములు బయటపడునని తలచి కర్మలనే వదలుదుమా? అసలు కర్మయే వలదని కూర్చున్నంత మాత్రమున మన మనస్సు నిర్మల మగునా? కనుక కర్మల నాచరించుచునే చిత్త పారిశుద్ధ్యము కొఱకు కూడ ప్రయత్నింతము గాక!

ఒకడు వెళ్ళి గుహలో కూర్చున్నాడనుకొనుడు. అక్కడ నతనికి ఎవ్వని సంపర్కమును ఉండదు. తానప్పుడు శాంతిపూర్ణ మనస్కుడయినట్లు భావించును. కాని గుహనువదలి భిక్షకొఱకతడు బయటికెక్కడికైనను వచ్చినప్పుడు చూడుడు. ఆడుకొను కుఱ్ఱవా డొకడు తలుపుగొళ్ళెమును గణగణలాడించుచు ఆ నాద బ్రహ్మలో లీనమగును. కాని ఆ యమాయికబాలుడు చేయు ధ్వనిని ఈ యోగి సహింపలేడు. "ఏమీ! యింత కఠోరధ్వని చేయుచున్నా డీ కుఱ్ఱవాడు!" అని యోగి యనును. అతడు గుహలోనుండి, చిన్నధ్వనిని సైతము సహింపలేనంతగ తన మనస్సును దుర్బలము చేసికొన్నాడు. కొంచెము కటకటధ్వని వినబడిన చాలును, దాని శాంతియంతయు తలక్రిందయిపోవును. ఇట్టి మనోదౌర్బల్యము మంచిదికాదు.

సారాంశమిది : మన మనస్సుయొక్క స్వరూపమును తెలిసికొనుటకు కర్మ చాలఆవశ్యకము. కర్మలో దోషములు కనబడినప్పుడు, వానిని తొలగించు కొనవచ్చును. దోషములు తెలియనిచో ప్రగతి ఆగిపోవును. వికాసము శూన్య మగును. కర్మచేసిననే దోషములు కనబడగలవు. వానిని దూరముచేయుటకు వికర్మను సాధనముగ జేసికొనవలె. ఇట్టి వికర్మతో అహర్నిశము ప్రయత్నము జరుగుచున్నచో, స్వధర్మము నాచరించుచునే నిర్లిప్తుడుగ నుండు టెట్లో, కామక్రోధాతీతుడు, లోభమోహాతీతుడు అగుట యెట్లో కాలక్రమమున బోధ పడును. కర్మను నిష్కళంకముగ నుంచుటకై నిరంతరప్రయత్నము జరుగు చున్నచో, కాలక్రమమున నిర్మల కర్మలు సహజములగును. నిర్వికారకర్మలు ఒకదానివెంట నొకటి సహజముగ జరుగుచున్నచో ఏకర్మ యెప్పుడు జరిగినదో ఆ గుర్తుయుండదు. కర్మ సహజమయిపోయినప్పుడు అది అకర్మయగును. సహజకర్మనే అకర్మయందురు. దీనిని మనము నాల్గవ అధ్యాయములో చూచి నారము. కర్మ అకర్మ యెట్లగునో మహాపురుషుల పాదములయొద్ద కూర్చుం డుటవలన తెలియగలదను విషయమునుగూడ భగవానుడు నాల్గవఅధ్యాయము చివర చెప్పియున్నాడు. ఈ యకర్మస్థితిని వర్ణించుటకు భాష చాలదు.

## 18. అకర్మదశయొక్క స్వరూపము

కర్మయొక్క సహజత్వమును గ్రహించుటకు తెలిసిన యుదాహరణ మొకటి తీసికొందము. చంటిబిడ్డ మొదట నడచుట నేర్చుకొనునపుడు ఎంతో కష్టపడును. కాని వాని ఈ బాల్యక్రీడలో మనకు ఆనందమున్నది. "చూడుడు, మా పాపాయి నడక ప్రారంభించినాడు" అందుము. కాని తరువాత అదే సహజమయిపోవును. వాడు నడచు చుండును, మాటలాడుచుండును; కాని నడకమీద దృష్టియే యుండదు. తిండివిషయముకూడ నిట్టిదే. తినుటయే యొక ఘనకార్య మన్నట్లు పిల్లవానికి అన్నప్రాశనచేయుదుము. కాని కాల క్రమమున ఆ తినుట సహజమైపోవును. ఈతనేర్చుకొనుట మొదట నెంతకష్ట మనిపించును! మొదట ఆయాసము వచ్చును. కాని తరువాత మఱియొక పనివలన అలసినపుడు, దానికి విరుగుడుగ "రా, కొంచెము ఈతకొట్టి వత్తము, అలసటతీరును." అని యందుము. అప్పుడు ఈదుట కష్టమనిపించదు. శరీర మూరకయే సహజముగ నీటిపై తేలుచుండును. అలసట యనున దొక మాన సిక స్థితి. కర్మలవలన మనస్సునకు వ్యథకలిగినప్పుడు శ్రమయనిపించును. కాని వికర్మతో నాచరించుటవలన కర్మలు సహజమై బరువే యనిపించవు.

అప్పుడు మనము కర్మలు చేసియుకూడ చేయనట్లేయుండి అకర్మదశను పొందుదుము. ఈ స్థితిలో కర్మలు ఆనందమయము లగును.

కర్మను అకర్మగ చేయుట జీవితలక్ష్యము. ఈ లక్ష్యసిద్ధి కొఱకు స్వధర్మాచరణరూపమైన కర్మల నాచరింపవలె. వానిని చేయుచున్నచో మన దోషములను గ్రహింపగలుగుదుము. ఆ దోషములను తొలగించుటకు వికర్మయొక్క ఆశ్రయమును పొందవలె. అట్లభ్యాసము చేయుచుండుట వలన కర్మలో నేమాత్రపు శ్రమగాని కష్టముగాని లేని మనస్థ్సితి యేర్పడును; వేల కొలది పనులు చేయుచున్నను మనస్సు నిర్మలముగను శాంతముగను ఉండును. "ఓ ఆకాశమా, ఎండవలన నీవు మాడిపోవా? వర్షము వలన తడిసి పోవా? చలి వలన వణకిపోవా?" అని యాకాశము నడిగిచూడుడు. ఆకాశ మే మనును? "నే నేమగుచున్నానో మీరే నిర్ణయము చేయవలెను. నాకేమియు తెలియదు" అనును.●

'పిచ్చివాని యొడలిమీద గుడ్డ యున్నదో లేదో యను నిర్ణయము
ప్రజలు చేయవలెగాని పిచ్చివాని కా విషయ మేమియును తెలియదు.'

దీని భావార్థ మిది: స్వధర్మాచరణ రూపమైన కర్మలు వికర్మయొక్క సాయము వలన వికార రహితముగ ఆచరింపబడినచో నవి స్వాభావికములై పోవును. పెద్దపెద్ద వికట పరిస్థితులుకూడ కష్టమనిపించవు. కర్మయోగమున కిది తాళము చెవి. తాళముచెవి లేక, తాళమును పగులగొట్టవలె నని ప్రయత్నించినచో చేతులు పుండ్లు పడును. కాని తాళముచెవి చేజిక్కినప్పుడు క్షణములో తాళము తెఱవబడును. కర్మయోగమునకున్న ఈ తాళముచెవి వలన కర్మ లన్నియు నిరుపద్రవముగ నెరవేరును. ఈ తాళముచెవి మనోజయము ద్వారా లభ్యమగును. అందువలన మనోజయమునకు విరామములేని ప్రయత్నము జరుగవలె. కర్మ నాచరించుచుండగా కనబడు మనోమాలిన్యమును కడిగివేయుటకు ప్రయత్నము చేయవలెను. అప్పుడు బాహ్యకర్మల జంజాటము కనిపింపదు. కర్మచేయుచున్నా నను నహంకారము నశించును. కామక్రోధముల యుద్వేగము నశించును. క్లేశముయొక్క స్పృహయే యుండదు. కర్మ చేయుచున్నా నను స్ఫురణకూడ మిగులదు.

ఒకసారి నాకొక పెద్దమనుష్యుడు ఇట్లు జాబు వ్రాసెను:– "ఇన్ని పర్యాయములు రామనామ జపము చేయవలసియున్నది. మీరు కూడ ఇందులో

పొల్గొనుచు దినమున కెన్నిసార్లు జపము చేయుదురో తెలుపుడు.'' ఆయన తన బుద్ధికి తోచినట్లు పనిచేయుచున్నాడు. ఆయనను విమర్శించుటకు నే నిది చెప్పుటలేదు. కాని రామనామము లెక్క పెట్టునది, కొలుచునది కాదు. తల్లి బిడ్డకు సేవచేయుచు, దానిని గూర్చిన నివేదిక యేమైనను వ్రాసి అచ్చువేయించునా? వేయించుచో ఒక్క 'థాంక్స్యూ' (అభినందనము) తో బిడ్డ ఋణ విముక్తుడు కాగలడు. కాని తల్లి యట్టిపని చేయదు. ఆమె యేమనును? ''నే నేమి చేసితిని? నేను చేసిన ఘనకార్య మేమియులేదే! నా బిడ్డకు నేను చేసికొనుట యొక బరువా?'' అని యనును. వికర్మయొక్క సహాయతతో ఏకాగ్రచిత్తుడయి, హృదయమును పనియందు చొప్పించి, మానవుడు చేయుకర్మ కర్మయే కాకుండబోవును. అది యకర్మయగును. అక్కడ క్లేశము, కష్టము, తొట్రుపాటు మొదలైన వేవియు ఉండవు.

ఈ స్థితి వర్ణనాతీతము. వర్ణనచేసినను అది యస్పష్టముగనే యుండును. సూర్యు డుదయించుచున్నాడు. కాని ''నేను చీకటిని పోగొట్టుచున్నాను. పక్షులకు ఎగురవలెనన్నకోరిక కల్గించుచున్నాను. మానవులను కర్మప్రవృత్తులను జేయుచున్నాను'' అని సూర్యుని కెప్పుడయిన అనిపించునా? అత డుదయించినచోటనే కదలకయుండును. ఆతని యునికియే విశ్వమును నడుపుచున్నది, కాని సూర్యుని కీ స్పృహలేదు. ''సూర్యభగవానుడా, నీ యుపకారము లనంతములు, నీ వెంత అంధకారమును పోగొట్టుచున్నావు!'' అని మీ రతనితో అనినచో అతడు తెల్లబోవును. ''ఏదీ, కొంచెము చీకటిని దెచ్చి నాకు చూపగలరా? నేను చీకటిని పోగొట్టుచున్నాననిన అది నా కర్తవ్యము'' అని యతడనును. అసలు అంధకారమును సూర్యునియొద్దకు తీసికొనివెళ్ళుట సాధ్యమైనపనియా? సూర్యుని యునికివలననే అంధకారము లేకుండబోవును. ఆ వెలుగులో ఒకడొక సద్గ్రంథమును పఠింపవచ్చును, మఱియొకడు చెడ్డపుస్తకమును చదువవచ్చును. ఒక డపకారమును చేయవచ్చును, మరియొక డుపకారమును చేయవచ్చును. కాని ఈ పాపపుణ్యములకు సూర్యుడు బాధ్యుడుకాడు. సూర్యు డిట్లనును:— ''ప్రకాశము నా సహజధర్మము. నాయొద్ద ప్రకాశము కాకున్న మరేమియుండును. నేను ప్రకాశము నిచ్చుచున్నానను సంగతియే నాకు తెలియదు. నా యునికియే ప్రకాశము. ఈ పనిలోనుండు శ్రమయేమో నాకు తెలియదు. నే నేదో చేయుచున్నాననుట నాకు తెలియని విషయము.''

సూర్యుని ప్రకాశదాన మెట్లు స్వాభావికమో మహాత్ముల విషయమును అట్లే. వారు బ్రతికియున్నారనిన వెలుగు నిచ్చుచున్నారనియే భావము. "మీరు మహాత్ములు, సత్యవాదులు" అని ఒక జ్ఞానితో అని చూడుడు. "నేను సత్యపథమున నడువకపోయినచో నిక చేయున దేమున్నది? నేను చేయుదానిలో విశేషమేమున్నది?" అని యతడనును. జ్ఞానిలో అసత్యప్రవర్తన ఉండనేఉండదు.

అకర్మయొక్క భూమిక యిట్లుండును: సాధన లింతనై సర్గికములును, స్వాభావికములును అయిపోయి, అవి జరుగుచున్నవను స్ఫురణయేయుండదు. ఈ సాధనలకు ఇంద్రియములు సహజముగ అలవాటు పడును. అతడు సహజముగ పలికిన పలుకెల్ల హితోపదేశమగును. ఇట్టిస్థితి ప్రాప్తించినప్పుడు కర్మ అకర్మయగును. జ్ఞానికి సత్కర్మలు సహజములగును. కిలకిలారావము పక్షుల సహజ ధర్మము. మాతృస్మరణ బిడ్డలకు సహజధర్మము. ఈ విధముగనే ఈశ్వరస్మరణ మహాత్ములకు సహజధర్మమగును. తెల్లవారునపుడు "కొక్కరోకో" యనుట కోడికి సహజధర్మము. భగవానుడగు పాణిని స్వరములను తెలియజెప్పుచు కోడికూతను ఉదాహరణగనిచ్చెను. పాణిని కాలమునుండి నేటివరకును కోడి ఉదయమున కూయుచునేయున్నది. కాని దీనికై కోడి కెవరైనను సమ్మానపత్రములు సమర్పించిరా? అది కోడికి సహజధర్మము. అవిధముగనే సత్యము పలుకుట, భూతదయ, పరులదోషములను గమనింపకుండుట, అందరకును సేవాశుశ్రూషలుచేయుట మొదలగు కర్మలు సత్పురుషులకు సహజము. అవి చేయకుండ వారు జీవింపలేరు. భోజనము చేసినందులకు మన మెవరినైనను గౌరవింతుమా? తినుట, త్రాగుట, నిద్రించుట, ప్రాపంచికమానవులకు సహజకర్మ లైనట్లే, సేవాకర్మలు జ్ఞానులకు సహజకర్మలు. ఉపకారముచేయుట వారి స్వభావము. ఉపకారము చేయకుండుట వారిపట్ల అసంభవము. అట్టి జ్ఞాని చేయుకర్మ అకర్మదశను పొందినట్లు ఎంచుకొనవలె. ఈ దశకు సంన్యాసమను అతి పవిత్రమగు పదవి యీయబడినది. సంన్యాసమనగా పరమోత్కృష్టమైన ఈ యకర్మదశయే. దీనినే కర్మయోగమని కూడ అనవలెను. మానవుడు కర్మ చేయుచునేయుండును. కనుక అది 'యోగ' మయినది. కాని కర్మచేయుచుగూడ, చేయుచున్నానను స్ఫురణ లేకపోవుట చేత, అదే సంన్యాసమయినది. కర్మవాసన తన కంటకుండ, యుక్తితో కర్మనాచరించుట వలన అది యోగమయినది; చేయుచునే చేయని వాడగుటచేత నది 'సంన్యాస' మయినది.

## 19. అకర్మయొక్క ఒకవైపు సంన్యాసము

ఇంతకు సంన్యాస మనగానేమి ? కొన్ని కర్మలను వదలివేయుట, కొన్నిటిని చేయుట – ఇదియా సంన్యాసము? అదికాదు. "అన్ని కర్మలను వదలుట" యనునదే సంన్యాసముయొక్క నిర్వచనము. సర్వ కర్మలనుండియు విముక్తుడగుట, కొంచెముకూడ కర్మ నాచరింపకపోవుట – ఇది సంన్యాసము. కాని కర్మచేయకపోవుట యనిన అర్థమేమి? కర్మ అతి విచిత్రవస్తువు. సర్వకర్మలను సంన్యసించుట యెట్లు ? కర్మ ముందును వెనుకను, ఇటు అటు, అన్నిదిశలను వ్యాపించియున్నది. కూర్చుండుటకూడ క్రియయేకదా! 'కూర్చుండుట' యనునది క్రియాపదము. ఇది క్రియయగుట వ్యాకరణశాస్త్రములో మాత్రమేకాదు; సృష్టిశాస్త్రములోకూడ సహాయ క్రియవలె గాక, 'కూర్చుండుట' క్రియయే. కూర్చుండగా కూర్చుండగా కాళ్ళు నొప్పులుపుట్టును. కూర్చుండుటలోకూడ శ్రమయేయున్నది. ఏమియు చేయకుండుటకూడ కర్మయే యయినపుడు, ఇక కర్మ సంన్యాసమెట్లు సంభవమగును ? భగవంతు డర్జునునకు విశ్వరూపమును జూపెను. అంతటను వ్యాపించిన ఆ విశ్వరూపమును చూచి అర్జునుడు భయపడి కన్నులు మూసికొన్నాడు. కన్నులు మూసికొన్నను ఆ దృశ్యము లోపలకూడ కనిపించుచునే యుండెను. కన్నులు మూసికొన్నను కనబడుదానినుండి తప్పించుకొనుట యెట్లు ? మనము చేయకపోయినను జరుగుచున్నదానినుండి తప్పుకొనుట యెట్లు ?

ఒకనియొద్ద అమూల్యమైన అనేక సువర్ణాభరణము లుండెను. వాని నన్నిటిని ఒక పెద్దపెట్టెలో దాచిపెట్టవలె ననుకొన్నాడు. సేవకుడు అందులకు తగిన పెద్ద యినుపపెట్టెను చేయించి తీసికొని వచ్చెను. దానిని చూచి యజమానుడు ఇట్లన్నాడు : " ఎంత మూర్ఖుడవురా నీవు! ఓరీ పల్లెటూరివాడా! సౌందర్యమన్ననేమో నీకు తెలియనట్లున్నదే! ఇట్టి యమూల్యాభరణములను అసహ్యమయిన ఈ పనికిమాలిన పెట్టెలోనా పెట్టవలసినది ? పో, చక్కని బంగారపు పెట్టె యొకటి చేయించి తీసికొనిరా!" సేవకుడు పోయి బంగారు పెట్టెను చేయించి తెచ్చినాడు. "దీని కొక బంగారు తాళమును గూడ చేయించి తీసికొనిరమ్మ. బంగారపు పెట్టెకు బంగారు తాళమే శోభించును" అన్నాడు యజమానుడు. నగలను మరుగున దాచియుంచవలెనని ఆయన యుద్దేశము. కాని అత డావస్తువులన్నిటిని మరుగు పరచినట్లా, బయలు పరచినట్లా ? చోరుల కా నగలను వెదకుకొనవలసిన అవసరమే కలుగలేదు. వా రా చందుగు పెట్టెను కాజేసిరి.

దానితో పని తీరిపోయినది. దీని భావమేమనగా, కర్మ నాచరింపకపోవుట కూడ ఆచరించు విధానమే యగుచున్నది. కర్మ యింత వ్యాపకమై యున్నపుడు దానిని వదలుట యెట్లు ?

ప్రపంచములోనున్న కర్మ లన్నిటిని ఆచరించుచున్నను, అవి యన్నియు కరగి అదృశ్య మగు ఉపాయమును సాధించుటయే కర్మ సంన్యాసమును పొందుటకు మార్గము. ఇట్లు కాగలిగినప్పుడు "సంన్యాసప్రాప్తి" యయినదని చెప్పగలము. కర్మల నాచరించుచుండగనే అవి యన్నియు కరగిపోవుట యెట్లు? సూర్యు డాచరించు పనులు కరగినట్లుగనే ! సూర్యుడు నిరంతరమును కర్మ రతుడై యుండును. రాత్రివేళ కూడ నతడు కర్మ నాచరించుచునే యున్నాడు. అప్పు డతని ప్రకాశము ద్వితీయగోళార్ధములో పనిచేయుచుండును. కాని యిన్ని పనులు చేయుచున్నను, అత డేమియును చేయుటలే దనియే యనుచుందుము. ఇందుచేతనే నాల్గవ అధ్యాయములో "నే నీ యోగమును మొదట సూర్యుని కుపదేశించి యుంటిని. తిరిగి సూర్యునినుండి వివేచనపరుడును, మననశీలుడు నయిన మనువు దీనిని నేర్చుకొన్నాడు" అని భగవానుడు చెప్పుచున్నాడు. ఇరువదినాల్గుగంటలును కర్మల నాచరించుచున్నప్పటికిని సూర్యుడు లేశ మాత్రమును కర్మ నాచరించుటలేదు. నిజమున కీ స్థితి అద్భుత మైనది. ఇందు సందేహ మేమియు లేదు.

## 20. అకర్మయొక్క రెండవవైపు యోగము

కాని యిది సంన్యాసమున కొక రూపము మాత్రమే. కర్మ నాచరించుచు గూడ ఆచరింపనట్లుండుట సంన్యాసములో నొక భాగము. తా నేమాత్రమును కర్మ నాచరింపకుండ, ప్రపంచములోని వారినెల్ల కర్మప్రవృత్తులను చేయుట రెండవభాగము. దీనియం దపారమైన ప్రేరకశక్తి యిమిడియున్నది. అకర్మ లోని విశేషము కూడ నిదే. అకర్మయందు కర్మాచరణ కవసరమైనశక్తి నిండి యున్నది. ఆవిరిశక్తి కూడ నిదేకదా ! బంధించి యుంచబడిన యావిరి యెంత ప్రచండ కార్యములను చేయదు ? అది పెద్దపెద్ద యోడలను, రైలు బండ్లను క్షణమాత్రములో లాగుకొనిపోవును. సూర్యుని విషయముకూడ నింతే. అతడు లేశమాత్రమును కర్మనాచరింపడు. కాని యిరువది నాలుగు గంటలును తెంపులేని కర్మనాచరించుచునే యుండును. మన మతనిని ప్రశ్నించినచో, "నే నేమియు చేయుటలేదే !" అని యనును. రేయింబగళ్ళు కర్మ చేయుచునే, చేయనట్లుండుట, ఏమియు చేయకుండ అహోరాత్రము అనంతకర్మ లాచరించు

చుండుట – ఈ రెండును సూర్యుని రెండురూపములు. సంన్యాస మీ రెండు రూపములతో అలంకృతమై యున్నది.

రెండును అసాధారణములే. ఒక విధానములో కర్మ ప్రకటమయి యుండును; అకర్మావస్థ గుప్తముగ నుండును. రెండవ విధానములో అకర్మస్థితి ప్రకటమై యుండును; కాని దానిద్వారా అనంతకర్మలు జరుగుచునే యుండును. ఈ స్థితియందు అకర్మలో కర్మ పూర్ణముగ నిండియుండును. కనుక దానివలన ప్రచండమైన కార్యాచరణ జరుగును. ఇట్టి స్థితిని పొందిన వ్యక్తికిని సోమరికిని చాల వ్యత్యాసమున్నది. సోమరి అలసిపోవును. విసుగు జెందును. కాని ఈ యకర్మస్థితిని పొందిన సంన్యాసి కర్మశక్తిని బంధించి యుంచును. కర్మ లేశమాత్రమును జేయడు. కాలుసేతులతోగాని మరే యవ యవములతో గాని ఎట్టిపనిని చేయడు. కాని ఏ పనిని చేయకయే అత డనంత కర్మలను చేసినవా డగును.

ఒకనికి కోపము వచ్చినదనుకొందము. ఏదైన మన లోపము వలననే అతడు కోపగించి యుండినచో మన మతనియొద్దకు పోదుముకదా! అప్పుడతడు మౌనమువహించును. మాటలాడడు. ఆ మౌనము వలన, ఆ కర్మత్యాగము వలన ఎంత ప్రచండ పరిణామము కలుగును! మరియొకడైనచో బడబడ మాటలు కురియించును. అగుట కిద్దరిదియు కోపమే; కాని యొకడు మౌనము వహించును, రెండవవాడు బడబడవాగును. ఇద్దరును కోపమునకు మచ్చు ముక్కలే. ఏమియు మాటలాడకపోవుటకూడ క్రోధముయొక్క ఒకరూపమే. దానివలనగూడ పనులు నెరవేరుచుండును తల్లిగాని, తండ్రిగాని, బిడ్డతో మాటలాడుట మానివేసినచో దాని పరిణామ మెంత ప్రచండముగ నుండును! మాటలాడుట కట్టిపెట్టుట వలన, మాటలాడి నందువలన కలుగు ఫలముకంటెను ఎక్కువ ఫలము కలుగును. మౌనమువలన కలుగు ప్రభావము మాటలాడుట వలన కలుగనేరదు. జ్ఞానులయొక్క స్థితి ఇట్లేయుండును. వాని యకర్మయే, మౌనముతో కూర్చుండుటయే ప్రచండమైన కార్యములను నెరవేర్చును; ప్రచండమైన సామర్థ్యము నుత్పన్నము చేయును. క్రియలద్వారా ప్రకటితము కాజాలని పనులన్నియు ఒక డకర్మకుడుగానుండి చేయగలుగును. సంన్యాసము యొక్క రెండవరూప మిట్లుండును.

ఇట్టి సంన్యాసియొక్క సమస్తకార్యములును, సమస్తప్రయత్నములును ఒక్కచోటకలిసి ఒకరూపమునే పొందును.

'ఎడతెగకుండ నేనుచేయు ప్రయత్నము లన్నియు నిలచిపోయినవి. భగవంతుని రెండు రెక్కలపై మూటవలె పడియున్నాను. చింతలన్నియు తొలగిపోయినవి. ఆశ్రయము చిక్కినది. శరీరసంబంధమయిన వికారములన్నియు అంతరించినవి. ఇపుడు నేను నాబలముపై ఆధార పడిలేను. ప్రభువు నా అహంకారమును పటాపంచలు చేసెను. పసిబిడ్డ వలె నిర్మలుడనయితిని.' —తుకారామ్.

తుకారామిట్లన్నాడు:— "నేనిప్పుడు ఖాళీయైపోయితిని; ముద్దకట్టుకొని పడియున్నాను. ఇక నా ప్రయత్నములేమియులేవు." తుకారాము ఖాళీయైపోయి నాడు. కాని ఆ ఖాళీసంచిలో ప్రచండమైన ప్రేరకశక్తి యున్నది. సూర్యుడు స్వయముగా భేరిమ్రోగించుకొనడు. కాని అతని దర్శనమాత్రముననే పక్షులెగురుట మొదలిడును, మేకపిల్లలు గంతులువేయును, ఆవులు వనమునకు మేతకు బయలుదేరును, వ్యాపారస్థులు దుకాణములను తెరచెదరు, రైతులు పొలములకు పోదురు. ఇట్లు ప్రాపంచిక వ్యవహారములన్నియు ప్రారంభమగును. సూర్యుని యునికి మాత్రముననే అనంతకోటి కార్యములు జరుగును. ఈ యకర్మావస్థలో అనంతమైన కర్మలకు కావలసిన ప్రేరణయు సామర్థ్యమును పూర్ణముగ నిండియుండును. సంన్యాసముయొక్క రెండవరూపము ఇట్లద్భుతముగ నుండును.

## 21. రెంటిని పోల్చుట భాష కతీతమైన పని

ఈ యైదవ అధ్యాయములో సంన్యాసముయొక్క రెండు రూపములను పోల్చి చెప్పుకొన్నారము. ఒక డిరువది నాల్గుగంటలు కర్మ నాచరించుచుగూడ ఏమియు చేయనివాడగును. రెండవవాడు క్షణముకూడ నేమియు చేయకుండ సర్వమును చేయుచుండును. మాటలాడుచునే మాటలాడనిరీతి యొకటి, మాటలాడకయే మాటలాడు రీతి యొకటి. ఈ రెండు విధానములును ఇక్కడ పోల్చి చెప్పబడ్డవి. ఈ రెండు దివ్య విధానములను అవలోకించుటలో, విచారణచేయుటలో, మననము చేయుటలో అపూర్వమైన ఆనందమున్నది.

అసలీవిషయమే అపూర్వము, ఉత్కృష్టము. నిజమునకు సంన్యాసమునుగూర్చిన ఈ భావనయే అతి పవిత్రమైనది, యోగ్యమైనది. ఈ భావమును మొట్టమొదట శోధించి కనిపెట్టినవారికి మన మెంతగా ధన్యవాదము లర్పింపవలెనో! ఇది మిక్కిలి ఉజ్జ్వలమైన కల్పన. నేటివరకును మానవుని బుద్ధియు, భావనాశక్తియు ఎగిరి యందుకొన్న మహోన్నతశిఖర మీ సంన్యాసకల్పనయే.

దీని తరువాత నేటివరకును మరెవ్వరును ఈ యెత్తున కెగురలేకపోయిరి. ఎగురు ప్రయత్నములు మాత్రము జరుగుచునేయున్నవి. కాని భావనలోను, అనుభవములోను ఎవరును ఇంత యెత్తునకు పోయినారని చెప్పలేము. ఈరెండు రీతులతో గూడిన సంన్యాసముయొక్క భావన దృష్టికి తగిలినంతనే అపూర్వమైన ఆనందము కలుగును. కాని ఇందుండి తిరిగి భాషలోనికి, ప్రాపంచిక వ్యవహారములలోనికి దిగునప్పటికి ఈ యానందము తగ్గి మనము దిగజారుచున్నామా అని యనిపించును. నే నీ విషయమయి మిత్రులతో నెల్లపుడును చెప్పుచుందును. నే నెన్నో సంవత్సరములుగ ఈ దివ్యభావములను మననము చేయుచున్నాను. దీనిని భాష వర్ణింపలేదు. ఇది మాటల కందునది కాదు.

ఏమియు చేయకయే సమస్తమును చేసివేయుట, అన్నియు చేయుచునే లేశమాత్రమును చేయనట్లుండుట – ఈ కల్పన యెంత యుదాత్తము, రసమయము, కావ్యమయము! ఇక కావ్యములలో నేమున్నది? ఈ కావ్యముముందు తక్కిన కావ్యములన్నియు వెలవెలబోవును. ఈ కల్పనలోగల ఆనందము, ఉత్సాహము, స్ఫూర్తి, దివ్యత్వము మరి యే కావ్యమునందును లేదు. ఈ విధముగ నీ యైదవఅధ్యాయము మహోన్నతమైన భూమికపై ప్రతిష్ఠింపబడినది. గీత నాల్గవ అధ్యాయము వరకును కర్మ, వికర్మలనుగూర్చి చెప్పి ఇక్కడ మహోన్నతస్థితికి వెళ్ళినది. ఈ యధ్యాయములో అకర్మదశయొక్క రెండు రూపములును ప్రత్యక్షముగ పోల్పబడినవి. ఇట్లు పోల్చు ప్రయత్నములో భాష తబ్బిబ్బగును. కర్మయోగి శ్రేష్ఠుడా? లేక కర్మసంన్యాసి శ్రేష్ఠుడా? ఇందు ఎవరెక్కువగ కర్మనాచరింతురో చెప్పలేము. అన్నియు చేయుచునే ఏమియు చేయకపోవుట, ఒకటియు చేయకే సమస్తమును చేయుట – ఈ రెండును యోగములే కాని పోల్చి చెప్పుటకొరకు మొదటిది యోగమని రెండవది సంన్యాసమని యందుము.

## 22. భూమితిశాస్త్రము - మీమాంసకు లిచ్చిన దృష్టాంతములు

ఇట్టిచో వీనిని పోల్చి సమన్వయించుట యెట్లు? ఉదాహరణతోనే ఈ పని కావలె. ఉదాహరణ మియ్యబోయినచో భాష చాలక దిగజారుచున్నామా యని అనిపించును. కాని దిగజారవలసియే యుండును. నిజమునకు పూర్ణకర్మసంన్యాసము గాని పూర్ణకర్మయోగము గాని శరీరధారికి అనుభవములోనికి రాజాలని భావనలు. ఆ కల్పనల యెదుట దేహమే నిలువజాలదు. కాని ఈ కల్పనల దరిదాపునకు వెళ్ళిన మహాపురుషుల యుదాహరణములే మనకు

శరణ్యము. ఉదాహరణ లెప్పటికిని అసంపూర్ణములుగనే యుండును. అయిన నేమి ? అవి పూర్ణములనియే మనము భావించి సాధన ప్రారంభింపవలె.

రేఖాగణితము "అ, ఆ, ఇ ఒక త్రిభుజమని యనుకొమ్ము" అని చెప్పును. కాని అట్లెందు కనుకోవలె ? ఎందుల కనిన ఈ త్రిభుజము యొక్క రేఖలు నిజమునకు రేఖలేకావు. రేఖ యనగా 'పొడుగు మాత్రముండి వెడల్పులేనిది' అని నిర్వచనము. బోర్డుమీద వెడల్పు రాకుండ పొడుగు మాత్రము కనబరచుట ఎట్లు సంభవము? పొడుగు గీయుటలో వెడల్పుకూడ రానేవచ్చును. మన మే రేఖను గీచినను, దానిలో ఏ కొంచెమో వెడల్పుండియే తీరును. కనుక భూమితి శాస్త్రములో "ఇది రేఖ యనుకొ"మ్మని యనకుండ పనియే జరుగదు. భక్తి శాస్త్రములోకూడ ఇంతే. "ఈ చిన్న సాలగ్రామములో అఖిల బ్రహ్మండ నాయకు డున్నాడనుకో" అని భక్తుడు కూడ అనును. "ఇదేమి పిచ్చి ?" యని యెవ రైన అనినచో "మీ రేఖాగణితము వట్టి పిచ్చియేనా ? ఇంత స్పష్టముగ మొద్దు రేఖ కనబడుచున్నను, దీనికి వెడల్పు లేదనుకొమ్మందురే! ఇది పిచ్చికాదా ?" అని నీ వడుగుము. భూతద్దముతో చూచినచో గీత అరంగుళము వెడల్పున కని పించును. మీరు మీ రేఖాగణితములో అనుకొన్నట్లే ఈ సాలగ్రామములో పరమేశ్వరు డున్నాడని భావనచేయుడు' అని భక్తిశాస్త్ర మనును. పరమేశ్వ రుడు ఛిన్నభిన్నము లయి నశింపడు. కాని నీ సాలగ్రామము విరిగి ముక్క లగును కదా! ఒక్క దెబ్బతీసి చూడనా ?' అని యనుట వివేకముతో కూడిన మాటకాదు. ఎందువలననిన భూమితి శాస్త్రములో 'అనుకో' అనునది చెల్లుబడి యైనచో, భక్తిశాస్త్రములో మాత్ర మెందులకుకాదు ? బిందువును 'అనుకో' అని బోర్డుమీద కనబడునట్లుగ చుక్క పెట్టుదుము. బిందు వెక్కడనైనను స్పష్టమైన సున్నవలె నుండునా ? బిందువు నిర్వచనము బ్రహ్మయొక్క నిర్వ చనమే. బిందువునకు పొడవుగాని, వెడల్పుగాని, మందముగాని ఏమియులేదు. నిర్వచన మన్ననో యిట్లే చేయుదుము. కాని బోర్డుమీద కనబడునట్లు వ్రాయు దుము. అయినను బిందు వనునది నిజమునకు అస్తిత్వ మాత్రము, త్రిపరి మాణ రహితము. సారాంశమేమనగా : నిజమైన త్రికోణము, నిజమైన బిందువు సిద్ధాంత మాత్రముగనే యుండును. కాని వాని యస్తిత్వమును గుర్తించి వ్యవహరింపవలసి యుండును. భక్తిశాస్త్రమునందు కూడ సాలగ్రామములో అవిచ్ఛిన్నుడు, అవినాశి, సర్వవ్యాపి యయిన పరమేశ్వరు డున్నాడని ఒప్పుకొన వలసియుండును. ఇక్కడ మనముకూడ ఇటువంటి కాల్పనిక దృష్టాంతములనే తీసికొని, కర్మయోగ కర్మసంన్యాసములను సరిపోల్చి చూతము.

మీమాంసకు లోక ప్రశంసనీయమైన విషయమును వివరించిరి. పరమేశ్వరు డెక్కడున్నాడను మీమాంస చేయుచు వా రొక సుందరమైన వివరణ చెసినారు. వేదములలో ఇంద్రుడు, అగ్ని, వరుణుడు మొదలగు దేవతలను గురించి ప్రస్తావనగలదు. మీమాంసలో నీ దేవతల విషయమును విచారించుచు "ఇంద్రు డెట్లుండును ? అతని రూపమెట్టిద్ది ? అతడెక్కడ నుండును ?" అను ప్రశ్నలను బయలుదేరదీసిరి. మీమాంసకులే దీనికి జవాబిచ్చినారు : ఇంద్రశబ్దమే ఇంద్రుని రూపము. ఇంద్రశబ్దములోనే అతని యునికి. 'ఇ' కి పూర్ణానుస్వారము. దానికి 'ద్ర' చేర్చిన – అదే యతని స్వరూప మగును. అదే అతని మూర్తియు, అతని పరిమాణమును. ఇక వరుణదేవత విషయమో ? అదియునంతే. మొదట 'వ'. తరువాత 'రు' అపైని 'ణ' – వరుణ యగును. ఇదే వరుణుని రూపము. ఈ విధముగనే అగ్ని మొదలైన దేవతలవిషయమునను భావింపుడు. ఈ దేవతలందరును అక్షర రూపధారులు. దేవతలందరు అక్షర మూర్తులు. ఈ కల్పనలో, ఈ విచారణలో చాల మాధుర్యమున్నది. గేవతా విషయికమగు కల్పన – దైవవస్తువు – ఏ యాకారము లందును ఇముడునది కాదు. ఆ భావమును ప్రకటించుటకు ఒక యక్షరమేచాలును. ఈశ్వరుని రూప మెట్టిది ? మొదట 'ఈ' తరువాత 'శ్వ' దాని తరువాత 'ర' చివరకు 'ఓం' తో పూర్ణత్వము వచ్చినది. 'ఓ' అను అక్షరమే ఈశ్వరుడయినది. ఈశ్వరున కది యొక సంజ్ఞావాచకమైనది. ఇట్టి సంజ్ఞలను మనము కల్పించుకొన వలసియున్నది. ఎందుచేతననగా : మూర్తిలో – ఆకారములో – ఈ విశాల కల్పనలు బొత్తిగా ఇముడనేరవు. కాని మనుష్యుని యిచ్ఛ చాల పట్టుదల కలది. అత డీ కల్పనలను మూర్తిలో ప్రవేశపెట్టు ప్రయత్నము చేయకుండ నుండలేడు.

## 23. శుక జనకులవలె సంన్యాసియు యోగియు ఒక్కడే !

సంన్యాసము, యోగము – ఈ రెండును మహోన్నత విషయములు. పూర్ణసంన్యాసము, పూర్ణయోగము అను కల్పనలు ఈ భౌతిక దేహములో ఇముడనేరవు. ఈ ధ్యేయములు దేహములో ఇముడకపోయినను భావనలో తప్పక యిముడవచ్చును. పూర్ణయోగి పూర్ణసంన్యాసి – వీరి యస్తిత్వము కేవలము నిర్వచనములోనే యుండును. అందని యాదర్శముగనే యేర్పడును. కాని ఈ యాదర్శములను హెచ్చుగా అందుకొన్నవారిని ఉదాహరణగ మనము తీసికొనవలసియుండును. అప్పుడు భూమితిశాస్త్రములోవలెనే 'ఇతనిని పూర్ణయోగియని, ఇతనిని పూర్ణసంన్యాసియని అనుకో' అని చెప్పుకొనవలె. సంన్యా

సముయొక్క ఉదాహరణలుగ శుకుని, యాజ్ఞవల్క్యుని చెప్పుకొందుము. ఇక కర్మయోగమున కుదాహరణలుగ జనక శ్రీకృష్ణుల పేర్లను భగవద్గీతయే తీసికొన్నది. లోకమాన్యతిలకు 'గీతారహస్యము'లో జనక శ్రీకృష్ణాదులు కర్మయోగులు, శుక యాజ్ఞవల్క్యాదులు సంన్యాసులు అని యొక పట్టిక నిచ్చినారు. కాని కొంచెము విచారించినచో ఆ పట్టిక తడిచేతితో తుడిచివేయబడినట్లు తుడిచిపెట్టుకొనిపోవును. యాజ్ఞవల్క్యుడు సంన్యాసి. జనకుడు కర్మయోగి, ఆయనకు శిష్యుడు. అనగా సంన్యాసియైన యాజ్ఞవల్క్యునికి కర్మయోగియైన జనకుడు శిష్యుడైనాడు. కాని ఆ జనకునకు శిష్యుడైన శుకదేవుడు సంన్యాసి. యాజ్ఞవల్క్యుని శిష్యుడు జనకుడు, ఆ జనకుని శిష్యుడు శుకుడు. సంన్యాసి, మరల కర్మయోగి, మరల సంన్యాసి – ఈ విధముగ నున్నది ఈ మాలిక. ఈ విధముగ యోగము, సంన్యాసము ఒక పరంపరలోనే వచ్చును.

శుకదేవునితో వ్యాసుడన్నాడు – "నాయనా శుకా! నీవు జ్ఞానివేకాని గురువు యొక్కముద్ర యింకను నీ మీదపడలేదు. అందుచేత నీవు జనకునియొద్దకు వెళ్ళుము." శుకుడట్లే యని వెళ్ళినాడు. జనకు డప్పుడు తన విశాలభవనమున మూడవ అంతస్తుపై కూర్చుండెను. శుకుడు వనవాసి. నగరమును చూచుకొనుచు పోయినాడు. ఎందులకు వచ్చితివని జనకుడు శుకుని అడిగినాడు. జ్ఞానమును పొందుట కన్నాడు శుకుడు. "నిన్ను పంపిన దెవరు?" అన్నాడు జనకుడు. శుకుడు : వ్యాసదేవుడు. జన : నీ రాక యెక్కడనుండి? శుకు : ఆశ్రమమునుండి. జన : వచ్చునప్పుడిక్కడి బజారులో ఏమేమి చూచితివి? శుకు : నలువైపుల నెక్కడ చూచినను అమర్చబడియున్న పంచదార మిఠాయిలు కనబడినవి. జన : ఇంకేమి చూచితివి? శుకు : నడిచెడి, మాటలాడెడి పంచదారబొమ్మలను చూచితిని. జన : మరేమి చూచితివి? శుకు : ఇక్కడికి వచ్చుచుండగా పంచదార మెట్లు కాలికితగిలినవి. జన:తరువాత నేమికనబడెను? శుక:ఇక్కడకూడ పంచదార బొమ్మలనే సర్వత్ర చూచుచున్నాను. జన : ఇప్పుడేమి కనబడుచున్నది? శుక : ఒక పంచదారబొమ్మ మఱియొక పంచదారబొమ్మతో మాట్లాడుచున్నది.

అప్పుడు జనకుడన్నాడు:– "ఇక నీవు వెళ్ళిపోవచ్చును. జ్ఞానమంతయు నీకు లభించినది." జనకుని చేవ్రాలుతో శుకుని కవసరమైన ప్రమాణపత్రము లభించెను. కర్మయోగియైన జనకుడు సంన్యాసియైన శుకదేవుని శిష్యునిగా కృతార్థునిజేసినాడని దీని యర్థము. శుకుడు సంన్యాసి; కాని ఈ ప్రసంగమెంత రమ్యముగ నున్నది!

"ఏడుదినములలో నీకు మృత్యువు వచ్చు"నని పరీక్షిత్తునకు శాపమీయ బడినది. తన మరణమునకు కావలసిన యేర్పాట్లు పరీక్షిత్తు చేసికొనవలసి యుండెను. అంత్యసమయ మెట్లుండవలెనో బోధించగల గురువు కావలసి వచ్చెను. పరీక్షిత్తు శుకాచార్యుని పిలిపించెను. శుకాచార్యుడు వచ్చి 24 × 7= 168 గంటలు పద్మాసనములో కూర్చుండి భాగవతమును వినిపించుచునే యుండెను. కూర్చుండిన ఆసనమును మార్చనేలేదు. తెంపులేకుండ కథను విని పించుచునేయుండెను. ఇందు విశేషమేమి ? ఇదేవిశేషము : వరుసగా ఏడుదిన ములు చాల శ్రమచేయవలసివచ్చినను అతని కేమాత్రమును శ్రమయనిపించ లేదు. ఎడతెగని కర్మచేయుచుగూడ అసలేమియు చేయనట్లే కూర్చుండెను. శ్రమయొక్క భావనయే అక్కడలేదు. "సంన్యాసము, కర్మయోగము – మూల ములో నివి భిన్నవస్తువులు కానేకావు" అని దీని సారాంశము.

ఇందువలననే భగవంతుడు —

'ఏకం సాంఖ్యంచ యోగంచ, యఃపశ్యతి సపశ్యతి' అని యన్నాడు.

"సంన్యాసము, యోగము ఒకటే యని తెలిసికొన్నవాడే అసలు రహ స్యము నెఱిగినవాడు." ఒకడు కర్మచేయకుండ చేసిన వాడగుచున్నాడు, రెండవవాడు కర్మచేయుచుగూడ చేయనివాడగుచున్నాడు. ఉత్తమ సంన్యా సియు, నిత్యసమాధిలో నున్నవాడును, నిర్వికారుడుమ అయిన పురుషని మన మధ్యకువచ్చి పదిరోజులపాటు ఉండనిండు. ఎంతప్రకాశము, యెంతస్ఫూర్తి అతనినుండి మనకు లభింపగలదు! ఏండ్లతరబడి కుప్పతిప్పలుగ పేరుకొని పడి యున్నపని అతని దర్శనమాత్రముననే, అతని యునికివలననే నెరవేరును. ఫొటోను చూచుటవలన చిత్త పారిశుద్ధ్యము కలుగుచుండగా, మృతులైనవారి ఛాయపటమువలన హృదయమున భక్తి, ప్రేమ, పవిత్రత ఉత్పన్నమగు చుండగా, సజీవుడైన సంన్యాసియొక్క దర్శనమువలన ఎంతప్రేరణ లభింప గలదు! సంన్యాసి, యోగి ఇరువురును లోకోద్ధరణ చేయుచుందురు. ఒకచోట బయటికి కర్మత్యాగము కనబడుచున్నను ఆ కర్మత్యాగములో కర్మ పూర్తిగ నిండియుండును. ఆ కర్మ అంతులేని స్ఫూర్తితో కూడియుండును. జ్ఞానియైన సంన్యాసి, జ్ఞానియైన కర్మయోగి, యిరువురును ఒక సింహాసనమునే అధి ష్ఠింతురు. మాటలలో భిన్నత్వమున్నను అర్థమొకటే, ఒక తత్త్వము యొక్క రెండు రూపము లవి. యంత్రము వేగముగ తిరుగునప్పుడు అది స్థిరముగా నున్నదా, అసలు తిరుగుటయేలేదా యన్నట్లుండును. సంన్యాసిస్థితికూడ నిట్టిదే.

ఇతని శాంతినుండి, స్థిరత్వమునుండి అనంతశక్తి, అపారమైన ప్రేరణ వెలువడును. మహావీరుడు, బుద్ధుడు, నివృత్తినాథుడు-ఇట్టి దివ్యపురుషులే. సంన్యాసియొక్క కర్మశక్తియంతయు ఒకచోట స్థిరముగ నున్నను, అది ప్రచండమైనకర్మ నాచరించుచునేయుండును. అనగా యోగియే సంన్యాసి, సంన్యాసియే యోగి. ఇద్దరికిని మూలమున నేమియు భేదములేదు. శబ్దములు మాత్రము వేరుకాని అర్థమొక్కటే. ఱాయియనగా పాషాణము, పాషాణ మనగా ఱాయి యన్నట్లే కర్మయోగియనిన సంన్యాసి, సంన్యాసి యనిన కర్మయోగి.

## 24. ఐనను సంన్యాసముకంటె కర్మయోగమే మేలని తలపబడుచున్నది

ఈ విషయమిట్లున్నను ఇందు భగవంతుడొక ప్రత్యేకత చూపించినాడు. సంన్యాసముకంటె కర్మయోగము శ్రేష్ఠమన్నాడు. రెండును ఒకటేయైనచో భగవంతు డిట్లెందులకనవలె? ఇదేమైన పరిహాసమా? కర్మయోగమే శ్రేష్ఠమనుటలో భగవంతుడు సాధకుని దృష్టిలో నుంచుకొన్నాడు. బొత్తిగా కర్మనాచరింపకుండ అన్నికర్మలను చేయగలుగుట ఒక్క సిద్ధునికే సాధ్యము, సాధకునికి ఇది శక్యముకాదు. కాని అన్ని కర్మలను ఆచరించుచుగూడ నేమియు ఆచరింపనట్లుండుట కొంతవరకు అనుకరణీయము. సాదకునికి శక్యముకాక కేవలము సిద్ధునికే శక్యమగు విధానమొకటి. సాధకునికిగూడ కొంతవరకు శక్యమగునది వేఱొకటి. కర్మ నసలే ముట్టకుండ కర్మ నాచరించుట యెట్లను నది సాధకుని కొక సమస్యగనే యుండును. అతని కది దురవగాహము. సాధకునికి కర్మయోగ మొక మార్గమును, మజిలీయును. కాని సంన్యాసము యొక్క యునికి చివరియంతస్తుమీదనే కాని మార్గములో లేదు. ఇందుచేతనే సాధకునిదృష్టిలో సంన్యాసముకంటె కర్మయోగము శ్రేష్ఠము.

ఈ న్యాయము ననుసరించియే భగవంతుడు పండ్రెండవ అధ్యాయములో నిర్గుణముమీద సగుణమునకు ఆధిక్యము నిచ్చినాడు. సగుణములో అన్ని యింద్రియములకును పనియున్నది. నిర్గుణములో అట్లులేదు. నిర్గుణములో చేతులకు పని లేదు, పాదములకు పనిలేదు, నేత్రములకు పనిలేదు. ఇంద్రియము లన్నియు పనిలేకయే యుండును. సాధకుని కిది సరిపడదు. సగుణమునం దీ చిక్కులేదు. కనులతో మంచిరూపములను చూడవచ్చును. చెవులతో గానశ్రవణము చేయవచ్చును. హస్తములతో పూజయు, లోకసేవయు చేయవచ్చును. పాదములతో తీర్థయాత్రలు జరుపవచ్చును. ఈ విధముగ అన్ని యింద్రియములకును పని నిచ్చి చేయించుచు, నెమ్మది నెమ్మదిగ వానిని హరి

మయము చేయుట సగుణములో సాధ్యము. కాని నిర్గుణములో నివియన్నియు కట్టుపడిపోవును;—నాలుక, కన్ను, చెవి, కాలు, చేయి అన్నియు మూలపడును. ఈ నిష్క్రియత్వమును చూచి సాధకుడు బెదరిపోవును. అతని మనస్సునకు నిర్గుణత్వ మెట్లునచ్చును ? అతడు మౌనముతో గూర్చున్నచో మనసులో అసంగతభావములు బయలుదేరును. వలదన్నపని చేసితీరుటయే ఇంద్రియముల స్వభావము. ప్రకటన పత్రికలలో నుండునదిదేకదా! "ఇది చదువవలదు!" అని పైని వ్రాయుదురు. అందుచేత పాఠకులకు ముందు అదే చదువవలె ననిపించును. 'చదువవలదు' అనుటలో పాఠకుడు దానిని తప్పక చదువవలెననియే యుద్దేశము. మనుష్యుడు దానినే శ్రద్ధతో చదువును. నిర్గుణదశలో మనస్సు త్రోవతప్పి తిరుగుచుండును. సగుణభక్తి ఇట్టిదికాదు. అక్కడ ఆరతియున్నది. పూజయున్నది, సేవయు భూతదయయు ఉన్నవి. ఇంద్రియములకు కావలసినంతపని యున్నది. ఇంద్రియములకు సరియైనపని యప్పగించి, "ఇప్పుడు నీ యిష్టమువచ్చినట్లు వెళ్ళు" మని మనస్సుతో చెప్పుము. అప్పుడు మనస్సు కదలలేదు. అది యందులోనే లీనమై అప్రయత్నముగ ఏకాగ్రతను పొందును. అట్లుగాక పనిగట్టుకొని దాని నొకచోట నిలుపవలెననిన అది తప్పించుకొని పారిపోవును. ఆ యా యింద్రియముల కనువైన మంచిపనుల నప్పగించి మనస్సును స్వేచ్ఛగా పొమ్మనుము. అప్పుడది అట్లుపోదు. స్వేచ్ఛగా తిరుగుమని సెలవిచ్చినచో "నేను తిరుగను, ఇక్కడినుండి కదలను" అని యది అనును. "మాటాడక ఇక్కడనే కూర్చుండు"మని ఆజ్ఞాపించినచో, "ఇదిగో, పోవుచున్నా" ననును.

దేహధారియైన మానవునికి సాధనసౌకర్యముకొఱకు నిర్గుణముకంటె సగుణము శ్రేష్ఠమైనది. కర్మనాచరింపకుండ ఆచరించినట్లుండుటకంటె, కర్మ నాచరించుచు అది లేదనిపించు యుక్తి శ్రేష్ఠమైనది. ఎందుచేతననిన : ఇది తేలికయైన పని. కర్మయోగికి ప్రయత్నమునకు, అభ్యాసమునకు అవకాశము లున్నవి. అన్ని యింద్రియములను స్వాధీనపరచుకొని నెమ్మదిగా అన్ని పనులనుండియు మనస్సును తప్పించు అభ్యాసము కర్మయోగములో సాధ్యమగును. ఈ యుపాయము ఇప్పుడే సాధ్యము కాకపోయినను సాధింపదగినది మాత్రమగును. కర్మయోగము ననుకరించుట సులభము. ఇదే సంన్యాసము కంటె దానికుండు విశిష్టత. కాని పూర్ణకర్మయోగము, పూర్ణసంన్యాసము రెండును ఒకటే. పేర్లు రెండును చూచుటకు వేరువేరుగ కనిపించును. కాని అసలు రెండును ఒకటే. ఒక విధానములో కర్మ బహిరంగముగ నృత్యము

చేయుచు కనబడును, కాని లోపల శాంతి, రెండవదానిలో ఏమియు చేయకయే త్రిభువనములను కదలింపగలశక్తి యున్నది. బయటికి కనబడునది యథార్థముకాదు. ఇది యీ రెంటి విషయమునకు తథ్యము. పూర్ణకర్మయోగము–సంన్యాసము, పూర్ణసంన్యాసము–కర్మయోగము వీనికి భేదమేమియులేదు. కాని సాధకునికి కర్మయోగము సులభము. పూర్ణావస్థలో రెండును ఒకటే.

జ్ఞానదేవునికి చాంగదేవు డొక లేఖపంపినాడు. అది వట్టి తెల్లకాగితము. చాంగదేవునికంటె జ్ఞానదేవుడు వయసులో చిన్నవాడు. చిరంజీవి యని వ్రాయుదమన్న జ్ఞానదేవుడు జ్ఞానములో శ్రేష్ఠుడు. 'పూజ్యులు' అని వ్రాయవలెననిన అతడు వయసునకు చిన్నవాడు. ఇక విషయములు మాత్రము చాంగదేవుడేమి వ్రాయును ? కనుక నతడు వట్టి కాగితమే పంపించెను. అది ముందు నివృత్తినాథుని చేతికందెను. ఆయన దానిని చదివి జ్ఞానదేవుని కిచ్చెను. జ్ఞానదేవుడు చదివి ముక్తాబాయి కిచ్చెను. ముక్తాబాయి చూచి "చాంగదేవు డింత గొప్పవాడైనను ఇంతవరకు ఇతనికి పాండిత్యమే అబ్బలేదు" అనెను. నివృత్తినాథుడు మఱియొక అర్థము తీసి "చాంగదేవుడు నిరాడంబరుడు, శుద్ధుడు, నిర్మలుడు, ఉపదేశమీయగల యోగ్యుడు" అని జాబునకు ప్రత్యుత్తర మిమ్మని జ్ఞానదేవునితో అనెను. జ్ఞానదేవుడు అరువదియైదు శ్లోకముల ప్రత్యుత్తరము వ్రాసి పంపెను. దానిని 'జ్ఞానదేవపాసష్టి' యందురు. ఈ లేఖను గూర్చి యింత మనోరంజకమైన కథయున్నది. వ్రాసినది చదువుట సులభము కాని వ్రాయనిది చదువుట కష్టము. దానిని చదువుట ఎప్పటికిని పూర్తియేకాదు. ఈ విధముగనే సంన్యాసి వట్టి శూన్యునివలె పయికి కనబడుచున్నను ఆ శూన్యతలో అపారమైన కర్మ నిండియుండును.

సంన్యాసము, కర్మయోగము – పూర్ణరూపములో రెంటి విలువయు ఒక్కటే. కాని వ్యావహారిక దృష్టిలో కర్మయోగము యొక్క విలువ చాల హెచ్చు. ఒక నోటు విలువయు, ఒక బంగారునాణెపు విలువయు అయిదు రూపాయలనుకొనుడు. సర్కారు స్థిరముగ నున్నంతవరకు రెంటి విలువయు ఒక్కటే. కాని ఆ ప్రభుత్వము మారినచో వ్యావహారికముగ కాగితపునోటు ఒక్కపైసకు కూడ చెల్లదు. కాని ఎంతలేదన్నను నాణెముయొక్క విలువ–అది బంగారుకనుక–ఏకొంతయో ఉండును. పూర్ణావస్థలో కర్మత్యాగము, కర్మయోగము, రెంటివిలువయు ఒక్కటే. ఎందులకనిన రెంటియందును జ్ఞానము సమానము. జ్ఞానమువిలువ అనంతము. అనంతమున కేది కలిపి

నను దాని విలువ అనంతమే. ఇది గణితశాస్త్ర సిద్ధాంతము. కర్మత్యాగము, కర్మయోగము పరిపూర్ణజ్ఞానముతో కలిసినప్పుడు రెంటివిలువయు సమానము. కాని యిరువైపుల నుండియు జ్ఞానమును తొలగించినచో కర్మత్యాగముకంటె కర్మయోగమే సాధకునకు శ్రేష్ఠమని ఋజువగును. నిండైన శుద్ధజ్ఞానమును ఇరువైపులను కలిపినచో మరల రెంటివిలువయు ఒకటే. గమ్యముచేరినమీదట జ్ఞానము + కర్మ = జ్ఞానము + కర్మాభావము కాని ఇరువైపులను జ్ఞానమును తొలగించినచో సాధకుని దృష్టిలో కర్మాభావముకంటె కర్మయే శ్రేష్ఠమని స్థిరపడును. కర్మ నాచరింపకుండ ఆచరించినవాడగుట యెట్లో సాధకునికి బోధపడదు. కర్మల నాచరించుచు ఆచరింపని వాడగుట యెట్లో అతని కర్థమగును. కర్మయోగము సాధకుని మార్గములోను గమ్యములోనుకూడ ఉన్నది. కాని సంన్యాసము కేవలము గమ్యములోనే యుండును. మార్గములోలేదు. ఈ విషయమును శాస్త్ర పరిభాషలో చెప్పవలెనన్న కర్మయోగము సాధనయు, నిష్ఠయు నగును. సంన్యాసము కేవలము నిష్ఠయే. అంతిమా వస్థను నిష్ఠయందురు. (20-3-32)

# ఆరవ అధ్యాయము

## చిత్తవృత్తి నిరోధము

### 25. ఆత్మోద్ధరణకై ఆకాంక్ష

సోదరులారా! మానవు డెంత ఉన్నతోన్నతస్థానము నందుకొన గలడో భావనావివేచనలద్వారా ఐదవ అధ్యాయములో మనము తెలిసికొంటిమి. కర్మ, వికర్మ, అకర్మ కలిసి సాధన యంతయు పూర్తియగును. కర్మ స్థూలవస్తువు. మన మాచరించు స్వధర్మకర్మలలో మానసిక సహకార ముండవలెను. మానసిక శిక్షణకొఱకు చేయబడు కర్మను వికర్మ, విశేషకర్మ – లేక – సూక్ష్మకర్మ అని యందుము. కర్మ, వికర్మ–రెండును అవసరమే, ఈ రెంటి ప్రయోగముద్వారా అకర్మకు భూమిక తయారగును. ఈ భూమికలో కర్మ, సంన్యాసము–రెండును ఏకరూపమే యగునని వెనుకటి యధ్యాయములో చూచినారము. ఇక ఆరవ అధ్యాయము మొదట కర్మయోగముయొక్క భూమిక సంన్యాసముయొక్క భూమిక నుండి వేఱుగ కనబడుచున్నను, అక్షరశః అవి యేకరూపమే యని చెప్పబడినవి. ఈ భేదము దృష్టిలో మాత్రమే. ఐదవ అధ్యాయములో వివరించిన స్థితిని

పొందించు సాధనలను అన్వేషించుటయే తరువాతి అధ్యాయములలోని విష యము. పారమార్థిక చింతయును, గీతవంటి గ్రంథములును సాధువుల కొఱకే యను అపోహలో చాలమంది యుందురు. "నేను సాధువనుకాను" అన్నాడొక గృహస్థుడు. "సాధువు లొక ప్రత్యేకజాతి. నేను దానికి చెందను. గుఱ్ఱము, సింహము, భల్లూకము, గోవు, ఇత్యాది ప్రాణులవలెనే సాధువులు కూడ ఒక ప్రత్యేకజాతి. పారమార్థిక భావన లీ జాతికి మాత్రమే. వ్యావహారిక ప్రపంచ మంతయు వేఱొకజాతి. దాని యాలోచనలు వేఱు, ఆచారములు వేఱు" అని గృహస్థుని యుద్దేశ్యము. ఈ కల్పన సాధువులను, వ్యావహారిక మానవులను వేరువేరు జాతులుగ విభజించుచున్నది. తిలక్ మహారాజు తన 'గీతారహస్యము' నందు ఈ విషయమును చర్చించినాడు. గీతాగ్రంథము సర్వసాధారణముగ వ్యావహారిక జను లందరికిని ఉపయోగపడునదే యని ఆయన వాదము. దీనిని అక్షరశః నేను ఆమోదింతును. భగవద్గీత సమస్త ప్రపంచము కొఱకును చెప్ప బడినది. పారమార్థికములైన సమస్త సాధనలును ప్రతి వ్యావహారిక వ్యక్తికిని అవసరమే. మన వ్యవహారములను శుద్ధముగను, నిర్మలముగను ఉంచుకొనుచు మానసిక తృప్తిని, శాంతిని మనము ఎట్లు పొందవలెనో దానిని నేర్పుటయే పర మార్థము. వ్యావహారికమును పరిశుద్ధ పరచుట యెట్లో చూపుటయే గీతపని. వ్యావహారిక విషయము లన్నిటిలోనికిని గీత వచ్చుచునే యుండును. కాని నిన్నక్కడనే యుంచుట దానికి సమ్మతముకాదు. చేయిపట్టుకొని నిన్ను చివరి మెట్టువరకును తీసికొని పోవును. "పర్వతము మొహమ్మదు నొద్దకు రాకపోయి నచో మొహమ్మదే పర్వతమునొద్దకు పోవును" అను ప్రసిద్ధమైన సామెత లేదా? జడమైన పర్వతమునకు గూడ తన సందేశము అందవలెనని మొహమ్మదునకు ఆసక్తి. పర్వతము జడము. కనుక మొహమ్మదు పర్వతము రాకకై యెదురు చూచుచు కూర్చుండడు. గీత పనియు నిదే. మానవుడు ఎంత దరిద్రుడు, దుర్బలుడు, మూర్ఖాతిమూర్ఖుడు అయినను వానియొద్దకు గీతామాత వెళ్ళును. కాని ఈ వెళ్ళుట ఉన్నవారి నున్నచోట నుండనిచ్చుటకు కాదు. చేయిపట్టుకొని ముందునకు నడుపుటకును పైకెత్తుటకును. మనుష్యుడు తన వ్యవహారము లను పరిశుద్ధపరచుకొని పరమోచ్చస్థితిని పొందవలెననియే గీత కోరును. ఇందు లకే గీత పుట్టినది.

కనుక "నేను జడుడను, లౌకికుడను, సాంసారిక జీవిని" అని చుట్టుగోడ కట్టుకొని కూర్చుండకుము. ఈ మూడున్నర మూరల శరీరమే నా సర్వస్వము.

వా వలన నే మగును ?" అనవలదు. ఇటువంటి చుట్టుగోడలలో నిన్ను నీవు బంధించుకొని పశువువలె ప్రవర్తింపకుము. ముందునకు సాగి ఊర్ధ్వగతికి పోవు సాహసము చేయుము.

'ఉద్ధరే దాత్మనాత్మానం। నాత్మాన మవసాదయేత్'

నన్ను నేను తప్పక పైకి తీసికొని పోవుదునను ధైర్యముతో నుండుము. నే నొక క్షుద్రసాంసారిక జీవిని అని అనుకొనుచు నీ మనశ్శక్తిని చంపివేసి కొనకుము. 'సద్భావనలు' అను రెక్కలను విరిచి వేసికొనకుము. నీ భావనా వైశాల్యమును పెంచుకొనుము. చండులపక్షి యుదాహరణమును ఎదుట నుంచు కొనుము. చండులపక్షి ప్రాతఃకాల సూర్యునిచూచి అతనియొద్ద కెగిరిపోవలె ననుకొనును. మనమును అట్లే కావలె. దుర్బలమైన రెక్కలతో ఆ పక్షి, పాపము! ఎంత యెత్తున కెగిరినను సూర్యునియొద్ద కెట్లు పోగలదు ? కాని తన భావనలో నది తప్పక సూర్యుని చేరగలదు. మన యాచరణ దీనికి విరుద్ధముగ నుండును. మనము పోగలిగినంత యెత్తునకైనను పోకుండ, భావనల కంతరాయమును కల్పించుకొని మనలను మనమే మరింత దిగద్రోసి కొనుచున్నాము. ఉన్నశక్తిని కూడ సంకుచిత భావనలద్వారా నష్టపరచుకొనుచున్నాము. భావనయే కాళ్ళు విరిగి కూర్చున్నచో అధఃపతనముకాక ఇంక నేమున్నది ? కనుక భావన లెప్పుడును ఊర్ధ్వముఖముగ నుండవలెను. భావనయొక్క సహాయముచేత మానవుడు ముందునకు పోవును. అందువలన భావనను సంకుచిత పరచుకొనకుము.

'అందఱును నడుచుమార్గమును వదలకుము. ఈ సంసారమునే పట్టు
కొని ఊగులాడుము. దీనిని వదలి ఇటునటు మాత్రము పోకుము.

ఇటువంటి వ్యర్థప్రలాపములు కట్టిపెట్టుము. నీ యాత్మ నవమాన పరచుకొనకుము. విశాలమగు భావనయు, ఆత్మవిశ్వాసమును ఉండిననే సాధకుడు నిలువగలడు. వీనివలననే ఆత్మోద్ధరణ కలుగును. అంతేకాని ధర్మము కేవలము సాధువుల కొరకేయని చెప్పి "నీ పరిస్థితులనుబట్టి నీ కిది యుచితమే" యన్నట్లు సాధుపురుషుల నుండికూడ అంగికార పత్రమును పొందగోరు ఆలోచనను వదలివేయుము. భేదజనక మయిన యిట్టి యూహలతో నిన్ను నీవు బంధించుకొనకుము. ఉన్నతాకాంక్షను పెట్టుకొనక పోయినచో ఒక్క అడుగుకూడ ముందునకు సాగదు.

ఈ దృష్టి, యీ యాకాంక్ష, యీ మహోన్నత భావన యున్నవానికే సాధనల సహకార మవసరము. అదిలేనిచో సర్వమును సమాప్తము. బాహ్యకర్మకు

సహాయముగ వికర్మ యను మానసిక సాధన చెప్పబడినది. కర్మకు సహాయముగ వికర్మ ఎప్పుడును ఉండవలెను. ఈ రెంటి కలయిక వలన అకర్మ యను దివ్యస్థితి లభించును. దానిని, దాని రీతులను ,అయిదవ అధ్యాయములో చూచి యుంటిమి. ఆరవ అధ్యాయమునుండి వికర్మయొక్క రీతులును మానసిక సాధనయు చెప్పబడును. ఈ మానసిక సాధననుగూర్చి చెప్పుటకు ముందు గీత యిట్లనుచున్నది. "ఓ సోదరజీవుడా! నీవు దేవుడవు కాగలవు. నీ వీ దివ్యమైన ఆకాంక్షను పెట్టుకొనుము. మనస్సును నిర్లిప్తము చేసికొని దాని తెక్కలను దృఢపరచుకొనుము." సాధనకు, అనగా వికర్మకు భక్తియోగము, ధ్యానము, జ్ఞానవిజ్ఞానములు, గుణవికాసము, ఆత్మానాత్మ వివేకము మొదలైన రూపములున్నవి. ఆరవ అధ్యాయములో ధ్యానయోగమను సాధనయొక్క మార్గము చెప్పబడినది.

## 26 చిత్తైకాగ్రత

ధ్యానయోగములో మూడు విషయములు ముఖ్యమైనవి : (1) చిత్తైకాగ్రత (2) చిత్తైకాగ్రత కుపకరించు మితజీవనము (3) సామ్యదశ – లేక సమదృష్టి. ఈ మూడును లేనిచో నిజమైన సాధనయుండనేరదు. చిత్తైకాగ్రత యనగా చిత్తచాంచల్యముమీద అంకుశము పెట్టుట. మితజీవన మనగా అన్ని పనులును కొలతప్రకారముండుట. సమదృష్టి యనగా విశ్వమును ఉదార దృష్టితో చూచుట. ఈ మూడును కలిసి ధ్యానయోగమగును. ఈ మూటికిని తోడు ఇంకను సాధనలున్నవి. అవి (1) అభ్యాసము (2) వైరాగ్యము. ఈ యైదు విషయములనుగూర్చి యిక్కడ కొంత చర్చింతము.

మొదట చిత్తైకాగ్రత తీసికొందము. ప్రతిపనియందును చిత్తైకాగ్రత అవసరము. వ్యావహారిక విషయములలో కూడ ఇది యవసరమే. వ్యావహారికమునకును పారమార్థికమునకును కావలసిన సద్గుణములు వేరువేరను కొనుట సరికాదు. వ్యావహారికమును పరిశుద్ధపరచుటయే పరమార్థము. వ్యవహార మేదైనను దాని యశోఽపయశములు, సఫలతా విఫలతలు ఏకాగ్రత మీదనే ఆధారపడియుండును. వ్యాపారము, వ్యవహారము, శాస్త్రపరిశోధన, రాజనీతి, రాజ్యతంత్రము – వీనిలో లభించు యశస్సు ఆ యా కర్తల చిత్తైకాగ్రత ననుసరించియే యుండును. నెపోలియనును గూర్చి ఒకమాట చెప్పుచుందురు. అతడు యుద్ధపుటేర్పాటు లన్నియు సరిగాచేసి తదుపరి ఆ యుద్ధభూమిలోనే గణితశాస్త్ర పరిశోధనలో నిమగ్నుడై యుండువాడట. డేరాలపై

తుపాకిగుండ్లు వర్షించుచున్నను, సైనికులు మరణించుచున్నను నెపోలియను మనస్సు తన గణితశాస్త్రమునందే లగ్నమై యుండెడిది. నెపోలియను – ఏకాగ్రత చాల గొప్పదని నేవనను. ఏకాగ్రతను గూర్చి అంతకుమించిన యుదాహరణ లియ్యవచ్చును కాని అతనియం దేకాగ్రత యెంతయుండెనో చూడుడు. ఖలీపా ఉస్మాన్‌ను గూర్చికూడ ఇటువంటిమాటయే చెప్పుచుందురు. యుద్ధమధ్యమున నమాజువేళకాగానే అతడు అక్కడికక్కడనే చిత్తైకాగ్రతతో మోకరించి నమాజు చేయువాడట. ఇరుపక్షములలో నెవరు చనిపోవుచున్నారను స్పృహకూడ లేనంతగ అయనమనస్సు ప్రార్థనలో నిమగ్నమయ్యెడిది. ఆది కాలపు ముసల్మానుల ఇట్టి ఈశ్వర నిష్ఠవలననే, ఏకాగ్రతవలననే ఇస్లాముధర్మ మింతగ వ్యాప్తి చెందినది.

ఆ కాలపు కథ నే నొకటి వింటిని. ఒక ఫకీరుండువాడు. శరీరములో బాణము గ్రుచ్చుకొని అత డపరిమితముగ బాధపడుచుండెను. దానిని బయటికి లాగబోగా బాధ మరింత అధికమయ్యెను. అందుచేత లాగుటకు వీలుకాలేదు. క్లోరోఫారమువంటి మత్తుమం దప్పుడేమియు లేదు. కనుక అదొక పెద్దసమస్య యయ్యెను. ఫకీరు నెరిగినవారిలో కొందరు ముందునకువచ్చి "బాణమిప్పుడు తీయవలదు. ఇతడు నమాజు చేయునప్పుడు తీయుదము" అనిరి. సాయం కాలపు నమాజువేళ యయ్యెను. ఫకీరు నమాజు మొదలుపెట్టెను. అంతలో నతడు ఏకాగ్రచిత్తుడయ్యెను. వెంటనే బాణము తీసివేసిరి. తీయుటే అతనికి తెలియదు! ఇది ఎంత యేకాగ్రత!

సారాంశమిది : వ్యావహారికములో నైనను, పారమార్థికములో నైనను చిత్తైకాగ్రత వినా సఫలత దుర్లభము. ఏకాగ్రత యున్నచో శక్తిసామర్థ్యము కెన్నడును కొఱతయుండదు. నీవు అరువదియైదేండ్ల ముదుసలివి వైనను నీలో యువజనోత్సాహము, సామర్థ్యము కనబడుచునే యుండును. మానవునకు వార్ధకము వచ్చినకొలది అతని మానసికశక్తి వృద్ధిపొందుచుండవలె. పండును చూడుడు – మొదట ఆకుపచ్చగా నుండి తరువాత పక్వమగును; క్రమముగ మాగి చివరకు క్రుళ్ళినశించును. కాని దానిలోని గింజమాత్రము అంతకంతకు గట్టిపడుచునే యుండును. పండుయొక్క బాహ్యశరీరము క్రుళ్ళి నశించును. ఈ బాహ్యశరీరము ఫలమునకు సారసర్వస్వముకాదు. దాని సారసర్వ స్వము ఆత్మయే – అదే బీజము. మానవశరీర విషయముకూడనింతే. శరీరము ముసలిదియగుచుండును. కాని స్మరణశక్తి వృద్ధిపొందుచునే యుండవలె; బుద్ధి

తేజస్వంతము కావలె; కాని అట్లగుటలేదు. 'ఇటీవల నా జ్ఞాపకశక్తి తగ్గిపోయిన దని ఒకడనును. ఏలయని యడుగగా 'వార్ధకము వచ్చుటవలన' అని యనును. నీ జ్ఞానము, నీ విద్య, నీ జ్ఞాపకశక్తి - ఇవి నీ బీజమని, నీ యాత్మయని యెఱుంగుము. శరీరము ముసలిదగుచున్నకొలది సడలిపోవును. కాని ఆత్మమాత్రము అంతకంతకు బలిష్ఠమగుచుండవలెను. ఏకాగ్రతవినా ఇది యసంభవము.

## 27. ఏకాగ్రత సాధించుట యెట్లు ?

ఏకాగ్రత అవసరమే. కాని అదెట్లువచ్చును ? దానికొఱకు మనమేమిచేయవలె ? మనస్సును ఆత్మయందు లగ్నముచేసి, "నకించి దపి చింతయేత్" "మరి దేనినిగూర్చియు చింతనచేయకు" మని భగవంతు డనుచున్నాడు.

కాని యిదెట్లు సిద్ధించును? మనస్సును పూర్తిగ శాంతిపరచుట చాలగొప్ప విషయము. ఆలోచనాక్రమమును గట్టిగ నిరోధించనిచో ఏకాగ్రత యెట్లుకలుగును ? బాహ్యచక్రము నేదోవిధముగ నిరోధించినను ఆంతరికచక్రము మాత్రము తిరుగుచునేయుండును. చిత్తైకాగ్రతకొఱకు ఈ బాహ్యసాధనలను ఉపయోగించుచున్నకొలది లోపలిచక్రము మరింత వేగముతో తిరుగుచుండును. నీవు పద్మాసనములో కూర్చుండి, దృష్టిని కేంద్రీకరింపుము. కాని యింతమాత్రమున మనస్సు ఏకాగ్రము కాజాలదు. మనశ్చక్రముయొక్క భ్రమణమును ఆపివేయగల స్థితిని సాధించుట ముఖ్యము.

మనస్సును కలవరపరుచు ఈ యపారమైన బాహ్యసంసారమును నిరోధించనిచో ఏకాగ్రత దుస్సాధము. ఆత్మయొక్క అపారమైన జ్ఞానశక్తిని క్షుద్రములయిన బాహ్యవిషయములలో ఖర్చు పెట్టుచున్నాము. ఇది జరుగరాని పని. పరులను పీడింపకుండ స్వప్రయత్నముచే ధనికుడగువాడు అనవసరపు ఖర్చులు చేయడు. అట్లే ఆత్మ - జ్ఞాన - శక్తిని క్షుద్రవిషయ చింతనలలో ఖర్చు పెట్టరాదు. ఈ జ్ఞానశక్తి మన యమూల్యమైన మూలధనము. కాని మనము దానిని స్థూల విషయములకై ఖర్చుపెట్టుచుందుము. "ఈ కూర బాగుగాలేదు. దీనిలో ఉప్పుతక్కువ" అనుచుందుము. ఏమినాయనా! గురివింద గింజయంత ఉప్పు తక్కువైనదా! పాపము! ఒక్క ఉప్పుగల్లు తక్కువయినదను దీర్ఘాలోచనలోనే మనజ్ఞానము ఖర్చుబడిపోవుచున్నది. బిడ్డల నింటిలో కూర్చుండబెట్టి చదువు చెప్పుదుము. చెట్ల క్రిందనైనచో కాకులను, పిచ్చుకలను చూచి పిల్లలు ఏకాగ్రత పొందలేరని ఇట్లు చేయుదుము. వారు పసిబిడ్డలగుటచేత అంతలో వారి కేకాగ్రత కుదురును. కాని మనము పశువుల మైనారము.

మనకు కొమ్ములు వచ్చినవి. మనలను సప్తప్రాకారములమధ్య పెట్టినను ఏకాగ్రతరాదు. ఏలయనిన ప్రపంచములోని ప్రతివిషయమునుగూర్చి చర్చకు దిగుచుండుట మన కలవాటైపోయినది. పరమేశ్వరునియొద్దకు చేర్చగల జ్ఞానమును మనము కూరలరుచులను చర్చించుటలో ఖర్చుపెట్టి అందే కృతార్థత యున్నదనుకొనుచున్నాము.

ఈ భయానకసంసారము అహర్నిశము మనలోపలను, వెలుపలను, నలువైపుల హుంకారము చేయుచున్నది. ప్రార్థన, భజనకూడ మనము బాహ్యాడంబరములకొఱకే చేయుచుందుము. పరమేశ్వరునియందు తన్మయులమై సంసారమును విస్మరించు క్షణ మొక్కటికూడ ఉండదు. ప్రార్థనకూడ ఆడంబరముకొఱకే యైనది. ఇట్టి మానసికదుస్థితియందు పద్మాసనములో కూర్చుండుట, కన్నులు మూసికొనుట అన్నియు వ్యర్థము. మనస్సు నిరంతరమును బయటనే పరుగెత్తుచున్నచో మానవుని శక్తియంతయు నష్టమైపోవును. మనుష్యులలో నియమ నిగ్రహములు నశించినవి. ఈనాడు మన దేశములో అడుగడుగునను ఈ విషయము అనుభవమునకు వచ్చుచునేయున్నది. వాస్తవముగ భారతవర్షము పరమార్థమునకు పుట్టినిల్లు. ఆదినుండియు భారతీయులు ఉన్నతాశయములు కలవారుగ పరిగణింబడు చున్నారు. అట్టి దేశమున మన మిప్పుడే స్థితికి వచ్చితిమి? కేవలము నిరర్థక విషయములచర్చలో మనము ఆతురత చూపుచున్నాము. ఇది చాల శోచనీయము. క్షుద్రవిషయములలోనే మన మనస్సు మునిగియుండును.

> 'హరికథలు, పురాణములు వినబోయిన నిద్ర నెత్తికెక్కును. నిద్రపోవలెనని పండుకొన్నచో ఆలోచనలు పరంపరలుగ వచ్చి తలలో తిరుగుచుండును. కర్మపద్ధతి యింత విపరీతమైనది. వీనినిగూర్చి వగచిన నేమి లాభము ?'

ఒకప్రక్క శూన్యాగ్రత, రెండవవైపున అనేకాగ్రత. ఏకాగ్రత పేరునకైనను ఉండదు. మనుష్యుడు ఇంద్రియముల కింతగ బానిస యైనాడు. నేత్రములను అర్ధనిమీలితములుగ ఎందుల కుంచవలెనని ఒకరొకసారి నన్నడిగిరి. నేను దీనికి సూటిగ జవాబు చెప్పగలిగితిని. "పూర్తిగ కనులు మూసికొన్నచో నిద్రవచ్చును. కన్నులను తెరచియుంచిన దృష్టి నలువైపులకును పరుగెత్తి యేకాగ్రత కుదురదు. కనులు మూసికొన్నచో నిద్ర వచ్చుట తమోగుణము. తెరచియుంచినచో దృష్టి చెదరి రజోగుణము ప్రవేశించును. ఇందువలన అర్ధ

నిమీలితస్థితి మధ్యమార్గముగ చెప్పబడినది.'' మనస్సు స్థితి మారనిచో, పరిశుద్ధము కానిచో ఏకాగ్రత కలుగనేరదని దీని తాత్పర్యము. ఆసనము వేసికొని కూర్చున్నంత మాత్రమున అది సిద్ధింపదు. దాని కొఱకు మన వ్యవహారము లన్నియు పరిశుద్ధముగ నుండవలెను. వ్యవహారములు పరిశుద్ధము లగుటకు లోపలి యుద్దేశము మారవలె. వ్యక్తిగత లాభము కొఱకుగాని వాసనల తృప్తి కొఱకుగాని యే బాహ్యఫలితమునో అపేక్షించిగాని ఏపనియు చేయరాదు.

మనము దినమంతయు పనులు చేయుచునే యుందుము. ఇట్లు దినమంతయు మనము పడు పాట్లలో ఉద్దేశమేమి ?

' ఈ యట్టహాసము, ఈ యురుకులు, పరుగులు అన్నియు మన చరమదశ మధురముగ నుండవలె ననియే కదా !'

జీవితము పొడుగునను అష్టకష్టములు పడుటెందులకు ? తుదిగడియ, మరణ సమయము పవిత్రమగుట కొఱకే కదా ! పగటియొక్క తుదిగడియ సాయంకాలమున వచ్చును. పగటి పను లన్నియు పవిత్ర బావముతో చేసినచో రాత్రి ప్రార్థన మధురముగ నుండును. కనుక సాయం సమయము మధురముగ నున్నచో ఆనాటి పను లన్నియు సఫలమైనట్లే యెంచుకొనుము. అప్పుడు మనస్సు ఏకాగ్రతను పొందును.

ఏకాగ్రత కొఱకిట్టి జీవిత పారిశుధ్యము అవసరము. బాహ్యవస్తుచింతన వదలిపోవలె. మానవు డెక్కువ కాలము జీవింపబోడు. ఈ స్వల్పమైన ఆయుః ప్రమాణములోనే దివ్యసుఖమును చవిచూడగల సామర్థ్యము వానికున్నది. ఇద్దరు వ్యక్తులు కేవలము ఒక యచ్చులోనే తయారైన ట్లుందురు. ఇద్దరిదియు ఒకటేముద్ర. రెండు కన్నులు వానిమధ్య ముక్కు, ముక్కునకు రెండు రంధ్రములు. ఇట్లు ఒక రూపముతోనే యుండియు ఒకడు దేవతుల్యుడుగ, ఒకడు పశుప్రాయుడుగ నుండును. దీనికి కారణమేమి ? ఇద్దరును పరమేశ్వరుని బిడ్డలేకదా ? ' అందరును ఒకజాతివారే కదా ' అయినను ఈ భేదమేల వచ్చినది ? ప్రవర్తనమునుబట్టి ఈ యిరువురును ఒక జాతివారే యని నమ్మలేము. ఒకడు నరుడుగానున్న నారాయణుడు, రెండవ వాడు నరుడుగా నున్న వానరుడు.

మానవుడెంత ఉచ్చస్థితికి పోగలడో, ఈ నరదేహమునం దెంత శక్తి యిమిడియున్నదో చూపగల మహాత్ములు నాడును నేడును కలరు. ఇది మన కనుభవసిద్ధము. ఈ దేహములోనుండి మనుష్యుడిట్టి అద్భుత కార్యములను

చేయగలిగి నప్పుడు నేను మాత్రము అట్లేల చేయలేను? నాకల్పనాశక్తికి హద్దు లేల యుండవలెను ? నావంటి దేహముకలవారే వీరపురుషులు కాగలిగినప్పుడు నా స్థితి ఇట్లెందుల కుండవలెను ? నాలో నెక్కడనో దోషమున్నది. నా మనస్సెల్ల ప్పుడును బయటనే తిరుగుచున్నది. ఇతరులను విమర్శించుటలోనే అది చాల వ్యర్థమై పోవుచున్నది.

'ఇతరుల గుణదోషములను నేనేల చూడవలెను? నాలోమాత్రము
దోషములు తక్కువగా నున్నవా ?'

ఎల్లపుడును ఇతరుల చిన్నచిన్నలోపములను చూచుటలోనే నిమగ్నుడనై యున్నచో నాకు చిత్తైకాగ్రత యెట్లుకుదురును ? అట్లున్నప్పుడు నాస్థితి 1 శూన్యావస్థ అనగా నిద్ర – లేక – తమోగుణము, 2 అనేకాగ్రత – అనగా – రజో గుణము–అను ఈ రెంటినడుమను చిక్కుకొనియుండును.

ఏకాగ్రతకొఱకు "ఇట్లుకూర్చుండుము; కన్నులను ఇట్లుంచుకొనుము. ఇట్లాసనము వేసికొనుము"–ఇత్యాది సూచనలు భగవంతు డీయకపోలేదు. కాని చిత్తైకాగ్రత అవసరమని గ్రహించినప్పుడే పైవన్నియు మన కుపకరించును. ఏకాగ్రత అవసరమని మనసులో ముందు నిర్ధారణ కావలెను. అప్పుడు మనకు మనమే దానికి కావలసిన సాధనమార్గములను అన్వేషింతుము.

## 28. మితజీవనము

చిత్తైకాగ్రతకు సాయపడు రెండవవిషయము మితజీవనము. మన పను లన్నియు తూచినట్లుండవలెను. ఈ గణితశాస్త్రరహస్యము మన సమస్తక్రియల లోను ఓతప్రోతముగా నుండవలె. ఔషధమువలెనే ఆహారనిద్రలుకూడ తూకము ప్రకారముండవలెను. సమస్త క్రియలును ఇట్లే యుండవలె. ఇంద్రియము లన్నిటిమీదను కావలి ఉంచవలెను. నే నెక్కువగ తినుటలేదుకదా! హెచ్చుగ నిద్రపోవుటలేదుకదా! అనవసరమైన వానిమీదికి దృష్టి పోనిచ్చుటలేదుకదా!– అను సూక్ష్మదృష్టితో మానవుడు తన్ను తాను ఎల్లపుడును పరీక్షించుకొను చుండవలెను.

ఒకానొక గృహస్థుడు తా నెవరియింటికి వెళ్ళినను అందెక్కడ నే వస్తువున్న దియు ఒకక్షణములో అవగాహన చేసికొనువా డని ఒకరు నాతో ననిరి. "ఓదేవా, నాకీ మహిమ లభింపకుండునుగాక!" అని నాలో నే ననుకొంటిని. ఆ గదిలోని అయిదు–లేక–యేబదివస్తువుల పట్టికను జ్ఞప్తియం దుంచుకొనుటకు నేను యతని

మంత్రినా ? లేక నే నాయింటిలో నేదేని దొంగిలింపబోవుచున్నానా ? సబ్బు ఎక్కడనున్ననేమి, గడియార మెక్కడనున్ననేమి ? ఇవన్నియు నా కెందులకు? ఈ నిరర్థక విషయములకై నామేధ నేలబాధింపవలె ? నా నేత్రముల కీ వృథా శ్రమయేల ? ఈ విధముగ చెవులపైగూడ కావలియుంచుము. "కుక్కచెవుల వంటి చెవులు మనకున్నచో ఎంతబాగుగానుండును !"అని కొంద రనుకొందురు. కుక్కలు ఎటుకావలసిన నటు చెవుల నంతలో త్రిప్పగలవు. పరమేశ్వరుడు మనుష్యుని కీ శక్తి నీయలేదు. కాని ఇదొక లోటుకాదు. ఈ నిరర్థకశక్తితో మన కవసరములేదు. అసలు మన మనస్సే మిగుల నుద్రిక్తమయినది. ఎక్కడనేని కాసంత అలికిడి యయ్యెనా మనస్సు అటు పరుగిడును. కనుక నిగ్రహమును మితత్వమును జీవితమునందు ప్రవేశపెట్టుము. చెడ్డవస్తువులను చూడకు. చెడ్డ పుస్తకములను చదువకు. నిందాస్తుతులు చెవినిబెట్టకు. నిర్దుష్ట వస్తువులే కదా యని మితిమీరి సేవింపకు. ఇక సదోషవస్తువులవిషయము చెప్పనేల ? ఎట్టి ఇంద్రియచాపల్యమును ఉండరాదు. సారాయి, పకోడీ, రసగుల్లా అవసరమేలేదు. కమలాఫలము, అరటిపండు, బత్తాయి, నారింజకూడ ఎక్కువగా అక్కరలేదు. ఫలాహారము శుద్ధమైన అహారమే. కాని అదికూడ మితిమీరి పనికిరాదు. స్వేచ్ఛాచారమునకు దిగినచో లోపలి యజమానుడు తప్పక దండించునను భయ భక్తులు ఇంద్రియముల కుండవలె. నియతాచరణమే మితజీవన మందుము.

## 29. శుభదృష్టి

మూడవవిషయము సమదృష్టి కలిగియుండుట. సమదృష్టియే శుభదృష్టి. శుభదృష్టి కలుగనిచో ఏకాగ్రత రానేరదు. సింహము ఎంత వనరాజైనను ముందునకు నాలుగడుగులు వేసి వెనుకకు చూచును. క్రూరజంతువున కేకాగ్రత ఎట్లు వచ్చును ? సింహము, కాకి, పిల్లి – వీనికన్నులు ఎప్పుడును నలువైపుల చూచుచుండును. వాని చూపు ఎప్పుడును బెదరుచు చెదరుచు నుండును. హింసావృత్తిగల ప్రాణియొక్క స్థితి ఇట్లేయుండును. మనలో సామ్యదృష్టి రావలెను. ఈ సృష్టియంతయు కల్యాణమయముగ తోచవలెను. నామీద నాకు విశ్వాసమున్నట్లే సర్వసృష్టిమీదను ఉండవలెను. ఇందులో భయపడ వలసిన దేమున్నది ? అంతయు పరిశుద్ధమే, పవిత్రమే.

"విశ్వం తద్భద్రం యదవన్తి దేవాః"

ఈ విశ్వమును పరమేశ్వరుడు పాలించుచున్నాడు. కనుక ఇది మంగళ మయము. అంగ్లకవి బ్రౌనింగుకూడ ఇట్లే యన్నాడు—

"ఈశ్వరు డాకాశమున ప్రకాశించుచున్నాడు, ప్రపంచమంతయు సరిగా నడచుచున్నది."

ప్రపంచమున చెడు గేమాత్రమునులేదు; చెడుగెక్కడనేని ఉన్నచో అది మన దృష్టిలోనే. మనదృష్టిని బట్టియే సృష్టి ఉండును. ఎఱ్ఱని సులోచనములు పెట్టుకొన్నచో సృష్టియంతయు మండిపోవుచున్నట్లు ఒకటే యెఱుపుగా కనిపించును.

సమర్థరామదాసు రామాయణము వ్రాయుచు శిష్యులకు చదివి వినిపించు చుండెను. అది వినుటకు హనుమంతుడుకూడ వచ్చి కూర్చుండెను. "హను మంతు డశోకవనమునకు వెళ్ళెను. అక్కడ అతడు తెల్లనిపువ్వులను చూచెను" అని రామదాసు చదవగా తక్షణమే హనుమంతుడు ప్రత్యక్షమై ముందునకు వచ్చి "నేను చూచినవి తెల్లనిపువ్వులుకావు, ఎఱ్ఱనివి. నీవు తప్పు వ్రాసితివి. దానిని సవరింపుము" అనెను. "నేను సరిగానే వ్రాసితిని నీవు చూచినవి తెల్లనిపువ్వులే" అని రామదాసు అనెను. "స్వయముగ అక్కడికి వెళ్ళిన వాడను నేను. నాదేయబద్ధమా!" అని హనుమంతు డనెను. చివరకీవివాదము శ్రీరామచంద్రునియొద్దకు వెళ్ళెను. ఆయన యిట్లు తీర్పుచెప్పెను: "పువ్వులు తెల్లనివే. కాని హనుమంతునికన్నులు క్రోధమువలన ఎఱ్ఱపడుటచే తెల్లని పుష్పము లతనికి ఎఱ్ఱగా కనబడినవి." ఈ మధురగోష్ఠి యొక్క సారాంశమిది: ప్రపంచమును మన మేదృష్టితో చూచుచుందుమో అది మనకట్లే కనిపించును.

ఈ సృష్టి శుభప్రదమని మనస్సులో నిశ్చయము కానిచో ఏకాగ్రతకలుగ నేరదు. సృష్టి అక్రమముగా నడచుచున్నదని యనుకొను చున్నంతకాలము అన్నివైపుల నుండియు అనుమానములు నన్ను పీడించుచునే యుండును. కవులు పక్షుల స్వాతంత్ర్యమును గూర్చి గానము చేయుదురు. ఒక్కసారి నిన్ను నీవు పక్షిగా భావించుకొని చూడుము. దాని స్వాతంత్ర్యమేమో నీకు తెలిసిపోవును. పక్షి తన మెడను ముందునకు, వెనుకకు అదేపనిగ ఆడించు చుండును. పక్షులెప్పుడును ఎవరివలన నేమి కీడువచ్చునో అనుభయముతో నుండును. పక్షినిదెచ్చి యొక ఆసనముమీద కూర్చుండబెట్టుము. దాని కేకాగ్రత కుదురునా? ఎవరేని కొంచెము దగ్గరకు రాగానే అది తుఱ్ఱున ఎగిరి పోవును. 'ఇతడు వచ్చుట నన్ను చంపుటకు కాదుకదా?' అని అది సంశయ పడును. ఈ ప్రపంచములోని వారందఱు తన్ను తినువారు, చంపువారు అని

భయపడువానికి శాంతియెక్కడ? "నాకు రక్షకుడను నేనే; మిగిలిన వారందరును నన్ను తినువారు" అని యనుకొనుచున్నంత వరకు ఏకాగ్రత కలుగనేరదు. సమదృష్టి కలిగించుకొనుటయే దీనికి ఉత్తమమార్గము. సర్వత్ర మంగళమును దర్శించుటకు పూనుకొనుము. చిత్తము దాని కదే శాంతించును.

దుఃఖములోనున్నవాని నెవనినైనను జల జల ప్రవహించు నదియొద్దకు తీసికొని పొండు. స్వచ్ఛమును శాంతమును అగు ఆ ప్రవాహమును చూడగనే వాని వ్యాకులత తగ్గిపోవును అతడు తన దుఃఖమును మరచిపోవును. ఆ ప్రవాహమున కింతశక్తి యెక్కడిది. పరమేశ్వరుని శుభశక్తి దానిద్వారా ప్రకటమగును. వేదములలో నదు లత్యంత సుందరముగ వర్ణింపడినవి.

'అతిష్ఠన్తీనాం అనివేశ నానాం'

నదులిట్లుండును. నది యఖండముగ ప్రవహించుచుండును. దాని కిల్లువాకిలిలేదు. అది సంన్యాసిని. కనుక నిట్టి పవిత్రప్రవాహము ఒక్కక్షణములో మనస్సునకు ఏకాగ్రతనిచ్చును. ఇట్టి సుందరమైన నదినిచూచి మనస్సులో ప్రేమ జ్ఞానప్రవాహము లేల వెల్లి విరియవు ?

ఈ బాహ్యజడప్రవాహమే మనస్సున కింతటి శాంతిని ప్రసాదింపగలిగినచో హృదయమనెడు లోయలో భక్తిజ్ఞానములను చిన్మయఝురి ప్రవహించినప్పుడు నాకింకెంత శాంతి లభింపవలె ? వెనుక నా మిత్రుడొకడు హిమాలయ-కాశ్మీర ప్రాంతములలో పర్యటించుచు అక్కడి పవిత్రపర్వతముల సుందర జలప్రవాహముల వర్ణనను వ్రాసి నాకు పంపుచుండెను. నే నిట్లు జవాబిచ్చితిని: "నీకు నిరుపమానందమును గూర్చుచున్న అక్కడి జలప్రవాహముల, పర్వత పంక్తుల, శుభ సమీరముల అనుభవమును నేనును నా హృదయమునందే పొందగలను. నా అంతస్సృష్టిలో ఆ రమణీయదృశ్యము లన్నిటిని నిత్యమును నేనును చూచుచునే యున్నాను. అందువలన నీవు నన్నచటికి రమ్మన్నను నా హృదయములోని ఈ భవ్యదివ్య హిమాలయమును వదలి నేను రాను."

'స్థావరాణాం హిమాలయః

స్థిరత్వము సాధించుటకు స్థైర్యమూర్తియైన ఏ హిమాలయమును ఉపాసింపవలెనో ఆ హిమాలయముయొక్క వర్ణనను విన్నంతమాత్రముననే నేను నా కర్తవ్యమును వదలివేసినచో అది తలక్రిందు వ్యవహారమగును.

సారాంశము : చిత్తమును కొంచెము శాంతి పరచుకొనుము. దానిని మంగళదృష్టితో తిలకింపుము. అప్పుడు నీహృదయములో భక్తిజ్ఞానఝురులు అనంతముగ ప్రవహించును. భావన లను దివ్యతారలు హృదయాకాశములో మెరయును. జాతివి, మట్టివి యైన పవిత్రవస్తువులను చూచి చిత్తము శాంతిపడి నపుడు అంతస్సృష్టిచిత్రములను చూచి యేల శాంతింపదు? నే నొకప్పుడు తిరువాన్మ్యూరు వెళ్ళితిని: ఒకరోజున సముద్రపుటొడ్డున కూర్చుంటిని. అపార మైన ఆసముద్రము, దానిమహాగర్జన, సాయంసమయము – స్తబ్ధుడనై, నిశ్చేష్టు డనై కూర్చుంటిని. ఒకమిత్రుడు పండ్లు మున్నగునవి నాకయి అక్కడికి తెచ్చి యిచ్చెను. ఆసమయమున ఆసాత్త్వికాహారముకూడ నాకు విఘ్నప్రాయముగ తోచెను. సముద్రము ఓం, ఓం అని గర్జించుచు "మామనుస్మరయుధ్యచ" అను గీతావచనమును నా తలపునకు తెచ్చుచుండెను. సముద్రము సతతము నామ స్మరణము చేయుచుండును. కర్మకూడ చేయుచుండును. ఒక అలవచ్చును, అది మరలపోవును. తిరిగి మరియొకటి వచ్చును. ఒక్కక్షణమైన విశ్రాంతిలేదు. ఈ దృశ్యమును చూచి నాయాకలిదప్పి లెగిరిపోయెను. అస లా సముద్రములో నేమి విశేషమున్నది? ఆ యుప్పునీటియలలు లేచుటచూచి నా హృదయము పొంగినదికదా! ఇక జ్ఞానప్రేమలను అగాధ సముద్రపుటలలు హృదయమున లేచినపుడు నే నింకెంత హెచ్చుగా నృత్యముచేయగలుగుదునో! వైదికఋషుల హృదయములో ఇట్టి సముద్రపుటలలు లేచుచుండెడివి.

"అంతః సముద్రే హృది అంతరాయుషి
ఘృతస్యధారా అభిచాక శీమి
సముద్రాదూర్మి ర్మధుమానుదారత్"

ఈ దివ్యభాషకు భాష్యమువ్రాయుటకు, పాపము, భాష్యకారులుకూడ నేమియు పాలుపోక చకితులైరి. ఆహా! ఎంతదొడ్డది ఆ ఘృతధార! ఆ మధు ధార! నా అంతస్సముద్రములో లేచునవి ఉప్పునీటి కెరటమూలా? కాదు, కాదు, నా హృదయములో ఘృతక్షీర మధువులు అలలుగా లేచి పొంగి పొరలుచున్నవి.

## 30. బాలకుడు - గురువు

హృదయములోని ఈ సముద్రమునీద దృష్టి నిలుపుట నేర్చుకొనుము. బయటనున్న నిరభ్ర నీలాకాశమునుచూచి మనస్సునుకూడ నిర్మలముగను, నిర్లిప్తముగ చేసికొనుము. నిజమునకు చిత్తైకాగ్రత ఆటవలె సహజమైన విష యము. చిత్తకల్లోలమే అసహజము, ప్రకృతి విరుద్ధము. చిన్నబిడ్డ కంటివంక

రెప్పవాల్పక చూడుము. ఆ పసిబిడ్డ రెప్పవేయకుండ చూచును. మన మిూలోగా పదిసార్లు రెప్పవేయుదుము. పిల్లల మనస్సు అంతలో ఏకాగ్రమగును. నాలు గైదునెలల శిశువునకు పచ్చని ప్రకృతిశోభను చూపింపుము. శిశువు తదేక దృష్టితో చూచును. పచ్చని ప్రకృతిని చూచుచుండుటచే పిల్లల విరేచనము కూడ పచ్చగా నుండునని తల్లు లనుకొందురు. పిల్లలు అన్ని యింద్రియము లను కన్నులుగా చేసికొని చూచుచున్నారా యని అనిపించును. ఏ విషయమైనను పసిబిడ్డల మనస్సుమీద గొప్ప ప్రభావమును కలిగించును. మొదటి మూడు నాలుగు సంవత్సరముల లోపల లభించు శిక్షణయే, నిజమైన శిక్షణ యని శిక్షణ శాస్త్రజ్ఞు లందురు. విద్యాపీఠములు, పాఠశాలలు. మరి యితర సంస్థలు ఎన్ని స్థాపించినను ప్రారంభదశలో అబ్బిన శిక్షణ తిరిగి యెన్నడును అబ్బ నేరదు. శిక్షణ విధానముతో నాకు సంబంధమున్నది. ఈ బాహ్యశిక్షణ వలని ప్రయోజనము శూన్య మను అభిప్రాయము దినదినమును నాలో దృఢపడు చున్నది; ప్రారంభములో అబ్బిన సంస్కారము వజ్రతుల్యమగును. తరువాతి శిక్షణ పై మెరుగు, పై తొడుగు అని తెలిసికొనుము. సబ్బు పట్టించుటవలన పై మరకలును మాలిన్యమును వదలిపోవును కాని మేని నలుపు ఎట్లుపోవును ? ఆ విధముగనే ఆదిసంస్కారములు వదలి పోవుట చాలకష్టము.

ఇట్లు మొదటనబ్బిన సంస్కారము బలవత్తరముగా,తరువాతి సంస్కారము బలహీనముగా నగుటకు గల కారణమేమి ? చిన్నతనములో ఏకాగ్రత సహజమై యుండుటయే దీనికి కారణము. అందువలన అప్పటి సంస్కారములు ఎన్నటి కిని నశింపవు. చిత్తైకాగ్రతయొక్క మహిమ యిట్టిది. ఈ యేకాగ్రత నార్జించు కొన్నవాడు చేయలేని దేమున్నది ?

నేడు మన జీవిత మంతయు కృత్రిమమైనది. మన బాలవృత్తి నశించి నది. జీవితములో వాస్తవమైన సరసత్వములేదు. అది శుష్కమైనది. మనము తల—తోక లేకుండ ప్రవర్తించుచున్నాము. 'డార్విన్' చెప్ప నవసరము లేకుండ మన కార్యములవలన మనది మర్కటజాతియే యని మనము ఋజువు చేసికొను చున్నాము.

చిన్నపిల్లవాడు విశ్వాసశీలుడయి యుండును. తల్లి చెప్పినదెల్ల వానికి ప్రమాణము. ఆమెనుండి తాను విన్నకథ లేవియు వానికి అసత్య మనిపించవు. కాకి చెప్పినది, పక్షియన్నది – ఈ మాటలన్నియు వాడు సత్య మనుకొనును. పిల్లలలోని ఈ మంగళమనోవృత్తివలన వారికి త్వరితముగఏకాగ్రత కుదురును.

## 31. అభ్యాసము, వైరాగ్యము, శ్రద్ధ

ఏకాగ్రతయొక్క తాత్పర్యమిది: ధ్యానయోగమునకు చిత్తైకాగ్రత, పరిమిత జీవనము, శుభప్రదమైన సామ్యదృష్టి అవసరము. వీనికితోడు మరిరెండు సాధనములు చెప్పబడినవి: (1) వైరాగ్యము (2) అభ్యాసము. ఇందు మొదటిది విధ్వంసకారి. రెండవది నిర్మాణకారి. పొలములో కలుపుమొక్కలను పెరికివేయుట విధ్వంసక కార్యము. దీనినే వైరాగ్యమందురు. పొలములో విత్తనములు వాటుట విధాయక కార్యము. సద్విషయములను గూర్చి మరల మరల చింతనచేయుట అభ్యాస మందురు. వైరాగ్యము విధ్వంసకక్రియ, అభ్యాసము విధాయక క్రియ, కాగా వైరాగ్యమెట్లు లభించును? మామిడిపండు తియ్యగానున్నదందుము. కాని ఆ తీపి కేవలము మామిడిపండులోనే యున్నదా? లేదు. మామిడిపండులోనే లేదు. మన ఆత్మాభిరుచిని వస్తువులో చొప్పించినందువలన ఆ వస్తువు మధురమగును. కనుక లోపలి మాధుర్యమును చవిచూచుట నేర్చుకొనుము. కేవలము బాహ్యవస్తువులోనే మాధుర్యములేదు, "రసానాంరసతమః" మాధుర్యసాగరమైన ఆత్మ మన దగ్గరనే యున్నది. దాని వలననే తియ్యని వస్తువులకు తీపికలిగినది. ఇట్లు బావించుచుండుటవలన మనసులో వైరాగ్య సంచారము కలుగును. సీతామాత హనుమంతునికి ముత్యాలహారమును బహుమతిగా నిచ్చెను. హనుమంతుడు ఆముత్యములను కొరికిచూచి పారవేసెను. వానిలో అతని కెక్కడను రాముడు కనబడలేదు. రాముడున్నచోటు అతని హృదయమే. ఆధ్యాత్మికపు విలువలేని ముత్యముల కొఱకే మూర్ఖులు లక్షలు ఖర్చుపెట్టుచుందురు.

ఈ ధ్యానయోగమును వర్ణించుచు ఒక గొప్పవిషయమును భగవంతుడు ఆరంభములోనే చెప్పియున్నాడు: "నన్ను నేనే ఉద్ధరించు కొనవలసియున్నాడను. నేను ముందునకు సాగిపోదును. నేను ఎత్తున కెగురుదును. ఈ నరదేహములో స్తబ్ధుడనై పడియుండను. పరమేశ్వరుని సమీపించు సాహసము చేయుదును. దానికి ప్రయత్నముకూడ చేయుదును" అను దృఢ సంకల్పము మానవుడు చేసికొనవలెను.

ఇదంతయు విని అర్జునుడు, "భగవన్, ఇప్పటికే నా వయస్సు చాల గడచిపోయినది; కొలదిరోజులలో చనిపోదును. నా కిక ఈ సాధనవలన నేమి ప్రయోజనము?" అను సంశయమును వెలువరించెను. "మృత్యువనగా దీర్ఘనిద్ర" యని భగవంతుడు ధైర్యము చెప్పెను. మనము దినదినము

పనిపాటలు చేసికొని ఏడెనిమిదిగంటలు నిద్రపోదుము. ఈ నిద్రకు ఎవరైనను భయపడునా ? పైగా నిద్రపట్టక పోయిన చింతనొందును. నిద్ర అవసరమైనట్లే మృత్యువుకూడ అవసరము. మనము నిద్రలేచి తిరిగి పనులలో ప్రవేశింతుము. అట్లే మరణానంతరముకూడ వెనుకటి సాధనయంతయు సార్థకమగును. జ్ఞానదేవుడు జ్ఞానేశ్వరిలో ఈ ప్రసంగమునుగూర్చి వ్రాసిన పద్యములలో తన జీవిత చరిత్రనే వ్రాసెనా యన్నట్లుండును.

'వానికి శైశవములోనే సర్వజ్ఞత అబ్బినది. సకల శాస్త్రములు స్వయముగనే ముఖమునుండి వెలువడినవి'

ఇత్యాది చరణములలో నిదియే కనబడును. పూర్వజన్మలోని యలవాట్లు విన్ను పట్టి యాడ్చుచుండును. ఒక్కొక్కని మనస్సు విషయముల దెసకు పోనేపోదు. మోహమెట్లుండునో వానికి తెలియనే తెలియదు. ఏలయనగా వాని వెనుకటి జన్మలోనే దానికి వలసిన సాధన పూర్తియయ్యెను.

'మేలుచేయు వాడెవడైనను ఎప్పుడును దుర్గతిని పొందడు.'

కల్యాణమార్గమున పోవువాని శ్రమ ఏ మాత్రమును వ్యర్థముకాదు. ఈ విధమైన శ్రద్ధ చివర బోధింపబడినది. అపూర్ణముగ నున్నది చివరకు పూర్ణమగును. భగవంతుని యీ యుపదేశసారమును గ్రహించి మీ జీవితమును సార్థక పరచుకొనుడు. (27–3–32)

# ఏడవ అధ్యాయము

## ప్రపత్తియోగము - లేక - శరణాగతి

### 32. భక్తియొక్క భవ్యదర్శనము

ఆత్మీయులారా ! అర్జునునకు స్వధర్మపాలనగూర్చి ప్రశ్నకలిగినప్పుడు అతని మనస్సులో స్వపరసంబంధమైన మోహముత్పన్నమయి, స్వధర్మాచరణనుండి తప్పించుకొను ఉపాయము నతడు వెదకనారంభించెను. నిరర్థకమైన ఈ మోహము మొదటి యధ్యాయములో చూపబడినది. ఈ మోహమును తొలగించుటకే రెండవ అధ్యాయము ప్రారంభమయినది. అందు ఈ మూడు సిద్ధాంతములు చెప్పబడినవి : (1) అనశ్వరమైనఆత్మ సర్వత్ర నిండియున్నది. (2) దేహము నశ్వరము. (3) స్వధర్మము నెన్నడును త్యజింపరాదు.

వీనితోపాటు కర్మఫలత్యాగ మను ఉపాయము కూడ చెప్పబడినది. ఈ యుపాయమే పై సిద్ధాంతములను ఆచరణలోబెట్టు సాధనము. కర్మయోగవివరణ నుండి కర్మ, వికర్మ, అకర్మ పుట్టినవి. కర్మ వికర్మల సంయోగము నుండి ఉత్పన్నమగు అకర్మయొక్క రెండురూపములను అయిదవ అధ్యాయమున మనము చూచితిమి. ఆరవ అధ్యాయమునుండి వికర్మయొక్క భిన్నభిన్న రూపములు చెప్పుట ప్రారంభమయ్యెను. ఆ యధ్యాయములోనే సాధనకు సంబంధించిన ఏకాగ్రతయు చెప్పబడినది.

నేటిది ఏడవ అధ్యాయము. ఈ యధ్యాయములో వికర్మయొక్క విశాలము, సుందరము అయిన వేరొకగది తెఱవబడినది. సృష్టిదేవి మందిరములోను, విశాలవనములోను నానావిధ మనోహర దృశ్యము లున్నట్లే గీతాగ్రంథము లోను ఉన్నవి. ఆరవ అధ్యాయములో ఏకాగ్రతయను గదిని దర్శించినారము. ఇప్పుడు మనము మరియొక గదిలో ప్రవేశింతము.

దాని ద్వారమును తెఱవకముందే భగవంతుడు మోహకారకమైన ఈ జగద్రచనయొక్క రహస్యమును తెలియజెప్పుచున్నాడు. ఒకరకపుకాగితముపైనే ఒక కుంచెతోనే చిత్రకారుడు రకరకములైన చిత్రములను గీయును. సితారు వాయించువాడు ఏడుతీగెలమీదనే అనేక రాగములను పలికించును. భాషలోని యేబదిరెండు అక్షరములతో మనము పలురకములైన భావనలు, అభిప్రాయములు ప్రకటించుచుందుము. అట్లే ఈ సృష్టివిషయమునకూడ. సృష్టిలో అనంత వస్తువులును, అనంతవృత్తులును కనబడుచున్నవి. కాని ఈ యంతర్బాహ్యసృష్టి యంతయు అఖండాత్మ, అష్టవిధ ప్రకృతి - అను ఈ రెంటిసంయోగము చేతనే ఏర్పడినది. క్రోధాన్వితుని క్రోధము, ప్రేమించువాని ప్రేమ, దుఃఖితునియాక్రందనము, సంతసిల్లువాని సంతోషము, సోమరికుండు నిద్రాసక్తి, పాటుపడువాని కర్మానురక్తి-ఇవన్నియు ఒక చైతన్యశక్తియొక్కలీలలే! ఈ పరస్పరవిరుద్ధ భావముల మూలములో ఒక చైతన్యమే నిండియున్నది. లోపలిచైతన్యమొక్కటే యైనట్లు బాహ్యప్రకృతి స్వరూపముకూడ ఒక్కటే. చైతన్యమయమైన ఆత్మ, జడప్రకృతి - ఈ రెంటి సంయోగముచేతనే సృష్టియంతయు జన్మించినదని మొదటినుండియు భగవంతుడు చెప్పుచున్నాడు.

ఆత్మ, దేహము, పర, అపరప్రకృతులు సర్వత్ర ఒకటే. అయినను మానవుడు మోహములో ఏల పడిపోవుచున్నాడు ? భేదము లెందులకు కనబడుచున్నవి ? ఒకనితోడి సంపర్కము మధురముగనుండి మరొకనిని చూచుట అని

ష్టముగనుండునేమి? ఒకనిసాంగత్యము కావలెనని, మరొకనికి దూరముగ నుండవలెనని ఎందుల కనిపించును? ఒక పెన్సిలే, ఒక కాగితమే, ఒక చిత్ర కారుడే; కాని అతడు వ్రాయు అనేక చిత్రములద్వారా అనేక భావములు ప్రకట మగును. చిత్రకారుని హస్తకౌశలము ఇందేయున్నది. చిత్రకారుని కుంచె, వైణి కుని వ్రేళ్ళు మనలను ఏడ్పించగలవు. నవ్వింపగలవు. ఇదే వానిలోనున్న కౌశలము, ప్రాశస్త్యము.

వీడు దగ్గరనుండవలెను, వాడు దూరముగ నుండవలెను; వీడు నావాడు, వాడు పరాయివాడు, అని యనుకొనుటకు మోహమే కారణము. ఈ మోహము వలననే మనుష్యుడు సమయమువచ్చినపుడు తన కర్తవ్యమునుకూడ వదలి పెట్టును. ఈ మోహమునుండి విముక్తులము కావలెనన్న సృష్టికర్తయొక్క హస్త కౌశలరహస్యమును గ్రహింపవలెను. బృహదారణ్యకోపనిషత్తులో 'నగారా' దృష్టాంతమీయబడినది. ఒక నగారానుండియే భిన్నభిన్ననాదములు వెలు వడును. కొన్ని నాదములు విని భయపడుదుము; కొన్నింటికి ఆనందముతో నృత్యము చేయుదుము. ఈ భిన్నభావములను జయింపవలెనవిన నగారా వాయించువాని కౌశలమును పట్టుకొనవలెను. అతని కౌశలమును మనము గ్రహించినంతనే అతడు పలికించిన నాదము మన కవగతమగును. "మాయను తరింపదలచినవారు నా శరణు పొందుదురుగాక!" అని భగవానుడు ఒక వాక్య ములోనే చెప్పివేసెను.

'పూర్తిగా నా శరణుజొచ్చినవారే యీ సంసారసాగరమును సులు వుగా దాటగలిగిరి. మాయ యను వల యీవలియొడ్డుననే వారినుండి తొలగినది.

కాని ఈ మాయ యననేమి? పరమేశ్వరునిశక్తిని, అతని కళాకౌశల మును మాయ యందురు. ప్రకృతి, ఆత్మ—జైన పరిభాషలో జీవము, అజీవము— ఈ రెంటినికలిపి రంగురంగులసృష్టిని రచించిన వానిశక్తియే లేక కళయే మాయ. జైలులో ఒక రకమునకే చెందిన రొట్టె, పప్పుపులుసు ఉన్నట్లే, ఒక అఖండా త్మయే, ఒక అష్టప్రకృతి మయ శరీరమే ఉన్నవి. వీనితో పరమేశ్వరుడు రక రకముల వస్తువులను తయారు చేయుచున్నాడు. మన మీ వస్తువులను చూచి భిన్నభిన్నములు పరస్పర విరుద్ధములైన మంచిచెడుగుల అనుభవమును పొందుచుందుము. వీని నతిక్రమించి మనము నిజమైన శాంతిని పొందవలె ననిన ఈ వస్తునిర్మాతయొక్క తత్త్వమును పట్టుకొని అతని పరిచయము

సంపాదింపవలె. అట్లు పరిచయము చేసికొన్నమీదటనే ఖేదజనకమును ఆసక్తి జనకమును అగు ఈ మోహమునుండి విమోచన పొందగలము.

ఆ పరమేశ్వరుని తెలిసికొనుటకు ఒక లోకోత్తర సాధన – ఒక లోకోత్తర వికర్మ ఉన్నది. దానిని తెలియజెప్పుటకు ఏడవ యధ్యాయములో భక్తి యను భవ్యమందిర మొకటి తెఱవబడినది. చిత్తశుద్ధికిగాను యజ్ఞము, దానము, జపము, తపము, ధ్యానము, ధారణ – మున్నగు అనేక వికర్మలు చెప్పబడు చుండును. ఈ సాధనలను నేను సోడా, సబ్బు, కుంకుడుకాయలతో పోల్తును. భక్తి నీరు వంటిది. సోడా, సబ్బు, కుంకుడుకాయలు శుద్ధిచేయును. కాని నీరు లేనిచో అవేమియు పనిచేయవు, నీరులేనిచో అవియుండియు లాభమేమి? అట్లు కాక సోడా, సబ్బు, కుంకుడుకాయలు లేకపోయినను ఒక్క నీటితోనే శుద్ధిచేయ వచ్చును. నీటితోపాటు అవికూడ నున్నచో "అధికస్య అధికం ఫలం" అగును. పాలకు పంచదార చేర్చినట్లుండును. యజ్ఞము, యాగము, ధ్యానము, తపము– ఈ యన్నిటిలోను హృదయము లేకున్నచో ఇక చిత్తశుద్ధి యెట్లు కలుగును? హృదయమే భక్తి.

అన్ని సాధనలకును భక్తి యవసరము. భక్తి ఉపాయములలో నెల్ల మేటి. సేవాశాస్త్ర మెరిగి ఉపచర్యలు బాగుగ చేయనేర్చినవా డొకడు ఒక రోగి సేవకై వెళ్ళు ననుకొనుము. వాని హృదయములో సేవాభావము లేకపోయినచో అది యదార్థమైన సేవ యెట్లగును? ఎద్దు చాల బలిష్ఠముగ నున్నను, బండి లాగు నిచ్ఛయే లేనిచో అది అడుగు వేయకుండ ఆగిపోవును. లేదా, బండిని ఏ గోతిలోనికో లాగివేయును. హృదయములేని పనుల వలన తుష్టియు లేదు, పుష్టియు లేదు.

## 33. భక్తినుండి విశుద్ధమైన ఆనందము లభించును

ఈ భక్తియున్నచో ఆ మహాచిత్రకారుని కళను, అతనిచేతనున్న కుంచెను మనము చూడగలుగుదుము. ఆ జలధారయొక్క మూలములోనున్న అపూర్వ మధురరసమును ఒక్కసారి రుచి చూచితిమా, ఇక మిగిలిన రసము లన్నియు తుచ్ఛములు, నీరసములు అనిపించును. అరటిపండ్ల రుచి నెరిగినవాడు రంగు వేసిన కొయ్య పండ్లనుచూచి, చేతబట్టుకొని 'సరే బాగున్న' వనుచు అవతల బెట్టును. అసలు పండ్లరుచి తెలిసియున్నందువలన కొయ్యపండ్ల మీద వానికి భ్రాంతియుండదు. ఈ విధముగనే ఆ యమృతధారయొక్క మాధుర్యమును గ్రహించినవానికి గులాబీ షర్బతువంటి బాహ్యవస్తువులపై ఆసక్తియుండదు.

ఒక తత్త్వజ్ఞానితో ప్రజలన్నారు: "అయ్యా, ఈ రోజున పట్టణములో గొప్ప అలంకారము చేయుచున్నారు; పోవుదము రండు!" "సోదరులారా, ఈ అలంకారములో నేమున్నది? ఒక దీపము, తరువాత మరియొకటి, మరియొకటి— ఈ విధముగ ఒక లక్ష, పదిలక్షలు, కోటి మీరు లెక్కింపగలిగినన్ని—ఈ యలంకారములు నే నెరిగినవే" అని వేదాంతి జవాబు చెప్పినాడు. గణితములో క్రమ వృద్ధి ననుసరించి 1+2+3 ఈ ప్రకారము అనంతము వరకు నుండును. సంఖ్యకును సంఖ్యకును ఉండు అంతరము తెలిసినచో సంఖ్య లన్నియు వ్రాయవలసిన అవసరముండదు. అట్లే వారు ఒకటి తరువాత నొకటిగా వెలిగించిన దీపములవరుసను చూచి ఇంతగా తన్మయులము కావలసినపని యేమున్నది? కాని మానవున కిట్టి యానందమునందే ఆసక్తిమెండు. నిమ్మకాయల రసము తీసి దానిని, పంచదారను నీటిలో కలుపును. దానిని లొట్టలువేయుచు త్రాగి "ఓహో, ఈ షర్బత్ ఎంతబాగుగా నున్నది!" అనును. జిహ్వకు రుచులు కల్పించుట తప్ప మరి పనియేలేదు. "ఇది దీనిలో కలుపుము, అది దానిలో కలుపుము" అనుచు రుచులు మరగుటలోనే యున్నది ఆనంద మంతయు! చిన్నప్పుడు నేనొకసారి సినీమా చూచుటకు వెళ్ళితిని. నిద్రవచ్చిన పండుకొనవచ్చునని ఒకగోనెపట్టాను నావెంట తీసికొని వెళ్ళితిని. కన్నులు మిరుమిట్లుగొల్పు నిప్పు బొమ్మలను తెరపై చూచుసరికి రెండుమూడు నిమిషములలో నా కన్నులు అలసిపోయినవి. ఆట అయిన తరువాత లేపుడని ప్రక్కవానితోచెప్పి పట్టాపరచుకొని నిద్రపోయితిని. రాత్రి ఆరుబయట గాలియాడుచోట చంద్రుని,నక్షత్రములను చూచుట మానివేసి, ప్రశాంతసృష్టిలోని పవిత్రానందమును వదలి ఆ యిరుకైన సినీమాలోని నిప్పుబొమ్మల నాట్యమును చూచి చప్పట్లు కొట్టుచున్నాము. ఇది నాకేమియు అర్థమగుటలేదు.

మానవు డింత ఆనందరహితు డెట్లయినాడు? అయ్యో! అతడెంత దుస్థితికివచ్చెను! ప్రాణములేని బొమ్మలవలని క్షణికానందమునకై ప్రాకులాడుచున్నాడుగదా! జీవితములో ఆనందము లేనప్పుడు ఇట్టి కృత్రిమానందము నన్వేషించును. ఒకసారి మా పొరుగున బాజావాయించుచుండిరి. ఈ బాజాయెందులకని నే నడిగితిని. పిల్లవాడు పుట్టినా డనిరి. తనకు కుఱ్ఱవాడు పుట్టినాడని ఆ గృహస్థు మేళము చేయించి ప్రపంచమునకు చాటుచున్నాడు! ప్రపంచములో వీని కొక్కని కేనా పిల్లవాడు పుట్టుట. పిల్లవాడు పుట్టినాడని నృత్యములు, గానములు, నాటకములు జరుపుదురు. ఇవన్నియు కుఱ్ఱతనపు చేష్టలుకాక మరేమి?

ఇదియంతయు చూచిన ఆనందమునకు కఱవు వచ్చినట్లున్నది. కఱవుకాలములో రెండు మెతుకులకొఱకు ప్రజలు విఱుచుకొనిపడినట్లే ఎక్కడనేని కుఱ్ఱవాడు పుట్టినను, ఎటకేని సర్కసు–లేక–సినీమా వచ్చినను ఆనందమునకు అంగలార్చు ప్రజలు పాపము! మిడుతలదండువలె ఆ యా కార్యక్రమములలో పడిపోవుదురు.

అది నిజమైన ఆనందమా ? గానముయొక్క అలలు చెవులద్వారాపోయి బుద్ధికి ఉత్తేజమును కలిగించును. ఇట్లే వస్తువులరూపములు నేత్రములద్వారా బుద్ధికి ఉత్తేజమును కలిగించును. ఈవిధముగా కలిగిన ఉత్తేజముతోనే పాపము! మానవుల ఆనందము నిండియుండును. ఇట్టి యింద్రియసుఖమే ఆనందమనుకొని ఒకడు పొగాకును చూర్ణముచేసి ముక్కులో కూరుకొనును. మరియొకడు దానిని బీడీగా చుట్టి నోటిలో పెట్టుకొనును. ఈ నశ్యమువలని, పొగవలని ఉద్రేకమువలన వారికి ఆనందరాశి చేజిక్కినట్లుండును. ఒక్కబీడీముక్క దొరకినంతనే వాని సంతోషమునకు మేరయుండదు. టాల్‌స్టాయి అన్నాడు– "ఆ సిగరెట్టునిషాలో వాడు ఖూనీకూడ చేసివేయుననిన ఆశ్చర్యములేదు. ఇది యొక రకమైన మత్తు అనుకొనుడు.''

ఇట్టియానందములో మానవు డెందులకు నిమగ్నుడై పోవును ? నిజమైన ఆనంద మెక్కడ దొరకునో తెలియకే. మానవుడు నీడనుచూచి మైమరచును. ఈనాడు పంచేంద్రియముల ఆనందమునే అనుభవించుచున్నాడు. ఒకవేళ కనులు లేకపోయినచో మిగిలిన నాలుగింద్రియములతోనే ప్రపంచములో సంతోషమును అనుభవించుచున్నాడు. మంగళ (అంగారక) గ్రహమునుండి రే పెవడైనను ఆరింద్రియములతో క్రిందికి దిగివచ్చినచో అయిదింద్రియములవాడు ఖిన్నుడై "వీనిముందు మనమెంత దీనులము, హీనులము!'' అని విలపించును.

సృష్టియొక్క అర్థమంతయు ఈ పంచేంద్రియముల కెట్లు తెలియగలదు ? ఒక్కొక్కడు ఈ ప్రపంచవిషయములలో కొన్నిటి నెన్నుకొని వానియందే లోలుడైయుండును. పాపము! గాడిదయరపు వినిపించినచో అశుభము చెవిని బడినదనుకొనును. కాని వాని దర్శనము మాత్రము గాడిద కశుభము కాదా ? గాడిద వలన వానికి నష్టము కలిగినదనియే యనుము; వాని మూలమున ఇతరులకు నష్టము కలుగుటలేదా ? నేను బరోడా కాలేజీలో నుండగా ఒకసారి ఐరోపా గాయకులు వచ్చిరి. వారు అగుటకు గొప్ప పాటగాండ్రే; ఇతరులను ఓడించి వచ్చినవారే. అయినను నా కటువంటి పాట విను అలవాటు లేక ఎప్పుడు లేచి పోదునా యనిపించెను. నా పరీక్షలో వారు తప్పిపోయిరి. మన గాయకులు

ఆ దేశములకుపోయిన వారి పరీక్షలో వీరు తప్పిపోవచ్చును. సంగీతము వలన ఒకనికి ఆనందము కలిగిన మరియొకనికి కలుగదు. ఇట్టిది నిజమైన ఆనందము కాదు; అది కృత్రిమానందము. వాస్తవికానందమును దర్శింప నంతవరకు ఈ కృత్రిమానందములోనే ఊగులాడుచుందుము. పాలు దొరకనంతవరకు అశ్వత్థామ పిండితో చేసిన పాలనే పాలనుకొని త్రాగినాడు. ఈ విధముగ మీరు ఆనందముయొక్క నిజస్వరూపమును ఎంతగా గ్రహించి చవిచూడ గలిగిన, అంతగా ఇతర విషయము లన్నియు వెలవెల బోవును.

ఈ యానందము నన్వేషించుటకు భక్తియే ఉత్కృష్టమార్గము. ఈ మార్గమున పోగాపోగా పరమేశ్వరుని కౌశలము బోధపడును. ఇది అవగతము కాగానే ఇతర భావన లన్నియు వాని కవియే క్షీణించి రూపుమాసిపోవును. ఇక క్షుద్రమైన ఆకర్షణలేమియు నిలువనేరవు. అప్పుడు ప్రపంచమున ఒక యానందమే నిండియున్నట్లు గోచరించును. మిఠాయిదుకాణము లెన్నియున్నను అన్నిటిలోని మిఠాయి లొకటే. నికరమైన వస్తువు చేజిక్కనంతవరకు మనము చంచలమైన పక్షులవలె ఒకకణ మిక్కడను ఒకకణ మక్కడను తినుచుందుము. నేటి వేకువను తులసిరామాయణమును చదువుచుంటిని. దీపమునొద్ద పురుగులు చేరినవి. ఇంతలో నొక బల్లి వచ్చెను. నా రామాయణముతో దానికేమిపని ? పురుగులను చూచుసరికి దాని కెంత ఆనందము కలిగెనో! అది పురుగులమీదికి వచ్చుచుండగా చేతితో కొంచెము అదలించితిని. అది పారిపోయెనే కాని దాని చూపంతయు పురుగులమీదనే యుండెను, "ఈ పురుగులను నీవు తిందువా ? నీ నోరు ఊరుచున్నదా ?" అని నన్ను నేను ప్రశ్నించుకొన్నాడను. నా నోరూరలేదు. నేను చూరగొనుచున్న ఆనందము ఆ బల్లి కేమి తెలియును ? రామాయణములోని రసమును అది చవిచూడలేదు. ఈ బల్లివలె నున్నది మనదశ. నానారసములలో మనము నిమగ్నులమై యున్నాము, కాని నికరమైన రసము మనకు లభించినచో ఎంత ఆనందము కలుగును! శ్రేష్ఠమైన ఆ రసమును చవిచూపగల భక్తియను సాధనను భగవంతుడు మనకు అందించుచున్నాడు.

## 34. సకామభక్తియు విలువ కలదే

భగవంతుడు భక్తులను మూడు విధముల విభజించినాడు – (1) సకామ భక్తుడు (2) నిష్కాముడైన యేకాంగి భక్తుడు (3) జ్ఞాని, అనగా పూర్ణభక్తుడు. నిష్కాములైన ఏకాంగి భక్తులలో మూడు తెగలవారు కలరు. (అ) ఆర్తుడు (ఆ) జిజ్ఞాసువు (ఇ) అర్థార్థి. భక్తి వృక్షముయొక్క శాఖోపశాఖ లివి.

సకామభక్తు డనగా నెవడు ? ఒక కోరిక మనసులో పెట్టుకొని భగవంతుని చేరువాడు. ఇది నికృష్టమైన భక్తియని చెప్పి నేను దానిని నిందింపను. గౌరవ ప్రతిష్ఠలు కలుగునని అనేకులు సార్వజనిక సేవకు పూనుకొందురు. ఇందు చెడుగేమున్నది ? వానికి బాగుగా గౌరవ ప్రతిష్ఠలిందు. గౌరవించుట వలన రాగల చెడు గేమియును లేదు. గౌరవము లభించుచుండుట వలన పోనుపోను వారు సార్వజనిక సేవలో స్థిరపడుదురు. క్రమముగ వారి కట్టిసేవయే ఆనంద దాయకమగును. గౌరవమును పొందవలెనను కాంక్షకు అర్థమేమి ? ఈ గౌరవము వలన మనము చేయుచున్న పనులు ఉత్తమమైనవే యని మనకు నమ్మకము కలుగును. తాను చేయుసేవ మంచిదో చెడ్డదో తెలిసికొనగల ఆంతరికసాధనము ఆత్మజ్ఞానము లేనివాడు ఈ బాహ్యసాధనపై ఆధారపడియుండును. బిడ్డపనిని తల్లి మెచ్చుకొనుటవలన తల్లికొఱకు హెచ్చుగా పనులు చేయవలెనని బిడ్డకు తోచును. సకామభక్తికూడ నిట్టిదే. సకామభక్తుడు పరమేశ్వరుని సన్నిధికి చేరి "ఇమ్ము" అని యడుగును. అన్నిటికిని సర్వేశ్వరుని యాచించు ప్రవృత్తి సామాన్యమైనదికాదు; ఇది అసామాన్యము. "మనము తీర్థయాత్రకు పోవు దమా ?" అని యొకసారి జ్ఞానదేవుడు నామదేవుని అడిగెను. "ఎందులకు ?"అని నామదేవుడనెను. "సాధుసమాగమము లభించు"నని జ్ఞానదేవుడు జవాబిచ్చెను. "అయినచో భగవంతుని అడిగివచ్చెదను" అని చెప్పి నామదేవుడు దేవమందిర మునకు వెళ్ళి దేవునికెదురుగ నిలబడినాడు. అతనికంటివెంట అశ్రుప్రవాహము బయలుదేరెను. భగవంతుని చరణములమీదనే దృష్టినిలిపి చూచుచుండెను. కన్నీరుకార్చుచు చివరకు "ప్రభూ, నేను వెళ్ళవచ్చునా ?" అని యడిగెను. జ్ఞానదేవుడుకూడ ప్రక్కనేయుండెను. ఈ నామదేవుని పిచ్చివాడందురా మీరు ? భార్య యింటియొద్ద లేకపోయిన ఏడ్చుచు కూర్చుండు వా రెందరో ఉన్నారు. దేవునియెదుటికేగి కన్నీరుకార్చు భక్తులనుమాత్రము – వారు సకామభక్తులే యగు దురుగాక – సామాన్యులని యనరాదు. కాని ముఖ్యముగా అడుగదగినదాని నిమ్మని వారు దేవుని అడుగకపోవుటయు కలదు. అది వారి యజ్ఞానమే. ఇంత మాత్రమున సకామభక్తి త్యాజ్యము కాదు.

స్త్రీలు ఉదయముననే లేచి వివిధవ్రతముల నాచరింతురు. హారతినిత్తురు, అఖండమును వెలిగింతురు, తులసీ ప్రదక్షిణము చేయుదురు. ఎందుల కిదం తయు ? పరలోకమున పరమేశ్వరానుగ్రహము కలుగవలెనని. ఇట్లనుకొనుట అమాయికమే కావచ్చును. అయినను మరణానంతరము పరమేశ్వరానుగ్రహము

లభింపవలెనని స్త్రీలు జపములును, వ్రతములును, ఉపవాసములును మొదలైన అనుష్ఠానములను ఆచరింతురు. ఇట్టి వ్రతశీలుర నిష్ఠనుండి మహాపురుషులు జన్మించుచుందురు. తులసీదాసు సంతతినుండి రామతీర్థస్వామి ఉద్భవించెను. రామతీర్థుడు ఫ్రెంచిభాషలో ప్రవీణుడు. తులసీదాసు వంశములో పుట్టిన మీకు సంస్కృతమేరాదా ? అని యొక రనిరట. రామతీర్థునిమీద దీనిపరిణామము కనబడెను. కులస్మృతిలో నెంత సామర్థ్యమున్నది! తదుపరి ఆయన ఆ ప్రోత్సాహమువలన సంస్కృత మభ్యసించినాడు. స్త్రీలలోని ఈ భక్తిభావమును మనము అపహాస్యము చేయరాదు. ఇట్లు భక్తికణములు కూడుకొన్న తావులందు తేజస్వంతమగు సంతానము ఉత్పన్నమగును. కావుననే భగవంతుడనును–"నా భక్తుడు సకాముడైనను అతనిభక్తిని నేను దృఢతరము చేయుదును. అతని మనస్సులో తికమకలు కలుగనీయను. 'ఈ నా రోగమును నివారింపు' మని దీనుడై నన్నతడు అర్చించినను, అతని ఆరోగ్యవాంఛను బలపరచి అతనిని నీరోగినిగా చేయుదును. దేని కతడు నాయొద్దకు వచ్చినను నేనతని వెన్ను చరచి ప్రేమతో దగ్గరకుతీయుదును." ధ్రువుని యుదాహరణను తీసికొనుడు. ఇతనికి తండ్రియొడిలో కూర్చుండుటకు స్థానము దొరకమిచే ఈశ్వరుని ప్రార్థింపుమని తల్లి చెప్పెను. అప్పుడు ధ్రువుడు భగవదుపాసనలో ప్రవేశించెను. భగవంతు డతనిని సుస్థిరమైన స్థానములో కూర్చుండబెట్టెను. మనస్సు నిష్కామము కాకపోయినంతమాత్రమున నేమైనది ? మనుష్యుడు వెళ్ళుట యెవరియొద్దకు ? అర్థించుట యెవరిని ? అనునదే ముఖ్యవిషయము. ప్రపంచముముందు చేయిచాపకుండ ఈశ్వరుని అర్థించువృత్తి గొప్పది.

నిమిత్త మేదైనను నీ వొక్కసారి భక్తి మందిరమున ప్రవేశించిచూడుము. ప్రారంభములో కోరికతో ప్రవేశించినను పోనుపోను నిష్కామి వగుదువు. వస్తుప్రదర్శనశాలలో " అయ్యా, తమ రొకసారి దయచేసి, ఎంత శ్రేష్ఠమైన రంగురంగులఖాదీ తయారగుచున్నదో కొంచెము చూడుడు. " అని కార్యనిర్వాహకులు విజ్ఞప్తి చేయుదురు. గ్రాహకుడు లోపలికిప్రవేశించి చూచి దానిచే ఆకర్షింపబడును. భక్తివిషయమునను ఇంతే. ఒక్కసారి భక్తిమందిరములో ప్రవేశింపుము; దాని సౌందర్యమును సామర్థ్యమును తెలియును. స్వర్గమునకు వెళ్ళుచుండగా ధర్మరాజువెంట చివర కొక కుక్కయే మిగిలియుండెను. భీమార్జునాదులు దారిలోనే పడిపోయిరి. స్వర్గద్వారమునొద్ద గల భటులు ధర్మరాజుతో "నీవు రావచ్చును, కాని ఈ కుక్క రాగూడదు." అనిరి. "నా కుక్క రాగూడనిచో

నేనును రా జాలను'' అని ధర్మరాజనెను. అన్యాసక్తిలేని సేవచేయు శునకమైనను 'నేను నే' ననుకొను దురభిమానులకంటె శ్రేష్ఠము. భీమార్జునుల కంటెను గూడ అది శ్రేష్ఠమని ఋజువైనది. ఈశ్వరాభిముఖమగు కీటకమైనను ఈశ్వరవిముఖులైన పెద్దలలోని పెద్దకంటెను గొప్పది. దేవాలయములలో కూర్మము, నంది – విగ్రహములుండును. ఆనందికి అందరును నమస్కరింతురు. అది సామాన్యమైన యెద్దుకాదు. అది దేవుని యెదుటనే యుండును. వృషభమేయైనను అది భగవంతునిదని మనము మఱవరాదు. పెద్దపెద్ద మేధావులకంటె అది శ్రేష్ఠమైనది. భగవంతుని స్మరించు అమాయికుడు కూడ విశ్వవంద్యు డగును. ఒకసారి నేను రైలులో పోవుచుంటిని. రైలుబండి యమునానది వంతెన మీదికి వచ్చెను. నా ప్రక్కనున్న యొకడు పులకిత హృదయుడై ఒకకాని డబ్బు నదిలో పడవేసెను. అది చూచి మరియొకడు "మనది అసలే దరిద్రదేశము. దానికితోడు ప్రజలిట్లు వ్యర్థముగ డబ్బును పాఱవేయుచుందురు'' అని విమర్శింప మొదలుపెట్టెను. అప్పుడు నే నంటిని. "మీ రతని యుద్దేశమును గుర్తింపలేదు. ఆ యుద్దేశములో నున్న విలువ రెండుమూడు పైసలైనను ఉండునందురా అనరా? మరేసత్కార్యమునకైనను ఆ పైసా లిచ్చియుండిన ఇంకను బాగుగా నుండును. అది తరువాత చూతము. కాని భావనాశీలుడైన ఆ వ్యక్తి "ఈ నది యననేమి ? ఈశ్వరకారుణ్యమేయిట్లు ప్రవహించుచున్నది'' అని ఈ త్యాగము చేసినాడు. మీ యర్థశాస్త్రములో ఈ భావనకెమైన స్థానమున్నదా ? దేశములోని ఒక జీవనదిని దర్శించి అతని యంతఃకరణము ద్రవించినది. ఈ భావనను మీరు గౌరవింపగలిగినచో మీకును దేశభక్తి యున్నదందును. దేశభక్తి యనిన భోజనమా ? దేశములోని యొక మహానదిని చూచి 'నా సంపత్తినెల్లను ఇందు ముంచివేయుదును. సమస్తమును ఆతల్లిపాదముల కర్పింతును' అను భావన మనస్సునం దుదయించిన అదెంత గొప్ప దేశభక్తి! పసుపు, ఎరుపు, నీలపు రాళ్ళు, (మరకత మాణిక్యములు) కీటకముల మలము నుండి తయారైన ముత్యములు, పగడములు – ఇవన్నియు నీటముంచి వేయదగిన విలువకలవియే. పరమేశ్వరునిచరణముల ముందట ఇవియన్నియు ధూళి వంటివని, తుచ్ఛములని తెలిసికొనుడు. నదికిని పరమేశ్వరుని చరణములకును సంబంధమేమి యని మీరనవచ్చును. మీదృష్టిలో సృష్టికిని పరమేశ్వరునకును సంబంధమెక్కడనేని ఉన్నదా! నది యనగా మీకు ఆక్సిజన్ హైడ్రొజనుల సంపుటియే. సూర్యుడనగా నొకపెద్దరకపు గ్యాసుదీపము. ఆ సూర్యునికి నమస్కారమేమిటి ? ఇక నమస్కారము చేయవలసివచ్చినచో

ఒక్కరొట్టెకే! ఆ రొట్టెలో మాత్రమేమున్నది. చివర కదియు ఒక రకమైన తెల్లని మట్టియే. దానికొఱకింతగా నోరూరుట యెందులకు? అంత గొప్పగా ఉదయించు సూర్యునిలోను, అందముగ ప్రవహించు నదిలోను పరమేశ్వరానుభవము కలుగక పోయిన ఇంక కలుగున దెక్కడ? ఆంగ్లకవి వర్డ్సువర్తు "పూర్వము ఇంద్రధనుస్సును చూచినపుడు నా హృదయము ఆనందముతో నృత్యము చేయుచుండెడిది. కాని యీ నాడు నే నట్లు నృత్యముచేయలేక పోవుచున్నానే! వెనుకటి జీవిత మాధుర్యమును కోల్పోయి, నేను ఖాయినయిపోలేదుకదా!" అని దుఃఖముతో అనును.

సారాంశమిది: సకామభక్తియందును – అందేకాదు–అమాయికుని భావన యందు సైతము చాల మహత్త్వమున్నది. దీనిపరిణామముగ గొప్ప సామర్థ్యము లభించును. ఎవడైనను, వాడెట్టివాడైనను, ఒక్కసారి ఈశ్వరమందిరములో కాలుపెట్టినచో మాన్యుడగును. అగ్నిహోత్రములో ఎటువంటి కట్టెవేసినను కాలిపోవును. భగవద్భక్తి ఒక అపూర్వసాధన. సకామభక్తికికూడ భగవంతుడు సంతోషించును. పోనుపోను ఆ భక్తి నిష్కామమై పూర్ణత్వము వైపునకు వెళ్ళును.

## 35. నిష్కామ భక్తియొక్క రూపములు; పూర్ణత్వము

సకామభక్తుని విషయమై తెలిసికొంటిమి. ఇక నిష్కామభక్తుల విషయమై చూతము. వీరు రెండు విధముల నుందురు. (1) ఏకాంగి (2) పూర్ణుడు. ఏకాంగిభక్తులలో మూడు రకములవారు కలరు. అందు మొదటి రకమువాడు ఆర్తభక్తుడు. ఆర్తు డనగా దయకొఱకు అర్థించువాడు; నామదేవునివలె భగవంతుని కొఱకు విలపించుచు విలవిల కొట్టుకొనువాడు. అతడు భగవంతుని ప్రేమరసము నెప్పుడు గ్రోలుదునా యని, ఎప్పు డతని నాలింగనము చేసికొని కృతార్థుడ నగుదునా యని, అతని పాదములపైబడి ఎప్పుడు ధన్యుడ నగుదునా యని వ్యాకులతతో ఆతురతతో తహతహపడు చుండును. తాను చేయు ప్రతి కార్యము హృదయపూర్వకముగను, ప్రేమాన్వితముగను ఉన్నదా లేదా యని చూచుకొనుచుండును. ఇక రెండవ రకమువారు జిజ్ఞాసువులు. ప్రకృతము మన దేశములో ఇట్టిభక్తు లంతగా లేరు. వీరిలో కొందరు మాటిమాటికిని గౌరీశంకర (ఎవరెస్టు) శిఖరము నెక్కుటకు ప్రయత్నించి చనిపోవుచుందురు. మరికొందరు ఉత్తరధృవము నన్వేషించుచు పోయి తమ యనుభవములను కాగితముపై వ్రాసి సీసాలో సీలుచేసి నీటిలో వదలి మరణింతురు. మరికొందరు అగ్నిపర్వతము

లోనికి దిగుదురు. కాని ఇప్పటి భారతీయులకు మృత్యువనిన ఒక పెనుభూతము. వారికి కుటుంబపోషణను మించిన పురుషార్థమే లేదు. జిజ్ఞాసుభక్తునిలో ప్రబలమైన జిజ్ఞాస యుండును. అతడు ప్రతివస్తువుయొక్క గుణధర్మములను పరిశీలించుచుండును. మానవుడు నదీముఖముద్వారా సముద్రమును చేరునట్లే ఈ జిజ్ఞాసువుకూడ చివరకు పరమేశ్వరుని యొద్దకు చేరును. మూడవ రకము భక్తుడు అర్థార్థి. అర్థార్థి యనగా ప్రతివస్తువుయొక్క అర్థమును పరిశీలించువాడు. ఇక్కడ అర్థమనగా లోకకల్యాణమే కాని రూపాయలు, అణాలు, పైసలుకాదు. ఇత దేవిషయమును పరిశీలించినను తన్మూలమున లోకకల్యాణము అగునా కాదా యనునదే అతనికి ఒరపిడిఖాయి. నా మాటలు, వ్రాతలు, చేతలు భగవత్ప్రీతికరము లగునా కావా యని చూచుచుండును. నిరుపయోగము, అహితము అయినపని అతనికి సమ్మతముకాదు. ప్రపంచ క్షేమమునుగూర్చి తపించువాడు ఎంతో మహాత్ముడు కదా! జగత్కల్యాణమే అతని కానందము. సమస్త కార్యములను ప్రేమదృష్టితో చేయువాడు ఆర్తుడు. సమస్త క్రియలందును జ్ఞానదృష్టి కలిగియుంచువాడు జిజ్ఞాసువు. లోకకల్యాణమే దృష్టియం దుంచుకొనువాడు అర్థార్థి.

పై ముగ్గురును నిష్కామభక్తులే కాని వీరిది ఏకాంగిభక్తి. వీరిలో ఒకడు కర్మద్వారమునను, ఒకడు హృదయ ద్వారమునను, ఒకడు బుద్ధిద్వారమునను ఈశ్వరుని సమీపింతురు. ఇక పూర్ణభక్తునిగూర్చి తెలిసికొనవలసియున్నది. ఇతనినే జ్ఞానిభక్తు డందుము. ఇతనికి కనబడున దంతయు పరమేశ్వరుని రూపమే. కురూపుడు, సురూపుడు, రాజు, భిక్షుకుడు, స్త్రీ, పురుషుడు, పశువు, పక్షి – అన్నింటను పరమాత్మయొక్క పావనదర్శనమే.

> 'ప్రభూ! పురుషులు, స్త్రీలు, బిడ్డలు - వీరినందరిని నారాయణ
> స్వరూపులుగా భావించునట్లు నా మనస్సును సంస్కరింపుము.'

అని భక్తతుకారాము ప్రార్థన. హిందూ ధర్మములో నాగపూజ, గజముఖునిపూజ, వృక్షపూజ మొదలైనవి పిచ్చిపద్ధతులైనచో జ్ఞానిభక్తునిలో ఈ పిచ్చి, పరాకాష్ఠను పొందిన ట్లగపడును. చీమమొదలు సూర్యచంద్రుల వరకు సర్వత్ర అతని కగపడినదెల్ల పరమాత్మ స్వరూపమే. అతని హృదయము ఆనందముతో పొంగి పొరలును.

> ఇక ఈ సుఖము అనంతము, అపారము నైనది. ఆనందసాగరమున
> కెరటాలు పొంగుచున్నవి.'

ఇట్టి దివ్యభవ్యదర్శనమును మీరు భ్రమయని అందురుగాక! ఈ భ్రమ సౌఖ్యరాశి, ఆనందనిధి. జ్ఞాని గంభీరసాగరములో పరమేశ్వరవిలాసమును, గోమాతలో ఈశ్వరవాత్సల్యమును దర్శించును. పృథ్విలో ఈశ్వరుని క్షమ, నిరభ్రాకాశములో అతని నిర్మలత్వము, రవిచంద్రతారలలో శుభప్రదమైన అతని తేజస్సు, పువ్వులలో అతని కోమలత్వము చూచును. మఱియు దుర్జనులలో తన్ను పరీక్షించు పరమేశ్వరుని వీక్షించును. ఈ విధముగ ఒక పరమాత్మయే సర్వత్రవ్యాపించి క్రీడించుచున్నట్లు చూచు అభ్యాసము జ్ఞానిభక్తుడు చేయుచుండును. ఇట్లు చేయుచు చివర కతడు ఈశ్వరునిలో లీనమైపోవును.

# ఎనిమిదవ అధ్యాయము

## ప్రయాణసాధన : సాతత్యయోగము.

### 36. శుభసంస్కార సంచయము

సోదరులారా! మానవజీవితము అనేకసంస్కారములతో నిండియుండును. అనేకకార్యములు మనవలన జరుగుచుండును. దినములో ఇరువదినాలుగు గంటలును మనము చేయుపనులను లెక్కింపబోయిన ఆ లెక్కకు అంతే యుండదు. తినుట, త్రాగుట, కూర్చుండుట, నడుచుట, తిరుగుట, పనులు చేయుట, వ్రాయుట, మాటలాడుట, చదువుట – ఇవేకాక నానావిధ స్వప్నములు, రాగద్వేషములు, మానావమానములు, సుఖదుఃఖములు మొదలైనవి అంతు లేకుండ మనలో కనబడుచుండును. ఈ యన్నిటి సంస్కారములును మన మనస్సు నంటియుండును. కనుక జీవితమనగా నేమని నన్నెవరైన అడిగిన సంస్కార సంచయమే జీవితమని నే నందును.

సంస్కారములు మంచివి చెడ్డవియని రెండువిధములు. ఈ రెంటియొక్క పరిణామమును మానవుని జీవితముమీద కనబడుచునే యుండును. బాల్యమున జరిగిన విషయములు మనకు జ్ఞప్తిలోనే యుండవు. పలకమీది వ్రాత చెరిగిపోయినట్లు బాల్యావస్థయంతయు మరపునబడును. పూర్వజన్మ సంస్కారములు అసలు పూర్వజన్మ ఒకటున్నదా యని శంకించునంతగా విస్మృతిపా లగును. ఈజన్మలోని బాల్యావస్థయే మఱపునబడినప్పుడు ఇక పూర్వజన్మసంగతి చెప్పుట యెందులకు? పూర్వజన్మ విషయమటుంచి ఈ జన్మనుగూర్చి విచారింతము.

మన కెన్నివిషయములు జ్ఞప్తిలోనున్నవో అన్నియే జరిగినవని చెప్పలేము. జరిగిన క్రియలు, వానిచే కలిగిన జ్ఞానానుభవములు అనేకములుగ నుండును. కాని ఈ క్రియలు, వాని యనుభవములు హరించిపోయి చివరకు కొన్ని సంస్కారములుమాత్రమే నిలిచియుండును. రాత్రి నిద్రపోవుముందు పగటిపనులు జ్ఞప్తికి తెచ్చుకొనవలెననిన అన్నియు జ్ఞప్తికిరావు. బహుస్పష్టమైనవి, లోపల గట్టిగ నాటు కొన్నవి మాత్రమే స్ఫురణకువచ్చును. ఎవరితోనైన మనకు జరిగిన పెద్ద ఘర్షణలు, జగడములు తప్పక జ్ఞప్తికి వచ్చును. ఎందులకనిన ఆనాటికి ముఖ్యముగ మనము సంపాదించుకొన్న దదేకనుక ముఖ్యమైనవి, స్పష్టమైనవియైన అనుభవములు మనస్సులో చాల గాఢముగ నాటుకొనును. ముఖ్యమైనవి జ్ఞప్తిలోనుండి మిగిలినవన్నియు అస్పష్టములై పోవును. మనము దినచర్య వ్రాయబోయి చాలవరకు మరచి ముఖ్యమైన ఏ మూడు నాలుగు విషయములో వ్రాయగలుగుదుము. ఒక వారములో కలిగిన అనుభవములను ఒకరోజుననే కూర్చుండి వ్రాయవలెననిన ఇంకను మరచిపోయి అతి ముఖ్యమైన ఏ యొకటి రెండో వానిలోనుండి వ్రాసికొందుము. ఒక నెలలోని యనుభవములు ఒకసారియె వ్రాయవలెననిన ఆనెలలోని ముఖ్యాతిముఖ్యమైన అనుభవములే గుర్తుండును. ఈ విధముగనే ఆరునెలలకు, సంవత్సరమునకు, అయిదుసంవత్సరములకు ఒకసారి వ్రాయవలసి వచ్చినచో మహత్త్వపూర్ణమైన ఏ కొద్ది ఘటనలో స్ఫురణకువచ్చును. అవియే మనకు సంస్కారములగును. అనేక క్రియలుచేసి అనంతమైన జ్ఞానానుభవములు పొందినపిమ్మట కూడ చివరకు మనస్సులో మిగిలియుండు సంస్కారములు ఎన్నోయుండవు. భిన్నభిన్నములైన కర్మలు భిన్నభిన్నములైన అనుభవములను కలిగించిపోవును. దృఢమైన యే అయిదారు సంస్కారములో మిగిలియుండును. ఈ సంస్కారములే మన మూలధనము. మనము జీవిత మను వ్యాపారమును నడుపుచు సంస్కారము లను సంపదనుమాత్రము కూడబెట్టుదుము. వ్యాపారస్థుడు రోజు, నెల, సంవత్సరము—వీనిననుసరించిన జమాఖర్చులువ్రాసి చివరకు లాభమో నష్టమో ఒక్క అంకెలో తేల్చినట్లే జీవితవ్యాపారమునుకూడ తేల్చుకొనవలె. అనేక సంస్కారముల జమపట్టి పెరిగిపెరిగి చివరకు మిగులు సారము బహుస్వల్పము. జీవితముయొక్క తుదిగడియలో ఆ స్వల్పమునే ఆత్మ జ్ఞప్తికి దెచ్చుకొనును. జన్మ పొడుగునను చేసిన పనులను స్ఫురణకు తెచ్చుకొన్నప్పుడు ముఖ్యమైన ఏ రెండుమూడు విషయములో మనకు కనబడును. ఇదే మనజీవితమున కెల్లను ఆదాయము. కాని తానాచరించిన కర్మలు, పొందిన

జ్ఞానానుభవములు అన్నియు వ్యర్థముగ పోయినవని దీనియర్థము కాదు. వాని పని పూర్తియైపోయినది. వేలకొలది రూపాయలను వ్యాపారములో పెట్టగా చివరకు వర్తకునికి అయిదువేలు నష్టమో, పదివేలు లాభమో తేలును. నష్టమువచ్చిన గుండె జారిపోవును. లాభమువచ్చిన హృదయము ఆనందముతో నృత్యము చేయును.

మన జీవితవిషయముకూడ ఇంతే. మరణసమయమున జిహ్వేంద్రియ వాసన కలిగినచో జీవితమంతయు రుచులు కుడుచు అభ్యాసములోనే కడచినట్లు ఋజువగును. జిహ్వేంద్రియవాసనయే అతని జీవితమునకెల్ల సంపాదన. మరణ మాసన్నమైనతల్లికి బిడ్డలు జ్ఞప్తికివచ్చిన పుత్రసంబంధమగు సంస్కారమే ఆమెలో బలిష్ఠముగ నుండెనని తలంపవలెను. తానాచరించిన అసంఖ్యాకములైన ఇతరకర్మలన్నియు గౌణమైయున్నట్లు ఋజువగును. అంకగణితభిన్నముల సూక్ష్మీకరణలో ఎంతెంత పెద్దసంఖ్యలైనను సంక్షిప్తపరచుచుపోగా చివరకు ఒకటియో లేక సున్నయో జవాబురావచ్చును. ఈ విధముగనే జీవితములో అనేక సంస్కారములు అంతరించి చివరకు బలమైన ఏయొక సంస్కారమో నిలిచి యుండును. జీవితమను ప్రశ్న కది సమాధానమగును. అంత్య సమయమున స్మరణకువచ్చునదే జీవితమునకెల్లను ఫలము.

జీవితముయొక్క ఈ యంతిమసారము, ఈ యంతిమక్షణము మధుర మగునట్లు మనపనులన్నియు ఉండవలెను. తుదిగడియ మధురమైనచో జీవిత మంతయు మధురమే, ఈ లక్ష్యమును దృష్టిలో పెట్టుకొని జీవిత సమస్యలన్నియు పరిష్కరించుకొనవలెను. జీవితకార్యక్రమమంతయు ఈ దృష్టితోనే నియమించు కొనుము. ప్రశ్నకు సమాధానము చెప్పునప్పుడు అడుగబడిన ప్రశ్ననే దృష్టిలో పెట్టుకొని సమాధానము చెప్పుదుము. ఈ రీతిగనే మనపనులన్నిటిని చేయవలసి యుండును. కనుక చనిపోవువేళ ఎట్టి సంస్కారము దృఢముగ నుండవలెనను కోరికయుండునో దాని కనుగుణముగ జీవితప్రవాహమును త్రిప్పుకొనవలెను. అహోరాత్రము దానివైపునకే దృష్టి యుండవలెను.

## 37. మరణము స్ఫురణయందుండుగాక !

మరణసమయమున ప్రబలముగ మనస్సులోనుండు భావనయే రానున్న జన్మలో బలిష్ఠముగ పనిచేయునని ఈ యెనిమిదవ అధ్యాయములో సిద్ధాంతము చేయబడినది. ఈ సత్యమును దారిబత్తెముగ తీసికొని జీవుడు భావియాత్రకు బయలుదేరును. నేటియనుభవముల నాధారముచేసికొని నిద్రనుండి లేచిన తరు

వాత రేపటి జీవితయాత్రను ప్రారంభింతుము. ఆ విధముగనే ఈ జన్మలో పొందిన అనుభవజ్ఞానమను మూలధనముతో మరణ మను నిద్ర తరువాత తిరిగి మన యాత్ర ప్రారంభమగును. ఈ జన్మయొక్క అంతమే రానున్న జన్మకు ప్రారంభము. కనుక నిరంతరమును మరణమును జ్ఞప్తియం దుంచుకొని జీవిత యాత్రను సాగింపుము.

మరణస్మృతివలన మరియొక లాభముకూడ కలదు. దీనివలన మృత్యుభయమును జయించి, మృత్యువును సహజముగ సమీపింపగల శక్తి మనకు కలుగును. ఏకనాథ మహారాజునుగూర్చిన కథ యొకటున్నది. ఒక గృహస్థు డతనితో – "మహారాజా, మీ దెంత పుణ్యజీవితము. మా జీవితములు అట్లేల లేవు ? మీ కెప్పుడును ఎవరిమీదను కోపము రాదే! ఎవరితోడను వివాదములు, కలహములు లేవే! మీలో నెంతశాంతియు, ప్రేమయు, పవిత్రతయు గలవు!" అని అన్నాడు. ఏకనాథు డిట్లు జవాబు చెప్పెను – "ప్రకృతము నా విషయ మట్లుంచుము. నిన్ను గూర్చి నాకొక విషయము తెలియును. ఇక ఏడు దినములలో నీకు చావు రానున్నది." ఏకనాథు నంతటివాని మాట అబద్ధమని యెవరన గలరు ? "ఏడు దినములలో మృత్యువా! అరే, 168 గంటలేనా ఇక గడువు!" అని అతడు శీఘ్రముగ ఇల్లు చేరుకొన్నాడు. ఏమియు తోచక అవసాన కాలమునకు సంబంధించిన వ్యవహారములు చక్కబెట్టుకొను చుండెను. జబ్బు చేసినది; మంచమెక్కినాడు. ఆరు దినములు గడచినవి. ఏడవ దినమున ఏకనాథు డతని యొద్దకు వచ్చెను. రోగి యతనికి నమస్కారము చేసెను. ఎట్లున్నాడవని ఏకనాథు డడిగెను. "ఇక పోవుచున్నాను" అని అన్నాడతడు. "ఈ యారు దినములలో నెంతపాపము చేసితివి ? చెడుతలంపు లెంతగా మనసులోనికి వచ్చినవి ?" అని యేకనాథుడు ప్రశ్నించెను. ఆసన్న మరణు డిట్లనెను – "స్వామీ, పాపపు తలంపులు కలుగుటకు సమయమే లేదు. తెంపులేకుండ మృత్యువే నా యెదుట నిలిచి యున్నది." అప్పు డేకనాథు డిట్లనెను – "నా జీవితము పాపరహితముగా ఎందుల కున్నదో ఇప్పుడు తెలిసినదా ? మరణ మను పులి యెల్లపుడును ఎదుట నిలిచి యుండగా పాప మెట్లు స్ఫురించును ? పాపము చేయుటకైనను నిశ్చింతముగ నుండవలె. మరణమును గూర్చిన నిరంతరస్మృతి పాప విముక్తికి తరణోపాయము. మృత్యువు ఎట్టయెదుట కనబడుచుండగా మానవుడు దేనిబలము చూచుకొని పాపము చేయును ?"

కాని మానవుడు మరణము తలంపునకు రాకుండ తప్పించుకొని తిరుగును. పాస్కల్ అను ఫ్రెంచి దార్శనికుడు కలడు. "పాన్‌సే" అని యతడు వ్రాసిన గ్రంథ మొకటి యున్నది. 'భావనలు' అని దాని యర్థము. వివిధ విషయములమీద స్ఫుటమైన భావములను అత డీ గ్రంథములో వ్యక్తపరచెను. అందొకచోట నిట్లనును – "మృత్యు వెల్లపుడును మనలను వెన్నంటియే యుండును. కాని దాని నెట్లుమరచి బ్రదుకుదునా యని మానవుని నిరంతర ప్రయత్నము. మృత్యువును జ్ఞప్తియం దుంచుకొని బ్రతుకవలెనను ఆలోచన మాత్రము చేయడు." మానవుడు మృత్యుశబ్దమును కూడ విన సహింపడు. భోజన సమయమున నెవరైన మృత్యువు పేరెత్తిన "ఎట్టి అశుభవాక్కు అనుచున్నావు!" అని యనును. కాని ఎంత అశుభ మనుకొన్నను మనము వేయు ప్రతి–అడుగును మృత్యువు వైపునకే పడుచున్నది. బొంబాయికి టిక్కెట్టు కొని రై లెక్కిన తరువాత నీవు కూర్చుండియే యున్నను బండి నిన్ను తీసికొని వెళ్ళి బొంబాయిలో పడవేయును. మనము పుట్టుకతోనే మృత్యువునకు టిక్కెట్టు తీసికొన్నారము. మీరు కూర్చున్నను, పరుగెత్తినను, ఏ స్థితిలోనున్నను మృత్యువు వచ్చి తీరును. మృత్యువును తలచినను తలపకపోయినను అది రాక మానదు. మరేది నిశ్చయము కాకపోయినను మరణము మాత్రము నిశ్చయము. సూర్యు డస్తమించి నపుడెల్ల మన ఆయువులో ఒక అంశమును తీసికొని పోవుచున్నాడు. ఈ విధముగ ఆయుఃప్రమాణము తఱిగిపోవును. గోటితో గిల్లి వేసినట్లు కొంచెముకొంచెముగ తఱిగిపోవును. అయినను మానవు డీ విషయమే తలంపడు. "ఇది పరమాశ్చర్యకరము!" అని జ్ఞానేశ్వరుడనును. మానవు డీ విషయమున ఇంత నిర్లక్ష్యముగ ఎట్లుండ గలుగుచున్నాడని జ్ఞానదేవునికి ఆశ్చర్యము. మరణముయొక్క తలంపునుకూడ సహింప లేనంతగా మానవునికి మృత్యుభయ ముండును. ఈ తలంపు నుండి తప్పించుకొనవలెనని కోరుచు కనులకు గంతలు కట్టుకొని కూర్చుండును. యుద్ధమునకుపోవు సైనికుడు మరణముమాట మరచిపోవుటకుగాను ఆటలు, పాటలు నృత్యములు సాగించును, సిగరెట్లు త్రాగును. పాస్కలు ఇట్లన్నాడు– "ప్రత్యక్షముగ సర్వత్ర మృత్యుదర్శన మగుచున్నను ఈ 'టామీ' (పాశ్చాత్య సైనికుడు) దానిని మరచి బ్రతుకుటకు తినుచు, త్రాగుచు ఆట పాటలలో నిమగ్నుడై యుండును."

మన మందరమును ఈ 'టామీ' వలెనే యున్నారము. ముఖమును తీర్చి దిద్దుకొని చిఱునవ్వు నటించుట, ముఖము వాడియున్నచో మెరుగులు, పౌడర్లు

వట్టించుట, వెండ్రుకలు తెల్లబడినచో నల్లరంగుపూయుట—ఈ మొదలైన ప్రయత్నములు మానవుడు చేయుచుండును. మృత్యువువచ్చి గుండెలమీద నృత్యము చేయుచున్నను, మన మా 'టామీ'ల వలె దానిని మరచుటకే అక్షయప్రయత్నము చేసెదము. "ఇంకేమైనను చెప్పుడు, మృత్యువుమాట మాత్రము చెప్పవల"దందుము. మెట్రిక్ ప్యాసైన కుఱ్ఱవానిని "తరువాత నేమి చేయవలెనని నీ యుద్దేశము ?" అని యడిగిన "ఈ ప్రశ్న ఇప్పుడే వేయకుడు, ప్రకృతము 'ఇంటర్' మొదటిసంవత్సరము జరుగుచున్నది" అనును. మరుసటిసంవత్సరము మరల అడిగినచో "సరే, ఇంటరు కానిండు, తరువాత చూతము" అని యనును. ఈ రీతిని విషయము నడుచును. తరువాత రానున్నస్థితినిగూర్చి ముందే ఆలోచింపవలదా ? ముం దడుగును గూర్చి మొదటనే ఆలోచించుకొనవలె. లేకున్నచో ఏగోతిలోనో పడవచ్చును. కాని విద్యార్థి ఈ యాలోచనను త్రోసిపుచ్చును. పాప మతడు పొందగల శిక్షణయొక్క అవలియొడ్డు వానికి కనబడక అంధకారమయముగ నుండును. కనుక ముందేమి చేయవలయునను ప్రశ్ననే ఎదుటికి రానీయడు. అయినను భవిష్యత్తు త్రోసివేయదగినది కాదు. అది మన తలకెక్కి స్వారిచేసితీరును.

కాలేజీలో అధ్యాపకుడు తర్క శాస్త్రము బోధించును—"మానవుడు మర్త్యుడు; సోక్రటీసు మానవుడు; కావున సోక్రటీసు మృతినొందును" అను అనుమానప్రమాణము నతడు బోధించును. ఇందులకు సోక్రటీసును ఉదాహరణముగ తీసికొనును. తన్నే యుదాహరణముగ నేలతీసికొనడు ? అధ్యాపకుడు కూడ మర్త్యుడేకదా! "అందరు మనుష్యులును మర్త్యులు. కనుక అధ్యాపకుడనైన నేనును, శిష్యులైన మీరును, మర్త్యులమే" అని మాత్రము చెప్పడు. ఆ మరణమును సోక్రటీసుమీదికే త్రోసివేయును. ఎందులకనిన సోక్రటీసెప్పుడో చనిపోయి తగవాడుట కిప్పుడు మన యెదుటలేడు కాబట్టి, గురుశిష్యులిద్దరును మరణమును సోక్రటీసుమీదికి త్రోసి "నీవును మాటాడకుము! నేనును మాటాడను!" అన్నట్లుందురు. తమవఱకు తాము సురక్షితుల మన్నట్లు కూర్చుందురు.

ఈ విధముగ ఎరిగియుండియే మృత్యువును మరచి బ్రతుకు ప్రయత్నము ఎల్లపుడును జరుగుచుండును. కాని యీమాత్రమున ఎక్కడనైనను మృత్యువు తొలగిపోవునా ? తల్లి మృతిజెందినపుడు బిడ్డకు మృత్యువు స్పష్టముగా గోచరించునుగదా! కాని మానవుడు నిర్భీతితో మృత్యువును జ్ఞప్తియం దుంచుకొని దానిని స్వీకరింప సిద్ధపడి జీవితమును సాగించుటకు సాహసము చేయడు.

పెద్దపులి యొక లేడిని తరుముచున్నదనుకొనుము. వేగముగల ఆ లేడికూడ పరుగెత్తి అలసిపోవును. పులిరూపమున మృత్యువు వెన్నంటి వచ్చుచునే యున్నది. ఆ సమయమున లేడిస్థితి యెట్లుండును ? అది యా పులివైపు చూచుట కైనను వెఱచును. కొమ్ములు, ముఖము మట్టిలోదూర్చి నిలబడి పోవును; నిరాధారమై "ఇదిగో రమ్ము ! నన్ను మింగివేయుము" అని నిస్పృహతో అన్నట్లుండును. మనము మృత్యువును ముఖాముఖిని చూడజాలము. దానిని తప్పించుకొని బ్రతుకుటకు వేలకొలది యుపాయములను పన్నుచుందుము. అయినను చివరికది మనగొంతు పిసికితీరును.

మరణ మాసన్నమైనపుడు మనుష్యుడు తన జీవితపు నిలువను లెక్క చూచుకొనును. మందబుద్ధియైన సోమరివిద్యార్థి పరీక్షకువచ్చి సిరాబుడ్డిలో కలము ముంచుచు పైకితీయుచు తెల్లకాగితమును నల్లబఱచు ధైర్యము లేకుండ కూర్చుండును. "ఓ సోదరా ! ఏ కొంచెమయినను వ్రాయుదువా ? వ్రాయవా ? సరస్వతివచ్చి వ్రాసిపెట్టునా ? మూడుగంటల కాలమును ముగిసి పోవుచున్నది." అనిన చివరకు వాడు వట్టి తెల్లకాగితమో లేక, యే నాలుగక్షరములు గీకిన కాగితమో ఇచ్చిపోవును. ప్రశ్న నన్వయము చేసికొని సమాధానము వ్రాయవలెనని తోచక వాడు ఇటునటు చూచును. మన స్థితికూడ నిట్టిదే. కాన జీవితము మృత్యువుదెసకు నడచుచున్న దను సంగతి లక్ష్యమునందుంచుకొని, అంతిమక్షణము పుణ్యమయము, అత్యంతపవిత్రము, మధురము కావలెనను ఆత్రముతో బ్రతికి నన్నాళ్ళు సాధనచేయవలె. అత్యుత్తమములైన సంస్కారము లెట్లు కలుగునను విచారణ మన మిప్పటినుండియే చేయవలె. కాని మంచి సంస్కారములను అలవరచుకొనవలెనను చింత యెవరికున్నది ? అది లేకపోగా అహోరాత్రము కుసంస్కారముల అలవాటుమాత్రము జరుగుచుండును. జిహ్వకు, కంటికి, చెవికి మనము చపలత్వము నేర్పుచున్నాము. దీనికి విరుద్ధమైన అభ్యాసమునందు చిత్తము లగ్నముచేయవలెను. మంచి విషయముల వైపునకు మనసును మగల్పవలెను. వానియందది మునిగి తేలవలెను. నీ దోషమును నీవు గుర్తించినయంతనే దానిని దిద్దుకొనసమకట్టవలెను. తప్పును గుర్తించిన తరువాత కూడ తిరిగి అదే చేయుటయా ? తప్పును తెలిసికొన్న వెంటనే మనకు పునర్జన్మ కలిగినట్లు. అది మనజీవితమునకు నూతన బాల్యావస్థ, నూతన ప్రభాతము అని నమ్ముము. ఇది నీకు నిజమైన మేలుకొలుపు. ఇకరేలుంబగళ్ళు ఆత్మనిరీక్షణ చేసికొనుచు జాగరూకుడ

వగుము. ఇట్లు చేయవేని మరల జారిపోదువు. చెడ్డయలవాటులు మరల ప్రారంభింతువు.

చాలయేండ్లకుమున్ను నేనొకసారి మా నాయనమ్మను చూడబోయితిని. ఆమె చాలముదుసలి. ఆమె నాతో "విన్యా, నాకిప్పుడు దారణాశక్తి తగ్గుచున్నది. నేతిగిన్నె కొఱకుపోయి దానివిషయమే మరచి తిరిగివత్తును" అని యన్నది. ఈ మాట యనుచునే నగలకు సంబంధించిన యేబదేండ్లనాటి విషయమొక్కటి చెప్పినది. అయిదు నిమిషములకు పూర్వము జరిగినది జ్ఞప్తిలోలేదు. కాని యేబదేండ్లనాటి బలిష్ఠసంస్కారమింత వరకును చెక్కుచెదరకుండ నిలిచి యున్నది. దీనికి కారణమేమి ? ఆ నగలమాట ఆమె నేటివరకును ప్రతివాని తోను, ఎల్లపుడును చెప్పుచుండును. అందువలన నాసంస్కారము ఆమె జీవితమున కంటుకొనిపోయి, ఆమె దానితో ఏకరూపమయ్యెను. "మరణసమయ మున మా ముసలమ్మకీ నగలసంగతి జ్ఞప్తికి రాకుండిన బాగుగా నుండునో దేవా !" అని నాలో నే ననుకొంటిని.

## 38. మరణస్మరణ మనలను సదా అంటియుండునుగాక!

అహర్నిశము మన కలవాటైన విషయము మనల నంటియుండ కేమగును ? అజామిళునికథ చదివి మనము భ్రమలో పడరాదు. బాహిరముగా చూచినచో అతడు పాపి. కాని యతని జీవితాంతరాళమున పుణ్యధార ప్రవహించుచుండెడిది. ఆ పుణ్యము అంతిమ క్షణములో మేల్కొన్నది. కాని ఎల్లప్పుడును పాపముచేయుచు చివరగడియలో రామనామము మనకుహఠాత్తుగ జ్ఞప్తికివచ్చునను భ్రమలో పడియుండవలదు. బాల్యమునుండి ఏకాగ్రతతో మంచి సంస్కారములను అలవరచుకొనుము. నిరంతరమును ఇట్టి సంస్కారములనే సేకరింపవలె నను చింతలో నుండుము. దీనివలన నేమగునని, దానివలన నేమ గునని యనకుము. నాలుగు గంటలకే ఎందులకు నిద్ర లేవవలె ? ఏడు గంట లకు లేచిన నష్టమేమి ? ఇట్లనుట వలన ప్రయోజనము లేదు. మనస్సునకు నిరంతరమును ఇట్టిస్వేచ్ఛ నిచ్చుచు పోయినచో చివరకు వలలో చిక్కుకొందువు. ఇక నీకు మంచి సంస్కారములు కలుగనేరవు. ఒక్కొక్క పైస ప్రోగుచేసి కొనుచు లక్ష్మిని కూడబెట్టవలె. ఇట్లే ఒక్క క్షణమైనను వ్యర్థముగ పోనీయక విద్యోపార్జనకు పూనుకొనవలె. అనుక్షణమును కలుగు సంస్కారములు మంచి వౌనా కావా యని పరిశీలించుకొనుము. కూడనిమాట ఒక్కటి పలికినను కుసం స్కారము వచ్చి పడినదన్నమాటే. మనముచేయు ప్రతిపనియు ఉలియై మన

జీవిత మను శిలకు అకృతిని దిద్దును. పగలు చక్కగా గడచిపోయినను రాత్రి స్వప్నములో చెడ్డతలంపులు రావచ్చును. అయిదారు దినముల లోపలి భావనలే స్వప్నములోనికి వచ్చునని చెప్పలేము. అజాగ్రత్త వలన చెడ్డ సంస్కారములు అపరిమితముగ వచ్చిపడును. అవి యేవేళ పైకి వచ్చునో చెప్పలేము. అందు వలన స్వల్పాతి స్వల్పవిషయములలో కూడ మెలకువతో సంచరింపవలెను. నీట మునిగిపోవు వానికి కట్టెపుల్లకూడ ఆధారమగును. మనము సంసార సాగర ములో మునిగి యున్నాము. మనము ఏ కొంచెము మంచిగ మాట్లాడినను అదే జీవితమున కాధారము కావచ్చును. చేసిన మేలు వ్యర్థముగ పోదు! అది నిన్ను తరింపజేయును. లేశమాత్రము కూడ చెడ్డ సంస్కారము కలుగనీయకుము. కనులు పవిత్రములై యుండునట్లు చెవులు నిందావాక్యములను వినకుండు నట్లు, నోరు మంచిమాటలనే పలుకునట్లు సదా ప్రయత్నింపుము. ఇట్టి జాగరూక తతో నుంటివా చివరకు విజయము కలిగితీరును. జీవన మరణములు రెంటికివి అధికారి వగుదువు.

పవిత్ర సంస్కారములు గలుగవలె ననిన మనసులో ఉత్కృష్ట భావనా పంచలనము తీవ్రముగా జరుగుచుండవలెను. చేతులు పవిత్ర కర్మలయందు నియుక్తములు కావలెను. లోపల ఈశ్వరస్మరణ, బయట స్వధర్మాచరణ; చేతిలో సేవాకర్మ మనసునందు వికర్మ – ఇది నిత్య కార్యక్రమము కావలెను. గాంధిగారిని చూడుడు, అనుదినమును వారు రాట్నమును త్రిప్పుచునేయుం దురు. సూత్రయజ్ఞమును నిత్యమును జరుపవలె నని నొక్కి చెప్పుచుందురు. ప్రతిదినమును ఎందులకు వడుకవలె? బట్టల కొఱకైనచో అప్పుడప్పుడు వడు కుట చాలదా? కాని ఇది వ్యవహారదృష్టి. నిత్యమును వడుకుటలో ఆధ్యాత్మిక మైన విలువయున్నది. దేశముకొఱ కేదో కొంతసేవ చేయవలసి యున్నాడనను చింతనకు నిత్య సూత్రయజ్ఞము చిహ్నము. ఈ దారము మనలను నిత్యమును దరిద్రనారాయణునితో కలుపుచు ఆ సంస్కారమును దృఢతరము చేయును.

వైద్యుడు ప్రతి దినమును త్రాగుమనిచెప్పి మందీయగా మం దంతయు ఒక రోజుననే త్రాగిన నేమగును? ఇట్లుచేయుట విచిత్రముగ నుండును. ఔష ధముయొక్క ఉద్దేశమే సఫలము కాకుండబోవును. మందుయొక్క ప్రభావము ఆ రోజున కారోజు శరీరముమీద పడి ప్రకృతికి అపాదిల్లిన వికృతిని తొలగించ వలె. జీవిత విషయముకూడ నింతే. శివునికి మెల్లమెల్లగ నభిషేకము చేయవలె. ఇది నాకు ప్రియమైన దృష్టాంతము. నా బాల్యములో అనుదినమును నేనీ యభి

షేకమును చూచుచుండువాడను. ఇరువదినాలుగు గంటల అభిషేకజల మంతయు కలిసి రెండు బొక్కెన లగునేమో! అయినప్పుడు రెండు బొక్కెనల నీరును ఒకసారియే శివునిమీద ఏల క్రుమ్మరించరాదు? దీనికి సమాధానము బాల్యములోనే నాకు లభించెను. నీరంతయు నొక్కసారి క్రుమ్మరించుట వలన ఆ పని సఫలము కానేరదు. బొట్టువెంట బొట్టుపడుటయే ఉపాసన. ఒక రకమైన సంస్కారధార నిరంతరముగా పడుచుండవలెను. ఉదయపు సంస్కారమే మధ్యాహ్నమున అదే సాయంకాలమున; అదే పగటిపూట, అదే రాత్రియందు, అదే నిన్న, అదే నేడు. ఈ నాడేదో రేపునుఅదే, ఈయేడేదో రాబోవు నేడును అదే, ఈ జన్మ మందేదో రానున్నజన్మ మందును అదే. జీవితము పొడుగునను ఏదో అంత్య సమయమునందును అదే—ఈవిధముగ సత్సంస్కారముల దివ్యధారలు జీవితము పొడుగునను ప్రవహించుచుండవలెను. ఇట్టి యఖండప్రవాహము నడచుచున్న నే చివరకు మనము విజయము నొందగలము. అప్పుడే మనము గమ్యమునకుచేరి జెండాను ప్రతిష్ఠింపగలము. సంస్కారముల ప్రవాహము ఒకదిశలోనేపారుచుండ వలెను. పర్వతముపై కురిసినవర్షము అన్నిదిశలకును ప్రవహించినచో దానివలన నది యేర్పడదు. అట్లుగాక నీరంతయు ఒకదిశకె ప్రవహించినచో అది ముందు సెల యేరుగా, సెలయేరు ధారగా, ధార ప్రవాహముగా, ప్రవాహము నదిగా, నది మహానదిగా విస్తరిల్లుచు వెళ్ళివెళ్ళి సముద్రమును చేరును. ఒకదిశలోనే ప్రవహించిన నీరువెళ్ళి సముద్రమున కలియును. కాని నలువైపులకును ప్రవహించు నీరు ఏ కొంతదూరమో పోయి యింకిపోవును. సంస్కారములవిషయము కూడ ఇంతే. సంస్కారములు ఇటువచ్చుచు అటుపోవుచున్నచో ప్రయోజనమేమి? సంస్కారముల పవిత్రవాహిని జీవితములో నిరంతరమును ప్రవహించుచున్నచో చివరకు మరణము మహానందమునకు నిలయమనిపించును. పర్వతయాత్రికుడు దారిలో ఎక్కువగ మజిలీలుచేయడు; దారిలో కలుగు మోహ, ప్రలోభములను జయించును. కాలు నిలద్రొక్కుకొని, శ్రమకోర్చి ఆరోహణ చేయుచు పోయిపోయి శిఖరము చేరును. అక్కడ మూపుమీది బరువును, రొమ్ములకు కట్టుకొన్న త్రాళ్ళను తొలగించుకొని అరు బయటిగాలిని హాయిగా అనుభవించును. వాని యానందమును ఇతరు లూహింపగలరా? కాని దారిలోనే ఆగిపోవు యాత్రికుని కొఱకు సూర్యుడు ఆగునా?

## 39. సర్వదా యుద్ధప్రసంగము

సారాంశమిది: బయటినుండి నిరంతర స్వధర్మాచరణ—అనగా కర్మ, లోపలినుండి హరిస్మరణతోకూడిన చిత్తశుద్ధి—అనగా వికర్మ—ఈ రెంటిప్రవా

హము నడుచుచున్నప్పుడు మరణము ఆనందదాయక మగును. ఇందుచేతనే భగవంతుడు—

"తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ"

"నన్ను సదాస్మరించుచుండుము – యుద్ధము చేయుము" అనును. "అందులోనే మునిగితేలుచుండుము" సదా యీశ్వరునిలో లీనమైయుండుము. బహిరంతరములు ఈశ్వరప్రేమతో నిండి. ఆ ప్రేమ జీవితమందెల్ల వ్యాపించి నప్పుడే మనుష్యుడు పవిత్ర కార్యాచరణయందు నిత్యానందమును పొందు చుండును. అప్పుడు చెడువృత్తులు మన యెదుటికివచ్చి నిలువలేవు. మనస్సు నందు సుందరములైన మనోరథములు అంకురించును. ఉత్తమకార్యములు అప్రయత్నముగా జరుగును.

ఈశ్వరస్మరణవలన సత్కర్మలు సహజరీతిని జరుగుచుండుట సత్యము. కాని "నిరంతరమును పోరాటముజరుపు" మనునదికూడ భగవంతుని యాజ్ఞయే. తుకారాముమహారాజు 'బహిరంతరములకు, జగత్తునకు మనస్సునకు అహోరాత్రము యుద్ధఘోషయే' అనియనును. లోపలను వెలుపలను అనంతసృష్టి వ్యాపించి యున్నది. ఈ సృష్టితో మనస్సు నిరంతరమును పోరాటము సలుపుచుండును. ఈ పోరాటమున అన్నివేళల జయమే కలుగునని చెప్పలేము. ఎవడు గమ్య మును చేరునో వాడే నిజమైన విజేత. చివరితీర్పే సరియైనది. యశోఽపయశ ములు అనేక పర్యాయములు ప్రాప్తించుచుండును. అపయశము విఫలతకలిగి నప్పుడు నిరాశపొంద పనిలేదు. రాతిమీద పందొమ్మిది సుత్తిదెబ్బలు కొట్టినను అది పగులక, ఇరువదవదెబ్బకు పగిలినచో ఆ పందొమ్మిదిదెబ్బలును నిరర్థకమై నట్లా? కాదు. చివరిదెబ్బయొక్క సఫలతకు వెనుకటి దెబ్బలన్నియు తోడ్పడినవి

నిరాశచెందుట యనగా నాస్తికుడగుటయే. పరమేశ్వరుడు మనరక్షకుడని నమ్ముము. బిడ్డలో ధైర్యమును పెంచుటకు తల్లి వానిని ఇటునటు తిరుగ నిచ్చును. కాని వానిని క్రిందపడనీయదు. పడబోయినవెంటనే వచ్చి వానిని మెల్లగా లేవదీయును. ఈశ్వరుడుకూడ నిరంతరమును నీ మీద దృష్టిపెట్టుకొని యుండును. నీ జీవితమను గాలిపడగకు కట్టిన దారము వాని చేతిలోనున్నది. ఒకసారి అత డా దారమును లాగిపట్టును; ఒకప్పుడు సడలించును. దారము మాత్రము అతని చేతిలోనే యున్నదను విశ్వాస ముంచుకొనుము. గంగాఘట్ట ములో ఈతనేర్పుదురు. గట్టుననున్న చెట్టునకు గొలుసో త్రాడో కట్టబడి యుండును. త్రాటియొక్క రెండవకొన ఈదువాని నడుమునకు కట్టి వానిని

నీటిలోపడవేయుదురు. గురువు నీటిలోనే యుండును. నేర్చుకొనువాడు క్రొత్త పనియగుటచేత మొదట మూడునాలుగు సారులు మునుగుటయు తేలుటయు జరిగినను చివర కా కళను నేర్చుకొనును. ఈ విధముగనే పరమేశ్వరుడు మనకు జీవితకళను నేర్పుచున్నాడు.

## 40. శుక్ల కృష్ణ గతి

పరమేశ్వరునిమీద శ్రద్ధయుంచి మనోవాక్కర్మలద్వారా రేలుంబగళ్ళు పోరాటము సల్పుచున్నచో అంత్యసమయము మహోత్తమముగ పరిణమించును. అప్పుడు దేవతలందరును అనుకూలురగుదురు. ఈ విషయమే ఈ యధ్యాయము చివర ఒక రూపకాలంకారముద్వారా నిరూపింపబడినది. ఈ రూపకమును మీరు అవగాహన చేసికొనుడు. ఎవని మరణసమయమున అగ్నిమండుచుండునో, సూర్యుడు ప్రకాశించు చుండునో, శుక్లపక్ష చంద్రుడు వృద్ధిలో నుండునో, ఉత్తరాయణము వచ్చి ఆకాశమంతయు మేఘరహితమై సుందరముగ నుండునో అట్టివాడు బ్రహ్మయందు విలీనుడగును. ఎవనిమృతిసమయమున పొగ వ్యాపించియుండునో, బహిరంతరములు అంధకారమయములై యుండునో కృష్ణపక్ష చంద్రుడు క్షీణించుచుండునో, దక్షిణాయనమువచ్చి ఆకాశమంతయు నల్లనిమేఘములతో కప్పబడియుండునో అట్టివాడు తిరిగి జననమరణ చక్రములోపడును.

చాలమంది ఈ రూపకమును చూచి తబ్బిబ్బగుదురు. పుణ్యమరణము కావలెనన్నచో అగ్ని, సూర్య, చంద్రాదిదేవతల, ఆకాశాదిభూతముల కృప యుండవలెను. అగ్ని, కర్మకును యజ్ఞమునకును చిహ్నము. అంత్యసమయములో కూడ యజ్ఞజ్వాల మండుచుండవలె. న్యాయమూర్తి రానడేగారు ఇట్లను వారు:– కర్తవ్యకర్మను నిరంతరమును పాలించుచు మరణించినవాని జన్మము ధన్యము. ఏదోయొక సద్గ్రంథమునుపఠించుచునో, వ్రాయుచునో, ఒక సత్కార్యమును చేయుచునో నేను మరణించితినా ధన్యుడనే." అగ్ని మండుచున్నదనిన అర్థమిది. మరణసమయమున కూడ కర్మనాచరించుచుండుట అగ్నియొక్క కృప. సూర్యునికృపయనగా బుద్ధియొక్క ప్రభ చివరవరకును ప్రకాశించుట. చంద్రునికృప యనగా అంత్యసమయములో పవిత్ర భావనలు వృద్ధిచెందుట. చంద్రుడు మనస్సుయొక్క–భావనయొక్క అధిదేవత. శుక్లపక్ష చంద్రునివలె మనస్సులో ప్రేమ, భక్తి, ఉత్సాహము, పరోపకారము, దయ – ఇత్యాది శుద్ధభావనలు పూర్ణవికాసమును పొందవలెను. ఆకాశముయొక్క కృప

యనగా హృదయాకాశములో ఆసక్తియనుమేఘపు సంచారము ఏమాత్రమును ఉండరాదని అభిప్రాయము. ఒకసారి గాంధీగారిట్లన్నారు – "నేనహర్నిశము చరఖా, చరఖాయని ఎలుగెత్తి కేకపెట్టుచున్నాను. చరఖాను నేనతిపవిత్ర వస్తువుగ భావింతును. కాని అంత్యసమయమున నాలో దాని వాసన యేమాత్ర మును ఉండరాదు. నన్ను చరఖాదెసకు ప్రేరేపించిన భగవంతుడే దాని భవిష్యత్తునుగూర్చి ఆలోచించుటకు సర్వవిధముల సమర్థుడు. యోగ్యులైన యితరులు ఇప్పుడు రాట్నమును చేపట్టినారు. చరఖాను గూర్చిన ఆలోచనను వదలి నేను పరమాత్మని యందు లీనమగుటకు సిద్ధముకావలె." పై దాని సారాంశమిది : ఉత్తరాయణ మనగా ఆసక్తి యను మేఘములు హృదయాకాశ మును ఆవరింపకుండుటయే.

చేతిలో నేదోయొక సేవాకార్యము జరుగుచుండగా, భావన యను పూర్ణిమ ప్రకాశించుచుండగా, హృదయాకాశము బొత్తిగా ఆసక్తిలేనిదై యుండగా, బుద్ధి తేజస్వంతమయి యుండగా మరణించినవాడు పరమాత్మలో లీనమగును. ఇట్టి పరమ మంగళమయ మగు అంత్యదశను చేరుటకు నిరంతరమును జాగరూక తతోను, దక్షతతోను, పోరాటము సలుపుచుండవలెను. ఒక్కక్షణమైనను అశుభ సంస్కారములకు మనస్సులో తావీయకుడు. ఇట్టి బలము చేకూరుటకీశ్వరుని సంతతముగా ప్రార్థించు చుండవలెను. నామస్మరణము, తత్త్వస్మరణము మరలమరల చేయుచుండవలెను.

## తొమ్మిదవ అధ్యాయము

## మానవసేవా రూపమైన రాజవిద్య : ఆత్మసమర్పణయోగము

### 41. ప్రత్యక్షానుభవ సిద్ధమైన విద్య

సోదరులారా ! ఈ రోజున నా గొంతు నొప్పిగానున్నది. నా మాటలు మీ కందరకు వినబడునో వినబడవో అని నా సందేహము. సాధుచరితుడు పెద మాధవరావు పేష్వాయొక్క అంత్యదశ ఈ సమయమున నాకు జ్ఞప్తికి వచ్చు చున్నది. ఆ మహాపురుషుడు మరణశయ్యపై పడియుండెను. కఫము చాల అధికమయ్యెను. విరేచనములకు మందిచ్చి కఫమును తగ్గించవచ్చును. అందు వలన మాధవరావు వైద్యునితో నిట్లనెను: "విరేచనములకు మందుపెట్టి

కఫమును పోగొట్టు ఉపాయము చూడుడు. ఇందువలన గొంతు తెఱపినిబడి నేను రామనామస్మరణము చేసికొ గలుగుదును." అట్లే ఈ రోజున నేమగూడ వరమేశ్వరుని ప్రార్థించితిని. "మాటలాడ గలిగినట్లే మాటలాడు" మని భగవంతుడన్నాడు. నే నిక్కడ గీతనుగూర్చి మాటలాడుట ఒకరి కుపదేశము చేయుటకు కాదు. కాని లాభము పొందగోరువారికి దాని వలన తప్పక లాభము కలుగును. అయినను నేను మాత్రము దీనిని నామజపముగ భావించి చెప్పుచున్నాను. గీతనుగూర్చి మాటాడు చున్నప్పుడు హరినామస్మరణ చేయుచున్నాననియే నా భావన.

నే నిప్పుడు చెప్పుచున్న మాటలకును ఈ తొమ్మిదవ అధ్యాయమునకును సంబంధమున్నది. ఈ యధ్యాయము హరినామముయొక్క అపూర్వ మహిమను గూర్చి చెప్పుచున్నది. ఇది గీతయొక్క మధ్యభాగములో నున్నది. మహాభారతమునకు మధ్యలో గీత: గీతకు మధ్యభాగమున ఈ తొమ్మిదవ అధ్యాయము. అనేక కారణములవలన ఈ యధ్యాయమునకు పవిత్రత వచ్చినది. జ్ఞానదేవుడు అంతిమ సమాధిలోనికి వెళ్ళినపుడు ఈ యధ్యాయమును జపించుచు ప్రాణమును వదలెనని యందురు. ఈ యధ్యాయమును స్మరించిన మాత్రమున నా హృదయము పొంగి కన్నీరు జలజల రాలును. ఈ యధ్యాయమును వ్రాసి వ్యాసదేవు డెంత ఉపకారము చేసినాడు! కేవలము భారతవర్షమునకే కాదు, సమస్త మానవజాతికిని చేసిన యుపకారమిది. భగవంతు డర్జునున కిచ్చిన ఈ యపూర్వసందేశము మాటలతో ప్రకటింపదగినది కాదు. కాని వ్యాసర్షి దయగలవా డగుటవలన ఈ విషయమును సంస్కృతభాష ద్వారా ప్రకటించెను. గుప్త విషయమున కతడు వాగ్రూపము నొసంగెను. ఈ యధ్యాయ ప్రారంభమున భగవంతు డిట్లనును - 'రాజ-విద్యా మహాగుహ్యా ఉత్తమోత్తమ పావన'.

ఈ రాజవిద్య, యీ యపూర్వవిషయము ప్రత్యక్షముగ అనుభవములోనికి తెచ్చుకొనవలసినది. భగవంతుడు దీనిని "ప్రత్యక్షావగమమ్" అన్నాడు. మాటలలో ఇముడనిది, అనుభవమను ఒరపిడి జాతిపై పరీక్షింపబడినది అగు విషయమును ఈయధ్యాయము చెప్పుచున్నది. ఇందువలన నిది అత్యంతమధురమైనది.

> 'మరణానంతరము లభించు స్వర్గమువలనను దానిని గూర్చిన కథల వలనను మనకేమి ప్రయోజనము? స్వర్గమునకు పోవువారెవరో, యమపురికి పోవువారెవరో ఎవరు చెప్పగలరు? బ్రతికియున్న నాలుగు దినములును రాముని దాసుడనై యుండుటలోనే నా కానందమున్నది'

అని యన్నాడు తులసీదాసు. రామునిదాసులై బ్రతుకుటలోనున్న మాధు ర్యము ఈ యధ్యాయములో కనబడుచున్నది. ప్రత్యక్షముగ ఈ దేహములోనే కన్నులార చూడదగిన సత్ఫలములను, ఇప్పుడే, ఇక్కడనే అనుభవవేద్య మయిన విషయములను ఈ యధ్యాయము చెప్పుచున్నది. బెల్లము తిన్నప్పుడే దాని మాధుర్యము ప్రత్యక్షముగ తెలియును. ఆ విధముగనే రాముని దాసు డగుటలోనున్న రుచి యిక్కడ కనబడుచున్నది. ఈ మ[illegible]ములో నుండ గానే జీవితమాధుర్యమును ప్రత్యక్షముగ [illegible]పగల రాజవిద్య ఈ యధ్యాయ ములో చెప్పబడినది. ఇది [illegible]ల గూఢమైనదైనను భగవంతుడు ఎల్లర సౌలభ్యము కొఱకు దీ[illegible]ని కరతలామలకము చేసినాడు.

## 42. సరళ మార్గము

గీతను వైదికధర్మసార మందురు. వైదికధర్మమనగా వేదములనుండి వెలువడిన ధర్మము. ప్రపంచములో వ్రాయబడిన ప్రాచీన గ్రంథములలోనెల్ల అతిప్రాచీనములు వేదములు. ఇందువలననే విశ్వాసశీలురు వీనిని అనాది గ్రంథ ములని నమ్మెదురు. తత్ఫలముగ వేదములు పూజ్యతను పొందినవి. ఐతిహాసిక దృష్టితో చూచినప్పటికిని అవి మానవ సమాజముయొక్క ప్రాచీన భావములకు ప్రాచీనతమ చిహ్నములయి యున్నవి. రాగిరేకులు, శిలాశాసనములు, నాణె ములు, పాత్రలు, ప్రాణుల యెముకలు మొదలైనవానికంటెను ఈ లిఖితసాధన ములు చాల మహత్త్వముగలవికదా! ప్రపంచమున మొట్టమొదటి ఐతిహాసిక ప్రమాణము లేవైన నున్నవనిన అవి వేదములే. ఈ వేదములలో బీజరూపముగ నుండిన ధర్మము వృక్షముగ పెరిగిపెరిగి చివరకు గీత యను దివ్య మధుర ఫలము నిచ్చినది. మనము ఫలములను తిందుముకాని చెట్టును తినముకదా! వృక్షమున ఫలములు పండినప్పుడే తినుటకు యోగ్యమైన వస్తువు మన కందు లభించును. వేద ధర్మసారముయొక్క సారమేకదా యీ గీత.

ప్రాచీనకాలమునుండి రూఢమైన ఈ వేదధర్మములో నానావిధ యజ్ఞ తంత్రములు, క్రియాకలాపములు, వివిధ తపశ్చర్యలు, అనేక సాధనలు చెప్ప బడినవి. ఈ కర్మకాండ యంతయు నిరుపయోగము కాకపోయినను దాని నాచ రించుటకు అధికార ముండవలెను. ఆ కర్మకాండ అందరికిని సులభముకాదు. ఎత్తైన నారికేళమునెక్కి బొండము లెవరు కోయుదురు? పీచు నెవరు తీయు దురు? కాయ నెవరు కొట్టుదురు? నే నెంత ఆకటితోనున్నను అంత యెత్తున నున్న టెంకాయ నాకు లభించుటెట్లు? క్రిందినుండి నేను కొబ్బరికాయ వంక

చూచుచో పైనుండి అది నా వంక చూచుచుండును. ఇందువలన నా యాకటి మంట ఎట్లు చల్లారును? నాచేతికి కొబ్బరి చిక్కనంతవరకు అంతయు వ్యర్థము. వేదోక్తములైన ఈ నానాకర్మ కలాపములలోను మిక్కిలి సున్నితములైన భావము లున్నవి. జనసామాన్యమునకు వానిని గూర్చిన జ్ఞానమెట్లు కలుగును? వేదమార్గము వినా మోక్షములేదు. దాని ననుసరించుటకు సామాన్యులకు అధికారములేదు. ఇక వారిగతి యేమికావలెను? అందుచేత కృపాసాగరులైన మహాత్ములు ముందునకు వచ్చి–"రండు మన మీ వేదములనుండి నిగ్గు తీయుదము. వేదసారమును తీసి ప్రపంచమున కందింతము" అని యన్నారు. కావుననే తుకారాము మహారాజు అన్నాడు –

" వేదములు అనంతుని వర్ణించినవి. ఈ యర్థము మాత్రమే ఊహింప దగినది "

ఆ యర్థమేమి? హరినామమే వేదములసారము. రామనామమువలన మోక్షసిద్ధి నిశ్చయము. స్త్రీలు, బిడ్డలు, శూద్రులు, వైశ్యులు, గ్రామీణులు, దీనులు, దుర్బలులు, రోగులు, వికలాంగులు–అందరికిని మోక్షము సులభసాధ్యమైనది. భగవంతుడు వేదములనెడి అలమరలోనున్న మోక్షమును బయటికితీసి అందరికిని అందుబాటులోనికి తెచ్చెను. మోక్షప్రాప్తికి ఇదెంత సూటియైన సులభోపాయము! నిష్కపట జీవితమును గడపువాడు స్వధర్మ కర్మలకును, సేవా కర్మలకును యజ్ఞరూప మెందుల కీయరాదు? ఇట్లు చేసినచో ఇక ఇతర యజ్ఞములతోడి అవసర మే మున్నది? నీ నిత్యనిష్కపట సేవాకర్మలను యజ్ఞ భావముతో చేయుము. ఇదే రాజమార్గము.

యా నాస్థాయనరో రాజన్ న ప్రమాద్యేత కర్హిచిత్
ధావ న్నిమీల్యవా నేత్రే నస్ఖలేన్న పతేదిహ.

ఈ రాజమార్గమున కన్నుమూసికొని పరుగెత్తి నప్పటికిని పడిపోదుమని గాని లేక ఎదురుదెబ్బ తగులు ననిగాని భయములేదు. ఇక రెండవది యగు వైదికమార్గము "క్షురస్యధారా నిశితా దురత్యయా" వంటిది. కత్తివాయియైనను కొంత బండపాఱవచ్చును. కాని యీవైదికమార్గము మిగుల నిశితమై దుర్గమమై యుండును. రాముని దాసుడై యుంట అధిక సులభము. ఇంజనీరు రోడ్డుయొక్క యెత్తును కొలదికొలదిగ పెంచుచు మనలను తీసికొనివెళ్ళి ఎత్తైన శిఖరమునకు చేర్చును. అందువలన ఇంతయెత్తునకు ఎక్కుచున్నా మనియే అనిపించదు. ఇంజనీరు చూపు నేర్పరితనము వంటిదే ఈ రాజమార్గముయొక్క ప్రాశస్త్యముకూడ.

మనుష్యుడు తాను కర్మనాచరించుచున్న చోటనే, ఆ సరళమైన కర్మద్వారానే పరమాత్మను పొందగలడు. ఈ మార్గమిట్టిది.

పరమేశ్వరు డెక్కడనైనను దాగి కూర్చున్నాడా? ఏగుహలోనో, ఏ సందులోనో, నదిలోనో, స్వర్గములోనో అతడు మరుగుపడి యున్నాడా? రత్నములు, మణులు, వెండి బంగారములు భూగర్భములో దాగియుండును. ముత్యములు, పగడములు, రత్నములు సముద్రములో దాగియుండును. అట్లే పరమేశ్వరుడను పద్మరాగము ఎక్కడనైనను దాగియున్నదా? భగవంతుని ఎక్కడనుండియో త్రవ్వి బయటికి తీయనక్కరలేదు. అత డెల్లప్పుడును అందఱ యెదుటను, అన్ని తావులను వ్యాపించియున్నాడు. మానవులందరును పరమాత్మయొక్క మూర్తులే. "ఈ మానవ రూపములో ప్రకటితమగు హరిమూర్తిని అవమానింపకుము." అని భగవంతు డనును. ఈశ్వరుడే సమస్త చరాచరములలోను వ్యక్తమగుచున్నాడు. ఇట్టి భగవంతుని అన్వేషించుటకు కృత్రిమోపాయములతో పనియేమి? సరళమైన ఉపాయము ఉండనేయున్నది. నీవు చేయు సేవాకార్యము లన్నిటికిని భగవంతునితో సంబంధము కూర్చితివా చాలు. నీవు రాముని బంటువై పొమ్ము! ఆ కఠినమైన వేదమార్గము, ఆ యజ్ఞము. ఆ 'స్వాహా', ఆ 'స్వధా', ఆ శ్రాద్ధము, ఆ తర్పణము – ఇవన్నియు మనలను మోక్షము వైపునకు తీసికొనిపోవును. కాని ఇందులో అధికారియా, అనధికారియా అను చిక్కు వచ్చును. మనకు దానితో పనియేలేదు. నీవు చేయునదంతయు ఈశ్వరార్పణము చేయుము. అంతే. నీ ప్రతి పనికిని ఈశ్వరునితో సంబంధము కలుపుము. ఇదే తొమ్మిదవ అధ్యాయమిచ్చు శిక్షణ. కావుననే ఇది భక్తులకు చాల ప్రియమైనది.

## 43. అధికారి యగునా, కాడా యను తగవు లేదు

కృష్ణుని జీవితమందెల్ల అతని బాల్యమే అతి మధురమైనది. బాలకృష్ణునే అధికముగ ఉపాసించుచుందురు. అతడు యాదవ బాలురతోపాటు గోవులను మేపుచు, వారితోపాటు తినుచు, త్రాగుచు, ఆడుచు పాడుచు ఉండువాడు. యాదవబాలురు ఇంద్రుని పూజింపబోయినపుడు కృష్ణుడు వారితో నిట్లనెను :– "ఇంద్రుని ఎవరుచూచిరి? అతడు మనకుచేసినయుపకారముమాత్రమేమున్నది? కాని ఈ గోవర్ధన పర్వతము ప్రత్యక్షముగ మన కగపడుచున్నది. ఇక్కడ ఆవులు మేయుచున్నవి. ఇందుండి మంచినీటి సెలయేళ్ళు పుట్టుచున్నవి. కాన మీ రీ పర్వతమును పూజింపుడు." ఇట్టి విషయముల నతడు వారికి బోధించువాడు. తనతోకలసి యాడుకొన్న గోపాలురకును, నవ్వుచు, పలుకుచు నుండిన

గోపికలకును, తన కానందమిచ్చిన ఆవులకును దూడలకును—ఈ యందఱకును అతడు మోక్షద్వారమును తెరచివేసెను. కృష్ణపరమాత్మ స్వానుభవముద్వారా ఈ సరళమార్గమును సూచించెను. బాల్యమం దతనికి ఆవులతోను దూడలతోను, పెద్దవాడయిన తరువాత గుఱ్ఱములతోను సంబంధము కలిగెను. మురళీగానము వినబడగనే అవి గద్గదము లయ్యెడివి. అతడు చేతితో నిమిరినంతనే గుఱ్ఱములు సకిలించెడివి. ఆ యావులును దూడలును రథాశ్వములును కేవలము కృష్ణ మయములై పోయెడివి. పాపయోను లనబడు ఆ పశుగణములకు కూడ మోక్షము లభించినట్లే. మోక్షమున కధికారము ఒక్క మానవులకే కాక పశు పక్షులకు గూడ ఉన్నదని శ్రీ కృష్ణుడు స్పష్టపరచెను. తన జీవితములో తానీ యనుభవమునే పొందెను.

కృష్ణభగవానుని యనుభవమే వ్యాసునిదికూడ. ఇరువురును ఒకశ్రేణికే చెందినవారు. ఉభయుల జీవిత సారమును ఒకటే. మోక్షప్రాప్తి విద్వత్తపైగాని, కర్మకలాపముమీదగాని ఆధారపడియుండదు. దానికి సరళమైన భక్తియే చాలును. "నేను—నేను" అని గర్వించు జ్ఞానులను వెనుకకునెట్టి భక్తిపూరిత లైన అమాయిక స్త్రీలు ముందునకు పోవుదురు. మనస్సును, భావనయు పవిత్రములైనచో మోక్షము దుర్లభముకాదు. మహాభారతములో 'జనక సులభాసంవాద'మను ఒక ప్రకరణమున్నది. అందు జనక మహారాజు జ్ఞాన ప్రాప్తికొఱకు ఒక స్త్రీయొద్దకు వెళ్ళెను. స్త్రీలకు వేదాధికారమున్నదా లేదా యని మీ రిక్కడ చర్చించుచు కూర్చుండగా సులభ అక్కడ జనకునికి ప్రత్యక్షముగ బ్రహ్మవిద్య నేర్పుచున్నది! ఆమె వట్టి సామాన్య స్త్రీ. జనకు డెంత మహాసమ్రాట్టు! ఎంత విద్యాసంపన్నుడు! అయినను ఆ మహాజ్ఞానికి మోక్షము చేజిక్కలేదు. కాన వ్యాసదేవు డతనిని సులభ పాదములపై బడుమని చెప్పి పంపెను. వైశ్యతులాధరుని విషయమును ఇట్టిదే. జాజలియను బ్రాహ్మణుడు జ్ఞానసంపాదనకొఱకు ఈ వైశ్యునియొద్దకు పోయెను. తులాధరు డిట్లన్నాడు :— "ఎవరు వచ్చినను సరే, ఈ తరాజుదండెను మ్రొగ్గులేకుండ సమముగ పట్టవలె. నాకు తెలిసినదంతయు నిదే." ఇట్టిదే ధర్మవ్యాధుని కథ కూడ. వ్యాధుడు కసాయివాడు. మాంసవిక్రయముచేసి అతడు సమాజసేవ చేయువాడు. అహంకారపూరితుడైన ఒక బ్రాహ్మణతపస్విని అతని గురువు ధర్మవ్యాధు నొద్దకు వెళ్ళు మనెను. కసాయివాడు తనకేమి నేర్పగలడని బ్రాహ్మణు డాశ్చర్యపడుచునే వ్యాధుని యొద్దకు వెళ్ళెను. అప్పుడు వ్యాధు

డేమిచేయుచుండెను ? మాంసమునుకోసి, శుభ్రముగ కడిగి అమ్మకమునకై అమర్చుచుండెను. అతడు బ్రాహ్మణునితో ఇట్లనెను:- "ఇదిగో చూడుము, నేనీ పనిని చేయగలిగినంత ధర్మయుతముగ చేయుచున్నాను. చేతనైనంతగ వాయాత్మ నిందు చొప్పించి ఈ పనిచేయుచు నా తల్లిదండ్రుల సేవ చేయుచున్నాను." ఇట్టివ్యాధుని రూపములో వ్యాసదేవుడొక ఆదర్శమూర్తిని చిత్రించెను.

మోక్షద్వారము ఎల్లరకును తెఱవబడి యున్నదని లోకమున కెఱుక చేయుటయే మహాభారతములోని ఈ స్త్రీ, వైశ్య, శూద్రాది కథల యుద్దేశము. ఆ కథలలోని తత్త్వమునే ఈ తొమ్మిదవ యధ్యాయము చెప్పుచున్నది. ఈ యధ్యాయము ఆ కథలమీద ముద్రవేయుచున్నది. రామునిసేవకుడై యుండుటలో నున్నరుచియే వ్యాధుని జీవితములో కనబడుచున్నది. భక్తతుకారాము అహింసోపాసకుడైనను, సజ్జనుడైన ఈ కసాయి మాంసవిక్రయము చేయుచునే మోక్షము పొందినాడని గొప్పగ శ్లాఘించెను. తుకారాము ఒక సందర్భములో "ఓ యీశ్వరా, పశువధచేయుహారిగతి యేమికానున్నదో!" అని ప్రశ్నించెను. కాని అతడే మరియొకచోట సజ్జనుడైన కసాయికి మాంస మమ్ముటలో సాయపడిన భగవంతుని కొనియాడెను. నరసీమోహతా హుండీకి ధనమిచ్చి, ఏకనాథునికై కావడిమోసి, దామాజీకి చెప్పులు కుట్టుటలో తోడ్పడి, పూజ్యురాలగు జనాబాయికి ధాన్యము దంపుటలో సహాయపడిన భగవంతుడే సజ్జనుడైన ఈ కసాయికిగూడ అట్టి ప్రేమతోనే తోడ్పడెనని తుకారామన్నాడు. నీ పనులన్నిటిని పరమేశ్వరప్రీతికొఱకే చేయవలయుననుట దీని సారాంశము. కర్మ పరిశుద్ధ భావనతో నిండి సేవామయమైనచో అది యజ్ఞరూపము తాల్చును.

## 44. కర్మఫలమును భగవంతుని కర్పింపుము

తొమ్మిదవ అధ్యాయములో ఈ ప్రత్యేకవిషయమే చెప్పబడినది. దీనిలో కర్మ భక్తియోగములయొక్క మధుర సంయోగమున్నది. కర్మయోగమనగా కర్మనాచరించుట, కర్మఫలమును త్యజించుట. ఫలవాసన చిత్తమునకు అంటనంతబాగుగ కర్మ నాచరింపుము. ఇది అక్రోట్‌చెట్టును నాటుటవంటిది. అక్రోట్ చెట్టు ఇరువదియైదు సంవత్సరములు గడచినమీదట ఫలించును. చెట్టు నాటువానికి తనజీవితములో దానిఫలమును అనుభవించు అవకాశమే లేకపోవచ్చును. అయినను చెట్టును నాటవలెను. దానికి భక్తిశ్రద్ధలతో నీరుపోయవలెను. కర్మయోగమనగా చెట్టునాటుట, ఫలమునందు కోరిక పెట్టుకొనకుండుట. ఇక భక్తి

యోగమని దేనినందుము? నిండుహృదయముతో ఈశ్వరునితో కలిసిపోవుటయే భక్తియోగము. రాజయోగములో కర్మయోగ భక్తియోగములు రెండును ఏకమగును. రాజయోగమునకు అనేకులు అనేక వ్యాఖ్యానములుచేసిరి. కాని రాజయోగమనగా కర్మ భక్తియోగముల మధుర సంయోగమని నా సంక్షిప్త వ్యాఖ్యానము.

మనము కర్మ నాచరింతము; కాని కర్మఫలమును వదలివేయకుండ దానిని పరమాత్మకు నర్పింతము. ఫలమును వదలివేయుచో దానిని నిషేధించినట్లగును; కాని అర్పణలో నిషేధములేదు. ఇదెంత మంచి పద్ధతి! దీనిలో చాల మాధుర్యమున్నది. ఫలమును వదలిపెట్టుట యనగా మనుష్యుడు ఫలమును అనుభవింపడని కాదు. ఎవరో ఒకరు ఆ ఫలమును అవశ్యముగ పొందుదురు. ఎవరికో యొకరికి అది లభించియే తీరును. కాని ఈ ఫలము ననుభవించువాడు అందుల కధికారి యగునా కాడా యను తర్జన భర్జనలు బయలుదేరవచ్చును. బిచ్చగాడు గుమ్మములోనికి రాగానే–"బలిసియున్నావు. బిచ్చమెత్తుట నీకు తగిన పని కాదు. వెళ్ళిపో!" అని నిర్దాక్షిణ్యముగా అందుము. అతడు బిచ్చమెత్తుట ఉచితమగునా కాదా యను తర్కమును లేవదీయుదుము. పాప మా భిక్షుకుడు సిగ్గుపడి వెళ్ళిపోవును. మన హృదయమునం దతనిపట్ల సహానుభూతి పూర్తిగ లోపించినపుడు బిచ్చమెత్తువాని యోగ్యతను మన మెట్లు నిర్ణయింపగలము! నా చిన్నతనములో ఒకసారి బిచ్చగాండ్రనుగూర్చి ఇట్టి సంశయమునే మా తల్లితో వెలిపుచ్చితిని. ఆమె యిచ్చిన జవా బిప్పటివరకును నా చెవులలో ప్రతిధ్వనించుచునేయున్నది. "ఈ బిచ్చగాడు బలిష్ఠుడుగ నున్నాడు, భిక్షము పెట్టినచో ఈ దురభ్యాసము, సోమరితనము మరింత పెరుగవా?" అని నే నామెను ప్రశ్నించితిని. "దేశే కాలేచపాత్రేచ" అను గీతాశ్లోకమునుగూడ ఆమెకు వినిపించితిని. ఆమె యిట్లన్నది–"ఇంటికివచ్చిన బిచ్చగాడు పరమేశ్వరుడే, ఇప్పుడు చెప్పుము, వాడు పాత్రుడో అపాత్రుడో! భగవంతునే అపాత్రుడందుమా? వీడు పాత్రుడు, వీ డపాత్రుడు అనుటకు నీకును నాకును ఏమి యధికారమున్నది? అందువలన దీనినిగూర్చి తర్కించు అవసరమే నా కగపడదు. నా దృష్టిలో అతడు భగవంతుడే." మా తల్లి చెప్పిన దానికి తగిన సమాధానమేదియు ఇంతవరకు నాకు స్ఫురించలేదు.

పరాయివానికి భోజనము పెట్టునపుడు పాత్రాపాత్ర విచారణ చేయుచుందుము. కాని మనపొట్టకు తినునప్పుడుమాత్రము ఈ తిండకి మన కధికార

మున్నదా యను ఆలోచనయే రాదు. గుమ్మమునొద్దకు వచ్చిన బిచ్చగానిని వట్టి దిక్కుమాలినవాడని ఎందుల కనుకోవలె? భిక్షుకుడు కేవలము భగవంతుడే యని ఎందుల కనుకొనరాదు? రాజయోగము ఇట్లనుచున్నది:—"కర్మఫలము ఎవనికో యొకనికి లభింపవలసినదేకదా! కనుక దానిని భగవంతునికే యర్పింపుము." నీ యర్పణకు తగిన స్థానమును రాజయోగము నీకు చూపుచుండును. ఫలేచ్ఛను వదలుట యను నిషేధాత్మకక్రియకూడ ఇక్కడలేదు. సర్వమును భగవంతునికర్పించుటయే కనుక పాత్రాపాత్రలనుగూర్చిన సమస్యకూడ తీరిపోవును. భగవంతుని కిచ్చిన దాన మెప్పుడును పరిశుద్ధమే. నీ కర్మలో దోష మున్నప్పటికిని ఆయన చేతులలో పడగానే అది పవిత్రమైపోవును. దోషములను దూరముచేయుటకు మనమెంత ప్రయత్నించినను కొంత దోషము ఉండనే యుండును. అయినప్పటికిని ఎంత పవిత్రహృదయముతో కర్మ చేయవలెనో అంత పవిత్రహృదయముతో దానిని చేయుట అవసరమే! బుద్ధి ఈశ్వరప్రసాదము. చేతనైనంత పరిశుద్ధరూపములో దానిని వినియోగించుకొనుట మన కవశ్యకర్తవ్యము. అట్లు చేయకపోవుట అపరాధమగును. కాన పాత్రాపాత్ర వివేచనకూడ చేయవలసినదే; కాని భగవద్భావముతో చేసిన అది సులువగును.

చిత్తశుద్ధికొఱకే ఫలమును మనము వినియోగింపవలె. జరిగెడుపని జరుగుచునే భగవదర్పితముకావలె. తన్మూలమున మానసిక తృప్తి లభించుచుండవలె. ఫలమును వదలరాదు. దానిని భగవంతుని కర్పించవలె. 'నా కామక్రోధములను ఈశ్వరున కర్పింతును' అనగా నేమి? మనసులో పుట్టు వాసనలను, కామక్రోధాది వికారములనుకూడ ఈశ్వరార్పణముచేసి బంధవిముక్తులముకావలె.

ఇక్కడ ఎవ్వరును సంయమాగ్నిలో దగ్ధము కానక్కరలేదు; ఎప్పటిదప్పుడు అర్పణచేసివేసి విముక్తిని పొందుటయే చాలును. ఏ యింద్రియమునేవి ఒత్తిడిపెట్ట నక్కరలేదు, హింసింప నక్కరలేదు.

'పాలుపంచదారలతో రోగము శమించుచుండగా చేదైన వేపాకురసము
నేల త్రాగవలెను.'

ఇంద్రియములు సాధనమాత్రములే. వానిని ఈశ్వరార్పణ చేయుము. చెవియున్నదనిన అసలు వినకుండ ఉండుటకా? కాదు. తప్పకుండ విను, కాని హరికథలు విను. అసలు వినకుండ నుండుట కష్టము. కాని హరికథలవంటి సద్విషయములకు చెవుల నుపయోగించుట చాల సులభము, మధురము, హితకరము. నీ చెవులను రాముని కర్పింపుము. నోటితో రామనామమును స్మరించు

చుండుము. ఇంద్రియములు శత్రువులు కావు. అవి చాల మంచివి. వాని శక్తి యపారము. కనుక ఈశ్వరార్పణ బుద్ధితో ప్రతీంద్రియమును ఉపయోగించుటయే రాజమార్గము. ఇదే రాజయోగము.

## 45. విశిష్టక్రియలనే అర్పించవలెనను పట్టుదల వలదు

భగవంతునికి విశిష్టక్రియలనే అర్పించవలెనని తలంపకు. పనులన్నిటిని ఆయన కర్పింపుము. శబరితెచ్చిన సామాన్యఫలములను రాముడెంత ప్రేమతో స్వీకరించినాడు! పరమేశ్వరుని పూజించుటకు గుహలోనికి పోనక్కరలేదు. నీ వెక్కడ ఏ పనినిచేసినను దానిని దేవుని కర్పింపుము. తల్లి, భగవంతునే సాకుచున్నదా యన్నట్లు తన బిడ్డను జాగరూకతతో పెంచుచుండును. బిడ్డకు స్నానముచేయించుట యనగా దేవునికి రుద్రాభిషేకము చేయుచున్నట్లే! బిడ్డను పరమేశ్వరుని ప్రసాదముగ భావించి, వానిని దైవస్వరూపముగ నెంచి తల్లి పోషింపవలె. కౌసల్య రాముని, యశోద కృష్ణుని ఎంత ప్రేమాతిశయముతో పోషించి పెంచిరి! దీనిని వర్ణించుచు శుకుడు, వాల్మీకి, తులసీదాసు తాము తరించినట్లు భావించిరి. ఆ వర్ణనలో వారు అపారమైన ఆనందమును పొందిరి. బిడ్డలకు తల్లి చేయుసేవ చాల గొప్పది. భగవత్స్వరూపుడైన పిల్లవానిసేవకంటె మహాభాగ్యము మరేముండును? ఇతరులకు చేయుసేవ ఈ భావనతోనే చేసిన యెడల దానిరూప మెంతగా మారిపోవును! ఎవరి కే సేవ లభించినను దానినే ఈశ్వరసేవగా భావించుచుండవలెను.

రైతు ఎద్దునకు సేవచేయును. అట్టి యెద్దును తుచ్ఛముగ భావింప వచ్చునా? భావింపరాదు. వేదములలో వామదేవుడు ఎద్దును శక్తిరూపముగ వర్ణించినాడు. విశ్వవ్యాప్తమైన ఆ వృషభరూపమే యీ యెద్దుకూడ.

> చత్వారి శృంగా త్రయో అస్యపాదా । ద్వేశీర్షే సప్తహస్తాసో అస్య
> త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాం ఆవివేశ.

నాలుగుకొమ్ములు, మూడుపాదములు, రెండుతలలు, ఏడు చేతులును కలిగి, మూడుచోట్ల బంధింపబడి మహాతేజస్వియై మర్త్యలోకమంతయు వ్యాపించి గర్జించు ఆ విశ్వవ్యాప్త వృషభము యొక్క పూజయే రైతుచేయును. టీకాకారులు ఈ వేదమంత్రమునకు అయిచారు విధములుగ వ్యాఖ్యానము చేసినారు. ఈ యెద్దు బహువిచిత్రమైనది కూడ! ఆకాశములో గర్జించుచు వర్షమును కురియించు ఆ వృషభమువే మలమూత్రములతో పొలములో పంటలు

వండించు తన యెద్దులో రైతు దర్శించుచున్నాడు. కృషికుడు తన పశు గణమునకు ఇట్టియున్నత భావముతో సేవ చేసినచో ఈ సామాన్యసేవ కూడ ఈశ్వరార్పితమగును.

ఈ విధముగనే ఇంటిలోని గృహలక్ష్మి వంటయిల్లలికి. ముగ్గుపెట్టి, పొయ్యి వెలిగించి శుభ్రమైన సాత్త్వికాహారమును అమర్చి, అది యింటిలోని వారందరికిని పుష్టి, తుష్టి యీయవలెనను కోరికతో చేయు పనియంతయు యజ్ఞ రూపమే. పొయ్యి వెలిగించుటయనగా ఇల్లాలు కొంచెములో యజ్ఞాగ్నిని వెలిగించినట్లే. ఈశ్వరప్రీత్యర్థము సిద్ధముచేయబడిన భోజనపదార్థము ఎంత శుభ్రముగను పవిత్రముగను ఉండునో ఊహించుకొనుడు. ఆ గృహలక్ష్మి హృదయములో నిట్టి సద్భావనయే యుండినచో ఆమెను భాగవతములోని ఋషి పత్నులతో పోల్చవచ్చును. ఇట్టి సేవచేసి ఎందరుతల్లులు తరించియుందురో! ఇక "నేను నేను" అని అహంకారపడు పండితులు, జ్ఞానులు ఎందరు మూలబడి పోయిరో!

## 46. జీవితమంతయు హరిమయము కాగలదు

మన క్షణక్షణజీవితము పైకి సాధారణముగ కనబడుచున్నను నిజమున కట్లుకాదు. అందులో గొప్ప అర్థమున్నది. జీవితమంతయు ఒక మహాయజ్ఞకర్మ. నీ నిద్రకూడ ఒక సమాధియే. భోగానుభవముల నన్నిటిని ఈశ్వరార్పణముచేసి పోవునిద్ర సమాధికాక మరియేమి? మనదేశములో స్నానముచేయుచు పురుష సూక్తమును పఠించు ఆచారము కలదు. స్నానమునకును పురుషసూక్తమునకును సంబంధమేమున్నది? వేయిచేతులు వేయికన్నులుగల ఆ విరాట్పురుషునకును నీ స్నానమునకును ఏమిసంబంధము? పరీక్షింపదలచినచో ఈ సంబంధము తెలియకపోదు. నీ తలమీద పోసికొను ప్రతి చెంబెడు నీటిలో వేయిబిందువులున్నవి. ఆ బిందువులు నీ శిరస్సును కడిగి నిన్ను నిష్పాపుని చేయుచున్నవి. పరమేశ్వరుని సహస్రహస్తములనుండి సహస్రధారలు నీపై వర్షించి నిన్నాశీర్వదించుచున్న వన్నమాట. ఈ బిందువులద్వారా పరమేశ్వరుడే నీ శిరస్సులోని మాలిన్యమును కడిగివేయుచున్నాడని భావింపుము. ఆ స్నానములో నిట్టి దివ్యభావనను చొప్పింపుము. అప్పుడా స్నానముయొక్క రూపమే మారిపోవును; దానికి అనంతశక్తి కలుగును.

ఎంత సామాన్యకర్మమైనను పరమేశ్వరునిదే యన్న భావనతో చేసినచో అది పవిత్రకర్మయగును. ఇది అనుభవ సిద్ధము. ఇంటికి వచ్చిన అతిథి

భగవత్స్వరూపుడని మనసాభావనచేసి చూడుము. సామాన్యముగ ఇంటికెవరైన పెద్దలు వచ్చుచున్నారనిన మనము ఇల్లు వాకిలి ఎంతో శుభ్రము చేయుదుము. ఎంతో మంచిమంచి భోజనపదార్థములు తయారుచేయుదుము. ఇక వచ్చిన యతిథి పరమేశ్వరుడే యనుకొన్నచో ఆభావనతో ఎంతమార్పు వచ్చును! కబీరు బట్టలునేయువాడు. అతడు

'మిక్కిలి సున్నితమైన పోగులతో ఈ వస్త్రమును నేయుచున్నాను'

అని పాడుకొనుచు నేతలో నిమగ్నుడై యుండువాడు. ఈశ్వరునికే ఈ వస్త్రము నేయుచున్నానని భావించువాడు. ఋగ్వేదఋషి "వస్త్రేవ భద్రా సుకృతా సుపాణి" అని అన్నాడు. సుందరహస్తములతో నేయబడ్డ వస్త్రమును కట్టబెట్టినట్లు ఈ నా స్తోత్రమును భగవంతునికి అర్పించుచున్నాను. కవి వ్రాయు స్తోత్రములు ఈశ్వరుని కొఱకే. అట్లే నేతగాడు వస్త్రములు నేయుటకూడ ఈశ్వరుని కొఱకే. ఎట్టి హృదయంగమమైన కల్పన యిది! చిత్తశుద్ధి కలుగజేసి హృదయము నెంతగా కదలించు భావన యిది! లోపల ఒక్కసారి యీ భావన ప్రవేశించినచో జీవిత మెంత నిర్మలమగును! చీకటిలో మెఱపు మెఱసినప్పుడు అంధకార మొక్కక్షణములో ప్రకాశముగ మారును. అంధకార మెపుడైన మెల్ల మెల్లగ వెలుగుగా మారునా? మారదు. క్షణమాత్రములో దాని బహిరంతరములు పూర్తిగ పరివర్తనము చెందును. ఆ విధముగనే ప్రతికార్యమును ఈశ్వరునితో జోడించుటవలననే జీవితమున నొక్కసారిగ అద్భుతమైన శక్తి, ఉత్సాహము ప్రవేశించును. ప్రతికార్యమును పరిశుద్ధమగును. నేడు మన జీవితములో ఆ యుత్సాహమేది? మనము మరణించలేదు కనుక బ్రతికియున్నట్లు భావించు కొను చున్నారము. నేడు మన ఉత్సాహమునకు నలుదిశలను కఱవు వచ్చినది. జీవితము కళారహితము శోకభూయిష్ఠము అయినది. కాని నీ సమస్త కార్యములను ఈశ్వరునితో జోడించవలెనని మనసార భావింపుము. అపుడు నీ జీవితమెంత రమణీయము పూజనీయము కాగలదో నీకే తెలియగలదు.

పరమేశ్వరుని స్మరించినంతనే పరివర్తనము కలుగును. ఇందు సందేహములేదు. "రామా, రామా" యన్న మాత్రమున నేమగునని యనకుము. ఒకసారి అనిచూడుము. సంధ్యా సమయమున రైతు పనిముగించుకొని ఇంటికి వచ్చుచున్నా డనుకొనుము. దారిలో నొక బాటసారి యతని కంటబడును.

"అన్నా, ఓ నారాయణా, కొంచెము ఆగుము. రాత్రి వచ్చుచున్నది. మా యింటికిరా నాయనా!" అని రైతు అనును. ఈ మాట వినినతోడనే యాత్రికుని

ముఖవై ఖరి మారునో లేదో చూడుము. ఆ యాత్రికుడు దొంగయైనను, దోపిడి గాడైనను కూడ పవిత్రుడగును. ఈ మార్పు భావన వలననే కలుగును. భావనలో నెంతశక్తియైనను కలదు. జీవితమే భావనామయము. ఇరువదేండ్ల పరాయి కుఱ్ఱవాడు ఒక యింటికి వచ్చును. ఇంటి యజమానుడు తనకొమార్తె నతనికిచ్చి వివాహము చేయును. కుఱ్ఱవాని కిరువదియేండ్లే. కాని యేబదియేండ్ల కన్యాదాత అతని పాదములు కడుగును. ఇదేమివింత! కన్యాదాన మెంత పవిత్రమైనది. వరుడు పరమేశ్వర స్వరూపుడనియే అతని భావన. జామాతయెడలచూపు ఈ భావననే మరింత పెంచుకొనుచు ముందునకుపొమ్ము.

ఇట్టి అసత్య భావనలవలన ప్రయోజన మేమని ఎవరైన అనవచ్చును. మొదటనే సత్యాసత్యముల తర్కములో దిగవలదు. ముందు అభ్యాసముచేసి అనుభవమును పొందుము. సత్యాసత్యములు అప్పుడు నీకు తెలియును. ఆ కన్యాదాన విషయములో జామాత నిశ్చయముగ పరమేశ్వరుడే యని మాటవరుసకు గాక నిజముగ భావింపుము. అప్పుడు ఎంత వ్యత్యాసము కనబడునో నీవే చూడగలవు. ఈ పవిత్ర భావనా ప్రభావముచేత వస్తువుల పూర్వరూపమునకును ఉత్తర రూపమునకును భూమ్యాకాశముల మధ్య నున్నంత అంతర మేర్పడును. అపాత్రుడు పాత్రుడగును. దుష్టుడు శిష్టుడగును. భిల్లుడైన వాల్మీకి జీవితము నందలి పరివర్తన యిట్టిదేకదా! నారదుని వ్రేళ్ళు వీణ మీటుచునే యున్నవి. నోట నారాయణ నామము జపింపబడుచునే యున్నది. అస్థితిలో ఈ భిల్లు డతనిని చంపుటకు పరుగెత్తును. కాని నారదుని శాంతికి భంగము కలుగలేదు సరికదా, అతడు ప్రేమపూర్ణమైన దృష్టితో భిల్లునివంక చూచును. వాల్మీకి యిట్టి దృశ్యమును ఇంతకు పూర్వ మెన్నడును చూచియుండలేదు. ఆ క్షణము వరకును అతడు రెండురకముల ప్రాణులనే చూచియుండెను – తన విల్లును అమ్ములను చూచి బెదరిపారిపోవు రకమొకటి, ఎదురుతిరిగి డీకొను రకమొకటి. ఇప్పుడు నారదు డతనిని చూచి పారిపోలేదు, డీకొననులేదు. శాంతభావముతో అట్లే నిలబడెను. వాల్మీకి బాణము నిలిచిపోయెను. నారదుని కనుబొమలు కదలలేదు, రెప్పవాలలేదు. మధురముగ భజన నడుచుచునే యున్నది. "నీబాణమట్లు నిలిచిపోయినదేమి?" అని నారదు డడిగెను. "మీ శాంతభావముచూచి" అన్నాడు వాల్మీకి. నారదు డట్లు వాల్మీకిని మార్చి వేసెను. ఈ పరివర్తనము అబద్ధమా? నిజమా?

ప్రపంచములో దుష్టుడు ఉన్నాడా లేడా యను నిర్ణయము నెవరుచేయ గలరు? నిజముగ దుష్టుడే యెదుటికి వచ్చినను వానిని పరమాత్మస్వరూపునిగ భావింపుము. వాడు దుష్టుడేయైనను మహాత్ముడై పోవును. ఇది దుష్టభావనయా? వాడు దుష్టుడేయని మాత్రమెవరు చెప్పగలరు? "సజ్జనులు సహజముగ మంచివారు కనుక వారి కంతయు మంచిదిగనే కనబడును. కాని వాస్తవమున కది నిజమా?" అని నీ వనవచ్చును. నీ నిర్ణయము మాత్రము సమంజసమని నిర్ధారణయేమి? సృష్టిని సాంగోపాంగముగ చూడగల సాధనసామగ్రి కేవలము సజ్జనులు కాని వారియొద్దనే యున్నట్లా? "సృష్టిమంచిదే. నీవు దుష్టుడవు కనుక నీ కంతయు చెడ్డదిగా కనబడును" అని యెందులకనరాదు? విషయ మిది : సృష్టి యొక అద్దమువంటిది. నీ వెట్టివాడవో ఎదుటిసృష్టిలో నీ ప్రతి బింబము అట్లే కనబడుచుండును. మనదృష్టి యెట్టిదో సృష్టియొక్క రూపమును అట్టిదే. ఇందుచేత ఈ సృష్టి మంచిదని, పవిత్రమని భావింపుము. నీ నిత్య కృత్యములలో కూడ ఇట్టి భావననే ప్రసరింపజేసి అందలి చమత్కారమును చూడుము.

భగవంతు డీ విషయమునే తెలియజెప్పుచున్నాడు—

"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం" — గీత.

నీవుచేయున దంతయు ఉన్నదునట్లు భగవంతుని కర్పింపుము. నా బాల్య ములో మా యమ్మ ఒక కథ చెప్పుచుండెడిది. కథ చమత్కారముగ నున్నను అందలిసారము అమూల్యమైనది. ఒక స్త్రీ యుండెడిది. తాను చేయున దంతయు కృష్ణార్పణము చేయవలెనని ఆమె నిశ్చయము. వంటయిల్లు అలుకగా మిగిలినపేడను మట్టిని ముద్దచేసి బయట పారవేయుచు "కృష్ణార్పణమస్తు!" అనెడిది. వెంటనే ఆ పేడముద్దవెళ్ళి ఆలయములోని భగవంతునిమూర్తి యొక్క ముఖమున అంటుకొనెడిది. పూజారి నిత్యమును విగ్రహమును తోమి కడుగలేక అలసిపోవువాడు. ఏమి చేయుటకును తోచలేదు. చివర కిది ఆ స్త్రీ మహిమయని తెలియవచ్చెను. ఆమె బ్రతికి యున్నంత కాలమును ఆ విగ్రహము శుభ్రపడనేరదని పూజారి తెలిసికొన్నాడు. ఒక రోజున ఆమె జబ్బుపడెను. మరణ మాసన్నమాయెను. మృత్యువును కూడ ఆమె కృష్ణార్పణము చేసినది. తత్క్షణమే ఆలయములోని మూర్తి ముక్కలుముక్కలై పడిపోయెను. ఆ స్త్రీని తీసికొని వెళ్ళుటకు దివినుండి విమానము వచ్చినది. ఆమె విమానమును కూడ

కృష్ణార్పణము చేసెను. విమానముకూడ వెళ్ళి ఆలయమునకు తగులుకొని తుత్తునియలయ్యెను. కృష్ణధ్యానము ముందర స్వర్గము కూడ వట్టి పనికిమాలిన వస్తువయినది.

ఇందలి సారాంశమిది : మనవలన జరుగు మంచిచెడ్డ కర్మలన్నిటిని ఈశ్వరార్పణచేయుటచేత వానిలో మరింత సామర్థ్యము ఉత్పన్నమగును. జొన్న గింజ కొంత పచ్చగాను కొంతయెఱ్ఱగాను ఉండును. కాని ఆ గింజలను మంగలములో వేగించినచో ఎంత చక్కనిపేలాలు తయారగును! తెల్లగా అష్టకోణములు తీరినపేలాలను, జొన్నగింజలను దగ్గరపెట్టి చూడుము — ఎంత వ్యత్యాసము కనబడునో! కాని, అవి యాగింజలలోనుండి వచ్చినవే; సందేహములేదు. ఈ వ్యత్యాసము కేవలము అగ్నివలన కలిగినదే! ఈ విధముగనే గట్టివైన ఆ గింజలను తిరుగటిలో పోసి విసరిన మెత్తనిపిండియగును. అగ్ని సంపర్కమువలన పేలాలైనవి, తిరుగటిలో విసురుటవలన మెత్తనిపిండియైనది. ఇట్లే యెంతచిన్నపనియైనను హరిస్మరణ సంస్కారమువలన నుత్తమోత్తమమగును. భావనవలన విలువపెరుగును. జపాపుష్పములు, మారేడు, తులసీదళములు, గరికపోచలు-వీనిని తేలికగా చూడకుము.

'రామునితో మిశ్రితమైనదంతయు రుచ్యమగును.'

ప్రతివిషయముతోను భగవంతుని జోడించి అనుభవమును పొందుచుండుము. రామునితోకూడిన ఈ సమ్మేళనతో తుల్యమైనది మరేమున్నది? ఈ దివ్యమైన మసాలాను మించినది మరెక్కడ దొరకును? దీనిని నీ ప్రతిపనిలోను చూడగల్గినచో సర్వమును సుందరము, రుచికరము కాగలదు.

రాత్రి ఎనిమిదిగంటలవేళ వాలయములో ధూపసుగంధము వ్యాపించినప్పుడు, జ్యోతులు వెలిగించినప్పుడు, హారతి యిచ్చినప్పుడు, దింపినప్పుడు మనము పరమేశ్వరునే దర్శించుచున్నామని నిజముగ భావింతుము. భగవంతుడు పగలంతయు మేల్కొన్నాడు. ఇప్పుడు నిద్రించుసమయము వచ్చినది. 'ఓ గోపాలా! ఇక నీవు సుఖము నిద్రింపుము' అని భక్తులు గానము చేయుదురు.

కాని శంకాశీలుడు, "ఇదేమివింత! భగవంతుడుకూడ నిద్రపోవునా?" అని ప్రశ్నించును.

అరే! భగవంతుడేమిచేయడు? బలేబాగుగానున్నది! భగవంతుడు కానిచో పాషాణమా నిద్రించునది, మేల్కొనునది? సోదరా, భగవంతుడే నిద్రపోవువాడు,

అతడే మేలుకొనువాడు, అతడే తినువాడు, త్రాగువాడు. తులసీదాసు ప్రాతః కాలమున భగవంతుని నిద్రలేపి 'రామచంద్రా! పక్షులు కిలకిలారావములు గావించుచున్నవి. ఇక నిద్రనుండి మేల్కొనుము.' అని వినతి చేయును.

భక్తులు తమ సోదరీ సోదరులను, ఆత్మీయులను రాముని మూర్తులుగ భావించి "నా రామచంద్రా, ఇక లెమ్ము!" అందురు. ఇదెంత సుందరమైన భావన! ఏదైన నొక విద్యార్థి గృహము (బోర్డింగు) చూడుడు. అక్కడి విద్యార్థులను, "అరే, లేచెదరా, లేవరా?" అని అదలించి లేపుదురు. ప్రాతఃకాలపు శుభ సమయమున నిట్టి కర్ణకఠోర వాణి యేమి బాగుగా నుండును? విశ్వామిత్రుని ఆశ్రమములో రామచంద్రుడు నిద్రించుచుండును. విశ్వామిత్రు డతనిని మేల్కొల్పును. వాల్మీకి రామాయణములో దాని వర్ణన యిట్లున్నది—

"రామేతి మధురాం వాణిం విశ్వామిత్రోఽభ్యభాషత
ఉత్తిష్ఠ నరశార్దూల పూర్వా సంధ్యా ప్రవర్తతే॥"

నాయనా, "రామా! ఇకలెమ్ము!" ఇట్టి మధురస్వరములో విశ్వామిత్రు డతనిని మేల్కొల్పును. ఎంత మధురమైన దీ పని! ఆ బోర్డింగుపిల్లలను లేపుట యెంతకఠోరముగనుండును! ఏడుజన్మలనాటి శత్రువే వచ్చి లేపుచున్నాడని పించును. కనుక పిల్లలను లేపునపుడు మొదట మెల్లగా పిలువుము. తరువాత కొంచెము బిగ్గరగా పిలువవచ్చును. కాని కాఠిన్యము, క్రూరత్వము ఏమాత్ర మును ఉండరాదు. ఒకవేళ పిల్లవాడు లేవకపోయినచో పదినిమిషములు ఆగి మరల లేపుము. ఈ రోజున వేళకు లేవక పోయినను రేపులేచునని ఆశింపుము. వానిని లేపుటకు ఇంపైనపాటలు, మేలుకొలుపులు మొదలైనవి పాడుము. నిద్ర లేపుట యను సామాన్యక్రియనుకూడ భగవంతుని మేల్కొల్పె యన్నట్లు ఎంత కావ్యమయముగా, ప్రేమమయముగా, సుందరముగా చేయవచ్చును! నిద్ర లేపుటకూడ ఒక శాస్త్రమే.

నీ సమస్తవ్యవహారములలోను ఈ భావనను ప్రవేశపెట్టుము. ముఖ్యముగ శిక్షణశాస్త్రములో ఈ భావన కెంతైన అవసరమువున్నది. బిడ్డలనగా నెవరు? ప్రభువుయొక్క మూర్తులే. ఈ దేవతలను సేవించుచున్నానమభావము గురువున కుండవలె. ఇట్టిభావన కలవాడు బిడ్డలను "పో, యింటికిపో! ఒక గంటసేపు విల బడు! చేయిచాపు! ఎంత మురికిబట్టలు, మురికిచేతులు, చీమిడిముక్కు!" అని గద్దింపడు. మీదుమిక్కిలి మెల్లగ తానే వానిముక్కు తుడుచును. చినిగిన గుడ్డ లనుకుట్టి, మురికిగుడ్డల నుతికి శుభ్రపరచును. ఉపాధ్యాయుడిట్లు చేసినచో దీని

పరిణామ మెంతబాగుగానుండును! బిడ్డలను తిట్టుట, కొట్టుటవలన ఏమైన మార్పు తేగలమా ? విద్యార్థులుకూడ నిట్టి దివ్యభావనతోనే గురువును చూడవలె. శిష్యులు హరిమూర్తులని గురువనుకొనవలె. గురువు భగవత్స్వరూపుడే యని శిష్యులుకూడ భావింపవలె. పరస్పర మిట్టిభావన పనిచేసినచో విద్య యెంత తేజ స్వంతము కాగలదు! బిడ్డలును భగవత్స్వరూపులే, గురువుకూడ భగవత్స్వరూపుడే. "ఇతడు గురువుకాడు, శంకరునిమూర్తియే. ఇతని బోధామృతమును మనము గ్రోలుచున్నాము. ఈతని సేవచెసి జ్ఞానోపలబ్ధిని పొందుచున్నాము" అని బిడ్డ లనుకొన్నచో గురువుపట్ల వారి ప్రవర్తన మెంత గొప్పగ నుండును!

## 47. పాపభయము లేదు

ప్రభువు సర్వత్ర విరాజమానుడై యున్నాడనుభావన మనలో నాటుకొన్నచో మనము పరస్పర మెట్లుమెలగవలెనను నీతిశాస్త్రము దానికదే మన అంతఃకరణమున స్ఫురించును. ఇందులకు శాస్త్రములు పఠింపవలసిన అగత్యమేలేదు. అప్పుడు సమస్తదోషములును దూరమైపోవును. పాపములు పలాయనమగును; దురితాంధకారము తొలగిపోవును.

తుకారాము ఇట్లన్నాడు— 'నీవు సంపూర్ణ స్వతంత్రుడవుకమ్ము. ప్రతిక్షణమును హరినామస్మరణగావింపుము. ఇట్లుచేసినచో నిన్ను ఏ పాపమును అంటదు.'

మంచిది! పో! పాపముచేయుటకు నీకు స్వేచ్ఛయున్నది. పాపములు చేసిచేసి నీవే అలసిపోవుదువో, పాపములను దగ్ధము చేయుటలో హరినామమే అలసిపోవునో చూచెదను. ఎంతబలముగల పాపమైనను హరినామమునెదుట గర్వముతో నిలువగలదా ? 'చేయగలిగినన్ని పాపములు చేయుము.' నీకు పూర్ణమైన స్వేచ్ఛయున్నది. హరినామమునకును నీ పాపములకును కుస్తీజరుగనిమ్ము. ఈజన్మలోనివే కాక అనంతజన్మల పాపములను క్షణములో భస్మపటలము చేయగల సామర్థ్యము ఈ హరినామములో నున్నదిసుమా! అంధకారము గుహాంతరాళములో యుగయుగములనుండి నిండియున్నను ఒక నిప్పుపుల్ల వెలిగించగానే పలాయనమైపోవును. చీకటి వెలుగుగా మారును. పాపము లెంత పురాతనములో అంతత్వరలో నవి నాశనమైపోవును. ఏలయనిన అట్లు నశించిపోవుటయే వాని నైజము. ప్రాంకట్టెలు అప్పటికప్పుడే కాలి బూడిదయగును.

రామనామముదగ్గర పాపము నిలువలేదు. 'రామా' యనిన భూతములు పారిపోవునని పిల్లలందురుకదా! మేము బాల్యములో రాత్రివేళ శ్మశానమునకు

వెళ్ళి వచ్చుచుండువారము. దానికి గుర్తుగా అక్కడ మేకులుపాతిరావలె నను నియమము పెట్టుకొనువారము. ఎటుచూచినను అంధకారము, పాములు, ముండ్లుకూడ నుండెడివి. అయినను వానిని మే మేమాత్రమును లెక్కచేయు వారము కాము. భూతములు మా కెన్నడును కనబడనేలేదు. అనుకొనువారికే భూతములుకాని అనుకొననివారి కవి యెట్లు కనబడును? పదేండ్ల కుఱ్ఱవానికి రాత్రులందు శ్మశానమునకు బోయిరాగల సామర్థ్యము ఎక్కడినుండి వచ్చినది? రామనామమునుండి. ఆ సామర్థ్యము సత్యస్వరూపుడైన పరమేశ్వరునిది. పరమాత్మ తనచెంతనే యున్నాడను భావనయున్నచో, ప్రపంచమంతయు తల క్రిందైనను, హరిభక్తుడు భయపడడు. వానిని ఏ రాక్షసి మ్రింగగలదు? రాక్షసి వానిశరీరమును మ్రింగి జీర్ణించుకొన్నను సత్యమును మాత్రము జీర్ణము చేసికో లేదు. సత్యమును జీర్ణించుకోగల శక్తి ప్రపంచమునం దెక్కడనులేదు. ఈశ్వర నామముముందర పాప మెంతమాత్రమును నిలువజాలదు. ఇందుచేత నీ హృదయము నీశ్వరునితో జోడించుము. ఆయన కృపను సంపాదింపుము. అన్ని కర్మలను ఆయన కర్పించి నీ వాతని వాడవై పొమ్ము. నీ సమస్త కర్మలను నైవేద్యముగ ప్రభువున కర్పించవలెనను భావనను క్రమక్రమముగా దృఢపరచుకొన్నచో క్షుద్రమును మలినమును అయిన నీ జీవితము దివ్యమును సుందరమును అగును.

## 48. కొంచెమైనను మధురమే

పత్రం, పుష్పం, ఫలం, తోయం – ఇం దేదైనను భక్తిభరిత మైనచో చాలును. ఎంతగా పూజించినాడవు? ఎంత యిచ్చినాడవు? – అనునది కాదు ప్రశ్న. ఏ భావనతో ఇచ్చినాడ వనునదే ముఖ్యము. ఒకసారి ఒక ప్రొఫెసరుతో శిక్షణ శాస్త్రసంబంధమైన చర్చ వచ్చెను. మా యిద్దరి అభిప్రాయములును కలియలేదు. చివరకు అతడు, "నేను పదునెనిమిదేండ్లనుండి ఈ పని చేయుచున్నాడను తెలియునా?" అన్నాడు. వాదనలో నన్నోడింపవలసినవా డాయన, కాని అట్లుచేయక నే నిన్ని సంవత్సరములనుండి అధ్యాపకత్వము నిర్వహించుచున్నాడ నని పలికినప్పుడు వినోదమునకు నే నిట్లంటిని – "ఎద్దు పదునెనిమిదేండ్లనుండి గానుగను త్రిప్పుచున్నంత మాత్రమున దానికి యంత్రశాస్త్రజ్ఞానమబ్బునా? శాస్త్రజ్ఞానము వేరు; గంతలు కట్టుకొని గానుగ త్రిప్పుట వేరు. అట్లే శిక్షణ శాస్త్రజ్ఞుడు వేరు; శిక్షణ విధానమును గ్రుడ్డిగ ప్రయోగించువాడు వేరు. జీతముకొఱకు పనిచేయువానికి పదునెనిమిది సంవత్సరములలో కూడ

బుద్ధికి పొడకట్టని విషయము శాస్త్రజ్ఞునికి ఆరు మాసములలోనే అనుభవసిద్ధ మగును. ఇంతకాలము తాను పని చేసితినని చెప్పుటకొఱకు ఆ ప్రొఫెసరు తన నెరసిన గడ్డమును నాకు చూపినందువలన ప్రయోజన మేమి? గడ్డము వలన సత్యము ఋజువు కాగలదా? ఈ విధముగనే "పరమేశ్వరుని యెదుట మహా నైవేద్యమును ఎంత పెద్దరాశిగా పోసితిని!" అను దానిలో మహత్త్వములేదు. పేరు, ఆకారము పెట్టిన డబ్బు కాదు లెక్కకు వచ్చునది; భావన ప్రధానము. ఏది, యెంత అర్పించితి ననునది కాదు ప్రశ్న. ఏ భావనతో చేసితి ననునదే ముఖ్యము. గీతలో మొత్తము ఏడువందల శ్లోకము లున్నవి. కాని పదేసివేల శ్లోకములున్న గ్రంథములుకూడ ఉన్నవి. వస్తువుయొక్క ఆకారము పెద్దదై నంతమాత్రమున దాని యుపయోగముకూడ ఎక్కువగ నుండునని చెప్పలేము. వస్తువులోనున్న తేజస్సెంత, సామర్థ్యమెంత? అనియే చూడవలె. జీవితములో మొత్తమెన్ని పనులు చేసితి మనుటలో లేదు గొప్పతనము. ఈశ్వరార్పణబుద్ధితో ఒక్కపని చేసినను, అదొక్కటే మనకు కావలసినంత అనుభవమును లాభమును ఇచ్చును. పంద్రెండేండ్లలోకూడ మనకు కలుగజాలని అనుభవము ఒక్క పవిత్ర క్షణములో కలుగుచుండును.

సారాంశ మేమనగా, నిత్యమునుచేయు సామాన్యకార్యము లన్నిటిని ఈశ్వ రార్పణము చేయుటవలన జీవితమునకు సామర్థ్యము కలుగును. మోక్షము చేజిక్కును. కర్మచేయుచు ఫలమును త్యజింపక దాని నీశ్వరార్పణముచేయుట రాజయోగమగును. ఇది కర్మయోగము కంటెనుగూడ ఒక అడుగు ముందునకు పోవును. "కర్మచేయుము, ఫలమును ఆశింపకుండ వదలిపెట్టుము" అని కర్మ యోగమనును. దీనితో కర్మయోగము ఆగిపోవును. ఇక రాజయోగము చెప్పున దిది — "కర్మ ఫలమును వదలకుండ సమస్త కర్మలను ఈశ్వరార్పణముగా చేయుము. నిన్ను ముందునకు తీసికొనివెళ్ళు సాధన సామగ్రియైన పుష్పము లివి. వానిని ఆ మూర్తికి సమర్పింపుము." ఒకవైపున కర్మ, రెండవవైపున భక్తి — ఈ రెంటిని కలిపి జీవితమును సుందరముగ చేసికొనుచు పొమ్ము. ఫల మును త్యజింపకుండ దానిని భగవంతునితో జోడింపుము. కర్మయోగములో వదలిపెట్టిన ఫలము రాజయోగములో జోడింపబడు చున్నది. విత్తనములు నాటుటలోను, విసరివేయుటలోను భేదమున్నది. నాటినవి కొంచెమైనను పెక్కు రెట్లుగ ఫలించును. విసరిపారవేసినవి ఊరకనష్టమై పోవును. ఈశ్వరుని కర్పించినపనులు నాటిన గింజలువంటివి. వానివలన జీవితము ఆనందమయ మగును. మిక్కిలి పవిత్రమగును. (17-4-32)

# పదియవ అధ్యాయము

## విభూతి చింతనము

### 49. గీతయొక్క పూర్వార్థముపై దృష్టి

మిత్రులారా! గీతయొక్క పూర్వార్థము పూర్తియైనది. ఉత్తరార్థములో ప్రవేశించుటకుముందు పూర్తియైన అధ్యాయముల సారాంశము చూచుకొనుట మంచిది. మోహనాశనము, స్వధర్మప్రవృత్తి – ఇవి గీతయొక్క ప్రథమాధ్యాయములో చెప్పబడిన అంశములు. జీవితముయొక్క ముఖ్య సిద్ధాంతములగు కర్మయోగము, స్థితప్రజ్ఞ దర్శనము–రెండవ అధ్యాయములోని విషయములు. మూడవ, నాల్గవ, అయిదవ అధ్యాయములలో కర్మ, వికర్మ, అకర్మల సమస్య పరిష్కరింపబడినది. కర్మయనగా స్వధర్మాచరణ. బాహ్యముగ జరుగు స్వధర్మాచరణమును బలపరచు మానసిక కర్మయే వికర్మ. కర్మ వికర్మలు రెండును ఏకరూపమై చిత్తశుద్ధి కలిగినప్పుడు మాలిన్యమంతయు నిర్మూలమయి పోవును, వాసనలు క్షీణించును, వికారములు శాంతించును. భేదభావము నశించును. అప్పుడు అకర్మదశ కలుగును. ఈ యకర్మదశ రెండువిధములుగ చెప్పబడినది. ఒక విధము : రేయుంబగలు కర్మనాచరించుచున్నైతము లేశ మాత్రమేని ఆచరింపని వానివలె నుండునట్టి స్థితి. దీనికి విరుద్ధమైనది రెండవ విధము : ఏ కర్మనేని ఆచరింపకయే నిరంతరమును ఆచరించువాని స్థితియిది. ఈ రెండు మార్గములద్వారా అకర్మదశ పరిపక్వస్థితిని పొందును. ఈ రెండును వేరువేరుగ కనబడుచున్నను పూర్ణరూపములో నొకటే. అవి కర్మయోగము, సంన్యాసము అని రెండుగ చెప్పబడినను ఆ రెంటిసారము మాత్ర మొకటే. అకర్మదశయనునది అంతిమలక్ష్యము, చివర మజిలీ. ఈ స్థితినే మోక్ష మన్నారు. ఈ విధముగ మొదటి అయిదు అధ్యాయములలోను జీవితశాస్త్రార్థ మంతయు పూర్తియైనది.

తరువాత అకర్మయను లక్ష్యమును చేరుటకుగాను అనేక వికర్మమార్గ ములు ఆరవఅధ్యాయములో చెప్పబడినవి. మనస్సును పరిశుద్ధ మొనర్చుటకు అవలంబించు తపస్సాధనలలో ముఖ్యమైనవి కొన్ని పొందుపరుపబడినవి. ఈ యధ్యాయములో చిత్తైకాగ్రత కొఱకు ధ్యానయోగమవసరమని చెప్పి దానికి అభ్యాసవైరాగ్యములు సహకారులుగ నిరూపింపబడినవి. ఏడవఅధ్యాయములో విశాలమైన భక్తి ఉత్కృష్టసాధనగ చెప్పబడినది. నీ వీశ్వరుని యొద్దకు ప్రేమ

భావముతో వెళ్ళు, జిజ్ఞాసువుగవెళ్ళు, లేదా విశ్వకల్యాణము నిమిత్తము వ్యాకులుడవై వెళ్ళు, లేక వ్యక్తిగతవాంఛలతో వెళ్ళు — ఏయుద్దేశముతోనైనను ఒక్కసారి ఆయన దర్బారులోనికి వెళ్ళితీరుము. ఈ విషయమును పురస్కరించుకొని ఈ యధ్యాయమునకు 'ప్రపత్తియోగము' అనగా ఈశ్వరుని శరణుచొచ్చుటకు ప్రేరేపించుయోగము' అని నేను పేరుపెట్టితిని. భగవానుడు ఏడవ అధ్యాయములో ప్రపత్తియోగము చెప్పి ఎనిమిదవ అధ్యాయములో 'సాతత్యయోగము'ను బోధించెను. నేను చెప్పుచున్న ఈ పేర్లు పుస్తకములో మీకు కనబడవు, నాసాధన కుపయోగపడిన పేర్లను నే నీ యధ్యాయములకు పెట్టితిని. సాతత్యయోగమనగా సాధనను అంత్యకాలము వరకును అవిరామముగ నడుపుచుండుట; నీవు నిశ్చయించుకొని త్రొక్కినమార్గములోనే ఆగకుండ ముందునకు సాగిపోవలెను. సాధనను కొన్నిదినము లిట్లు సాగించి కొన్ని దినములు వదలినచో గమ్యమును జేరవలెనను ఆశ ఎన్నటికిని నెరవేరదు. విసుగుచెంది నిరాశతో "ఇంకెన్నాళ్ళీసాధన ?" అని మాత్రము ఎన్నడును తలపరాదు. ఫలము సిద్ధింపనంతవరకు సాధనను సాగించుచునే యుండవలె.

ఇట్లు సాతత్యయోగమును పరిచితముచేసి తరువాత తొమ్మిదవ అధ్యాయములో మిక్కిలిసరళమై, జీవితస్వరూపమునే మార్చివేయు ఒక విషయమును భగవంతుడు చెప్పినాడు. అదే రాజయోగము. క్షణక్షణమునుచేయు కర్మలనన్నిటిని కృష్ణార్పణము చేయుమని తొమ్మిదవఅధ్యాయము చెప్పుచున్నది. ఈ యొక్కమాటతో శాస్త్రసాధనలు, కర్మవికర్మలు అన్నియు కొట్టుకొనిపోవును. కర్మసాధనలన్నియు ఈ సమర్పణయోగములో మునిగిపోవును. సమర్పణయోగమునే రాజయోగమందురు. ఇక్కడ సాధనలన్నియు సమాప్తమగును. విశాలమును శక్తిమంతమును అయిన ఈ యీశ్వరార్పణసాధన, చూచుటకు అతిసామాన్యముగ నున్నను కఠినమైనదే. ఈసాధన ఒకవిధముగ సరళమనికూడ చెప్పవచ్చును. ఏలయన గ్రామీణుడు మొదలుకొని మహా పండితునివరకును విశేష శ్రమలేకుండ దీని నందరును ఇంటియొద్ద కూర్చుండియే చేయవచ్చును. ఇది యింతసులభమైనను దీనిని సాధించుటకు గొప్ప పుణ్యసంస్కారము ఉండవలెను.

'అనేకజన్మముల పుణ్యసంచయ ముండిననే ఈశ్వరునియందు రుచి యుత్పన్నమగును.' ఏదైనను కొంచెము కష్టము కలిగినచో కంట నీరుపెట్టుదురు. కాని భగవంతుని నామ ముచ్చరించుచుండగా రెండు కన్నీటి బొట్లెన్నడును రాలవు.

దీని కుపాయమేమి? ఒకవిధముగ చూచినచో ఈసాధన అతిసుకరమని, మరొక విధమున చూచిన నతి దుష్కరమని మహాత్ములందురు. నేడు ఈ సాధన చాల కష్టమైనది.

ఈ నాడు జడవాద మను పటలము మన నేత్రములను కప్పివేసినది. అసలు ఈశ్వరు డొకడున్నాడా ? అను ప్రశ్నతోనే వాదము ప్రారంభమగును. అత డెక్కడను ఎవరికిని కనబడనే కనబడడు. జీవితమంతయు వికారమయము, విషయలోలము, విషపూరితము అయిపోయినది. ఇప్పుడు ఆరితేరిన వేదాంతుల దృష్టికూడ "అందరికిని కడుపునిండ అన్నము దొరకుటెట్లు ?" అను విషయమును దాటిపోవుటలేదు. ఇందు వారి దోషమేమియును లేదు. ఎందులకనగా ఈ నాడు చాలమందికి తినుటకేమియు లేనిస్థితి యేర్పడినది. ఆహారమే ఈనాటి పెద్దసమస్య అయినది. ఈ సమస్యాపరిష్కారములోనే నేడు అందఱ బుద్ధియు చిక్కుకొనియున్నది. సాయణాచార్యుడు రుద్రునివ్యాఖ్యానమిట్లు చేసినాడు— "బుభుక్షమాణః రుద్రరూపేణ అవతిష్ఠతే" ఆకలి గొన్నవారే రుద్రావతారములు. వారి క్షుద్బాధను శమింపజేయుటకు అనేక తత్త్వబోధలు, రాజశాసనములు ఏర్పడినవి. భిన్నభిన్నవాదములు ఈ తిండిసమస్యనుగూర్చియే బయలుదేరినవి. ఈ సమస్యలలో మునిగి తల పైకెత్తుటకు కూడ సమయము దొరకుటలేదు. పరస్పర కలహములులేకుండ, ప్రసన్నచిత్తముతో, శాంతిసుఖములతో అందఱికిని అన్న మెట్లుదొరకునను మార్గములోనే మన భగీరథ ప్రయత్నములన్నియు జరుగుచున్నవి. ఇట్టి విచిత్రమయిన సమాజ మేర్పడుచున్న యుగమునందు ఈశ్వరార్పణవంటి సులువైనపనికూడ అతి కష్టమైన దనిన అశ్చర్యమేమున్నది ? దీనికేమి యుపాయము ? ఈశ్వరార్పణయోగము నెట్లు సంపాదింపవలెను ? సులువుగా ఎట్లు ప్రయోగింపవలెను ? ఈ విషయమునే ఈ రోజున మనము పదియవ అధ్యాయములో చూడబోవుచున్నాము.

## 50. పరమేశ్వరుని దర్శనమునకు సులువగు మార్గము

బిడ్డల విద్యాభ్యాసములో అవలంబించు ఉపాయమువంటి ఉపాయమే పరమాత్మను సర్వత్ర దర్శించుటకు ఈ యధ్యాయములో సూచింపబడినది. బిడ్డలకు అక్షరములు రెండువిధములుగ నేర్పుదుము. మొదట పెద్దపెద్ద అక్షరములువ్రాసి నేర్పుదుము. తరువాత ఈ యక్షరములనే చిన్నవిగ వ్రాసి నేర్పుదుము. మొదట పెద్దవిగా వ్రాసిన క, గ లనే తరువాత చిన్నవిగా వ్రాయుదుము. ఇదియొకపద్ధతి. మరియొకపద్ధతికూడఉన్నది. అది మొదట సరళాక్షరములను,

తరువాత జటిలమైన సంయుక్తాక్షరములను నేర్పుట. సరిగా ఈ విధముగనే పరమేశ్వరుని దర్శించుట నేర్చుకొనవలెను. మొదట స్థూలముగా, స్పష్టముగా కన్పించు పరమేశ్వరుని చూచెదముగాక! సముద్రములు, పర్వతములు మొదలగు మహా విభూతులలో కన్పించు పరమేశ్వరుడు చూచుచుండగనే తేటతెల్లముగా మన కంటబడును. ఈ స్థూల పరమాత్మను మనము తెలిసికొన్నచో జలబిందువులోను రజఃకణములోను నిండియున్నది ఆ పరమాత్మయే యని క్రమశః విదితమగును. పెద్ద 'కా' లోను చిన్న 'కా' లోను భేద మేమియు లేదు. స్థూలములో నున్నదే సూక్ష్మములోను ఉన్నది. ఇదియొక పద్ధతి. మరియొక పద్ధతి యేమనగా, పరమాత్మను ముందు సరళరూపములోను తరువాత జటిల రూపములోను చూడగలుగుట. శ్రీరామునిలో ప్రకటితమైన పరమాత్మ సులువుగ మనస్సులో అంకితమగును. అట్లే ఏ వ్యక్తిలో శుద్ధమైన ఈశ్వరతత్త్వము సహజరూపమున ప్రకటనమగునో అట్టివానిని ఈశ్వరాంశసంభూతునిగ మనము వెంటనే గ్రహింప గలుగుదుము. రాముడు సరళాక్షరమువంటి వాడు. పరమేశ్వరుని ఈ రూపమును గ్రహించుటలో నేమియు కష్టములేదు. కాని రావణుడు సంయుక్తాక్షరమువంటి వాడు. ఈ రూపములో కొంత కలగలు పున్నది. రావణుని తపస్సు, కర్మశక్తి గొప్పవి. కాని ఆ శక్తిలో క్రూరత్వము కలిసియున్నది. మొదట రాముడను సరళాక్షరమును నేర్చుకొనుము. దయ, వాత్సల్యము, ప్రేమభావముకల రాముడు సరళుడైన పరమేశ్వరుడు; అతనిని త్వరగా పట్టుకొనవచ్చును. కాని రావణుని యందున్న పరమేశ్వరుని తెలిసికొనుటకు కొంత కాలము పట్టును. మొదట సరళాక్షరములు, తరువాత సంయుక్తాక్షరములు. ముందు సజ్జనులలోని పరమేశ్వరుని చూచి, చివరకు దుర్జనులలోని భగవంతుని చూచుట అలవరచుకొనవలె. సముద్రస్థితుడైన విశాల పరమేశ్వరుడే నీటి బిందువులోకూడ ఉన్నాడు. శ్రీరామునిలోని పరమేశ్వరుడే రావణుని యందును ఉన్నాడు. స్థూలమందున్నవాడే సూక్ష్మమునందును ఉన్నాడు. సరళరూపములో నున్నవాడే పరుషరూపములోను ఉన్నాడు. ఈ రెండు రీతులతో మనము ప్రపంచమను గ్రంథమును చదువుట నేర్చుకొనవలెను.

ఈ యపారమైన సృష్టియంతయు ఈశ్వరుడు రచించిన కావ్యమువంటిది. మన కంటికి దట్టమైన తెర అడ్డుపడుటచేత ఈ కావ్యము మనకు అజ్ఞాతమైనది. ఈ సృష్టి యను గ్రంథములో పరమేశ్వరుడు సర్వత్ర సుందరాక్షరములతో వర్ణింపబడియున్నాడు. కాని అతడు మన కగపడుటలేదు. ఈశ్వర దర్శన

మగుటకు ఒక గొప్పవిఘ్నము కలుగుచున్నది. అదేమనగా, సమీపములో మున్న సరళమైన ఈశ్వరరూపమును మనుష్యుడు గ్రహింపలేడు. దూరస్థమైన తీక్ష్ణరూపము వానికి గోచరించుటలేదు. 'నీ మాతయందు పరమేశ్వరుని చూడు' మనిన "ఈశ్వరరూప మింతసరళమా ? అని యందువు. పరమాత్మ తీక్ష్ణరూపములో ప్రత్యక్షమైనచో ఆ తేజస్సును నీవు సహింపగలవా ? దూరస్థుడైన సూర్యుడువచ్చి తనకు ప్రత్యక్షము కావలెనని కుంతి మనసార కోరుకొన్నది. కాని అతడు దగ్గరకు రాగావే ఆమె శరీరము కాలిపో నారంభించెను. ఆ తేజస్సు ఆమెకు దుస్సహమయ్యెను. ఈశ్వరుడు తన సర్వశక్తితో మన యెదుటకివచ్చి నిలిచినచో మన మతనిని దర్శించుటకు అసమర్థుల మగుదుము. మాతయొక్క సౌమ్యరూపములో అతడు వచ్చి నిలిచిన ఆ రూపము మనల నాకర్షింపదు. పేడా – బర్ఫీ జీర్ణముకావు; అచ్చమయిన పాలు రుచింపవు. మందభాగ్యత యొక్కయు, మృత్యువుయొక్కయు లక్షణము లివి. ఇట్టి రోగగ్రస్తమైన మానసిక స్థితి పరమేశ్వర దర్శనమునకు గొప్ప అంతరాయ మగును. ఈ మానసిక స్థితిని తొలగించుకొనవలసిన అవసర మెంతైనను కలదు. మన సమీపములో మున్న స్థూల, సరళ పరమాత్మను మొదట అవగాహన చేసికొని, తదుపరి సూక్ష్మ జటిల రూపములోనున్న పరమాత్మను గ్రహింతము గాక!

## 51. మానవునిలోనున్న పరమేశ్వరుడు

ప్రప్రథమమున మనకు కనిపించు పరమేశ్వరునిమూర్తి మనకు దగ్గరగా మున్న మనతల్లి. 'మాతృదేవోభవ' అని శ్రుతివాక్యము. పుట్టగానే శిశువునకు ముందు కనిపించునది తల్లికాక మరెవరు ? వాత్సల్యరూపిణియై పరమాత్మ యొక్క మూర్తిగనే ఆమె కనిపించును. ఈ మాతృభావమునే వ్యాపింప జేసికొనుచుపోయి, 'వందేమాతర' మని రాష్ట్రమాతను, తరువాత అఖిల భూమాతను పూజింతముగాక! కాని ప్రారంభములో బిడ్డయొక్క అందుబాటులోనికి వచ్చు సర్వోత్కృష్టమైన యీశ్వరప్రతిమ తల్లియే. మాతృపూజవలన మోక్షము లభించుట అసంభవముకాదు. మాతృపూజ యనగా వాత్సల్య స్వరూపుడైన పరమేశ్వరుని ఆరాధనయే. తల్లి నిమిత్తమాత్రమే. పరమేశ్వరుడామెలో తన వాత్సల్యమును చొప్పించి నటన చేయుచుండును. ఇంత మాయామమత లోపలినుండి యెందులకు పుట్టుకొనివచ్చునో ఆ తల్లికే తెలియదు. తన వృద్ధత్వములో బిడ్డ తనసేవకు అక్కఱకువచ్చునను నూహతో ఆమె వానిని పోషించుచున్నదా ? కాదు, కాదు. ఆమె వానిని కన్నది; ప్రసవవేదన అనుభవించినది. ఆ వేదనయే

బిడ్డయెడల ప్రేమోన్మత్తతను కలిగించి, ఆమె హృదయమును వాత్సల్యముతో నింపినది. ఆమె ప్రేమింపకుండ ఉండనేరదు; గత్యంతరములేదు. తల్లి యనగా అపారసేవామూర్తియే. పరమేశ్వరారాధనయొక్క ఉత్కృష్టరూపము మాతృపూజ. ఈశ్వరుని 'అమ్మా' యనియే సంబోధించుము. 'అమ్మ' కంటె గొప్ప శబ్దము మరెచ్చటనున్నది? 'అమ్మ' స్థూలపదములలో మొదటిది. అమెలో ఈశ్వరుని చూచుట నేర్చుకొనుము. తరువాత తండ్రి, గురువు—వీరిలోకూడ దర్శింపుము. గురువు శిక్షణనిచ్చును. పశువుగా వచ్చినవాని నతడు మానిపినిగ చేయును. ఇదెంత యుపకారము! మొదట తల్లి తరువాత తండ్రి, తరువాత గురువు, తరువాత దయాళువులైన మహాత్ములు, అత్యంత స్థూలరూపములో నున్న ఈ పరమేశ్వరరూపమును మొదట చూడుము. పరమేశ్వరుడు వీరిలో కనబడనిచో ఇక నెక్కడ కనబడును?

మాత, పిత, గురువు, మహాత్ములు—వీరిలో పరమాత్మను దర్శింపుము. ఆవిధముగనే చిన్నబిడ్డలలోకూడ మనము పరమాత్మను చూడగలిగినచో అందెంతో ఆనందమున్నది. ధ్రువుడు, ప్రహ్లాదుడు, నచికేతుడు, సనక, సనందన, సనత్కుమారులు—వీరందరును బాలురేకదా! కాని వీరికెంత ఉన్నతస్థాన మీయవలెనో పురాణకర్తలకును, వ్యాసాదులకును తెలియలేదు. శుకదేవుడు, శంకరాచార్యులు బాల్యమునుండియే విరాగులు. జ్ఞానదేవుడును అంతే. వీరందరును బాలురే. కాని పరమేశ్వరుడు వీరిలో కనబడినంత పరిశుద్ధరూపముతో మరెక్కడను కనిపించడు. ఏసుక్రీస్తు చిన్నబిడ్డల నెక్కువగ ప్రేమించువాడు. ఒకసారి శిష్యు లాయన నిట్లడిగిరి: "మీ రెప్పుడును ఈశ్వరరాజ్యమునుగూర్చి చెప్పుచుందురుకదా! ఆ రాజ్యమున ప్రవేశించుట కర్హులెవరు?" అప్పు డక్కడ ఒక కుఱ్ఱవాడుండెను. జీససు వానిని బల్లమీద నిలవబెట్టి "ఈ పిల్లవానివలె కాగలవారే ఈశ్వరరాజ్యమున కర్హులు" అన్నాడు. జీససు చెప్పిన ఈ మాట సత్యము. సమర్థ రామదాసు ఒకనాడు పిల్లవానివలె ఆడుకొనుచుండెను. ఇది చూచి కొందరు పెద్దలకు ఆశ్చర్యముకలిగెను. అందొకడు "ఏమి, మీరీరోజువ ఇట్లు చేయుచున్నారు!" అనగా రామదా సిట్లు జవాబు చెప్పెను.

'ఎవరు పిన్నలుగా నుందురో వారు గొప్పవారు.
ఎవరు పెద్దలుగా నుందురో వారు దొంగలలో దొంగలు'

పెండ్లు పైబడినకొలది మనుష్యునికి కొమ్ములు మొలచును. వికారములు, వాసనలు పెరుగును. ఇక ఈశ్వరస్మరణకూడ ఉండదు. చిన్నబిడ్డలమనస్సులో

వికారములేమియు ఉండవు. వారిబుద్ధి నిర్మలముగ నుండును. అబద్ధమాడరాదని మనము పిల్లలకు బోధింతుము. అబద్ధ మనగా నేమనిపిల్లలు ప్రశ్నింతురు. ఉన్నదున్నట్లు చెప్పుటయే సత్యమని సిద్ధాంతము చేయుదుము. "ఉన్నదున్నట్లు చెప్పుటకాక మరొకపద్ధతి కూడ ఉన్నదాయేమి ?" అని బిడ్డలు సంశయములో పడుదురు. లేనిదానిని ఉన్నట్లుగా చెప్పుటయెట్లు ? చతురస్రమును చతురస్రమే అనుము, వృత్త మనకుము అని అన్నట్లే యిది యుండును. ఇదంతయు చూడగా పిల్లల కాశ్చర్యము కలుగును. విశుద్ధపరమాత్మ స్వరూపములే పిల్లలు. కాని పెద్దవారు వారికి తప్పుడు శిక్షణ నిత్తురు. ఇంతకును ముఖ్యవిషయ మేమనగా తల్లి, తండ్రి, గురువు, మహాత్ములు, బిడ్డలు - వీరిలో మనము పరమేశ్వరుని దర్శింపలేనిచో మరి యెందు దర్శింపగలము? ఈశ్వరాకృతులలో ఉత్తమమగు ఆకృతిని వీరియందే చూడగలము. పరమేశ్వరుని ఈ సరళ సౌమ్యరూపములను ముందు తెలిసికొనుము. వీరియందు పరమేశ్వరుడు స్పష్టమైన పెద్దఅక్షరములతో వ్రాయబడియున్నాడు.

## 52. సృష్టిలోని పరమేశ్వరుడు

ఈ విధముగ మనము మొదట తల్లిదండ్రులవంటి సౌమ్య, పవిత్రమూర్తులలో పరమేశ్వరుని దర్శింప నేర్చుకొందముగాక! ఇట్లే సృష్టిలోని విశాలములు, మనోహరములునైన రూపములలో కూడ మన మాతనిని దర్శింపవలె. ఆ యుషఃకాలమును, సూర్యోదయమునకు పూర్వము కనిపించు ఆదివ్యప్రభను చూడుడు. ఋషు లీ యుషోదేవతను గానముచేయుచు పరవశులై నృత్యముచేయుదురు — "ఓ యుషస్సా! నీవు పరమేశ్వరుని సందేశమును తెచ్చు దివ్యదూతవు. మంచు బిందువులలో నీవు స్నానముచేసి వచ్చుచున్నావు. అమృతత్త్వమునకు నీవు పతాకవు." ఇట్టి భవ్యము, హృదయంగమము నైన వర్ణనను ఋషులుచేసిరి. వైదికఋషి యిట్లన్నాడు—"పరమేశ్వరుని సందేశమును అందించు నీద్వారా అతనిరూపము నా కవగాహన కానిచో మరెవరిద్వారా కాగలదు?" ఇంత సౌందర్యముతో అలంకృతమైన ఉషస్సు మనయెదుట నిలిచియున్నది. కాని మన దృష్టి అంతవరకు పోయినప్పటి మాటకదా!

అట్లే సూర్యుని చూడుడు! అతనిదర్శనము పరమాత్మ దర్శనము వంటిదే. అత డాకాశములో రంగురంగుల చిత్రములను చిత్రించును. చిత్రకారుడు వెలలతరబడి రంగులకుంచె నాడించి సూర్యోదయ చిత్రమును తయారుచేయును. కాని నీవు ఉదయముననే లేచి పరమేశ్వరుని ఆ కళానైపుణ్యా

మును ఒక్కసారి దర్శించి చూడుము. ఆ దివ్యకళకును, అనన్య లభ్యమైన ఆ సౌందర్యమునకును సాటియేమున్నదో చెప్పుము. అయినను దానిని చూచువా రెవరు ? అక్కడ సూర్యభగవానుడు సౌందర్యరాశియై వచ్చి నిలిచియుండగా, ఇక్కడ నీవు మొద్దుదుప్పటి ముఖమునకు కప్పుకొని గుబ్బుపెట్టి నిద్రించు చుందువు. "ఓ సోమరీ ! నీ వింకను పండుకొనవలెననియే కోరుచున్నావు. కాని నేను నిన్ను లేపుదును" అని యతడనును. సూర్యుడు ప్రాణప్రదములైన తన కిరణములను కిటికీలనుండి పంపి ఆ సోమరిని లేపును. 'సూర్య ఆత్మా జగత స్తస్థుశ్చ' సూర్యుడు సమస్త స్థావర-జంగమములకును ఆత్మ. చరాచరముల కాధారము. ఋషి అతనికి "మిత్రు"డను పేరు పెట్టినాడు.

"మిత్రోజనాన్ యాతయతి బ్రువాణో,
మిత్రోదాధార పృథివీముత ద్యామ్"

"ఈ మిత్రుడు మానవులను పిలుచుచున్నాడు. వారిని పనిపాటలలో ప్రవేశపెట్టుచున్నాడు. అతడు స్వర్గమును, పృథివిని భరించుచున్నాడు." ఆ సూర్యుడు నిజముగ జీవితమున కాధారము. అతనియందు పరమాత్మను దర్శింపుము.

పావనమైన ఆ గంగను చూడుము. నేను కాశీలో నున్నప్పుడు గంగా తీరమునకువెళ్ళి కూర్చుండువాడను. రాత్రి యేకాంతసమయమున వెళ్ళుచుండు వాడను. ఆ నదీ ప్రవాహ మెంతో సుందరముగను, ప్రసన్నముగను ఉండును. దాని భవ్య,గంభీరప్రవాహమును,దానిగర్భములో నిమిడియున్న ఆకాశములోని అనంతతారలను చూచి నేను ముగ్ధుడ నగువాడను. శంకరుని జటాజూటము నుండి, అనగా హిమాలయమునుండి ప్రవహించుచు, రాజ్యములను తృణప్రాయ ముగ త్యజించి తపస్వులైన రాజాధిరాజుల కాశ్రయమిచ్చిన ఆ గంగను దర్శించి నే నపారమైన శాంతి ననుభవించువాడను. ఆ శాంతిని నే నెట్లు వర్ణింపగలను ? అది భాష కతీతము. తన శరీరమంతయు కాకపోయినను, కనీసము అస్థులైనను గంగలో కలియవలెనని హిందువు ఎందులకు కోరుకొనునో నా కప్పు డర్థ మయ్యెను. మీరు నవ్వుదురు, నవ్విన వచ్చు నష్టమేమియు లేదు. కాని నాకు మాత్రమీ భావనలు పవిత్రములుగా స్మరణీయములుగా తోచుచున్నవి. మరణ సమయములో గంగాజలము రెండుబొట్లు నోటిలో వేయుదురు. ఆరెండు బిందువు లనగా పరమేశ్వరుడే ఆ రూపములో లోపలికి ప్రవేశించు చున్నాడన్నమాట. ఆ గంగను పరమేశ్వరు డనియే భావింపుము. పరమేశ్వరుని కరుణాప్రవాహమే

గంగ. నీ సమస్త బాహ్యాంతర మాలిన్యములను ఆ తల్లి కడిగివేయును. పరమేశ్వరుడు గంగామాతలో గాక మరెక్కడ కనబడును? సూర్యుడు, నదులు, అలలతో ఘోషించు విశాల సాగరము - ఇవన్నియు పరమేశ్వరుని మూర్తులే.

ఇక గాలిని చూడుడు! అది ఎక్కడనుండి వచ్చుచున్నదో, ఎక్కడికి పోవుచున్నదో ఏమియు తెలియదు. కేవలము భగవంతుని దూతయే అది. భారతదేశములోనికి వచ్చుగాలి కొంత సుస్థిర హిమాలయము మీదుగను, కొంత గంభీరసాగరము మీదుగను వచ్చును. ఈ పవిత్రవాయువు హృదయములను తాకి, చెవిలో గునగున శబ్దము చేయుచు మనలను మేల్కొల్పును. కాని దాని సందేశమును వినువారెవరు? నీ పేరవచ్చిన నాలుగు పంక్తుల యుత్తరమును జైలరు నీకీయకపోయినచో నీకు బాధకలుగును. ఓ మందభాగ్యుడా! ఏమున్నదాయుత్తరములో? పరమేశ్వరుని యొద్దనుండి అనుక్షణమును గాలితోపాటు వచ్చుచున్న ఈ ప్రేమసందేశమును వినుము.

నిత్యకృత్యములలో మన కుపకరించు గోసంపదను తీసికొనుడు. ఆ గోమాతలో నెంత వాత్సల్యము, మమత, ప్రేమ నిండియున్నవి! అది అడవి మేతకుపోయి రెండుమూడు మైళ్ళ దూరమునుండి తన లేగదూడకొఱకు ఎట్లు పరుగెత్తుకొని వచ్చును! వైదిక ఋషులు పర్వతములనుండి కలకలధ్వనితో ప్రవహించు స్వచ్ఛజలములుగల నదులను చూచి నిండుపొదుగులతో బిడ్డల కొఱకు అంబా యని పరుగెత్తుకొనివచ్చు గోవులను స్మరణకు దెచ్చుకొనెడివారు. ఆ ఋషి నదినిచూచి ఇట్లనును- "ఓ దేవీ, క్షీరములవంటి పవిత్రమై మధుర జలములను తీసికొని వచ్చెడు నీవు గోమాతవలె నున్నావు. గోవు ఎట్లు అడవిలోనే స్థిరపడలేదో అట్లే నీవుకూడ పర్వతములలో నుండలేవు. దప్పికగొన్న నీ బిడ్డలను కలిసికొనుటకు నీవు పరుగెత్తుకొనుచు వత్తువు."

'వాశ్రా ఇవ ధేనవః స్యందమానాః'

వాత్సల్యమూర్తియగు గోవు రూపమున భగవంతుడే వచ్చి వాకిట నిలబడియున్నాడు.

ఆ గుఱ్ఱమును చూడుడు? ఎంతతీవి, ఎంత విశ్వాసము, ఎంత స్వామిభక్తి కలది! అరబ్బులకు గుఱ్ఱము లనిన ఎంత యిష్టము! అరబ్బీవాని కథ మీకు తెలియును కదా! విపత్తులోనున్న ఒక అరబ్బీ తన గుఱ్ఱమును నొక వర్తకునకు అమ్మవలె ననుకొని డబ్బుసంచి చేతపట్టుకొని గుఱ్ఱపుసాలకు

పోయెను. కాని గుఱ్ఱము గంభీర, ప్రేమపూర్ణ నేత్రములతో వానివంక చూచెను. అతడది చూచి సంచిని క్రిందపారవేసి యిట్లు తలంచెను. "నా ప్రాణము పోయి నను సరే! నేను గుఱ్ఱమును మాత్రము అమ్మను. ఏమి కావలసియున్నదో అది యగును. నాకు తిండి లేకపోయినను సరే! గుఱ్ఱమును అమ్మజాలను. అల్లాయే నన్ను రక్షించును." వెన్ను తట్టగానే గుఱ్ఱము ఎంత ప్రేమతో సకిలించును! దాని జూ లెంత అందమైనది! గుఱ్ఱములో నిజముగ అమూల్యమైన గుణములున్నవి. సైకిలులో నే మున్నది? గుఱ్ఱమునకు మాలిష్‌చేయుము. అది నీకు ప్రాణము నిచ్చును, నీకు మిత్రమై యుండును. నా మిత్రుడొకడు గుఱ్ఱపుస్వారి నేర్చుకొనుచుండెడివాడు. గుఱ్ఱము వానిని పడవేయు చుండెను. అది తన్నెక్కనిచ్చుటలేదని అతడు నాతో చెప్పెను. అప్పుడు నే నిట్లంటిని—"గుఱ్ఱము నెక్కుటకు మాత్రము తయారగు చున్నావు. కాని దానిసేవ యేమైనను చేయు చున్నావా? సేవచేయువాడు మరొకడా, సవారి చేయువాడవు నీవా? అదెట్లు సాగును? దానికి స్వయముగ దాణాపెట్టుము, నీరుపెట్టుము, మాలిష్‌చేయుము. తరువాత స్వారిచేయుము." అత డట్లే చేసెను. తరువాత కొన్నాళ్ళకు నన్ను కలిసికొని గుఱ్ఱము తన్ను పడవేయుటలేదని చెప్పెను. గుఱ్ఱము పరమేశ్వర స్వరూపము. అది భక్తుని ఎందులకు పడవేయును? వాని భక్తినిచూచి అది సాధువగును. వీడు భక్తుడౌనా కాడా యని అది పరిశీలించును. కృష్ణభగ వానుడు స్వయముగా గుఱ్ఱములకు మాలిష్‌చేయువాడు. దాణా తన యొడిలో వేసికొని తెచ్చి తినిపించువాడు. గుట్టలుగాని పిల్లకాలువలు గాని అడుసుగాని అడ్డు తగిలినచో సైకిలు ఆగిపోవును; కాని గుఱ్ఱము దుమికి వానిని దాటును. సుందరము ప్రేమ మయము అయిన గుఱ్ఱము పరమేశ్వరుని మూర్తికాక మరియేమి?

ఇక సింహమును చూతము. బరోడాలో నేనున్నప్పుడు తెల్లవారుజామున దాని గర్జన నాకు వినిపించెడిది. రమ్యమైన దాని గంభీరధ్వని విని నాహృదయము కదలిపోయెడిది. అపుడు గర్భాలయములో శబ్దము ప్రతిధ్వనించినట్లుండెడిది. ఏమి! దాని హృదయగర్భమునుండి వెలువడు ఆ గంభీరగర్జన! ఏమి! దాని ముఖముమీది ధీరోదాత్తమైన ఆ భవ్యనిర్భయ ముద్ర! ఏమి! దాని రాజఠీవి, రాజవైభవము! వీచు వింజామరవంటి ఆ సుందరమైన జూలేమి! పార్కులో నుండెడిది ఆ సింహము. దాని కక్కడ స్వేచ్ఛలేదు; బోనులో ఇటు నటు తిరుగు చుండెడిది. దానిచూపులో క్రూరత్వ మేమాత్రమును కనిపించదు. ప్రపంచము

నుండి తనకేమియు భయములేదన్నట్లు దానిరూపము, దృష్టి కరుణతో నిండి యున్నవి. తనలో తాను నిమగ్నమైనట్లు కనబడినది దానిచూపు. సింహము నిజముగ పరమేశ్వరుని పవిత్ర విభూతులలో నొకటియని అనిపించును. నా బాల్యములో "అంద్రొకిల్సు—సింహము" అనుకథను చదివియుంటిని. అదెంత రమ్యమైనకథ! ఆకలిదప్పులతో నున్న ఆసింహము వెనుకటి కృతజ్ఞతను జ్ఞప్తియందుంచుకొని అంద్రొకిల్సునకు మిత్రమై అతని పాదమును నాక మొదలుపెట్టెను. ఇందలి రహస్యమేమి? సింహములోనున్న పరమేశ్వరుని అంద్రొకిల్సు దర్శించె నన్నమాట. శివునియొద్ద ఎప్పుడును సింహముండును. సింహము భగవంతుని దివ్యవిభూతి.

పెద్దపులివలని ఆనందము మాత్రము ఏమంతతక్కువదా? దానిలోకూడ ఈశ్వరతేజస్సు హెచ్చుగా వ్యక్తమగుచుండును. దానితో స్నేహముచేయుట అసంభవముకాదు. భగవానుడు పాణిని అరణ్యములో శిష్యులకు పాఠము చెప్పుచు కూర్చుండెను. ఇంతలో వ్యాఘ్రమొకటి వచ్చెను. శిష్యులు భయపడి వ్యాఘ్రము, వ్యాఘ్రమని కేకలుపెట్టిరి. పాణిని, "సరే, అసలు వ్యాఘ్రమనిన నేమో తెలియునా? 'వ్యా జిఘ్రతీతి వ్యాఘ్రః' అనగా దేనిఘ్రాణేంద్రియము తీవ్రమైనదో అది వ్యాఘ్రము" అన్నాడు. బాలురకు దానిని చూచి కొంతభయము కలిగియుండవచ్చును. కాని భగవానుడగుపాణినికి అది నిరుపద్రవమైన శబ్దము మాత్రమే యయ్యెను. పెద్దపులిని చూచి ఆయన వ్యాఘ్రశబ్దవ్యుత్పత్తి చెప్ప నారంభించెను. పులి పాణినిని తినివేసెను; కాని తినివేసినంతమాత్రమున నేమయినది? పాణిని శరీరముయొక్క మధురమైనవాసన దానికి తగులగానే అది యతనివైపు తిరిగెను. కాని పాణిని పారిపోలేదు, ఎందుచేత ననగా అతడు శబ్దబ్రహ్మను ఉపాసించువాడు, అతనికి సర్వమును అద్వైతమయ మయ్యెను. వ్యాఘ్రములో కూడ అతడు శబ్దబ్రహ్మానుభూతినే పొందెను. పాణినిలోని ఈ మాహాత్మ్యమువలననే అతనిపేరు వచ్చినచోట నెల్ల పూజ్యభావముతో "భగవానుడుపాణిని" అని భాష్యము లుల్లేఖించినవి. అవి పాణినియెడల అత్యంత కృతజ్ఞతను వెలిపుచ్చినవి.

అజ్ఞానాంధస్య లోకస్య, జ్ఞానాంజన శలాకయా।
చక్షురున్మీలితం యేన, తస్మై పాణినయే నమః.

ఈ విధముగ భగవానుడు పాణిని, వ్యాఘ్రమునందు పరమాత్మను దర్శించెను. జ్ఞానదేవు డిట్లన్నాడు—

'స్వర్గసుఖము వశపడినను, పెద్దపులి పైకిదూకినను ఆత్మకు తొట్రుపాటు రాగూడదు'

మహర్షి పాణిని స్థితియిట్టిది. వ్యాఘ్ర మొక దైవవిభూతి యని ఆయన తెలిసికొన్నాడు.

ఇట్టిదే పాముకూడ. పా మనిన మనుష్యులకు చాలభయము; కాని అది పరిశుద్ధిపట్ల కేవలము బ్రాహ్మణుని వంటిది. దానిది ఎంత స్వచ్ఛత, ఎంత సౌందర్యము! ఏ పాటి మాలిన్యమునేని అది సహించదు. అపరిశుద్ధులగు బ్రాహ్మణులెందరో ఉన్నారు. కాని ముఱికితోనున్న పాము నెప్పుడైన ఎవరైన చూచినారా? పాము ఏకాంతవాసియైన ఋషివంటిదే! అది నిర్మలముగను, మనోహరముగను మెరయు హారము వంటిది. దానికి మనము భయపడ వలసిన పనియేమున్నది? మన పెద్దలు దానిని పూజింపవలెనని చెప్పినారు. హిందూధర్మములో మూఢాచారము లేవేవి యున్నవో మీకు తెలియును. కాని నాగపూజా విధానము అట్టిదికాదు. అదిమాత్రము శుద్ధమైనది. నా బాల్యములో మా యమ్మకు గంధముతో పామువిగ్రహమును చేసిపెట్టుచుండు వాడను. "అమ్మా, బజారులో మంచివిగ్రహము దొరకును" అని నే ననగా "అది నాకక్కరలేదు; పనికిమాలినదది. నాపిల్లవాడు చేసినదే నాకు బాగుగా నుండును" అని ఆమె యనెడిది. అప్పుడామె నాగపూజ చేసికొనెడిది. ఇది పిచ్చితనమా? మీరే యోజింపుడు. సర్పము శ్రావణమాసములో మనయింటికి అతిథిగా వచ్చును. వర్షకాలములో పాపము! దాని యిల్లంతయు నీటితో నిండి పోవును. అప్పుడదేమి చేయవలె? ఎక్కడనో దూరమున ఏకాంతముగ వసించు ఆఋషి ఎవరికిని ఇబ్బంది కలిగించకుండ తనదారిని తానువచ్చి ఏయింటిచూరు ననో, ఏవాసముల చాటుననో చాల తక్కువచోటు నాక్రమించి పడియుండును. కాని మనము బడిత తీసికొని దానివెంట బడుదుము. సంకటగ్రస్తమై యింటికి వచ్చిన అతిథిని చంపవచ్చునా? సెయింట్ ఫ్రాన్సిసును గూర్చి ఒక కథ చెప్పుదురు. అతనికి అడవిలో పాము కనిపించినప్పుడు, "రా, నాయనా, రా" అని యతడు ప్రేమతో పిలుచువాడట. సర్పములు అతని యొడిలో ఆడుచు శరీరమందంతటను సొగసుగ తిరుగుచుండెడివి. దీనిని వట్టిమాట యనకుడు. ప్రేమలో ఈ శక్తియున్నది. పాము విషజంతువందురు. కాని మనుష్యు డంతకంటె తక్కువవిషము కలవాడా? పాము కరచినను ఎప్పుడో ఒకసారి కరచును. కాని అదెప్పుడును పనిగట్టుకొని కరవదు. పాములు నూటికి తొంబది

విషములేనివే. మీ పొలములోని పంటను అవి రక్షించును. పంటను పాడు చేయు అనేక కీటకములను, జంతువులను పాము తినివేయును. ఇట్టియుపకారి, ఏకాంతప్రియము, పరిశుద్ధము, తేజస్వియైన సర్పము భగవంతుని రూపమే. మనదేవతాగణములలో అక్కడక్కడ సర్పము తప్పక వచ్చుచునే యుండును. విఘ్నేశ్వరుని కీ పామే మొలత్రాడయినది. శంకరుని కంఠమున పాములు చుట్టవేసికొని యుండును. విష్ణుమూర్తి శేషతల్పము మీదనే పరుండును. దీని లోని మాధుర్యమును చూడుడు. దీనికెల్ల భావార్థమిది : సర్పముద్వారా ఈశ్వరునిమూర్తి వ్యక్తమగుచున్నది. సర్పములోనున్న పరమేశ్వరునితో పరి చయము చేసికొనుము.

**53.** సృష్టిలోని పరమేశ్వరుడు : మరికొన్ని యుదాహరణలు

ఇట్టి యుదాహరణ లింకను ఎన్నిటినీయను ? విషయమును తెలియజెప్పు చున్నాను రామాయణసారమంతయు ఇట్టి రమణీయమైన కల్పనలలోనేయున్నది. రామాయణములో తండ్రికొడుకుల ప్రేమ, తల్లిబిడ్డల ప్రేమ,అన్నదమ్ముల ప్రేమ, సతీపతులప్రేమ–ఇవన్నియు ఉన్నవి. కాని నాకు రామాయణము ప్రియమగుట వీనివలనకాదు. రాముడు వానరులతో మైత్రిచేసికొనుటవలననే అది నాకు ప్రియ మైనది. వానరులు నాగజాతికి చెందినవారని ఈ నాటికనివాడుక. పురాతనవిషయ ములను విమర్శించుట ఐతిహాసికులపని. వానిని నేను విమర్శించను. రాముడు సాధారణవానరములతోనే మైత్రిచేసికొన్నాడనుకొనుడు. అందు అసంభవమే మున్నది? రాముడు వానరులు మిత్రులగుటలోనే నిజముగ రామునిరామత్వము రమణీయత్వము ఉన్నవి. కృష్ణునికిని గోవులకునుగల సంబంధమును ఇట్టిదే. కృష్ణుడు పూజింపబడుట ఈభావన నాధారముచేసికొనియే. శ్రీకృష్ణుని చిత్రపట మేదిచూచినను, అందు కృష్ణునితోపాటు గోవులుకూడ ఉండును. "గోపాలకృష్ణ! గోపాలకృష్ణ!" అని యందుము. కృష్ణునినుండి గోవులను వేరుచేసిన, ఇక కృష్ణు నిలో మిగులునదేమున్నది ? రామునినుండి వానరులను వేరుచేసినచో ఇక రాముడెక్కడ ? వానరులలోకూడ రాముడు పరమాత్మను దర్శించినాడు; వారితో ఘనిష్ఠమైన ప్రేమసంబంధమును నెలకొల్పుకొన్నాడు. రామాయణము లోని కీలకమిది. దీనిని మీరు విస్మరించినచో రామాయణములోని మాధుర్య మును మీరు చవిచూడలేరు. తండ్రి–కొడుకుల, తల్లి–బిడ్డల ప్రేమ ఇతరమైన యితిహాసములలోకూడ కనబడును. కాని నరవానరులమధ్య ఇట్టి మధురమైత్రి ఒక్క రామాయణములోనే దర్శింపగలము. మరెక్కడను చూడలేము. వానరులు

కూడ దైవస్వరూపులే యని రామాయణము ఋజువుచేయుచున్నది. వానరులనిన ఋషులకు చాల సంతోషము. రామటేక్ మొదలు కృష్ణా తటమువరకును కాలు క్రిందపెట్టకుండ వానరములు చెట్టునుండి చెట్టునకు దుముకుచు, ఆడుచు తిరుగుచు ఉండెడివి. ఈ విధముగ దట్టమైన ఆ వనములను, అక్కడ ఆటలాడెడు వానరములను చూచినపుడు సహృదయులైన ఋషులలో ఆనందము కలిగి కవిత్వ ముత్పన్నమయ్యెను. ఉపనిషత్తులు బ్రహ్మయొక్క నేత్రములను వర్ణించుచు కోతుల కన్నులను ఉపమానముగ నిచ్చినవి. కోతుల కన్నులు అతి చంచలముగ నలుదిక్కులను చూచుచుండును. బ్రహ్మనేత్రములుకూడ ఇట్లే యుండవలె. దృష్టి నొకచోటనే నిలిపియుంచుటవలన బ్రహ్మయొక్కపని నెరవేరదు. మనము ధ్యాననిమగ్నులమై ఒకచోట కూర్చున్నను కలిగెడి యిబ్బంది లేదు. కాని ఈశ్వరుడే ధ్యానములో మునిగియున్నచో సృష్టియేమికావలె ? కనుక అందఱిక్షేమమును కనిపెట్టు బ్రహ్మనేత్రములే కోతులకనులలో ఋషులకు కనిపించెను. వానరులలో పరమాత్మను దర్శించుట నేర్చుకొనుము.

నెమిలిని చూడుడు ! మహారాష్ట్రములో నెమిళ్ళెక్కువగాలేవు; కాని గుజరాతులో చాలనున్నవి. నేను గుజరాతులో నున్నప్పుడు ప్రతిదినమును పదిపండ్రెండుమైళ్ళు తిరిగివచ్చుట నా కలవాటు. అప్పుడు నాకు నెమిళ్ళు కనిపించెడివి. ఆకాశము నల్లనిమేఘములతో నిండి వర్షము కురియుముందు నెమిలి తన ధ్వనిని వినిపించును. హృదయమునుండి పెకల్చుకొనివచ్చు ఆ కేకసొగసు విన్నవారికే తెలియును. మన సంగీతశాస్త్రమంతయు ఈ ధ్వనినుండియే నిర్మాణమయినది. మయూరధ్వనియే "షడ్జము–షడ్జంరౌతి". మొదటిషడ్జము మనకు నెమిలినుండియే లభించినది. దీనినే పెంచి, తగ్గించి ఇతరస్వరముల కూర్చితిమి. మేఘములవైపు నిగుడ్చు దానిదృష్టి, ఆ గంభీరధ్వని, మేఘగర్జనను వినినంతనే గొడుగువలె విప్పుకొను దాని పింఛము ఎంతసొగసుగా నుండును ! ఆహా ? ఆ పింఛముయొక్క సౌందర్యముముందర మనుష్యుని దర్పమంతయు చూర్ణమై పోవును. రాజాధిరాజులుకూడ అలంకారములు చేసికొందురు. కాని నెమిలి పింఛము ముందర అవన్నియు యెందులకు ? ఎట్టి భవ్యదృశ్యమది? లెక్కలేని ఆ కన్నులు, రంగురంగుల ఆ దీప్తి, అద్భుతమును, సుందరమును అయిన ఆ ముద్ర, రమణీయరచన, ఆ చక్కనినగిషి ఒక్కసారి ఆ పింఛమును చూడుడు. పరమాత్మను కూడ అందులోనే చూడగలరు. సృష్టియంతయు ఈ విధముగనే అలంకృతమైయున్నది. పరమాత్మ సర్వత్ర దర్శనమిచ్చుచునేయున్నాడు. కాని అతనిని చూడలేని మందభాగ్యులము మనమే.

'మహాత్ములకు సర్వత్ర సుభిక్షమే. కాని అభాగ్యులమైన మనకు
అన్ని చోట్ల దుర్భిక్షమే.' —తుకారామ్.

వేదములలో అగ్ని యుపాసన చెప్పబడినది. అగ్ని నారాయణస్వరూపము. అదియెంత దేదీప్యమానమూర్తి! రెండు కఱ్ఱల రాపిడితో అది ప్రత్యక్షమగును. వానిలో అది యెక్కడ దాగి యున్నదో ఎవరికి తెలియును? ఏమి యా వేడిమి! ఆ తేజస్సు! వేదధ్వని అగ్నియుపాసనతోనే ప్రారంభమయ్యెను.

"అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్।
హోతారంరత్న ధాతమమ్"

ఏ యగ్నియొక్క ఉపాసనతో వేదమారంభమైనదో ఆ యగ్ని నొకసారి చూడుడు. అగ్నిజ్వాలలను చూచినప్పుడు జీవాత్మ అనుభవించు ఒడుదొడుకులు నాకు స్ఫురణకువచ్చును. ఆ జ్వాలలు ఇంటి యందలి ప్రొయ్యిలోనివైనను, దావాగ్నిలోనివైనను సడి చప్పుడులేని విరాగియింటివలె నుండవు. ఆ జ్వాలలున్నచోటులందెల్ల వాని సందడి ఉండనే యుండును. అవి అంతకంతకు పై కెగసిపోవలెనని ఆరాటపడుచుండును. 'ఈథర్' వలనను, గాలియొత్తిడి వలనను ఈ జ్వాలలు కదలుచుండునని మీలో విజ్ఞానవేత్తలు అందురు. కాని నేనిచ్చు అర్థమిది: పైనున్న పరమాత్మను, తేజోరాశియైన ఆ సూర్యనారాయణుని కలియుటకు అవి నిరంతరమును పైకెగయుచుండును. అంటుకొన్నది మొదలు ఆరిపోవువరకును వాని యాతురత అట్లే యుండును. సూర్యుడు అంశి, ఈ జ్వాలలు అంశలు. అంశ అంశిలో కలియుటకు తహతహ పడుచుండును. మంటలారిపోయినప్పుడే వాని యాతురత నిలిచిపోవును; అంతవరకును ఆగదు. సూర్యునికి తామెంతో దూరముననున్న విషయమే యీజ్వాలలకు తెలియదు. శక్తికొలది క్రింది నుండి పైకి లేచుచుండుటయే వానికి తెలియును. అగ్నియనగా ఈ విధముగ జాజ్వల్యమానమైన వైరాగ్యమును ప్రకటించు జ్వాలయేయని తోచును. ఇందుచేతనే 'అగ్నిమీళే' అనునది వేదములో మొదటి ధ్వనియైనది.

ఆ కోయిలను నేనెట్లుమఱువగలను? ఎవరి నదిపిలుచుచున్నది? వేసవిలో నదులును కాలువలును ఎండిపోయినను వృక్షములు క్రొత్తగ చిగుర్చుచుండును. వృక్షముల కింతవైభవమును సమకూర్చిన వారెవరు? ఆ వైభవదాత యెక్కడనున్నాడు? అని యది అడుగుట లేదుకదా! ఎంత మధురధ్వని ఆ కోయిలది? హిందూధర్మములో కోయిలపేరిట ఒక వ్రతవిధానమే యున్నది. కోకిలధ్వనిని వినకయే భుజింపమని స్త్రీలు వ్రతము పట్టుదురు. కోకిలరావ

ములో పరమాత్మను దర్శించుటను ఈ వ్రతము నేర్పును. కోయిలయెంతో సుందరముగ గానముచేయును. ఉపనిషత్తునే గానము చేయుచున్నదా యన్నట్లుండును. దాని మధురమైన వాణి వినబడునే కాని అది మాత్రము కనబడదు! అంగ్లకవి వర్డ్సువర్తు దానిని చూచుటకు పిచ్చివానివలె అడవులవెంట పరుగెత్తును. అంగ్లమహాకవి కోయిలను వెదకబోవును. కాని భారతదేశపు సామాన్యస్త్రీలు కోకిలవాణి వినబడకపోయినచో భోజనమే చేయరు. ఈ కోకిలవ్రతము ద్వారా భారతస్త్రీలు మహాకవి పదవిని పొందినారు. కోయిల వినిపించు పరమానంద కరమైన మధురధ్వనిలో సుందరపరమాత్మ నిశ్చయముగ అభివ్యక్తమగును.

కోయిల సుందరమైనదా? కాకి పనికిమాలినదా? కాకినిగూడ గౌరవింపుము. కాకి నాకు చాల ప్రియమైనది. దానిది కారునలుపు. తీవ్రమైన ధ్వని. ఆ ధ్వని యేమైనచెడ్డదా? కాదు, అది కూడ మధురమే. రెక్కలు కొట్టుకొనుచు అది వచ్చుచుండుట ఎంతమనోహరముగ నుండును! చిన్నపిల్లల చిత్తమును అది యెంతైన ఆకర్షించును. చిన్నపిల్లలు ఇంటిలోపల అన్నము తినరు. బయటివాకిటిలో కాకిని, పిచ్చుకను చూపించుచు ముద్దలుతినిపించిననే వారు తిందురు. కాకితో స్నేహముచేయు పిల్లవాడు పిచ్చివాడా? కాదు. వానిలో జ్ఞానము నిండియున్నది. కాకిలో వ్యక్తమగు పరమేశ్వరునితో అతడంతలో లీనమైపోవును. తల్లి అన్నములో పెరుగువేసిపెట్టినను, పాలు పంచదార వేసి పెట్టినను వానికది రుచింపదు. కాకి తన రెక్కలు ముక్కు ఆడించుటలోనే వానికానందముకలదు. సృష్టిపట్ల చిన్నపిల్లలకుగల యుత్సాహమును ఆధారముగా చేసికొని 'ఈసబు' తన నీతికథలను రచించెను. ఈసబునకు సర్వత్ర ఈశ్వర దర్శనము కల్గుచుండెడిది. నాకు ప్రియమైన పుస్తకములపట్టికలో ఈసబు నీతి కథలకు తప్పక ప్రథమస్థాన మిత్తును. ఈసబురాజ్యములో రెండుచేతులు, రెండుకాళ్ళుగల మానవులుమాత్రమే కాక నక్కలు కుక్కలు కాకులు కప్పలు కుందేళ్ళు తోడేళ్ళు తాబేళ్ళు మొసళ్ళు కలవు. ఇవన్నియు సంభాషించుచు నవ్వుచు ఉండును. ఇదొక సజీవమైన గొప్పసమ్మేళనము. ఈచరాచర సృష్టియంతయు తనతో సంభాషించుచున్నట్లు ఈసబు భావించెను. అతనికి దివ్యదర్శనము లభించెను. రామాయణముకూడ ఈ తత్త్వముమీదనే ఈ దృష్టితోనే రచింపబడినది. తులసీదాసు రాముని బాలలీలలను వర్ణించినాడు. రాముడు అంగణములో ఆడుకొనుచుండును. కాకియొకటి దగ్గరకువచ్చును. రాముడు దానిని నెమ్మదిగా పట్టుకొనబోవును. కాకి వెనుక వెనుకకు పోవును. చివరకు రాముడు అలసి

పోవును. అంతలో అతని కొకఉపాయముతోచును. రాముడు కొంచెముమిఠాయి దానికి చూపుచు సమీపించును. అదిచూచి కాకి మెల్లి మెల్లిగా దగ్గరకువచ్చును. కాకి పరమేశ్వరస్వరూపమే కనుక తులసీదాసు ఈవర్ణనకు చాలపుటలు వినియోగించినాడు. రామునియంశమే ఆ కాకియందును ఉన్నది. రామునికిని కాకికిని గల పరిచయము పరమాత్మకును పరమాత్మకునుగల పరిచయమువంటిదే.

## 54. దుర్జనులలోకూడ పరమాత్మను చూచుట

సారాంశము: ఈ విధముగ సృష్టిలోని పవిత్రమైన నదులు, పెద్దపర్వతములు, గంభీరసాగరము, వాత్సల్యమూర్తియగు గోమాత, శ్రేష్ఠమైనగుఱ్ఱము, శౌర్యముగలసింహము, మధురమైనకోయిల, సుందరమైననెమిలి, స్వచ్ఛమును వి కాంత ప్రియమునగు సర్పము, రెక్కలాడించుకాకి, పైకెగయు అగ్నిజ్వాలలు, ప్రశాంతమైన నక్షత్రములు మొదలగు వివిధరూపములలో పరమేశ్వరుడు నిండియున్నాడు. అతనిని చూచుట నేత్రములకు అలవాటుచేయవలె. పెద్దఅక్షరములు సరళాక్షరములు మొదటను, చిన్నఅక్షరములు సంయుక్తాక్షరములు తరువాతను నేర్చుకొనవలె. సంయుక్తాక్షరములు అడుగడుగునను వచ్చుచునే యుండును. కనుక నవి నేర్చుకొననంతవరకు ప్రగతిలేదు. దుర్జనులు సంయుక్తాక్షరములవంటివారు. కనుక దుర్జనులలోని పరమాత్మనుకూడ చూచుట నేర్చుకొనవలె. రాముడు ఈశ్వరస్వరూపుడని తెలిసికొనగలము. రావణుడును కూడ అంతేయని తెలిసికొనవలె. ప్రహ్లాదుని ఈశ్వరాంశగా ఆమోదించగలము. కాని హిరణ్యకశిపునిగూడ ఆమోదించవలె. వేదములో—

> నమోనమః స్తేనానాం పతయే నమోనమః నమః పుంజిష్టేభ్యోనమో
> నిషాదేభ్యః। 'బ్రహ్మ దాశా బ్రహ్మదాసా బ్రహ్మైవేమే కితవాః'

"ఆ బందిపోటు దొంగలనాయకులకు నమస్కారము. ఆ క్రూరాత్ములకు, హింసకులకు నమస్కారము. ఈ మోసగాండ్రు, ఈ దుష్టులు, చోరులు అందరును బ్రహ్మస్వరూపులే. వీరందరికిని నమస్కారము."

దీనియర్థమేమి? సరళాక్షరములను నేర్చుకొన్నారము. ఇక కఠినాక్షరములనుకూడ అవగాహనచేసికొనవలె" నని. కార్లైల్ "వీరపూజ" అను గ్రంథమును రచించెను. అందతడు నెపోలియనును కూడ ఒక వీరునిగ చిత్రించెను. ఈ పాత్ర శుద్ధపరమాత్మ స్వరూపముకాదు; మిశ్రితరూపము. కాని ఇందులోని పరమేశ్వరునికూడ మన మవగాహన చేసికొనవలెను. కనుకనే

తులసీదాసు రావణుని రామునియొక్క విరోధిభక్తుడన్నాడు. ఈ భక్తుని రూప రేఖలు కొంచెము వేరుగా నుండును. నిప్పుసోకుటవలన కాలు వాచును. కాని దానికి కాపుకాచిన వాపుతీరును. ఇక్కడ రెండుచోట్లను పనిచేసినది ఒకటే వేడిమి. కాని అది భిన్నభిన్నరూపములలో కనబడును. అట్లే రామరావణుల బాహ్యప్రవర్తనలు వేరువేరుగ కనబడుచున్నను అవి పరమేశ్వరుని రూపము లనియే గ్రహింపవలె.

స్థూలము, సూక్ష్మము; సరళము, మిశ్రమము; సరళాక్షరములు, సంయుక్తాక్షరములు అన్నియు నేర్చుకొనుము. చివరకు పరమేశ్వరుడు లేని స్థానమే లేదను అనుభవమును పొందుము. అణురేణువులయందున్నవాడు కూడ అతడే. చీమ మొదలు బ్రహ్మాండము వరకు సర్వమును పరమాత్మతోనే నిండి యున్నది. సమస్తమును ఒకరకముగనే కనిపెట్టిచూచు కృపాళువు, జ్ఞాన మూర్తి, వత్సలుడు, సమర్థుడు, పావనుడు, సుందరుడు అయిన పరమాత్మ నలుదిశల సర్వత్ర నిలిచియున్నాడు. (24-4-32)

# పదునొకొండవ అధ్యాయము

## విశ్వరూపదర్శనము

### 55. విశ్వరూప దర్శనముకొఱకై అర్జునుని ఆరాటము

సోదరులారా! ఈ విశ్వములోని అనంతవస్తువులలో వ్యాపించియున్న పరమాత్మను మన మెట్లు గుర్తింపవలెనో, మనకనుల కగపడుచున్న ఈ విరాడ్రూపమును మన మెట్లు హృద్గతము చేసికొనవలెనో కడచినసారి విపుల ముగ తెలిసికొన్నారము. మొదట స్థూలము. తరువాత సూక్ష్మము. మొదట సరళము తరువాత జటిలము—ఈ విధముగ సమస్త వస్తువులలోను భగవంతుని సాక్షాత్కారము చేసికొనవలెనని, ఎడతెగని అభ్యాసముచే సమస్తవిశ్వమును ఆత్మస్వరూపముగ చూచుట నేర్చుకొనవలెనని కడచిన అధ్యాయములో తెలిసి కొంటిమి.

ఈ నాడు పదునొకొండవ అధ్యాయము చూడవలసి యున్నారము. ఈ యధ్యాయములో భగవంతుడు తన ప్రత్యక్షరూపమును చూపించి తన పరమకృపారసమును అర్జునునిపై కురియించినాడు. "ప్రభూ! నీ ప్రభావమును

పూర్ణముగ ప్రకటించురూపమును చూడగోరు చున్నాను" అని యర్జునుడు భగవంతుని కోరినాడు. అర్జునుడు కోరినది ఇట్టి విశ్వరూపసందర్శనమే.

'విశ్వము' 'జగత్తు' అనుమాటలు మనము వాడుచుందుము. ఈ భూమండలము విశ్వములో నొక చిన్నభాగము. దీనినైనను మనము సరిగా తెలిసికొనలేకున్నారము. ఈ భూమండల మింతవిశాలముగ కనబడుచున్నను, సమస్త విశ్వమును దృష్టిలో పెట్టుకొని చూచినచో అది మిగుల అల్పమైనదని గ్రహింపగలుగుదుము. రాత్రివేళ ఆకాశముపంక కొంచెము దృష్టి నిలిపి చూచిన అసంఖ్యాకములైన గోళములు కనబడును. విశాలాకాశమున సుందరములై రంగు రంగుల చిన్నచిన్న పూలవలె మినుకు మినుకు మను లక్షలకొలది నక్షత్రముల స్వరూపము మీకు తెలియునా ? ఈ చిన్నచిన్న నక్షత్రములు మహాప్రచండమైనవి. వానిలో లెక్కలేనన్ని సూర్యమండలములు ఇమిడియున్నవి. రసమయములు, తేజోమయములు అయి ప్రకాశించు గోళరాసులవి. ఈ యనంత రాసుల లెక్క ఎవరు తేల్చగలరు ? వీనికి దరిలేదు, అంతములేదు. మనసాధారణ నేత్రములకే అవి వేలకొలదిగ కనబడును. దుర్భిణితో చూచిన అవికోట్లకొలదిగ కనబడును. ఇంకను పెద్దదుర్భిణియైనచో కనబడుసంఖ్య యింకను పెరుగును. దీని కంతమెక్కడనో, అదెట్లుండునో తెలిసికొనుట కష్టసాధ్యము. పైని, క్రింద, సర్వత్ర వ్యాపించియున్న అనంతసృష్టిలో ఒక చిన్న భాగమును భూమండల మందుము. కాని ఈ చిన్నదికూడ ఎంతో విశాలమైనదిగా కనబడును.

ఈ విశాలసృష్టి పరమేశ్వరుని రూపముయొక్క ఒకవైపు మాత్రమే. ఇక దాని రెండవవైపు చూతము. అది కాలము. ఇంతవరకు గడచినకాలము ఐతిహాసికముగా ఎంత చూచినను పదివేల సంవత్సరములకు మించదు. భవిష్యత్తు మనఊహకే అందదు. చారిత్రిక కాలము పదివేల సంవత్సరములైన మన జీవితపరిమితి నూరేండ్లు దాటుట కష్టము. నిజమునకు కాలమనునది అనాది. అనంతము. కడచిన కాలమునకు హద్దు పద్దులులేవు. ఇక గడవనున్నకాలము మనఊహ కందనిది. అనంతవిశ్వముతో పోల్చిన మనభూమి ఎంత అల్పమో, అనంతకాలములో ఈ పదివేల సంవత్సరములును అంతే. భూతకాలము అనాది. భవిష్యత్తు అనంతము. ఈ కొలదిపాటి వర్తమానకాలము మనము మాటలాడుచుండగనే భూతకాలములోనికి వెళ్ళిపోవును. 'ఇదిగో ఇది వర్తమానకాలము' అని యనుచుండగనే అది భూతకాలములో లీనమైపోవును. ఇట్లు మనవర్తమాన కాలము అత్యంత చపలమైనది. ఈ విధముగ కాల మను ఈ మహానది అఖండ

ముగ ప్రవహించుచున్నది. దాని ఆద్యంతములు మనకు తెలియవు. ఈ ప్రవాహముయొక్క అత్యల్పమైన మధ్యభాగము మాత్రము మనకు కనిపించును.

ఈ విధముగ ఒకవైపున విశ్వముయొక్క, ఒకవైపున కాలము యొక్క అనంతత్వము గోచరించుచున్నది. దీనింబట్టి సృష్టియొక్క అంతము మన ఊహకు అందనివిషయమని తేలుచున్నది. మూడుకాలములలోను, ముల్లోకములలోను, భూతభవిష్య ద్వర్తమానములలోను, పైని క్రిందను నడుమను, సర్వత్ర వ్యాపించియున్న పరమేశ్వరుని విరాడ్రూపమును ఒక్కసారిగా చూడవలెనను ఇచ్ఛ అర్జునునిలో ఉత్పన్నమయ్యెను. ఈ యిచ్ఛనుండి పదునొకొండవ అధ్యాయము పుట్టినది.

అర్జును డనిన భగవంతునికి చాలప్రేమ. అది ఎంత ప్రేమయనగా, పదియవ అధ్యాయమున ఏ యే రూపములలో తన్ను చింతన చేయవలెనో ఆయా రూపములను గూర్చి భగవంతుడు చెప్పుచు "పాండవులలోని అర్జునునిరూపములో నన్ను స్మరించుము" అని యనును. "పాండవులలో నేను ధనుంజయుడను" అని కృష్ణుడు చెప్పెను. దీనిని మించిన ప్రేమోన్మత్తత మరెక్కడనుండును? ప్రేమ యెంత పిచ్చిదికాగలదో తెలుపుట కిది యుదాహరణ. భగవంతునికి అర్జునుని పైని అపారమైన ప్రీతి. ఆ ప్రేమ ప్రసాదమే పదునొకొండవ అధ్యాయము. భగవంతు డర్జునునకు దివ్యదృష్టిని ప్రసాదించి, తనదివ్యరూపమును చూడవలెనను అర్జునుని కోరికను సఫలము చేసెను. ఈ విధమున నతడు తన ప్రేమ ప్రసాదమును అర్జునున కందించెను.

## 56. సూక్ష్మరూపములో సైతము పూర్ణదర్శనము సిద్ధించును

ఆ దివ్యరూపముయొక్క భవ్యవర్ణన ఈ యధ్యాయములో నున్నది. ఇదంతయు నిజమైనను ఈ విశ్వరూపదర్శనము కావలెనను ప్రలోభమే నాకు లేదు. నేను చిన్నరూపముతోనే సంతృప్తి నొందుదును. నాకు కనిపించు సామాన్యసుందర రూపముయొక్క మాధుర్యమును అనుభవించుట నేను నేర్చుకొంటిని. పరమేశ్వరుడు ముక్కముక్కలుగ విభజింపబడిలేడు. మనము చూచు పరమేశ్వరుని రూపము పరమేశ్వరునిలోనొక భాగముమాత్రమే యని, మిగిలిన భాగమంతయు బయట నెక్కడనో ఉన్నదని నేను భావించను. ఈ మహావిశ్వమందెల్ల వ్యాపించియున్న పరమేశ్వరుడే యథాతథముగా సంపూర్ణ రూపముతో ఒక చిన్నమూర్తిలోను, ఒక రజఃకణములోను కూడ వ్యాపించియున్నాడని నాభావము. చిన్నవస్తువులో అత డేమాత్రమును తక్కు

వగా నుండదు. అమృతసాగరములో నున్న మాధుర్యమే అందలి చిన్న బిందువులోకూడ ఉండును. నాకు లభించిన ఒక చిన్న అమృతబిందువులోని మాధుర్యము చవి చూచుచుండుటయే నాకు ప్రియము. కావలెననియే నే నిక్కడ అమృతమును దృష్టాంతముగ తీసికొన్నాడను. నీటినో, పాలనో ఉపమానముగ తీసికొనలేదు. ఒకగిన్నెడు పాలలో నెంతరుచి యున్నదో గరిటెడుపాలలోకూడ అంతే రుచి యుండును. కాని గిన్నెడుపాలలోని పుష్టి గరిటెడుపాలలో నుండదు. కాని అమృతముయొక్క విషయము వేరు. అమృతసాగరములో నున్నంతమాధుర్యము ఒక్క అమృతబిందువులోగూడ నున్నది. దానితోపాటు పుష్టికూడ సమానమే. అమృతబిందు వొకటియైనను గొంతులోనికిదిగిన అమృతత్వమే లభించును.

ఆ విధముగనే పరమేశ్వరుని విరాట్స్వరూపములో నున్న దివ్యత్వమే, పవిత్రతయే ఒక చిన్నమూర్తిలోకూడ ఉన్నది. మచ్చునకై తెచ్చిన గుప్పెడు గోదుమలనుబట్టి ఇవి గోదుమలని నేను గుర్తుపట్టలేకపోయినచో, గోనెడు గోదుమలను నా యెదుట బెట్టినను యెట్లు గుర్తుపట్టగలను ? నా కంటియెదుటి ఈశ్వరుని యొక్క ఒక చిన్నమూర్తిలో నే నీశ్వరుని గుర్తింపలేకపోయిన, అతని విరాట్స్వరూపమును చూచి మాత్రము ఎట్లు గుర్తింపగలను? చిన్న, పెద్ద–ఇందు విశేష మేమున్నది? చిన్నరూపమును మనము తెలిసికొన్నచో పెద్దరూపము అవగతమయినట్లే! కనుక ఈశ్వరుడు తన విశ్వరూపమును చూపవలెనను ఆకాంక్ష నా కేమియులేదు. అర్జునునివలె విశ్వరూప సందర్శనమును అర్థించు యోగ్యత కూడ నాలోలేదు. అదిగాక నాకు కనబడునది ఆ విశ్వరూపములో నొక చిన్న భాగమునికూడ నాకు తోచదు. చిత్రపటమునుండి కత్తిరింపబడిన ఒకముక్కను చూచి ఆ చిత్రపటము ఎవరిదో మనము గుర్తింపలేము. కాని పరమాత్మ యిట్టి ముక్కలసంపుటి కాడు. అతడు ముక్కలుముక్కలుగ ఖండింపబడజాలడు. ఒక్క చిన్నరూపములోకూడ అనంతుడైన పరమేశ్వరుడు సంపూర్ణముగ నిండి యుండును. చిన్న ఫొటోకును పెద్దఫొటోకును భేదమేమి ? పెద్దఫొటోలోనున్న వివరణలన్నియు దాని ప్రతిరూపమైన చిన్నఫొటోలోకూడ ఉండును. చిన్నఫొటో పెద్దదానిలో నొకభాగము కాదు. చిన్నటైపు అక్షరములలో నున్నమాట ఏ యర్థము నిచ్చునో ఆ యర్థమునే పెద్దటైపు అక్షరములలో నున్న మాటకూడ ఇచ్చును. పెద్దటైపులోనున్నది ఎక్కువ అర్థమును, చిన్నటైపులోనున్నది తక్కువ అర్థమును ఈయదు.

ఈ వాదమే మూర్తిపూజకు ఆధారము. అనేకులు మూర్తిపూజమీద దాడి వెడలుచుందురు. విదేశీయులును, స్వదేశస్థులు కొందరును మూర్తిపూజ అనుచిత మనుచుందురు. కాని ఆలోచించినకొలది మూర్తిపూజలోని దివ్యత్వము నాకు స్పష్టముగ కనబడుచుండును. మూర్తిపూజ యనగా నేమి ? ఒక చిన్న వస్తువులో బ్రహ్మాండమును దర్శింపగలవిద్యయే మూర్తిపూజ. ఒక కుగ్రామ ములో విశ్వమునెల్లను చూడగలవిద్యను నేర్చుకొనుట తప్పా ? ఇది ఊహా గానము కాదు, అనుభవసిద్ధమైన విషయము. విరాట్స్వరూపములో నేమున్నదో అదంతయు ఒకచిన్న మూర్తిలోకూడ ఉన్నది. అదే ఒకమృత్తికా కణములో కూడ ఉన్నది. ఈ మృత్తికలోనే మామిడి, అరటి, గోదుమ, బంగారము, వెండి– ఇవన్నియు ఉన్నవి. సృష్టియంతయు ఈ మృత్కణములో నున్నది. ఒక చిన్న నాట్యమండలిలో ఒకవ్యక్తియే భిన్నభిన్నవేషములు ధరించి నాట్యరంగము మీదికి వచ్చుచుండును. పరమేశ్వరుడుకూడ ఇట్టివాడే. నాటకకర్త నాటక మును వ్రాసి, తానే నాటకపాత్రలుకూడ ధరించినట్లు పరమేశ్వరుడుకూడ అనంత మైన నాటకమును రచించి తానే అనంతమైన పాత్రలనుధరించి ఈ నాట్య రంగముమీద అభినయించుచుండును. ఈ యనంత నాటకములో ఒక్కపాత్రను అర్థముచేసికొంటిమా, అందున్న పాత్రల నన్నింటిని అర్థముచేసికొన్నట్లే !

కావ్యములలో ఉపమానములు, దృష్టాంతములు మొదలైన వానికున్న ఆధారమే మూర్తిపూజకును ఉన్నది. ఏదైన గుండ్రని వస్తువును చూచినప్పుడు మనకు ఆనందము కలుగును. ఎందువలననగా దానిలో నొక క్రమవిధాన ముండును కాబట్టి. ఈవిధానము ఈశ్వరునిస్వరూపము. ఈశ్వరసృష్టి సర్వాంగ సుందరము. దానిలో ఒక క్రమపద్ధతియున్నది. ఆ గుండ్రనివస్తువు సువ్యవస్థిత మైన ఈశ్వరునిమూర్తి. కాని అడవిలోపెరుగు వంకరటింకరచెట్టుకూడ ఈశ్వరుని స్వరూపమే. దానిలో ఈశ్వరునిస్వచ్ఛందతయున్నది. ఆ చెట్టునకు ఏమియు బంధనములులేవు. భగవంతు నెవరు బంధింపగలరు ? ఆ వంకరటింకరచెట్టులో బంధనాతీతుడైన పరమేశ్వరు డున్నాడు. ఒక తిన్నని నున్నని స్తంభమును చూచినప్పుడు దానిలో ఈశ్వరుని సమత్వము కనబడును. నగిషీలు చెక్కిన స్తంభమును చూచినప్పుడు, నక్షత్రమాలికలతో ఆకాశమును అలంకరించిన పర మేశ్వరుడు కనబడును. పార్కులో అలంకారముకొఱకు కత్తిరింపబడిన మొక్క లను చూచినపుడు ఈశ్వరుని సంయమరూపము కనబడును. హద్దులులేని విశాలమైన అరణ్యములో ఈశ్వరుని భవ్యతను, స్వతంత్రతను దర్శింతుము.

అడవిలోను ఆనందమును పొందుదుము. తీర్చి దిద్దిన పార్కులోను పొందుదుము. కాని మనము పిచ్చివారమా? కాము. ఆనంద కారణము రెంటిలోను ఉన్నది. ఎందుచేతననగా ఈశ్వరుని గుణము ప్రతి దానియందును ప్రకటమై యున్నది. నున్నని సాలగ్రామములో నున్న తేజస్సే నర్మదలోని వంకరటింకర గణపతిలోను ఉన్నది. కనుక నా కావిరాట్స్వరూపము వేరుగ కనబడకపోయినను నష్టిలేదు.

పరమేశ్వరుడు సర్వత్ర వేఱువేఱు వస్తువులలో భిన్నభిన్న గుణముల ద్వారా ప్రకటమగుచుండును. ఇందువలన మన కానందము కలుగును. ఆ వస్తువులలో ఆత్మీయత గోచరించును. నీకు ఆనందము అకారణముగ కలుగుట లేదు. ఆనంద మెందులకు కలుగుచున్నది? ఏదో కొంతసంబంధముండుటం బట్టియే! బిడ్డను చూచినతోడనే తల్లికి ఆనందముకలుగును. ఎందులకనగా ఆ సంబంధమును ఆమె యెరుగును కనుక. ఈవిధముగనే ప్రతివస్తువుతోడను ఈశ్వర సంబంధము పెట్టుకొనుము. నాలోనున్న పరమేశ్వరుడే ఆ వస్తువులోను ఉన్నాడనుకొనుటయే ఆనందమునకు కారణము. మరొక కారణ మేమియులేదు. ఈ ప్రకారము ఆత్మసంబంధమును పెంచుకొనుటయే ఆనందమును పెంచుకొను మార్గము. అంతటను ప్రేమసంబంధమును పెట్టుకొని చూడుము. ఎంత మనోహరముగ నుండునో! అప్పు డనంతసృష్టిలో నున్న పరమాత్మ పరమాణువులో కూడ నీకు కనబడును. ఒక్కసారి ఆదృష్టి అలవడినచో ఇక కావలసిన దేమున్నది? కాని దీనికై ఇంద్రియములకు సుసంస్కారములు, సదభ్యాసములు కావలెను. భోగవాసనలు తొలగిపోయి పవిత్రమైన ప్రేమదృష్టి మనకు లభించినప్పుడు ప్రతివస్తువులోను ఈశ్వరుడే కనబడును. ఉపనిషత్తులలో ఈవిషయము చాలసుందరముగ వర్ణింపబడినది. ఆత్మరంగు ఎట్టిదన్నపుడు ఋషి ప్రేమపూర్వకముగ 'యథా అయం ఇంద్రగోపః' ఇది పట్టువలె మృదువై ఎఱ్ఱనిదైన ఇంద్రగోపమను పురుగువంటి దన్నాడు. ఆ పురుగును చూచినప్పుడు ఎంత యానందము కలుగును! ఈ యానంద మేల కలుగును? ఏ భావముతో నన్ను నేను చూచుకొనుచుందునో ఆభావముతోనే దానినికూడ చూచుచుందును. దానితో నా కెట్టి సంబంధమును లేకపోయినచో నాకా ఆనందము కలుగునా? నాలోపల మన్న సుందరమైన ఆత్మయే ఆ యింద్రగోపమునందును ఉన్నది. కావుననే ఆ యుపమాన మిచ్చినాను. ఇంతకు ఉపమాన మెందులకిత్తురు? దానినుండి ఆనందమెందులకు కలుగును? రెండువస్తువులలో సామ్యముండుటచేత ఉప

మాన మీయబడును. అందుల కనియే ఆనందము కలుగును. ఉపమానోప మేయములు కేవలము భిన్నవస్తువులైనచో ఆనందము కలుగదు. ఉప్పు, కారము వలె నుండునని ఎవడైన అనినచో వాడు పిచ్చివాడందుము. కాని యెవరైన నక్షత్రములను పుష్పములతో పోల్చిన, ఆ పోలికకు మన మానం దింతుము. ఉప్పు కారమువలె నుండునన్నప్పుడు వానిలోని సాదృశ్యము మనకవగతము కాదు. కాని ఉప్పులో నున్న పరమాత్మయే కారములో కూడ ఉన్నాడను ఎఱుక కలవాడు ఈ సాదృశ్యములో కూడ ఆనందమును పొందును. ప్రతివస్తువునందును ఈశ్వరుడు పడుగుపేకగా నిండియున్నాడనియే దీని సారాంశము. ఈ యనుభవము కలవానికి విశ్వరూపదర్శనముతో పనిలేదు.

## 57. విరాడ్విశ్వరూప దర్శనము సుకరము సైతము కాదు

నేనావిశ్వరూపమును చూచి సహింపగల్గుటమాత్రమెట్లు ? సగుణము, సుందరము అయిన ఒక చిన్నరూపము నెడల నాకున్న ప్రేమ, ఆత్మీయత, మాధుర్యము-వీనియొక్క అనుభవము ఈ విశ్వరూపదర్శనములో ఉండదేమో అనుకొందును. ఈ స్థితియే అర్జునునకు కలిగెను. చివరకతడు "ఓప్రభూ, నీమనోహరమైన పూర్వరూపమును చూపుము" అని గజగజ వణకుచు అన్నాడు. విరాట్స్వరూపమును :చూడవలెనను కోరిక పెట్టుకొనవలదని అతడు స్వాను భవమువలన మనకు చెప్పుచున్నట్లున్నది యిది. ఈశ్వరుడు త్రికాలముల యందు, త్రిలోకములయందు వ్యాపించియుండుటయే బాగుగా నున్నది. ముద్ద కట్టుకొని బగబగ మండుచు గోళాకారమువలెనున్న ఆతార నాయొద్దకు వచ్చి, నిలిచినచో నాస్థితి యేమికావలె? ఆ నక్షత్రములు వానిస్థానములలో నవియుండి ఎంతశాంతముగ కనబడుచున్నవి! అంతదూరమునుండి అవి నాతో మాట్లాడు చున్నవాయని అనిపించును. కాని దృష్టికి శాంతినికలిగించు ఆనక్షత్రము నా యొద్దకు వచ్చిన నింకేమున్నది ? బగబగమండు ఆ యగ్నిలో నేను కాలి బూడిదదయైపోదును. ఈశ్వరునియొక్క ఈ యనంతబ్రహ్మాండములను ఉన్న చోటనే యుండనిండు. వాని నన్నిటిని ఒక చోటికే తీసికొనివచ్చుటలో ఏమి యానందమున్నది? బొంబాయి 'కబూతర్‌ఖానా' (పావురములప్రదర్శనశాల)లో వేలకొలది పావురము లుండును. వాని కక్కడ నేమైనను స్వేచ్ఛయున్నదా ? ఆ దృశ్యము చాలవికటముగ నుండును. ఈ సృష్టి పైని, నడుమ, దిగువ — ఇట్లు మూడురీతుల విభజింపబడి యుండుటలోనే మాధుర్యమున్నది. స్థలాత్మక సృష్టికి వర్తించు ధర్మమే కాలాత్మకసృష్టికి కూడ వర్తించును. వెనుకటి జన్మ

యొక్క స్మృతి మనకులేదు. అట్లే భవిష్యత్తును గూర్చిన జ్ఞానము కూడ లేదు. ఇది మనకు శుభదాయకము. మానవమాత్రులకు తెలియక కేవలము పరమేశ్వరునికే తెలిసిన అయిదు విషయములు ఖురాన్‌షరీఫ్‌లో చెప్పబడినవి. వానిలో నొకటి భవిష్యత్తును గూర్చిన జ్ఞానము. మనము అంచనాలు వేయు చుందుము. కాని ఊహించివేయు అంచనాలు జ్ఞానమనబడవు. భవిష్యత్తును గూర్చిన జ్ఞానము మనకు లేకపోవుటలోనే శుభమున్నది. అట్లే భూతకాల విస్మృతి కూడ నిజముగ శుభావహము. దుష్టుడెవడయిన సజ్జనుడుగా మారి నాయెదు టికి వచ్చినప్పుడు వాని వెనుకటి ప్రవర్తన నాకు జ్ఞప్తికి వచ్చినచో వానియెడల నా కాదరణ కలుగదు. వా డెంత నచ్చజెప్పినను వానివెనుకటి పాపములను నేను మఱవలేను. వాడు చచ్చి మరల పుట్టినప్పుడే ప్రపంచము వాని పాపములను మరచిపోవును.

పూర్వవిషయములను స్మరించుటవలన వికారములు పెరుగును. ఈ పూర్వస్మృతి నశించినచో చిక్కులన్నియు తీరును. పాపపుణ్యములను విస్మ రించుట కొక యుపాయము ఉండవలెను. మరణమే ఆ యుపాయము. ఈ జన్మలో కలుగు బాధలనే మనము సహించలేనపుడు ఇక వెనుకటి జన్మము లోని కుళ్ళంతయు త్రవ్వుకొనుట యెందులకు? ఈజన్మ మను గృహము నందు కుళ్ళేమైనతక్కువా? మన బాల్యావస్థనుకూడ మనము చాలవరకు మరచి పోదుము. ఈ విస్మృతి మంచిదే! జరిగిపోయిన విషయములను మరచిపోవుటయే హిందూ – ముస్లింమైత్రికి ఏకైకమార్గము. ఔరంగజేబు అత్యాచారములను చేసెను. వాని నెన్నాళ్ళు వల్లెవేయుచుందుము? గుజరాతీభాషలో రతన్‌బాయి యొక్క గీత మొకటి యున్నది. దానిని తఱచు మన మిక్కడ వినుచుందుము. "ప్రపంచములో చివరకు నిలిచియుండునది కీర్తి యొక్కటే! పాపమును ప్రజలు మరచిపోదురు" అని యాగీతముచివర ఉన్నది. కాలమే జల్లెడపట్టి చెడుగును మంచినుండి వేరుచేయును. చరిత్రలో మంచి యెంతయుండునో అంతే తీసికొనవలె. పాపమును విసర్జింపవలెను. మానవుడు చెడుగునెల్లను విడిచివేసి మంచినిమాత్రమే గుర్తుపెట్టుకొన్నచో ఎంతబాగుగానుండును! కాని అట్లు జరుగుటలేదు. కనుకనే విస్మృతి చాల అవసరము. ఇందులకై భగ వంతుడు మృత్యువును నిర్మించినాడు.

సారాంశమిది: ఈ జగత్తు ఎట్లున్నదో అట్లుండుటయే మంగళకరము. కాల స్థలాత్మకమైన జగత్తునెల్ల దగ్గరకు తెచ్చుకొనవలసిన అవసరములేదు. అతిపరి

చేయములో సారస్యములేదు. కొన్ని వస్తువులతో సన్నిహితత్వము పెంచుకొన వలె. మరికొన్నిటితో సంబంధము మానవలె. "గురువునకు దూరముగా నమ్రతతో కూర్చుందుము. తల్లి కట్లుచేయుదుమా? ఆమె యొడిలోనే కూర్చుందుము. ఏ వ్యక్తితో నెట్లు వ్యవహరింపవలెనో అట్లే చేయవలె. పుష్పములను మనము దగ్గరకు తీసికొందుము. కాని నిప్పును ఎడముగా నుంతుము. నక్షత్రము దూరమునుండియే సుందరముగా తోచును. సృష్టికూడ అంతే! అతిదూరముననున్న సృష్టిని చాలదగ్గరకు తెచ్చుకొనుటవలన అధికమైన ఆనందమును పొందుదుమని చెప్పలేము. ఉన్నవస్తువును ఉన్నచోటనే యుండనిమ్ము. అందులోనే సారస్యమున్నది. దూరముననుండి రమ్యముగ కనబడు వస్తువును దగ్గరకు తెచ్చుకొనిన అది సుఖదాయకమే యగునని చెప్పలేము. దానిని దూరముగనేయుంచి దాని సారస్యమును గ్రహింపవలెను. మొండి పట్టుదలతో అతి పరిచయము చేసికొనుటవలన ప్రయోజన మేమియు లేదు.

సారాంశమిది : త్రికాలము లొకసారియే మనయెదుట నిలువకుండుట మంచిది. త్రికాలజ్ఞాన ముండుటచే ఆనందము, కల్యాణము మనకు విధిగాచేకూరు నని అనుకొనలేము. అర్జునుడు ప్రేమవశుడై మొండిపట్టుతో ప్రార్థించుటవలన భగవంతు డంగీకరించి తన విశ్వరూపమును అతనికి చూపెను. కాని నాకు భగవంతుని చిన్నరూపమేచాలును. ఈ చిన్నరూపము పరమేశ్వరునిలో ఒక ముక్కకాదు. అది ముక్కయే అయినను, మహామహమైన ఆ విశాలమూర్తియొక్క పాదమో, లేక దానిగ్రవేలో అయినను, ఆపాటి దర్శనము లభించినందులకే నా జన్మ ధన్యమనుకొందును. స్వానుభవమువలన నేనుపొందిన జ్ఞానమిది. వార్ధాలో జమ్నాలాల్‌గారు లక్ష్మినారాయణ దేవాలయములో హరిజనులకు ప్రవేశమిచ్చినపుడు దర్శనార్థము నేను వెళ్ళితిని. పదిపదునైదు నిమిషములు ఆరూపమును చూచుచుంటిని. అపుడు నాకు సమాధిస్థితిని పొందిన ట్లయ్యెను. భగవంతుని ఆ ముఖము, వక్షము, చేతులు చూచుచు చూచుచు నాదృష్టి పాదముల మీదికి పోయి స్థిరపడెను. "నీపాదసేవ మధురమైనది" అను భావన చివరకు నిలిచి పోయెను. ఒక చిన్నరూపములో ఆ పరమపురుషుడు ఎట్లి ముడునని ఎవరైనను శంకించినయెడల ఆ పరమపురుషుని పాదములే నాకు చాలునని నే నందును. పూర్ణరూపము కనబడవలెనని కోరను. అర్జునుడు విశ్వరూపదర్శనమును అర్థించినా డనిన అతడు దాని కధికారి. అతనికి భగవంతునితో నెంత సన్నిహితత్వము! అతని యెడల ఎంతప్రేమ! ఎంతసఖ్యభావము! ఆయోగ్యత నాకెక్కడ? నా కా పాదములే చాలును. ఇంతే నాయర్హత.

**58. సర్వార్థ సారము**

పరమేశ్వరుని ఆ దివ్యరూపవర్ణనలోనికి బుద్ధిని పోనిచ్చుట నా కిష్టము కాదు. అట్లు పోనిచ్చుట పాపము. ఆ విశ్వరూపవర్ణనగల పవిత్రశ్లోకములను పఠించి మనము పవిత్రుల మయ్యెదము గాక! బుద్ధిని ప్రయోగించి ఈశ్వర రూపమును ముక్కలు చేయబూనుట నాకు నచ్చదు. అది 'అఘోర - ఉపాసన' యగును. అఘోరోపాసకులు శ్మశానమునకుపోయి మృత కళేబరములను చీల్చి తంత్రోపాసన చేయుదురు. ఇట్లే యుండును పై పనికూడ. పరమేశ్వరుని ఆ దివ్యరూపము

"విశ్వతశ్చక్షురుత విశ్వతో ముఖో। విశ్వతో బాహురుత విశ్వతస్పాత్"

ఆ విశాలమైన అనంతరూప మిట్లుండును. ఆ వర్ణనాత్మక శ్లోకములను గానసుచేసి మనహృదయమును పాపరహితముగను, పవిత్రముగను చేసి కొందముగాక!

పరమేశ్వరుని గూర్చిన ఈ వర్ణనయం దెల్ల బుద్ధి ఆలోచనకు దిగుచోటు ఒక్కటేయున్నది.— "ఓయర్జునా! వీరందరును చనిపోవువారే, నీవు నిమిత్త మాత్రుడవు కమ్ము. అంతయు చేయువాడను నేనే" అని భగవంతు డర్జునునితో అనును. ఇదే నామనస్సులో ప్రతిధ్వనించు చుండును. మన మీశ్వరుని చేతిలోని ఖడ్గముగా కావలెనను భావము కలిగినప్పుడు బుద్ధియాలోచనకు దిగును. ఈశ్వరుని చేతిలోని పనిముట్టుగా అగుటయెట్లు? అతనిచేతిలో మురళిని అగుదునా? అతడు నన్ను పెదవులకు చేర్చుకొని మధురస్వరములను పలికించు యోగ్యత నాకు కలుగుటయెట్లు? నేను మురళి నగుట యనగా లోపల లొట్టయగుట అన్నమాట. కాని నాలో వికారములు, వాసనలు, పూర్తిగ నిండియున్నవి. ఇక నావలన మధురస్వరములు వెలువడు టెట్లు? నాలో అహంకారము నిండియున్నది. నేను నిరహంకారుడను కావలెను. నేను పూర్ణ ముగ ముక్తుడనై, లోన బోలుగా నైనప్పుడే పరమేశ్వరుడు నన్ను మురళిగ చేసి కొనును. కాని పరమేశ్వరునికి మురళి నగుట చాల సాహసము. పోనీ! అతని పాదరక్షను కావలెననుకొన్నను అదియు సులువైనపని కాదు. ఆయన కాలికి కొంచెమేని ఒత్తిడిలేని మెత్తనిచెప్పును కావలె. పైనున్న పరమేశ్వరుని పాదము నకును, క్రింది ముండ్లకు – రాళ్ళకును మధ్య నే నుండవలె. నా చర్మమును ఒలిచి, బాగుగ ఊని మెత్తపఱుపవలె. కాన పరమేశ్వరుని పాదరక్ష నగుట కూడ తేలికపని కాదు. ఇక పరమేశ్వరుని చేతిలోని పనిముట్టును కావలెనని

వదిసేర్ల బరువుగల ఇనుపగుండుగా కారాదు. తపశ్చర్యయను సానమీద పదను పెట్టిన కత్తిగా కావలె. ఈశ్వరునిచేతిలో నాజీవిత మను ఖడ్గము మెఱయు చుండవలె. ఈ భావము నాహృదయములో ప్రతిధ్వనించుచుండును. అట్లు భగవంతుని చేతిపనిముట్టును కావలెనను ఆలోచనలో మునిగిపోదును. ఇది యెట్లు సాధ్యమో ఆ విధానము స్వయముగ భగవంతుడే ఈ యధ్యాయము యొక్క చివరిశ్లోకములో చెప్పినాడు. శ్రీ శంకరాచార్యుడు తన భాష్యములో ఈ శ్లోకము "సర్వార్థసారము"-గీతకు నెల్లసారమని అన్నాడు. ఆ శ్లోక మిది-

"మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః ।
నిర్వైరః సర్వభూతేషు యః సమామేతి పాండవ."

'ప్రపంచములో ఎవనికి ఎవ్వనితోను శత్రుత్వములేదో, ఎవడు తటస్థుడై ప్రపంచమునకు నిష్కామసేవచేయునో, తాను చేయు పనియంతయు నా కెవ్వడర్పించునో ఎవడు నాభక్తుడు, క్షమాశీలుడు, నిస్సంగుడు, విరక్తుడు, ప్రేమమయుడు అయియుండునో, అట్టివాడు నా చేతిలో ఖడ్గమగును.' ఇది గీతాసారము. (1-5-32)

# పండ్రెండవ అధ్యాయము

## సగుణ నిర్గుణ భక్తి

**59.** ఆరవ అధ్యాయమునుండి పదునొకొండవ యధ్యాయము వఱకు : ఏకాగ్రతనుండి సమగ్రత వఱకు

సోదరులారా! గంగాప్రవాహము అన్ని ప్రదేశములలోను పవిత్రమైనదే! కాని హరిద్వారము, కాశీ, ప్రయాగవంటిచోట్లు మిక్కిలి పవిత్రములైనవి. అవి ప్రపంచమునెల్ల పావనము చేయుచున్నవి. భగవద్గీత విషయముకూడ ఇంతే! భగవద్గీత మొదటినుండి చివరవరకు అంతయు పవిత్రమే! కాని మధ్య మధ్య కొన్ని అధ్యాయములు తీర్థక్షేత్రములై యున్నవి. మన మీనాడు చెప్పు కొనవలసిన అధ్యాయము మిగుల పవిత్రమైన తీర్థక్షేత్రము. దీనిని "అమృత ధార" యని భగవంతుడే అన్నాడు. "యేతు ధర్మామృత మిదం యథోక్తం పర్యుపాసతే" ఇరువది శ్లోకములుగల చిన్న అధ్యాయమేయైనను ఇది అమృత ధారయైనది. అమృతమువలె మధురము, సంజీవియైనది. ఈ యధ్యాయములో

స్వయముగ భగవంతుడే భక్తిరసముయొక్క మహిమను, దానితత్త్వమును గానము చేసినాడు. వాస్తవమునకు ఆరవ అధ్యాయమునుండియే భక్తి తత్త్వము ప్రారంభమైనది. అయిదవ అధ్యాయము చివరవరకు జీవన శాస్త్రమును చూచితిమి. స్వధర్మాచరణ రూపమైన కర్మలు, వానికి సహకారియైన వికర్మయను మానసికసాధన, ఈ రెండు సాధనల వలనను సమస్తకర్మలను భస్మముచేయు అంతిమ సోపానమైన అకర్మయొక్క భూమిక – ఈ విషయముల విచారణ మొదటి అయిదు అధ్యాయములలో జరిగినది. దీనితో జీవన శాస్త్రము సమాప్తమయినది. ఆరవ అధ్యాయమునుండి పదునొకొండవ యధ్యాయము చివరవరకు ఒక విధముగ భక్తితత్త్వ విచారణ జరిగినది. అది యేకాగ్రతతో ప్రారంభమైనది. చిత్తైకాగ్రత యెట్లు కలుగ గలదో, దాని కేయే సాధవలున్నవో, వాని యావశ్యకమేమో ఆరవ అధ్యాయములో చెప్పబడినది. పదునొకొండవ అధ్యాయములో సమగ్రత బోధింపబడినది. ఏకాగ్రత మొదలుకొని సమగ్రత వరకును గల ఈ పెద్దమజిలీని మన మెట్లు దాటగలమో ఇప్పుడిక్కడ చూడవలెను.

ఆరవయధ్యాయము చిత్తైకాగ్రతతో ప్రారంభమయినది. ఏకాగ్రత సిద్ధించిన మీదట ఏ విషయమునైనను మనుష్యు డాలోచింప గలుగును. చిత్తైకాగ్రతయొక్క ఉపయోగము గణితశాస్త్రాధ్యయనములో కనబడునని అభిమానముతో నేను చెప్పగలను! ఈ యధ్యయనమువలన లాభము కలిగితీరును. కాని ఇది చిత్తైకాగ్రతకు సర్వోత్కృష్టమైన లక్ష్యముకాదు. పూర్ణమైన యేకాగ్రతకు గణితశాస్త్రాధ్యయనము ఒరపిడిరాయి కాదు. గణితాదిశాస్త్రాధ్యయనములలో చిత్తైకాగ్రతవలన కీర్తి లభించును. కాని ఇది నిజమైన పరీక్షకాదు. అందుచేత మనదృష్టి భగవంతుని చరణములదెసకు మరలవలె నని ఏడవ అధ్యాయము చెప్పుచున్నది. భగవంతుని చరణములయందు ఏకాగ్రదృష్టి నిరంతరము నిలుపవలెనని, మన వాణి చెవి కన్ను ఆ చరణములయందే సతతము లగ్నము కావలెనని, దీనికై మరణ పర్యంతము ప్రయత్నింపవలెనని ఎనిమిదవ అధ్యాయము బోధించుచున్నది. ఇంద్రియము లన్నింటికిని ఇది యభ్యాసము కావలె. అన్యచింత కలుగనంతగా అన్ని యింద్రియములకును ఇది యలవడవలె. అన్ని యింద్రియములకును భగవంతుని పొందవలెనను ఉత్కంఠ కలుగవలెను. మన యెదుట ఒకడు విలపించు చుండవచ్చును. ఒకడు భజనచేయుచుండవచ్చును. ఒకడు వాసనారూపమైన వలను అల్లుచుండ వచ్చును. లేక విరాగులైన మహాత్ముల సమావేశము జరుగుచుండ వచ్చును. సూర్యుడు

వెలుగుచుండవచ్చును. చీకటి క్రమ్మియుండవచ్చును. ఏది యెట్లున్నను మరణ కాలమందు పరమేశ్వరుడు చిత్తములో ప్రత్యక్షమగు స్థితిని అన్ని యింద్రియము లకును జీవితము పొడుగునను అలవరుప వలెను. ఈ సాతత్యశిక్షణ ఎనిమిదవ అధ్యాయములో ఇయ్యబడినది. ఆరవఅధ్యాయములో ఏకాగ్రతయు, ఏడవ అధ్యాయములో ఆ యేకాగ్రత ఈశ్వరాభిముఖము కావలెననుటయు, (దీనినే ప్రపత్తియందురు) ఎనిమిదవదానిలో సాతత్య యోగమును, తొమ్మిదవ దానిలో సమర్పణ యోగమును బోధింపబడినవి. పదియవ అధ్యాయములో ఈశ్వర విభూతులు క్రమానుగుణముగ చెప్పబడినవి. ఒక్కొక్క అడుగు ముందునకు వేయుచు ఈశ్వరస్వరూపమును ఎట్లు హృద్గతము చేసికొనవలెనో, చీమ మొదలు బ్రహ్మవరకు వ్యాపించియున్న పరమాత్మను మెల్లమెల్లగా ఎట్లు హృదయ ములో ఇముడ్చుకొనవలెనో చెప్పబడినది. పదునొకొండవ అధ్యాయములో సమ గ్రత చెప్పబడినది విశ్వరూప దర్శనమునే నేను సమగ్రతాయోగ మందును. సామాన్య రజఃకణములోకూడ విశ్వమంతయు ఇమిడియున్నదను అనుభవ మును పొందుటయే విశ్వరూప దర్శనము. ఇదే విరాడ్ దర్శనము. ఆరవ అధ్యా యమునుండి పదునొకొండవ యధ్యాయమువరకు భక్తిరసము అనేక విధముల వడియగట్టబడి సారము తీయబడినది.

## 60. సగుణోపాసకుడు, నిర్గుణోపాసకుడు – తల్లి యిద్దరు బిడ్డలు

పంద్రెండవ అధ్యాయములో భక్తితత్త్వ విచారణ పూర్తిచేయ వలసి యున్నది. అర్జునుడు ఈ సమాప్తికి సంబంధించిన ప్రశ్న వేసెను. అయిదవ అధ్యాయములో జీవనశాస్త్ర విచారణ సమాప్తి సందర్భమున ప్రశ్నించినట్లే అతడు ఇక్కడకూడ ప్రశ్నించెను. అర్జును డిట్లడుగును. "ప్రభూ! కొందరు సగుణోపాసన చేయుదురు. మరికొందరు నిర్గుణోపాసన చేయుదురు. కాగా ఈ యిరుతెగలలో నీ కెవరు ప్రియులు ?"

భగవంతుడు దీని కేమి సమాధానము చెప్పగలడు! ఒక తల్లికి యిద్దరు బిడ్డ లున్నారనుకొనుడు. వారిలో చిన్నవానిది తల్లిని వదలి యుండగల వయస్సు కాదు. వానికి ఆమెమీద ఎంతో ప్రేమ. తల్లిని చూచుసరికే అత డానంద పరవశు డగును. తల్లి కొంచెముసేపు కనబడకపోయెనా వ్యాకులుడగును. వా డామెను విడిచి పోనేలేడు. ఆమె వియోగము నే మాత్రమును సహింపలేడు. తల్లిలేనిచో వానికి ప్రపంచమే శూన్యము. చిన్నవాడు ఇట్లున్నా డనుకొనుడు. ఇక రెండవ వాడు పెద్దవాడు. వాడుకూడ అపారమైన మాతృప్రేమ కలవాడు. కాని వివేక

వంతుడు. తల్లిని విడిచి యుండగలడు. అయిదారు మాసములు తల్లిని చూడక పోయినను ఉండగలడు. తల్లికి సేవచేయుచు బాధ్యతతో పనులన్నియు నిర్వహించును. పనిపాటలలో నిమగ్నుడగుటచేత మాతృవియోగమును సహింపగలడు. అతడు ప్రజలలో ప్రతిష్ఠ సంపాదించినాడు. ఇందులకు తల్లి చాల ఆనందించును. పెద్దవా డిట్టివాడు. ఇట్టి ఇద్దరు కుమారులను గూర్చి "ఏమమ్మా! ఈ యిద్దఱిలో ఎవనినో ఒకనిని నీయొద్ద నుండనిత్తుము. నీకిష్టమగువానిని కోరుకొను" మని ఆ తల్లితో అని చూడుడు. అప్పుడామె యేమి సమాధాన మిచ్చును? ఏ కుఱ్ఱవానిని కోరుకొనును? ఇద్దరను తక్కెడలోవేసి తూచునా? ఆ మాతయొక్క మానసికస్థితిని విచారింపుడు. సహజముగ ఆమె యీయగల ప్రత్యుత్తర మేమి? "గత్యంతరములేక ఒకని వియోగము నాకు తప్పకపోయినచో పెద్దవానిని తీసికొనుడు. వాని యెడబాటు నేను సహింతును." అని యనుచు చిన్నకుఱ్ఱవానిని గుండెకు అదుముకొనును. ఆమె వానిని వదలిపెట్టదు. చిన్నవానికి తనమీద నున్న ప్రేమాతిశయము వలన "పెద్దవాడు ఎడమైనను ఇబ్బందిలేదు" అన్నట్లుగ సమాధానము చెప్పును. కాని "ఇద్దఱిలో నీ కెవనియందు ఎక్కువప్రేమ" యను ప్రశ్నకు ఇది జవాబు కానేరదు. ఏదోయొక జవాబు చెప్పవలెను. కనుక అట్లు చెప్పివేసినది. దానినిబట్టి పెద్దవానియం దామెకు ప్రేమ తక్కువ యని వ్యాఖ్యానము చేసినచో అది అనుచిత మగును.

ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరమిచ్చుచు ఆ తల్లి యే సందిగ్ధావస్థలో పడినదో భగవంతుడుకూడ సరిగా ఆ స్థితిలోనే పడెను. అర్జును డిట్లడుగును – ప్రభూ! నీ భక్తులలో రెండు రకములవారు కలరు. ఒక రకమువానికి నీయం దత్యంత ప్రేమ. వాడు నిన్ను సదా స్మరించుచుండును. వాని కన్నులు నీకొఱకు తపించుచుండును. చెవులు నీ గుణగానమును విన కుతూహల పడును. చేతులును కాళ్ళును నీ సేవాకార్యములకై వేగిరపడుచుండును. రెండవతెగ భక్తుడు స్వావలంబి. అత డింద్రియముల నెల్లప్పుడు వశమునం దుంచుకొనును. సర్వభూతహితుడై పరమేశ్వరస్మరణ లేనివానివలె అహర్నిశము నిష్కామమగు సమాజసేవలో నిమగ్నుడై యుండును. అతడు అద్వైతభక్తుడు. ఇప్పు డీయిరువురిలో నీకు ప్రియమైనవా డెవడో నాకు తెలియజెప్పుము" ఇది అర్జునుడు భగవంతునడిగిన ప్రశ్న. ఆ బిడ్డలతల్లి యెట్లు సమాధానము చెప్పినదో సరిగా ఆవిధముగనే భగవంతు డిట్లు జవాబిచ్చెను- "సగుణభక్తుడు నాకు ప్రియుడు. అద్వైతభక్తుడుకూడ నావాడే" ఈ విధముగ భగవంతుడు సందిగ్ధస్థితిలో పడెను. ఏదో యొక సమాధానము చెప్పవలెను. కనుక అట్లు చెప్పినాడు.

నిజమున కిది సందిగ్ధావస్థయే. అక్షరశః ఈరెండుతెగల భక్తులును ఒకరే. ఇరువురి యోగ్యతయు ఒకటే. ఇద్దరిని పోల్చి చెప్పుట హద్దుమీరి పోవుటయే. అయిదవ అధ్యాయములో అర్జునుడు కర్మనుగూర్చి ప్రశ్నించినట్లే ఇక్కడ భక్తి విషయములోకూడ ప్రశ్నించినాడు. కర్మవికర్మల సహకారముతో మనుష్యుడు అకర్మదశను పొందునని అయిదవ అధ్యాయములో చెప్పబడినది. ఆ యకర్మదశ రెండు విధములుగ ప్రకటమగును. అహర్నిశము కర్మలనాచరించుచు సైతము లేశమాత్రమును కర్మ చేయనట్లుండువా డొకడు. ఇరువదినాలుగు గంటలును ఏ కొంచెమేని కర్మనాచరింపకుండ ప్రపంచము నెల్లను కదలించు శక్తిగలవా డొకడు. ఈ రెండు విధములను అకర్మదశ ప్రకటమగును. మరి యీ రెంటిని పోల్చుటెట్లు? ఒక వృత్తమును రెండు సమభాగములుగచేసి అందలి ఒకదానితో నొకదానిని పోల్చుట యెట్లు? రెండు లక్షణములు ఒకటిగనే యుండును. అకర్మయొక్క భూమికను గూర్చి వివరించుచు భగవంతుడు ఒక దానిని సంన్యాసమని, రెండవ దానిని యోగమని అన్నాడు. శబ్దములు రెండైనను అర్థమొకటే, సంన్యాసము, యోగము — ఈ రెండును సరళమైన, సులభమైన సాధనలు. సగుణ నిర్గుణములుకూడ నిట్టివే. సగుణ భక్తుడు ఇంద్రియములద్వారా పరమేశ్వరునిసేవ చేయును. నిర్గుణభక్తుడు విశ్వకల్యాణముకొఱకు మనస్సుతో చింతనచేయును. మొదటివాడు బాహ్యసేవయందు నిమగ్నుడై యుండును. కాని, వాని మనస్సులో నిరంతరమును చింతన జరుగుచునే యుండును. రెండవవాడు ప్రత్యక్షముగ నేమియు చేయనట్లు కనబడుచున్నను వాని లోపల మాత్రము నిరంతరమైన సేవ జరుగుచునే యుండును. ఈ యిద్దరు భక్తులలో నెవడు శ్రేష్ఠుడు? అహర్నిశము కర్మ నాచరించుచు లేశమాత్రము నాచరింపనట్లుండు సగుణభక్తుడు, హృదయములో లోకకల్యాణము కొరకు చింతనచేయు నిర్గుణభక్తుడు — ఈ యుభయులును బయటికి వేరువేరుగ కనబడుచున్నను లోపల మాత్ర మొకరే. ఇరువురిది ఒకటేరూపము. ఇరువురును భగవంతునికి ప్రియులే. కాని ఈ రెంటిలో సగుణభక్తి చాల సులభము. ఇట్లు భగవంతుడు అయిదవ అధ్యాయములో నిచ్చిన జవాబే ఇక్కడకూడ నిచ్చినాడు.

## 61. సగుణము సులభము, సురక్షితము

సగుణభక్తిలో ఇంద్రియములకు ప్రత్యక్షముగ పనియుండును. ఇంద్రియములు సాధనములుగా, లేక విఘ్నములుగా, లేక రెండునుగా అగును. అవి

మారకములా తారకములా యను విషయము సాధకుని దృష్టిపై ఆధారపడి యుండును. ఒకనితల్లి మరణశయ్యపై పడియున్న దనుకొనుడు. వా డామెను చూడగోరును. పదునైదుమైళ్ళు పోవలె. ఆమార్గమున మోటార్లుపోవు. అది వంకర టింకర కాలిబాట. ఇట్టి పరిస్థితిలో ఈ మార్గము సాధనమా ? విఘ్నమా ? – వీలు వాలులేని ఈ మార్గ మెక్కడ దాపరించినదో! లేకపోయిన ఎప్పుడో మా యమ్మ యొద్దకు వెళ్ళియుండువాడను" అని యత డనుకొనును. ఇట్టివాని కీమార్గము శత్రువు. ఎట్లో కాళ్ళీడ్చుకొనుచు, దారిని నిందించుచు వా డు నడచిపోవును. కాని ఏది ఎట్లున్నను, తల్లిని చూచుటకు త్వరత్వరగా అడుగువేయుచు పోవుట వాని కవసరము. మార్గమును శత్రువుగా భావించి నడుమ నెక్కడనో వాడు కూర్చున్నచో తాను శత్రువుగ బావించిన మార్గమునకే విజయము కలుగును. వడి వడిగా నడచిపోయినప్పుడే వా డాశత్రువును జయించినట్లు. ఈ పరిస్థితిలోనే మరి యొకడు ఇట్లనవచ్చును – "దట్టమైన ఈ యరణ్యములో ఈమాత్రపు మార్గమైన ఉన్నది. ఇంతేచాలును. ఇక తల్లియొద్దకు పోగలను. ఈ మార్గమే లేకపోయిన ఈ కొండలమీదుగ "నే నెట్లుపోవుదును" ఇట్లనుకొనుచు, అత డీకాలిబాట నొక సాధనముగ నెంచి వేగముగ సాగిపోవును. వా డామార్గమును మిత్రునిగ భావించును. మీరు దానిని మిత్రుడనుడు, శత్రువనుడు, అనుకూలమనుడు లేక ప్రతికూలమనుడు, ఏమైనను వడివడిగా ఆ మార్గమున పురోగమించవలసినదే. మార్గము విఘ్నకారకమా, సాధనభూతమా అను విషయము ఆ యా వ్యక్తుల మనోభూమికలపై అనగా దృష్టిపై ఆధారపడియుండును.

సగుణోపాసకునికి ఇంద్రియములు సాధనభూతములు. ఇంద్రియములు పరమేశ్వరునికి అర్పించు పుష్పములు. కనులతో హరిని దర్శించుచు, చెవులతో హరికథలను వినుచు, జిహ్వతో హరినామస్మరణ, పాదములతో తీర్థయాత్రలు, చేతులతో సేవాకార్యములు చేయుచు సగుణభక్తుడు సమస్తేంద్రియములను పరమేశ్వరుని కర్పించును. ఇంద్రియములు భోగముకొఱ కీయబడలేదు. పువ్వులు పరమేశ్వరునికి అర్పించుటకొరకు పుట్టినవిగాని దండగ్రుచ్చి ఎవరికివారు మెడలో వేసికొనుటకుగాదు. అట్లే ఈశ్వరసేవలోనే ఇంద్రియముల నుపయోగింపవలె. ఇది సగుణోపాసకుని దృష్టి. కాని నిర్గుణోపాసకునకు ఇంద్రియములు విఘ్నములుగ తోచును. అందువలన వాని నతడు అదుపులో నుంచును. లేక బంధించును. వానిని నిరాహారములుగ నుంచును. వానిపై కావలిపెట్టును. కాని సగుణోపాసకునకు ఇట్లు చేయవలసిన పనిలేదు. అతడు సర్వేంద్రియములను హరిచరణములకు

సమర్పించును. ఈ రెంటి యుద్దేశమును ఇంద్రియనిగ్రహమే. ఏ మార్గము ననుసరించినను ఇంద్రియనిగ్రహమే ఏకైకలక్ష్యము. విషయములమీదకి ఇంద్రియములను పోనీయకుండ పట్టవలె. కాని ఇందొకమార్గము సులభము, రెండవది కఠినము.

నిర్గుణోపాసకుడు సర్వభూత హితుడై యుండును. ఇది సామాన్య విషయముకాదు. విశ్వకల్యాణమును సాధించుట యనునది చెప్పుటకు తేలికయే. కాని ఆచరించుట చాలకష్టము. విశ్వకల్యాణమునుగూర్చి చింతన చేయువాడు చింతనతప్ప మరేమియు చేయడు. ఇందుచేతనే నిర్గుణోపాసన కష్టము. సగుణోపాసనను తమతమ శక్తి ననుసరించి అనేక విధములుగ అందఱును చేయవచ్చును. మనము జన్మించిన గ్రామముయొక్క సేవ, లేక తల్లిదండ్రుల సేవ సగుణ పూజయగును. ఈ పూజ లోకకల్యాణమునకు విరుద్ధము కాకుండ ఉండుటయే మనము గమనింపవలసిన విషయము. చేయుసేవ ఎంత స్వల్పమైనను, ఇతరుల క్షేమమునకది భంగకరము కాకున్నచో భక్తిమార్గములో అదొక మెట్టే, అట్లు కానిచో ఆ సేవ ఆసక్తితో కూడినదగును. తల్లిదండ్రులు, పీడితులైన బంధువులు, సాధువులు, మహాత్ములు — వీరి నందఱను ఈశ్వరస్వరూపులనుగ బావించి సేవింపవలె. ఈ భావముతో సేవచేయుచు ఆనందము ననుభవింపవలె. ఈ సగుణపూజ సులభమైనది. నిర్గుణపూజ కఠినమైనది. ఈ భేదమే లేకున్న రెంటియొక్క ప్రయోజనమును ఒకటే. సౌలభ్యమునుబట్టి చూచిన సగుణమే శ్రేయస్కరము — అంతే!

సగుణము సులభమనియే కాక, మరొక విధముగ కూడ దానిని సమర్థింపవచ్చును. నిర్గుణోపాసనలో భయమున్నది. నిర్గుణము జ్ఞానమయము. సగుణము ప్రేమమయము. సగుణములో ఆర్ద్రతయున్నది. దానిలో భక్తుడు సురక్షితుడుగ నుండును. నిర్గుణములో కొంచెము ప్రమాద మున్నది. నేనొకప్పుడు జ్ఞానముమీద ఎక్కువగ ఆధారపడి యుండువాడను. కాని కేవలము జ్ఞానము వలననే ముందునకు పోలేనని అనుభవమువలన ఇప్పుడు తెలిసికొన్నాడను. జ్ఞానమువలన మనస్సులోని స్థూలమైనమాలిన్యము కాలి భస్మమైపోవును. కాని సూక్ష్మమైన మాలిన్యము నశింపదు. స్వావలంబనము, విచారణ, వివేకము, అభ్యాసము, వైరాగ్యము — ఈ సాధనలన్నియు అవలంబించినను, వీని ద్వారా సూక్ష్మమైన మాలిన్యము తొలగిపోదు. భక్తియను నీరు లేకుండ ఈ మైలను కడిగివేయలేము. ఆ శక్తి, భక్తి యనునీటికే యున్నది. దీనిని మీరు

పరావలంబనమనిన అందురు గాక! కాని 'పర' అనిన 'మరియొక' అనికాక "శ్రేష్ఠపరమాత్మ" అని యనుకొని అతనిమీద ఆధారపడి యుండుడు. పరమాత్మని సాహాయ్యము లేకుండ మనోమాలిన్యము తొలగిపోదు.

ఇక్కడ 'జ్ఞాన' శబ్దముయొక్క అర్థమును సంకుచితపరచితినని ఎవరైన అనవచ్చును. జ్ఞానమువలన మనోమాలిన్యము తొలగదని నే ననుటలో జ్ఞానముయొక్క మహిమను నేను తగ్గించుచున్నానని ఒప్పుకొందును. కాని శుద్ధజ్ఞానము మట్టిబొమ్మలైన శరీరధారులకు కష్టసాధ్యమని నావాదన. శరీరముతో పొందు జ్ఞానము ఎంత శుద్ధమైనదైనను కొంత లోపముకలదిగను వికృతముగను ఉండును. ఈ దేహములో ఉత్పన్నమగుజ్ఞానశక్తి పరిమితముగనే యుండును. శుద్ధజ్ఞానోదయమైనచో దానితో సమస్తమాలిన్యమును భస్మీభూతమగు ననుటలో తిలమాత్రముకూడ నాకు సందేహములేదు. చిత్తము నంటియున్న మాలిన్యము లన్నిటిని భస్మముచేయగల సామర్థ్యము జ్ఞానములో నున్నది. కాని వికారములతో కూడిన ఈ దేహములో జ్ఞానముయొక్క బలము తక్కువగా నుండును. ఇందువలన దానిచే సూక్ష్మమాలిన్యములు నశించుట సంభవముకాదు. అందువలన భక్తిని ఆశ్రయింపనిచో సూక్ష్మమాలిన్యములు నిర్మూలింప బడజాలవు. కనుకనే మానవుడు భక్తిమార్గములో మిగుల సురక్షితుడై యుండును. ఈ 'మిగుల' అనువిశేషణము నే నుపయోగించినదే! ఇది గీతలోనిదికాదు. సగుణ భక్తి సులభము. ఇందులో పరమేశ్వరావలంబనమున్నది. నిర్గుణములో స్వావలంబన మున్నది. ఇందలి 'స్వ' అనునది మాత్రమేమిటి? అది హృదయస్థుడైన పరమేశ్వరుని దెల్పుమాట కాదా? అయినప్పుడు అట్టి పరమేశ్వరుని ఆశ్రయమనియేకదా స్వావలంబన మనుమాట కర్థము? కేవలము బుద్ధిసహాయతవలననే పరిశుద్ధుడైనవా డెక్కడను కనబడడు. స్వావలంబనవలన అనగా హృద్గతమైన ఆత్మజ్ఞానమువలన శుద్ధజ్ఞానము లభించును. సారాంశమేమనగా నిర్గుణభక్తుని స్వావలంబనలో కూడ ఆత్మపై ఆధారపడుట యున్నది.

## 62. నిర్గుణము కలియనిచో సగుణముకూడ దోషయుతమే

సగుణోపాసన చాలసులభము సురక్షితము అని నేను పైని చెప్పియున్నాడను. ఇప్పుడు నిర్గుణోపాసనను గూర్చి కూడ అట్లే చెప్పగలను. నిర్గుణమున కొకహద్దు ఉండును. వేఱువేఱు సేవా కార్యములకు, తదితరములైన పనులకు మనము సంస్థలను స్థాపింతుము. సంస్థలు మొదట వ్యక్తుల నాధారముచేసికొనియే ప్రారంభమగును. అనగా మొట్టమొదట సంస్థకు వ్యక్తినిష్ఠయుండును.

ఆ సంస్థ వికాసము పొందినకొలది దానిలో వ్యక్తినిష్ఠపోయి తత్త్వనిష్ఠ యేర్పడును. అట్లు తత్త్వనిష్ఠ యేర్పడనిచో, దానికి బలముచేకూర్చువ్యక్తి లోపించినంతనే ఆ సంస్థలో అంధకారము వ్యాపించును. నాకు ప్రియమైన ఉదాహరణ ఒకటియిచ్చెదను. రాట్నముయొక్క త్రాడు తెగినంతనే నూలువడుకలేము సరికదా, తీసినదారకూడ కదురునకు చుట్టలేము. వ్యక్తిలోపించగానే సంస్థకు కూడ ఈ దశయేపట్టి అది యనాథసంస్థయై పోవును. అట్లుకాక వ్యక్తినిష్ఠనుండి తత్త్వనిష్ఠ ఉత్పన్నమైనచో ఈ దుస్థితికలుగదు. సగుణమునకు నిర్గుణము తోడ్పడవలెను. ఎప్పుడో ఒకప్పుడు వ్యక్తి సాకారమునుదాటి తత్త్వనిష్ఠలో ప్రవేశించు అభ్యాసము చేయవలె. గంగ హిమాలయమునుండి – శంకరుని జటాజూటమునుండి – బయలుదేరి అక్కడనే ఆగిపోలేదు. ఆ జటాజూటము నుండి వెలువడి, అది అక్కడిగిరికందరములను, ఘట్టములను, అరణ్యములను దాటి సమతలములగు మైదానములో గలగల జలజల ప్రవహించుచుండుటచేతనే సర్వజనులకును ఉపయోగపడుచున్నది. ఈ విధముగ వ్యక్తియను ఆధారము పడిపోయినను తత్త్వమను బలిష్ఠమైన స్తంభముపై సంస్థ నిలువగలిగి యుండవలె. ఇంటిలో దూదియేకు కమానును ముందు త్రాటితో వ్రేలాడగట్టుదుము. అలవాటయిన తరువాత ఆ త్రాడు తీసివేయుదుము. తరువాత త్రాడులేకపోయినను కమాను చేతిలోసరిగా నిలిచియున్నచో దానికి సరియైన ఆధారము చిక్కినట్లు భావింతుము. ఈ విధముగనే సగుణముతో ఉత్సాహము ప్రారంభమైనను చివరకు తత్త్వనిష్ఠతో–నిర్గుణముతో అది పూర్ణత్వమును పొందవలె. భక్తిగర్భమునుండి జ్ఞానోదయముకావలె. భక్తి లతకు జ్ఞానమను పుష్పములు పూయవలెను.

బుద్ధుడు తనయాలోచనలో స్ఫురించినమూడు నిష్ఠలను బోధించెను. మొదట వ్యక్తినిష్ఠ, తర్వాత దానినుండి తత్త్వనిష్ఠ, తత్త్వనిష్ఠ కలుగనిచో కనీసము సంఘనిష్ఠయైనను ఉత్పన్నముకావలె. ఒకవ్యక్తి యెడల నుండుగౌరవము పదిమందికి వ్యాపించవలె. ఇట్లు సంఘమునెడల ప్రేమ యేర్పడకపోయినచో పరస్పరవైమనస్యములు, కలహములు ప్రారంభమగును. వ్యక్తిశరణత తొలగి సంఘశరణతరావలె. తరువాత సిద్ధాంతశరణత రావలె. ఇందుచేతనే బౌద్ధధర్మములో శరణత్రయ మిట్లు చెప్పబడినది.

"బుద్ధంశరణం గచ్ఛామి, సంఘంశరణం గచ్ఛామి, ధమ్మంశరణం గచ్ఛామి."

మొదట వ్యక్తిమీదను, తరువాత సంఘము నెడలను ప్రీతి. కాని ఈ రెండు నిష్ఠలును బలహీనములైనవే. కనుక చివరకు సిద్ధాంతనిష్ఠ కలిగి నప్పుడే సంస్థ నిలుచును. అప్పుడే అది లాభదాయకమగును. ఉత్సాహ మను ప్రవాహము సగుణములో ప్రారంభమైనను అది సాగిసాగి నిర్గుణసాగరములో కలియవలెను. నిర్గుణము కలియనిచో సగుణము దోషయుతమగును. సగుణము నిర్గుణముయొక్క హద్దులలో నుండి తన స్థిరత్వమును కాపాడుకొనును. ఇందుచేత సగుణము నిర్గుణమునకు ఋణపడియుండును.

హిందూధర్మము, క్రైస్తవధర్మము, ఇస్లాంధర్మము మొదలైన ధర్మములన్నిటిలోను ఏదోయొక రూపములో మూర్తిపూజ అనుష్ఠింపబడుచునేయున్నది. అది అధమశ్రేణికి చెందినదిగా తలపబడుచున్నను మాననీయమైనది, గొప్పది యని నాభావము. కాని మూర్తిపూజ నిర్గుణముయొక్క హద్దులలో నున్నంత వరకే దోషరహితముగ నుండును. నిర్గుణముయొక్క ఆశ్రయమును వదలగానే సగుణము దోషయుతమగును. అన్నిధర్మములలోను సగుణము నిర్గుణముయొక్క ఆశ్రయమును వదలి అధోగతిపాలయినది. పూర్వము యజ్ఞములలో పశుహత్య జరిగెడిది. ఇప్పటికిని శాక్తేయులు దేవికి జంతువులను బలియిచ్చెదరు. ఇది మూర్తిపూజపేర జరిగెడు అత్యాచారము. హద్దుమీరిన మూర్తిపూజ అపమార్గములో పడిపోయినది. కాని సగుణము నిర్గుణ నిష్ఠయొక్క హద్దులలో నున్నచో ఈ ప్రమాదము లేదు.

## 63. సగుణ నిర్గుణములు పరస్పర పూరకములు : రాముని చరిత్ర నుండి దృష్టాంతము

సగుణము సులభము, సురక్షితము. కాని సగుణమునకు నిర్గుణము ఆవశ్యకము. సగుణములో పురోగమించగా నిర్గుణము—అనగా తత్త్వనిష్ఠారూప మైన పుష్పము వికసించవలె. సగుణ నిర్గుణములు పరస్పరపూరకములుగాని విరుద్ధములు కావు. సగుణము నుండి నిర్గుణ మను అంతస్తునకు చేరవలెను. హృదయములోని సూక్ష్మమాలిన్యమును కడిగివేయుటకు నిర్గుణమునకు సగుణము యొక్క ఆర్ద్రత అవసరము. ఈ రెండును ఒకదానికొకటి శోభనిచ్చును. ఈ రెండురకముల భక్తియు రామాయణమునందు ఉత్తమస్థాయిలో చూపబడినది. ఈ రెండురకముల భక్తిని అయోధ్యాకాండములో విపులముగ వర్ణించినారు. భరతునిభక్తి నిర్గుణభక్తి. లక్ష్మణునిది సగుణభక్తి. నిర్గుణసగుణభక్తుల స్వరూపము ఈ యుదాహరణలద్వారా స్పష్టమగును.

రాముడు వనవాసమునకు వెళ్ళునప్పుడు లక్ష్మణుని తనవెంట తీసికొని వెళ్ళుటకు సిద్ధముగలేడు. ఆ తమ్ముని సాయ మవసరమని రామునికి అనిపించ లేదు. అతడు లక్ష్మణునితో ఇట్లనును – "లక్ష్మణా! తండ్రిగారి ఆజ్ఞానుసారము నే నడవికి వెళ్ళుచున్నాను. నీ వింటియొద్ద నుండుము. నా వెంటవచ్చి దుఃఖములోనున్న తల్లిదండ్రులను మరింత దుఃఖపెట్టకుము. పితరుల సేవచేయుచు నీవు వారియొద్దనున్నచో నేను నిశ్చింతముగానుందును. నా ప్రతినిధివిగ నీ విక్కడ నుండుము. నే నడవికి పోవుటచే కష్టముల పాలగుదునని తలపవలదు. ఋష్యాశ్రమములకే కదా నా యీ ప్రయాణము ?" ఈ విధముగ రాముడు తమ్మునికి నచ్చజెప్పినాడు. కాని లక్ష్మణుడు అన్న చెప్పినదాని నెల్లను ఒక్కమాటతో ఎగురగొట్టెను. ఒక్కదెబ్బతో అది రెండుముక్క లయ్యెను. తులసీదాసు దీనిని సుందరముగ చిత్రించినాడు. లక్ష్మణు డిట్లనును – "నీవు చెప్పినది ఉత్కృష్టమగు నిగమనీతియే. నిజమునకు నేను దానిని పాలింపవలసినవాడనే. కాని యీ రాజ్యభారమును నేను మోయలేను. నీకు ప్రతినిధిగ నుండగలశక్తి నాకు లేదు. నేను బాలుడను; హంస మేరుపర్వతమును మోయగలదా ? రామచంద్రా ! నేను నేటివరకును నీ ప్రేమలో పెరిగితిని. ఈ రాజనీతిని నీవు మరెవరికైనను నేర్పుము" అని చెప్పి లక్ష్మణుడు ఊరకుండెను.

చేప నీటినివదలియుండలేనట్లయినది లక్ష్మణునిస్థితి. రాముని వదలియుండు శక్తి అతనిలో లేదు. రామునియెడల సహానుభూతి అతని రోమరోమములోను నిండియున్నది. రాముడు నిద్రించుచున్నపుడు కూడ తాను మేల్కొని అతనిసేవ చేయువాడు. ఇందులోనే అతనికి ఆనందముండెడిది. ఎవరైనను కంటిమీద కంకరఖాయి విసరినచో వెంటనే చేయిపైకి లేచి ఆ దెబ్బను తాను భరించి కంటిని కాపాడును. అట్లే లక్ష్మణుడు రామునికి చేతివలెనుండువాడు. రామునిపై దెబ్బ పడబోయినచో లక్ష్మణు డా దెబ్బను తట్టుకొనువాడు. తులసీదాసు లక్ష్మణుని గూర్చి ఒకచక్కని యుదాహరణ నిచ్చినాడు. జెండా ఒకదండముపై ఎత్తున నెగురుచుండును. గానము, వందనము మొదలైన వన్నియు జెండాకే చేయుదుము. దాని రంగు ఆకారము మొదలైన వానినిగూర్చి స్తుతిగీతములు పాడుదుము. కాని సూటిగా నిలిచియున్న ఆ స్తంభమును తలచు వా రెవరు ? రాముని యశస్సను పతాకకు ఆధారమైన దండము లక్ష్మణుడు. జెండాదండ మెప్పుడును ఒరగియుండరాదు. అట్టి దండమై నిలిచిన లక్ష్మణుడును ఎన్నడునుఒరగియుండలేదు. యశస్సెవరికి వచ్చినది? రామునికి. ప్రపంచమునకు కన బడునది

పతాక. దండముతో నెవ్వరికిని పని లేదు. శిఖరము కనబడును. కాని క్రిందనున్న పునాది యెవరికిని కనబడదు. రాముని యశస్సు వ్యాపించి యున్నది, కాని లక్ష్మణుని యూరును పేరును లేదు. పదునాలుగు వత్సరములు ఈ దండ మట్లే నిలిచియుండెను. ఏ వైపునకును ఇంచుక ఒరగలేదు. అతడు స్వయముగ రాముని వెనుకనే నిలిచి రామ యశమును వ్యాపింపజేయుచుండెను. రాముడు అత్యంత కఠినకార్యములను లక్ష్మణునిచేత చేయించెను. సీతను అడవిలో వదలిపెట్టుపని చివరకు లక్ష్మణునికే అప్పగించెను. పాపము లక్ష్మణుడట్లే ఆమెను అడవిలో వదలివచ్చెను. లక్ష్మణునికి స్వతంత్రముగా నెట్టి అస్తిత్వమును లేదు. లక్ష్మణుడు రాముని నేత్రములు, హస్తములు, పాదములు, మనస్సు ఆయెను. నది సముద్రములో కలిసినట్లే లక్ష్మణునిసేవ రామునిలో లీనమై పోయినది. అతడు కేవలము రామునిఛాయిగా నయ్యెను. లక్ష్మణుని ఈ భక్తి సగుణభక్తి.

భరతుడు నిర్గుణభక్తుడు. అతని పాత్రనుగూడ తులసీదాసు బాగుగనే చిత్రించినాడు. రాము డడవికి వెళ్ళినప్పుడు భరతు డయోధ్యలో లేడు. అతడు తిరిగి వచ్చునప్పటికి దశరథుడు చనిపోయెను. 'ఇక నీవు రాజ్యము చేయవలె' నని గురువైన వసిష్ఠుడు భరతునికి నచ్చజెప్పుచుండగా నతడు "నేను పోయి రాముని కలిసికొనిరావలె" నన్నాడు. రాముని చూచిరావలె నని భరతుడు లోలోపల తహతహపడుచునే దానితోపాటు రాజ్యనిర్వహణమునకు వలసిన యేర్పాట్లు చేయుచుండెను. "ఇది రాముని రాజ్యము. దానిని నిర్వహించుట యనగా రాముని కార్యము నిర్వహించుటయే. ఈ సంపత్తికెల్ల యజమానుడు రాముడు. దానికి తగిన యేర్పాటు చేయుటయే నా కర్తవ్యము" అని భరతుని భావము. లక్ష్మణునివలె భరతుడు ఈ కర్తవ్యభావననుండి విముక్తుడు కాలేకపోయెను. భరతుని భూమికయిది. రామునిమీది భక్తియనగా రాముని కార్యము చేయుటయే. లేకున్నచో అభక్తి యెందులకు? రాజ్యనిర్వహణమునకు ఏర్పాట్లన్నియు చేసి రాముని కలిసికొనుటకు భరతుడు అడవికి వెళ్ళెను. "అన్నా! ఈ రాజ్యము నీదీ, నీవు—"అని యనునంతలో రాముడు "భరతా! నీవే రాజ్యము చేయుము" అనెను. అంత భరతుడు సంకోచముతో అట్లే నిలబడిపోయి "నీ యాజ్ఞ నాకు ప్రమాణము" అనెను. రాము డన్నదెల్ల భరతునికి ప్రమాణము. అతడు తన సర్వమును రామునికర్పించివేసెను. తిరిగివెళ్ళి రాజ్యపాలనను ప్రారంభించెను. కాని అందలి విశిష్టతను చూడుడు – అయోధ్యకు రెండుమైళ్ళ దూరములో

అతడు తపస్విగానుండి రాజకార్యములు చక్కబెట్టుచుండెను. చివరకు రాముడు తిరిగివచ్చి భరతుని కలిసినప్పుడు వారిలో వనమునందుండి తపస్సు చేసిన వారెవరో తెలిసికొనుట ప్రజలకు కష్టమయ్యెను. వయసులో కొంచెము భేదమున్నను రామభరతుల ముఖముద్రలలో ఒకటే తపోనిష్ఠ. కాన ప్రజలు రాముడెవరో భరతుడెవరో గుర్తింపలేనిస్థితిలో బడిరి. చిత్రకారు డెవడైన ఈ దృశ్యమును చిత్రించినచో అదెంత పవిత్రమైన దగును! ఇట్లు భరతుడు శారీరకముగ రామునికి దూరమునం దున్నను మానసికముగ ఒక్క క్షణకాలమైనను రాముని ఎడబాయలేదు. ఒకప్రక్క నతడు రాజ్యపాలన చేయుచున్నను మానసికముగ రామునియొద్దనే యుండెను. నిర్గుణములో సగుణభక్తి పూర్ణముగ నిండియుండును. కనుక అట్టిస్థితిలో వియోగ మను మాట భరతునికి స్ఫురించు టెట్లు? అతనికి వియోగబాధ కలుగనేలేదు. అతడు తన ప్రభువుయొక్క కార్యమును నిర్వహించుచునే యుండెను.

"రామనామము, రామభక్తి, రామోపాసన-ఇదంతయు మాకు బోధపడుట లేదు. మేము చేయునదంతయు దేవుని పనియే" అని ఈ కాలపు యువజనులనుచుందురు. దేవునికార్య మెట్లు చేయవలెనో భరతుడు చేసి చూపించెను. రాముని కార్యము చేయుచు భరతుడు రామ వియోగమును విస్మరించెను. భగవద్వియోగము ననుభవించుటకు తీఱిక లేకుండ భగవత్కార్యము నిర్వహించుట వేఱు, భగవంతునితో ఆత్మీయమగు సంబంధము కాసంతయులేక ఊరక అతనినిగూర్చి మాటలాడుట వేరు. భగవంతుని కార్యములు చేయుచు సంయమపూర్ణమైన జీవితము గడపుట దుర్లభము. భరతునిది నిర్గుణభక్తి యైనను దానికి సగుణముయొక్క ఆధారము లేకపోలేదు. "రామా! నీ మాట నాకు ప్రమాణము. నీ వేది చెప్పినను, అందు నాకు సందేహమేమియు లేదు" అని భరతుడు వెళ్ళబోవుచు మరల వెనుకకు దిరిగి రామునివంకచూచి "రామా! మనసు తృప్తిపడుటలేదు. ఏదో వెలితి అయినట్లు తోచుచున్నది" అనెను. వెంటనే రాము డతని మనోభావమును గ్రహించి "ఈ పాదుకలు తీసికో" అన్నాడు. చివరకు సగుణము నెడల అదరణ ఉండనే యున్నది. సగుణము వచ్చి నిర్గుణమునకు మృదుత్వము నిచ్చెను. లక్ష్మణుడైనచో ఆ పాదుకలతో తృప్తిపడువాడుకాడు. ఇది యతని దృష్టిలో పాలు కావలసిన వానికి మజ్జిగ దొరకినట్లుండును. భరతుని భూమికవేరు. అతడు రామునికి దూరముగా నుండి కర్మనాచరించెను. కాని అతని హృదయము రామమయము. భరతుడు కర్తవ్య

పాలనమునే రామభక్తిగా నెంచుకొనెను. అతనికి పాదుకల అవశ్యకము ఎంతైనను కనబడెను. పాదుకలు లేకపోయినచో అతడు రాజ్యపాలన చేయలెడు. పాదుకలఅజ్ఞ ననుసరించి అతడు తన కర్తవ్యమును నిర్వహించెను. లక్ష్మణుడెంతరామభక్తుడో, భరతుడును అంతే. బాహ్యముగ చూచిన ఇరువురి భూమికలు వేరువేరు. భరతుడు కర్తవ్యనిష్ఠుడు, తత్త్వనిష్ఠుడు అయినను అతత్త్వనిష్ఠకు పాదుకలతోడి అవశ్యకము తప్పలేదు.

**64.** సగుణ నిర్గుణములు పరస్పర పూరకములు : కృష్ణుని చరిత్రనుండి దృష్టాంతము

హరిభక్తి యను ఆర్ద్రత ముఖ్యముగ కావలెను. ఇందుచేత భగవంతుడర్జునునితో — "మయాసక్తమనాః పార్థ" అర్జునా! నాయం దాసక్తితో, నా కృపారసమును క్రోలుచు కర్మనాచరింపుము- అని పదేపదే చెప్పుచు వచ్చినాడు. ఆసక్తి యనుశబ్దమునే సూచింపని, ప్రేమింపని భగవద్గీత, అనాసక్తుడవై రాగద్వేషరహితుడవై నిరపేక్షతో కర్మనాచరింపుమని పదేపదే నొక్కిచెప్పు భగవద్గీత, అనాసక్తిని, నిస్సంగత్వమును పల్లవి అనుపల్లవిగా చేసినభగవద్గీత "అర్జునా! నాయం దాసక్తి నుంచుము" అని యనుచున్నది. కాని భగవంతునియం దాసక్తి కలిగియుండుట చాల ఉత్కృష్ట విషయ మను సంగతి మనము లక్ష్యమునం దుంచుకొనవలె. అది ఏ భౌతిక వస్తువు మీదనో మనము చూపు ఆసక్తికాదు. సగుణము నిర్గుణము-ఈ రెండును ఒకదానితోనొకటి పెనవేసికొని యుండును. సగుణము నిర్గుణముయొక్క ఆశ్రయమును పూర్తిగ వదలి యుండజాలదు. అట్లే నిర్గుణమునకు సగుణముయొక్క ఆర్ద్రత అవసరము. ఎల్లప్పుడును కర్తవ్యకర్మ నాచరించు వానికర్మ పూజారూపమే. కాని పూజతో పాటు రసము ఆర్ద్రత (భక్తి) ఉండవలె. "మా మనుస్మరయుధ్యచ" నా స్మరణచేయుచునే కర్మనాచరింపుము. కర్మము వస్తుతఃపూజయే! కాని దాని వెనుక సజీవమైన భక్తిభావము ఉండవలె. కేవలము పువ్వులతో చేయునది పూజకాదు. దానిలో భక్తిభావము ఉండవలెను. పుష్పములు సమర్పించుట ఒక పూజావిధానము. సత్కర్మలద్వారా పూజచేయుట మరియొకపద్ధతి. కాని రెంటిలోను భక్తిభావము ఉండవలెను. పుష్పములు సమర్పింపుము. కాని భక్తి లేనిచో ఆ పూవులు కేవలము రాతిమీద పడవేసినట్లే. కనుక ముఖ్యవస్తువు భక్తి. సగుణము – నిర్గుణము, కర్మ – ప్రేమ, జ్ఞానము – భక్తి – వీని యన్నిటి రూపమును ఒకటే. వీనిద్వారా పొందు అనుభవము చివర కొకటే.

ఉద్ధవార్జునుల విషయము తీసికొనుడు. రామాయణమునుండి ఒక్కసారిగ మహాభారతములోనికి దుముకుచున్నాను. ఇందులకు నా కధికార మున్నది. ఎట్లనగా రాము డన్నను కృష్ణు డన్నను ఒకటే. భరత లక్ష్మణులవంటివారే ఉద్ధవార్జునులు. కృష్ణుడున్నచోట నెల్ల ఉద్ధవు డుండవలయును. కృష్ణునితోడి వియోగము ఉద్ధవుడు క్షణమాత్రముకూడ సహింపలేడు. అతడు నిరంతరము కృష్ణునిసేవలో నిమగ్నుడై యుండును. కృష్ణుడువినా ప్రపంచమంతయు అతనికి రసవిహీనముగ నుండును. అర్జునుడుకూడ కృష్ణుని సఖుడే! కాని యతడు దూరముగా ఢిల్లీలో నుండును. అర్జునుడుకూడ కృష్ణునికార్యము నెరవేర్చువాడే! కాని కృష్ణుడు ద్వారకలోను, అర్జునుడు హస్తినాపురములోను ఉందురు. ఇద్దరి సంబంధమిది. కృష్ణుడు దేహత్యాగము చేయవలసి వచ్చినపుడు అతడుద్ధవునితో "ఉద్ధవా! నేనిక పోవుచున్నాను" అనెను. "నన్నుకూడ మీతో తీసికొనివెళ్ళరా? మన మిద్దరమును కలిసియే పోవుదము" అన్నాడు ఉద్ధవుడు. కాని కృష్ణుడు "ఇది నాకు సమ్మతముకాదు. సూర్యుడు తన తేజస్సును అగ్నిలో ఉంచి వెళ్ళినట్లే నాజ్యోతిని నీలో ఉంచి పోవుచున్నాను" అని చెప్పినాడు. ఈ విధముగ భగవంతుడు ఉద్ధవునిపట్ల చరమనిర్ణయ మొనర్చి, జ్ఞానమును ప్రసాదించి అతనిని పంపెను. తరువాత కొన్నాళ్ళకు కృష్ణుడు తన లోకమున కేగెను. ఈ వార్త ఉద్ధవునికి తీర్థయాత్రలో మైత్రేయ ఋషివలన తెలియవచ్చెను. కాని దీని కత డించుకయు చలింపలేదు. ఏమియు జరుగనట్లే యుండెను. "గురువు చనిపోగా శిష్యు డేడ్చినాడు. ఉభయులును బోధను వ్యర్థమొనర్చినారు." ఇట్టి గతి ఉద్ధవునికి పట్టలేదు. వియోగము కలుగనట్లే యున్నా డతడు. అతడు జీవితము పొడుగునను సగుణోపాసన చేసినాడు. ఎప్పుడును పరమేశ్వరసన్నిధినే ఉండువాడు. కాని ఇప్పుడతడు నిర్గుణములోనే ఆనందమును పొందుచు, నిర్గుణ మను మజిలీని చేరుకున్నాడు. సాధన సగుణముతో ప్రారంభమైనను నిర్గుణమను మెట్టును ఎక్కవలసియే యున్నది. లేకున్న పరిపూర్ణత కలుగదు.

అర్జునునిస్థితి దీనికి వ్యతిరేకము. శ్రీకృష్ణుడు అతని నేమి చేయుమనెను? తాను పోయినతరువాత తన స్త్రీల రక్షింపుమనెను. అర్జునుడు ఢిల్లీనుండి ద్వారకకు వచ్చి శ్రీకృష్ణుని స్త్రీలను తీసికొని ఢిల్లీకి బయలుదేరెను. దారిలో హిసార్‌దగ్గర పాంచాలచోరులు వారిపైబడి సొమ్ములు దోచుకొని పోయిరి. తా నొక్కడే నరుడని, మహావీరు డని, పరాజయ మెరుగనివా డని,

విజయుడని ప్రసిద్ధికెక్కిన అర్జునుడు, ప్రత్యక్షముగ యుద్ధముచేసి శివుని ఓడించిన అర్జునుడు చివర కీ సందర్భములో అజమీరునకు పారిపోయి ప్రాణమును రక్షించుకొనెను. కృష్ణుని వియోగమువలన అతడు చాల కలతపడి జీవచ్ఛవమై పోయినాడు. దీని సారాంశమిది: సర్వదా కర్మరతుడయి, కృష్ణునికి దూరముగనుండి నిర్గుణోపాసన చేసిన అర్జునునికి చివర కీ వియోగభారము దుస్సహమయినది. దీనితో అతడు చేసిన నిర్గుణోపాసనకే ముప్పు వాటిల్లినది. నిర్గుణమునకు సగుణానుభవము తప్పినదికాదు. సగుణము, నిర్గుణము పరస్పర పూరకములయి పూర్ణత్వమును పొందును. దేనికది పూర్ణముకాదు.

## 65. సగుణమును నిర్గుణమును ఒకటే యను విషయమున స్వానుభవములోని ఒక కథ

అందువలన సగుణనిర్గుణోపాసకు లిరువుర నడమ నుండు భేదమును వివరింపవలెనవిన భాష కుంటువడును. సగుణము, నిర్గుణము చివరకొకటే. భక్తిప్రవాహము మొదట సగుణములో ప్రారంభమైనను చివరకు నిర్గుణములో పరిసమాప్తి నొందును. వెనుక నొకసారి నేను 'వైకము' సత్యాగ్రహమును చూచుటకు వెళ్ళితిని. మలబారు సరిహద్దులో శంకరాచార్యుడు జన్మించిన గ్రామమున్నదని భూగోళ పరిచయమునుబట్టి నాకు తెలియును. నేను వెళ్ళుమార్గమునకు సమీపములోనే పూజ్యులు శంకరాచార్యుల 'కాలడీ' గ్రామ ముండితీరవలెనని నాకు తోచి అదెక్కడనున్నదో నీకు తెలియునా యని నా వెంటనున్న మళయాళీ సోదరుని అడిగితిని. అత డది అక్కడికి పదిపంద్రెండు మైళ్ళలోనే యున్నదని చెప్పి "మీ రక్కడికి వెళ్ళదలచితిరా ?" అని నన్నడిగెను. 'లే' దంటిని. నేను వెళ్ళుట సత్యాగ్రహము చూచుటకు. కనుక మరెక్కడికి వెళ్ళుటయు ఉచితము కాదని అప్పుడు నే నక్కడికి వెళ్ళనైతిని. అదట్లు జరుగుట సమంజసమే యని ఇప్పటికిని నా కనిపించును. కాని ఆ రాత్రి నిద్రలో ఆ 'కాలడీ' గ్రామమును, శంకరాచార్యుని మూర్తియు సర్వదా నా కనులకు కట్టినట్లుండెను. నా నిద్ర యెగిరిపోయెను. ఈ నాటికిని ఇదే నా యనుభవము. శంకరాచార్యుని జ్ఞానప్రభావమును, దివ్యమైన అద్వైతనిష్ఠయు, ఎట్టయెదుట కనబడుచున్న ప్రపంచమెల్ల మిధ్యయని నిరూపించగల అలౌకికమైన ఉజ్జ్వలమైన వైరాగ్యమును, గంభీరమైన వాణియు, ఆయనవలన నాకు కలిగిన మహోపకారమును – ఇన్నిటితో నా హృదయము నిండి రాత్రులకు రాత్రులే గడచిపోవువవి. నిర్గుణములో సగుణమెట్లు ఓతప్రోతమై యుండునో అప్పుడు నా కర్థ

మయ్యెను. ప్రత్యక్ష దర్శనములో కూడ అంతప్రభావము ఉండదు. నిర్గుణములో కూడ సగుణముయొక్క సారము పూర్తిగ నిండియుండును. కుశల వార్తలు తెలిసికొనుటకు విశేషించి నే నెవరికిని లేఖలు వ్రాయను. కాని ఏ మిత్రునికి లేఖలు వ్రాయకపోయినను హృదయములో అతనిని నిరంతరమును స్మరించుచునే యుందును. ఈ విధముగ నిర్గుణములో సగుణము గుప్తముగా నుండును. సగుణము, నిర్గుణము – ఈ రెంటిరూపమును ఒకటే. (1) ప్రత్యక్షముగ మూర్తిని పూజించుట, ప్రకటరూపమున సేవాకార్యములు చేయుచుండుట (2) ప్రకటరూపమున పూజను, సేవాకార్యములను వెలువరింపక పోయినను లోకకల్యాణముకొరకు హృదయములో నిరంతరమును చింతన చేయుచుండుట– ఈ రెంటివిలువ, యోగ్యత సమానము.

## 66. సగుణ నిర్గుణములు కేవలము దృష్టి భేదములే! కావున భక్తలక్షణముల నార్జింతముగాక ! సారాంశమిదియే !

సగుణ మేదో, నిర్గుణమేదో నిశ్చయించుట తేలికైన పనికాదు. ఒకదృష్టిలో సగుణమైనది మరొకదృష్టిలో నిర్గుణముగ నిశ్చితము కావచ్చును. శిలావిగ్రహముద్వారా చేయుదానిని సగుణసేవ యందుము. ఆ శిలలో భగవంతుని మూర్తీభవింప జేయుదుము. మన తల్లిలోను, మహాత్ములలోను చైతన్యమును ప్రత్యక్షముగ మనము దర్శించుచుందుము. వారిలో జ్ఞానము, ప్రేమ, సుహృద్భావము, స్పష్టముగ గోచరించుచుండును. అయినను మనము వారిని పరమాత్మగ భావించి పూజింపము. ఈ చైతన్యస్వరూపులు ఎల్లరకును కనబడుచునే యుందురు. కావున వారిలో సగుణ పరమాత్మను దర్శించి సేవింపవలెను. కాని అట్లుచేయక మానవులు ఱాతిలో పరమేశ్వరుని చూతురు. ఒక దృష్టిలో ఱాతి యందు పరమేశ్వరుని చూచుట నిర్గుణముయొక్క తుదిమెట్టు. మహాత్ములు, తల్లిదండ్రులు, ఇరుగుపొరుగువారు – వీరిలో ప్రేమ, జ్ఞానము, ఉపకారబుద్ధి వ్యక్తమగుచుండును. వారిలో ఈశ్వరుని చూచుట తేలిక. కాని ఱాతిలో ఈశ్వరుని చూచుట కష్టము. నర్మదానదిలోని ఱాతిని శంకరుని మూర్తిగ భావింతుము. ఇది నిర్గుణపూజ కాదా ? కష్ట మనుకొనునదియే మరియొక దృష్టిలోచూచిన సులభమనిపించును; ఱాతిలో పరమేశ్వరుని భావింపలేక పోయినచో మరిభావింపగలుగున దెక్కడ ? భగవంతుని మూర్తిగా నుండుటకు తగినది ఱాయియే. అది నిర్వికారము, శాంతము. అంధకారమయినను, వెలుతురయినను, వేడియైనను,

చలిమైననను ఆ జాయి యేమియు చలింపదు. ఇట్టి నిర్వికార మయిన జాయియే పరమేశ్వరుని చిహ్నముగా నుండదగినది. తల్లిదండ్రులు, ప్రజానీకము, ఇరుగు పొరుగువారు – వీరందరును కొలదిగనో గొప్పగనో వికారములతో కూడి యుందురు. కావున జాతిని పూజించుటవలె వీరిని భగవద్భావనతో పూజించుట ఒక దృష్టిలో కఠినమే!

సగుణనిర్గుణములు పరస్పర పూరకములని సారాంశము. సగుణము సులభము; నిర్గుణము కఠినము. కాని మరొక దృష్టిలో సగుణము కఠినము, నిర్గుణము సులభము. రెంటిద్వారా ఒక లక్ష్యమునే చేరుకొందుము. ఇరువది నాలుగు గంటలును కర్మ నాచరించుచు లేశ మాత్రమును కర్మ చేయని యోగి, ఎప్పుడును ఏ మాత్రమేని కర్మనాచరింపక సమస్తకర్మలను చేయు సంన్యాసి– ఈ యిరువురును ఒకరే యని అయిదవ అధ్యాయములో చెప్పబడినట్లే ఇక్కడ కూడ చెప్పవచ్చును. సగుణకర్మయోగము, నిర్గుణ సంన్యాసయోగము–రెండును ఒకటే. సంన్యాసమా, కర్మయోగమా ఏది శ్రేష్ఠమను ప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చుట భగవంతునికెట్లు కష్టమయినదో ఇక్కడను అట్లే యైనది. చివరకు సాధనలో ఒకదానికంటె నొకటి సులభ మను విషయమును లక్ష్యములో నుంచు కొని భగవంతుడు సమాధాన మిచ్చెను. లేకున్న యోగము – సంన్యాసము, సగుణము – నిర్గుణము అన్నియు ఒకటే. భగవంతుడు చివర కిట్లన్నాడు. "అర్జునా! నీవు సగుణోపాసన చేయుము లేక నిర్గుణోపాసన చేయుము. ఏదైనను సరే! కాని నీవు భక్తుడవు మాత్రము కావలె! జాతివి మాత్రము కావలదు" అని చెప్పి చివరకు భక్తుని లక్షణములు బోధించెను. అమృతము మధురముగ నుండును. కాని దాని మాధుర్యమును మనము చవిచూడలేదు. కాని భక్తుని లక్షణములు ప్రత్యక్ష మధురములు. వీనిని మనము ఊహింపవలసిన పనిలేదు; అనుభవములోనికి తెచ్చుకొందముగాక! ఈ యధ్యాయములోని భక్తలక్షణము లను స్థితప్రజ్ఞుని లక్షణములవలెనే మనము నిత్యమునుపఠింపవలెను. మననము చేయవలెను. వానిని మెల్లగ నిత్యానుభవములోనికి తెచ్చుకొని పుష్టిమంతులము కావలెను. ఈ విధముగ మనము మన జీవితములను మెల్లమెల్లగ పరమేశ్వరుని వైపునకు నడుపుకొనుచు పోవలెను. (8–5–32)

# పదునాఱవ అధ్యాయము

## ఆత్మానాత్మ వివేకము

### 67. కర్మయోగమున కుపకరించు దేహాత్మల - పృథక్కరణ

సోదరులారా! వ్యాసదేవుడు తనజీవితసారమును భగవద్గీతలో పొందు పరచెను. ఆయన ఇంకను అనేక గ్రంథములు విపులముగ వ్రాసెను. ఒక్క మహాభారత సంహితయే లక్ష – లక్షపాతికవేల శ్లోకముల గ్రంథము. సంస్కృతములో 'వ్యాస' శబ్దమునకే 'విస్తార' మని యర్థము. కాని భగవద్గీతలో ఆయనపోకడ విస్తరణవైపునకు మ్రొగ్గలేదు.భూమితి శాస్త్రములో తత్త్వమును సిద్ధాంతమును యూక్లిడు చెప్పినట్లే వ్యాసదేవుడు గీతయందు జీవితోపయోగ తత్త్వమును వ్రాసియుంచెను. భగవద్గీతలో విశేషచర్చగాని విశేషవ్యాఖ్యానముగాని లేదు. దీనికి ముఖ్యకారణమేమన గీతతో చెప్పబడిన విషయములను ప్రతి మానవుడును పరిశీలించుకొని వానిని తన జీవితములో ప్రయోగించుకొన వలెనని ఆయన యుద్దేశము. జీవితమున కుపయోగపడు విషయములు మాత్రమే గీతలో చెప్పబడినవి. అట్లు చెప్పుటలో వ్యాసుని యుద్దేశముకూడ అదే! కావుననే అతడు తత్త్వమును క్లప్తముగ చెప్పి సంతృప్తి చెందినాడు. ఇట్లు తృప్తిపడుటలో అతని సత్యనిరతి, అనుభవసిద్ధమైన ఆత్మవిశ్వాసము మనకు కనబడుచున్నవి. సత్యమైన విషయమును సమర్థించుటకు ఎక్కువ యుక్తితో పనిలేదు.

గీతమీద మనము దృష్టి పెట్టుకొనుటలో ముఖ్యోద్దేశ మేమనగా జీవితములో మనకు సాహాయ్యము అవసరమైనపుడెల్ల గీతనుండి మనకది కలుగు చుండవలెనని. అట్టి సాయమును మన కది యెల్లపుడును ఇచ్చుచున్నట్లే యుండును. గీత జీవనోపకారియగు శాస్త్రము. కావుననే దానిలో స్వధర్మము అంతగా నొక్కి చెప్పబడినది. మానవజీవితమునకు స్వధర్మాచరణయే గట్టి పునాది. జీవితసౌధము ఈ పునాదిమీదనే నిర్మితముకావలె. ఈ పునాదియొక్క గట్టితనమునుబట్టి భవనముయొక్క మనుగడ యుండును. ఈ స్వధర్మాచరణను గీత ' కర్మ ' యనును. స్వధర్మాచరణకు సన్నిహితముగనుండు అనేకములగు ఇతర విషయములుకూడ ఇందు ప్రతిపాదింపబడినవి. వాని రక్షణకొఱకు అనేక వికర్మలు చక్కగా సూచింపబడినవి. స్వధర్మాచరణను సుందరముగాను,

ఆకర్షణీయనుుగాను, ఫలప్రదముగాను చేయుటకు కావలసిన ఆధారమును, సాహా య్యమును సమకూర్చుట అవసరము. ఇందుచేత ఇటువంటి సంగతు లనేక ములు మన మింతవరకు గీతలో చూచినారము. అవి చాలవరకు భక్తిరూప మైనవి. ఇప్పుడు పదుమూడవ అధ్యాయములో మనము చూడబోవు విషయము కూడ స్వధర్మాచరణకు చాల ఉపయోగపడునదే. ఈ సాహాయ్యము భావ వికాసముద్వారా జరుగును.

స్వధర్మము నాచరించువాడు ఫలత్యాగము చేయవలసి యున్నాడను ముఖ్యవిషయము గీతలో సర్వత్ర చెప్పబడియున్నది. విధిగా కర్మను చేయుము. కాని దానిఫలమును విడిచిపెట్టుము. చెట్టునకు నీరుపోసి పోషిం పుము. కాని దానినీడను, ఫలపుష్పములను స్వయముగ అనుభవింపవలెనని కోరకుము. స్వధర్మము నాచరించు కర్మయోగము యొక్క రూపమిది. కర్మ యోగ మనగా కేవలము కర్మలను చేయుచుండుట యని కాదు. ఈ సృష్టిలో కర్మ అంతటను జరుగుచునే యుండును. ఆ విషయము లెక్కకు రానక్కర లేదు. కాని ఇటువంటి వట్టికర్మ కాక, స్వధర్మాచరణరూపమైన కర్మను చక్కగా నాచరించుచు దానిఫలమును వదలిపెట్టుమని చెప్పుట, గ్రహించుట తేలికయే కాని, ఆచరించుట కష్టము. ఎందువలన ననగా ఏ కార్యమునకైనను ప్రేరే పించునది దాని ఫలవాంఛయే! ఫలవాంఛ లేకుండ కర్మనాచరించుట తల క్రిందుపద్ధతి. ఈ పని లోకవ్యవహారమునకు విరుద్ధము. బహుకర్మ లాచరించు వాడు కర్మయోగి అని మనము గీతాదృష్టిలో తఱచుగా తలంతుము. ఎడతెగని పనులు చేయువాని జీవితము కర్మయోగమయమని మనలెక్క. కాని ఇది సరి యైన నిర్వచనము కాదు. గీతయిచ్చు నిర్వచనమును బట్టి చూచిన ఇట్టివాడు కర్మయోగి కాడు. కర్మనాచరించు లక్షల కొలది ప్రజలలోను - వట్టికర్మలేకాక స్వధర్మమును ఆచరించువారిలోను కూడ – గీత నిరూపించిన కర్మయోగులు లభించుట కష్టసాధ్యము. కర్మయోగము యొక్క సూక్ష్మమైన, నిజమైన అర్థమునుబట్టి చూచిన సంపూర్ణుడైన కర్మయోగి ఎక్కడను దొరకడనియే చెప్ప వచ్చును. కర్మ నాచరించుట, దాని ఫలమును వదలివేయుట కేవలము అసా ధారణవిషయము. అయినను గీత యింతవరకును కర్మను కర్మఫలమును వేరు చేయుమనియే చెప్పుచు వచ్చినది.

ఈ పృథక్కరణ ఆచరణయోగ్యమగుటకే మరియొక పృథక్కరణ ఈపదు మూడవ అధ్యాయములో చెప్పబడినది. "కర్మనాచరింపుము, ఫలాసక్తిని

వదలివేయుము" అను పృథక్కరణకు "దేహమును ఆత్మను వేరుపరచు"మను మహోత్కృష్టమైన పృథక్కరణ చాల సాయపడును. పదుమూడవ అధ్యాయములో ప్రతిపాదింపబడిన దిదియే. మన కనుల కగపడురూపమును మూర్తి, అకారము, దేహము అని యందుము. మననేత్రములకు బాహ్యరూపము పరిచితమైనను దాని ఆంతర్యమును గూడ మనము తెలిసికొనవలెను. ఫలము యొక్క పైచర్మమును ఒలిచి లోపలిగుంజును రుచిచూడవలె. కొబ్బరికాయ పైగల కవచము తొలగించినప్పుడు లోపలికొబ్బరి కనబడును. పనసపండు పట్ల కూడ అట్లు చేసిననే లోపల చక్కని తియ్యని తొనలు కనబడును. స్వవిషయమున గాని, ఇతరుల విషయమున గాని బహిరంతరములను వేరుచేసి చూచుట అవసరము. ఇట్లు పైతొడుగును వేరుచేయుట యననేమి? ప్రతి వస్తువుయొక్క బాహ్యరూపమునుండి లోపలిసారమును వేరుచేసి చూచుట యని యర్థము. ప్రతి వస్తువునకును వెలుపల దేహమని లోపల ఆత్మ యని రెండు ఉండును. కర్మవిషయములోకూడ ఇంతే. బాహ్యఫలము కర్మకు దేహము. కర్మనాచరించుటచే కలుగుచిత్తశుద్ధి కర్మకు ఆత్మ. స్వధర్మాచరణ యొక్క బాహ్యఫల మను దేహమును వదలిపెట్టుము; ఆంతరమగు చిత్తశుద్ధియను ఆత్మను గ్రహించి నూతన చైతన్యమును పొందుము. ఈ విధముగా చూచు అభ్యాసముతో దేహమును వేరుచేసి, ప్రతి వస్తువులోని సారమును గ్రహించు దృష్టిని మనము అలవరచుకొనవలెను. కంటికి, మనస్సునకు, భావనకు ఇటువంటి శిక్షణను, అభ్యాసమును నేర్పవలెను. ప్రతివిషయమునందును దేహమును వేరుపరచి ఆత్మను గౌరవింపవలెను. మన భావవికాసముకొరకు పదుమూడవ అధ్యాయము ఈ పృథక్కరణను బోధించినది.

## 68. సంస్కరణకు మూలాధారము

సారమును గ్రహించు దృష్టిని కుదుర్చుకొనుటలో చాల మహత్త్వమున్నది. బాల్యమునుండియు మన మిట్టి అభ్యాసమును చేసిన నెంత బాగుగా నుండును! ఈవిషయము జీర్ణముచేసికొనదగినది, ఈదృష్టి అంగీకరింపదగినది. ఆధ్యాత్మవిద్య జీవితమునకు సంబంధించినది కాదని చాలమంది అనుకొందురు. అట్టిసంబంధ మేదేని ఉన్నను అది యుండరాదని కొందఱియుద్దేశము. కాని దేహమునుండి ఆత్మను వేరుగ భావించెడుశిక్షణను బాల్యమునుండియే అలవరిచికొనుట శుభప్రదముగ నుండును. ఇది శిక్షణ శాస్త్రమునకు సంబంధించిన విషయము. నేటి కుశిక్షణఫలితముగ బిడ్డలకు చాల చెడ్డసంస్కారములు అబ్బు

చున్నవి. ఈ కుశిక్షణలో నున్నంతకాలము ఈదేహమే నేనను భావమును దాటి పోలేము. దేహభ్రాంతివలన ఇంద్రియలోలత్వములోనే కాలమంతయు గడచి పోవును. ఇట్లెన్నాళ్ళు గడచినను దేహము సేవకుతగిన ఉపకరణముగా ఏర్పడ జాలదు. ఈ విధముగనే దేహమునకు వృథాపూజ జరుగుచున్నది. ఆత్మమాధు ర్యము వైపునకు దృష్టిపోవుటయేలేదు. వర్తమాన శిక్షణవిధానమువలననే ఈ స్థితి యేర్పడినది. ఇట్లు అహర్నిశము దేహమునకు మూర్తిపూజచేయుచున్నాము.

అతిబాల్యమునుండియు దేహమును దైవముగ పూజించు శిక్షణ మన కీయబడుచున్నది. పిల్లవానికాలికి కొంచెము ఎదురుదెబ్బ తగిలినచో దాని కింత మట్టి యంటించిన సరిపోవును. దెబ్బ చిన్నదైనచో ఆమట్టి అద్దవలసిన అవ సరముకూడ వానికి కనిపించదు. చిన్నదెబ్బలను పిల్లవాడు లెక్కచేయడు. కాని కుఱ్ఱవానిసంరక్షకుడు ఇట్లూరకుండలేడు. అతడు పిల్లవానిని దగ్గరకుపిలిచి బుజ్జగించి "ఎంతదెబ్బతగిలినది ? ఎట్లుతగిలినది ? ఎక్కడతగిలినది ? పెద్ద దెబ్బయే తగిలినదే! అరే, రక్తముకూడ వచ్చుచున్నదే!" అని యనుచు, కుఱ్ఱ వాడు ఏడ్వకపోయినను వానినేడ్పించును. ఇట్లు ఏడ్వని కుఱ్ఱవానిని ఏడ్పించు లక్షణము నేమనవలెను ? "నాయనా! గంతులువేయకుము. ఆటలకు పోవలదు. పడెదవు. దెబ్బతగులును." అని కేవలము దేహముమీదనే దృష్టినిలుపు శిక్షణ పిల్లల కీయబడుచున్నది.

బాలుని ఎందులకేని మెచ్చుకొన్నను అది కేవలము దేహదృష్టితోనే. వాని నొకప్పుడు నిందించినచో అదియు దేహదృష్టితోనే. బిడ్డనుచూచి "ఎంత మురికితో నున్నావురా ?" అని యందురు. దీనివలన కుఱ్ఱవాని కెంతో మనోవ్యథ కలు గును. ఇది ఎంతమిథ్యారోపణ! కుఱ్ఱవాడు మురికితో నున్నమాటనిజమే! వానిని శుభ్రపరుపవలసియుండగా వాని నిట్లు నిందించి హింసించుట యెందులకు ? కుఱ్ఱవాడు దీనిని సహింపలేడు. వాడు చాలవిచారపడును. వాని యంతరాత్మలో పవిత్రత, నైర్మల్యము నిండియున్నను పాపము! వానిపై వృథాగా ఇట్టియారో పణ యెందులకు ? నిజమునకు ఆ కుఱ్ఱవాడు మురికివాడు కాడు. అతిసుంద రము, మధురము, పవిత్రము, ప్రియము అయినపరమాత్మ స్వరూపమే వాడు. పరమాత్మయొక్క అంశమే వానిలో మూర్తీభవించియున్నది. అట్టివానిని పట్టు కొని "మురికివాడా!" అందురు. ఆ మాలిన్యముతో వానికేమి సంబంధమున్నది? ఇంతకు ఆ మాలిన్యమున్నట్లే వానికి తెలియదు. అందుచేతనే ఈ నిందను వాడు సహింపలేడు. వాని మనస్సు క్షోభపడును. అట్టివానిలో నిక సంస్కరణకు

అవకాశములేదు. అందువలన చక్కగా నచ్చజెప్పి వానిని పరిశుభ్ర పరుప వలెను.

కాని ఇందులకు విరుద్ధమైనపద్ధతుల నవలంబించి "దేహమే తాను" అను భావమును వానిలో బలపరుచుచున్నాము. దేహాత్మల పృథక్కరణను శిక్షణ శాస్త్రములో నొక ఉత్తమోత్తమ సిద్ధాంతముగ భావింపవలె. తనయొద్ద విద్య నభ్యసించుశిష్యుడు సర్వాంగసుందరుడను భావనగురువుకుండవలె. కాని ఇప్పు డాభావన కనబడదు. లెక్కలలోగాని, ప్రశ్నకు సమాధాన మిచ్చునప్పుడుగాని పిల్లవాడు తప్పు చెప్పినచో గురువు చెంపదెబ్బవేయును. పిల్లవాని తప్పునకును చెంపదెబ్బకును ఏమిసంబంధము ? బడికి ఆలస్యముగ వచ్చినచో చెంప దెబ్బ పడినదన్నమాటే! అందువలన వాని చెంప కందునేకాని వాడు త్వరగా బడికి వచ్చునా ? చెంపమీద తేలిన వ్రేళ్ళు బడికిరావలసిన గంటను వానికి తెలుపగలవా ? నిజమునకు ఈ దెబ్బవలన వానిలోని పశుత్వమును పెంచు చున్నాము. నీవీ "దేహమే సుమా !" అనుభావమును దృఢపరుచుచున్నాము. కుఱ్ఱవాని జీవితమును భయమను పునాదిమీద నిర్మాణము చేయుచున్నాము. వాని జీవితమును సంస్కరించు ఉద్దేశమే మనకున్నచో ఈ విధముగ హింస పెట్టి, దేహాసక్తిని పెంచము. ఇందువలన వానిలో ఎన్నటికిని సంస్కరణను తీసి కొని రాలేము. "దేహమునుండి నేను వేరు" అని గ్రహించినప్పుడే సంస్కరణము కలుగును.

తనలో శారీరక, మానసిక దోషము లున్నట్లు మానవుడు గుర్తించుకొనుట తప్పుకాదు. ఈ జ్ఞానము దోషములను తొలగించు కొనుటకు సాయపడును. కాని "నేను దేహమను కాను. ఈ దేహమునుండి పూర్తిగా భిన్నము, అత్యంతసుంద రము, ఉజ్జ్వలము, దోషరహితము - అయిన ఆత్మను" అని మానవుడు స్పష్ట ముగా గ్రహింపవలయును. తాను నిర్దోషి యగుటకు చేసికొను ఆత్మపరీక్షను కూడ దేహభావమును తొలగించుకొనియే చేసికొనవలెను. అట్టివాడు ఎవరైనను తన దోషమునుపట్టి తనకు చూపినచో ఏమియు అనుకొనడు. చూపిన వానిమీద వానికి కోపమురాదు. మీదుమిక్కిలి శరీరముతో, మనస్సుతోకూడిన ఈ యంత్ర ములోని దోషములను పరిశీలించుకొని, వానిని తొలగించుకొనును. అట్లు దేహము నుండి తన్నువేరుగా చూచుకొనలేనివాడు తానై తన్ను సంస్కరించుకొనలేడు. "ఈ దేహము, ఈ పిండము, ఈ మట్టిబొమ్మ - ఇదే నే" ననుకొనువాడు తన్ను దా నెట్లు సంస్కరించుకొనగలడు ? ఈ దేహము సాధనకై నాకు లభించినదని

నమ్మినప్పుడే నాలో సంస్కరణ రాగలదు. ఎవరైనను నా రాట్నములో లోప మును చూపినచో వారిమీద నాకేమైన కోపము వచ్చునా? ఏదైన దోషము న్నచో దానిని సవరించుకొందును. శరీర విషయముకూడ ఇంతే? వ్యవసాయపు పనిముట్లవంటిదే ఈ దేహముకూడ. భగవంతుని సేద్యమునకు ఉపకరించు పని ముట్టే యీ దేహము. పనిముట్టు చెడినచో వెంటనే దానిని తప్పక సరిదిద్దుకొన వలె. సంస్కరించుకొనవలెను. ఈ దేహము సాధననిమిత్త మీయబడిన వస్తువు. అందువలన మనము దేహమునుండి మనలను వేరుపరచుకొని, దోషవిముక్తి కొఱకు ప్రయత్నింపవలె. "దేహ మను ఈ పనిముట్టునుండి నేను వేరు, దీనికి నేను స్వామిని, దీనిచేత నేను ఉత్కృష్టమైన సేవాకార్యములను చేయింతును" అని బాల్యము నుండియే "దేహమువేరు, తాను వేరు" అను వృత్తిని మానవుడు అలవరచుకొనవలె.

స్వయముగ ఆటలో పాల్గొనకుండ మధ్యవర్తిగ నుండువాడు ఆటలోని గుణదోషములను నిర్లిప్తముగ చూడగలిగినట్లే మన దేహ మనోబుద్ధులనుండి మనము వేరైయుండియే వాని గుణదోషములను పరిశీలింపగలము. ఒక్కొ క్కడు – "నా జ్ఞాపకశక్తి యేదో కొంచెము తగ్గిపోయినదండీ! దీని కేదైన ఉపా యము చెప్పగలరా?" అనును. మనుష్య డిట్లనుటలో తాను జ్ఞాపకశక్తినుండి వేరు" అని స్పష్టమగుచున్నది. "నా జ్ఞాపకశక్తి చెడిపోయినది"అని అతడనును. ఇందువలన వానికున్న సాధన సామగ్రిలో ఒక పనిముట్టు చెడిపోయినదని వాని భావన. ఒకడు తనపిల్లవాడు పోయినాడనును. లేక తన పుస్తకము పోయిన దనును. కాని యెవ్వడును తన్ను తాను కోల్పోజాలడు. చివరకు మరణ సమ యములో పూర్ణముగ నష్టమగునది దేహమే! పనికిరాకుండ పోవునది అదే! కాని లోపలి ఆత్మవస్తువు మాత్రము చెక్కచెదరకుండ ఉండును. అది నిర్దో షము, నీరోగముగ నుండును. ఇది గ్రహింపదగిన విషయము. దీనిని గ్రహిం చినచో పెక్కు చిక్కులు తొలగిపోవును.

**69.** దేహాసక్తితో దేహము బంధింపబడినది

'దేహమే నేను' అనుభావన సర్వత్ర వ్యాపించినందువలన మనుష్యుడు వివేకములేక దేహపుష్టికొఱకు అనేక సాధనలను నిర్మించుకొనును. వానిని చూచిన భయమగును. ఈ దేహమెంత ప్రాత దయి జీర్ణమయి పోయినను ఏదో యొక ఉపాయముచేత దానిని నిలబెట్టవలెనను నిశ్చయముతో అతడుండును. కాని యెంతకాలము ఈ దేహమును, ఈపైతొడుగును నిలుపగలము? చనిపోవు

వరకే కదా! మృత్యువుయొక్క 'వారంటు వచ్చిన తరువాత ఒక్కక్షణము కూడ అది నిలువజాలదు. మృత్యువునెదుట దానిగర్వమంతయు ఉడిగిపోవును. అయినప్పటికి ఈ తుచ్ఛదేహముకొఱకు మానవుడు వివిధసాధనలను సమకూర్చుకొనుచుండును. అహర్నిశము దేహమును గూర్చి యోజించుచుండును. దేహరక్షణార్థము మాంసభక్షణ చేయుటలో తప్పేమియు లేదని ఇటీవల కొందరనుచుందురు. మానవశరీరము చాల విలువకలది యని, మాంసము తినియైనను దానిని రక్షింపవలెనని వారిభావన. పశువుదేహముకంటె మానవదేహము విలువకలదిగా ఎందులకయినది? పశువు దొరకినదెల్ల తినివేయగలదు. స్వార్థము వినా దానికింకొక వృత్తిలేదు. మానవుని విషయములో అట్లుకాదు. మనుష్యుడు తనచుట్టునుండు జీవులను రక్షించును. కనుక మనుష్య దేహమునకు విలువ వచ్చినది. కాని ఏ కారణమున మానవదేహమునకు విలువ వచ్చినదో ఆ కారణమును మనము మాంసము తిని వమ్ముచేయుచున్నాము. ఓయీ! నీవు నిగ్రహముతో నుందువని, సర్వజీవులకొఱకును త్రికరణశుద్ధిగ పాటుపడుదువని, అందరిని కనిపెట్టి కాపాడువృత్తి నీలో నున్నదనికదా నీకి పెద్దరికము వచ్చినది? పశువుకంటె తనకున్న విశిష్టతచేతనేకదా మానవుడు శ్రేష్ఠుడనిపించుకొన్నాడు? ఇందువలననేకదా మానవదేహము దుర్లభమన్నారు. కాని దేనినాధారము చేసికొని మనుష్యుడు శ్రేష్ఠుడైనాడో దానినే యతడు నిర్మూలించుకొన్నచో ఇక వాని గొప్పతనము నిలుచునదెట్లు? ఒక జంతువు మరియొకజంతువు మాంసముతిని బ్రతికినట్లు మానవుడు కూడ అట్లే నిస్సంకోచముగ బ్రతుకుట ప్రారంభించినచో వాని గొప్పతనమున కున్నమూలాధారమే కూలిపోయినట్లగును. తానెక్కి కూర్చున్నకొమ్మను తానే కొట్టివేసికొన్నంట్లుండును.

ఆధునిక వైద్యశాస్త్రము అనేక చమత్కారప్రయోగములు చేయుచున్నది. వైద్యులు పశువునకు శస్త్రముచేసి అది బ్రతికియుండగనే దానిశరీరములో రోగక్రిములను ప్రవేశపెట్టి, దానివలన కలుగు వివిధపరిణామములను పరిశీలింతురు. ఈ విధముగ బ్రతికియున్న జంతువును ఇంతబాధపెట్టి సంపాదించు జ్ఞానము ఈ క్షుద్రమానవ శరీరమును నిలువబెట్టుట కుపయోగింపబడుచున్నది. ఇదంతయు భూతదయపేర జరుగుచున్నది. పశువుల శరీరములో రోగాణువులను ప్రవేశపెట్టి వానిరసిని తీసి మనుష్యశరీరములోనికి ఎక్కింతురు. ఇట్టి భీషణకృత్యము లనేకములు జరుగుచున్నవి. మనము ఏ శరీరముకొఱకు ఈపనులన్నిటిని చేయుచున్నామో ఆ శరీరము నిమిషములో విరిగి ముక్కలగు

గాజువంటిది. అది యేక్షణములో పగిలిపోవునో ఎవరును చెప్పలేరు. ఈ దేహ రక్షణకై ఈపనులన్నియు జరుగుచున్నను చివరకు దీనివలన మనకు కలుగుచున్న అనుభవమేమి? ఈ నాజూకు దేహమును పోషించి నిలువబెట్టు ప్రయత్నము జరుగుచున్నకొలది నశించు దేహములసంఖ్య పెరుగుచున్నది. ఇది మన నిత్యానుభవములోని విషయమే యైనను ఈ దేహమును పోషించి పెంచుటకు మనుష్యుడు చేయుప్రయత్నములు మాత్రము జరుగుచునే యున్నవి.

ఎట్టియాహారమును భుజించుటవలన బుద్ధి సాత్త్వికమగునో ఆ విషయము మీాది కెన్నడును ఆలోచనపోదు. మనస్సును కుదురుగా నుంచుకొనుటకును, బుద్ధిని నిర్మలము జేసికొనుటకును ఏమిచెయవలెనో దేనిసాయము తీసికొనవలెనో మనుష్యుడు గమనింపనే గమనింపడు. శరీరముయొక్క తూక మెట్లు పెరుగునా యనియే అతనియాలోచన. భూమిమీాదిమట్టి వచ్చి తనశరీరమున కెట్లు అంటుకొనునా యను విషయమునుగూర్చియే ఎల్లప్పుడును జాగ్రత్తపడుచుందుము. గోడకుకొట్టినపిడకలు ఎండి రాలినట్లే శరీరమున కంటుకొన్న ఈ మట్టిపూత, ఈ క్రొవ్వుకూడ చివరకు రాలిపోయి శరీరము యథాస్థితిని పొందును. అనగా శరీరము భరించలేనంతమట్టిని మనము శరీరమున కెక్కించుచున్నామన్నమాట. శరీరమును ఇంత హద్దుమీారి పెంచుటమాత్ర మెందులకు? ఈ దేహము మన చేతిలో ఒకపనిముట్టు. కనుక దానిని సరియైనస్థితిలో నుంచుటకు అవసరమైన దంతయు మనము చేయుచుండవలెను. యంత్రముద్వారా పనికావలెనని తలంతుము. అయినను దానిమీాద అభిమానముపెట్టుకొని కూర్చుందుమా? కాని శరీరమనుయంత్రము విషయమునకూడ ఇట్టివివేకము నేల చూపము?

సారాంశమిది: ఈ దేహము సాధనమేకాని సాధ్యముకాదు. మనలో ఈ భావమే దృఢముగనున్నచో శరీరము నంటియున్న ఈ దురభిమానము తొలగిపోవును. జీవితముయొక్క స్వరూపమే వేరుగా కనబడును. అప్పుడు దేహము నలంకరించు కొనుటలో గౌరవమున్నదని అనిపించదు. నిజముగ దీనికొక సామాన్యవస్త్రమున్న చాలును. కాని అంతటితో ఆగుదుమా? అది మృదువుగను, సన్నముగను ఉండవలెనని, దానికి అందమైనరంగుగల అద్దకము, అంచు, వన్నెచిన్నెలు, జరీ ఉండవలెనని యందుము. వీనిని తయారుచేయుటకు మన మనేకులను రకరకములైన శ్రమలపాలు చేయుచున్నాము. ఈ శ్రమయంతయు నేల? దేవునికేమియు వివేకములేదా? ఈ దేహమునకు సుందరమైన వన్నెచిన్నెల అవసరమేయున్నచో పెద్దపులి శరీరముమీాద అతడు తనపవి

తనమును చూపించినట్లే మనశరీరముమీద మాత్రము చూపియుండువాడు కాడా? తలచుకొన్నచో ఆయన చేయలేనిదేమున్నది? నెమిలికిచ్చినట్లు మనకును ఒక అందమైనపింఛమును తగిలించగలడు. కాని ఈశ్వరుడు మనుష్యునకొకరంగుగలచర్మమునే ఇచ్చినాడు. దేహముమీద నే కొంచెము మచ్చపడినను సౌందర్యము పెరుగుటకు బదులుగ చెడిపోవును. మానవుడున్నట్లుండుటలోనే సౌందర్యమున్నది. మానవదేహ మలంకరింపబడవలెనవి పరమేశ్వరుని కుద్దేశములేదు. సృష్టిలో సౌందర్యమున కేమైన లోపమున్నదా? ప్రకృతిసౌందర్యమును దర్శించుచుండుటయే మానవునిపని. కాని మనుష్యు డీ సంగతినేమరచిపోయినాడు. జర్మనీవారు మనరంగులను నాశనము చేసినారందుము. సోదరుడా! నీ హృదయములోని రంగు ఎప్పుడో వెలిసిపోయినది. తరువాతనే నీకు కృత్రిమమైన రంగులమీద రుచియేర్పడినది. దానివలన నీవు పరావలంబుడవైతివి. నిరర్థకముగ నీవీశరీర శృంగార మను కుచక్రములో పడిపోయితివి. మనస్సు నలంకరించుకొనుట, బుద్ధిని వికసింపజేయుట, హృదయసౌందర్యమును చేకూర్చుకొనుట—ఇవన్నియు ఒక ప్రక్కకు నెట్టివేసితివి.

## 70. తత్త్వమసి

ఇందుచేత ఈ యధ్యాయములో భగవంతుడు మనకందించిన యీ భావములు చాలవిలువ కలవి. "నీ వీ దేహ మవుకావు. ఆత్మవు", "తత్త్వమసి"—ఆ యాత్మస్వరూపుడవు నీవే"—ఇది మిక్కిలి ఉన్నతము, పవిత్రము అయిన మహావాక్యము. "ఈ బాహ్యకవచము, ఈ పై బెరడు, ఈ యెముకలగూడు నీవు కాదు. నాశరహితమైన ఫలమేదో, ఆ లోపలి సారమేదో, అది నీవు" అన్నది సంస్కృతసాహిత్యములో పొందుపరుపబడిన యీ మహావాక్యము. "అది నీవు" అనుభావము మానవునిహృదయములో స్ఫురించిన తత్క్షణమే, "ఈ దేహమును నేను కాను, ఆ పరమాత్మనే నేను" అను ఆలోచన మనసున నాటుకొన్నంతనే ఆనందానుభవము తరంగమువలె లేచును. ఈ నా సుస్వరూపమును నశింపజేయగల శక్తి ప్రపంచములో దేనియందును లేదు. ఇంత సూక్ష్మభావము ఈ మహావాక్యములో ఇమిడియున్నది.

ఈ దేహముకంటె భిన్నము, నాశరహితము, నిష్కళంకము అయిన ఆత్మతత్త్వమే నేను. ఆ యాత్మతత్త్వము నిమిత్తమే నాకీ శరీరము ప్రాప్తించినది. ఆ పరమేశ్వరతత్త్వము దూషితమగు అవకాశము కలిగినపుడెల్ల దానిని రక్షించుటకు ఈ శరీరమును విసరి పారవేయుదును. పరమేశ్వరతత్త్వమును ఉజ్జ్వల

ముగ నుంచుటకొఱకు ఈ దేహమును హోమము చేయుటకు నే నెల్లపుడును సిద్ధముగ నుందును. నే నీదేహమును వాహనముగ జేసికొని వచ్చుట నన్ను నేను నాశము చేసికొనుటకా? దేహముమీద నా అధికారము సాగవలసినదే. నే నీ దేహము నుపయోగించుకొనుచు తద్ద్వారా లోకకల్యాణమును వృద్ధి పరచెదను. త్రిలోకముల నానందముతో నింపుదును. ఈ మహత్త్వముల నిమిత్తము ఈ శరీరమును విసరిపారవేయుదును. ఈశ్వరునికి విజయభేరి మ్రోగింతును. ధనికుడు ఒకబట్ట మైలపడినచో వెంటనే దానిని విడిచి మరియొకటి ధరించును. నేనును అట్లే చేయుదును. కర్మాచరణకే ఈ దేహము. ఇది పనికిరాదని తెలిసినంతనే దానిని విసరివేయుటకు నాకు సందేహ మెందులకు?

సత్యాగ్రహముద్వారా మనకీశిక్షణ లభించినది. దేహము, ఆత్మ-రెండును వేరువేరు వస్తువులు. మానవు డీరహస్యమును తెలిసికొన్న రోజుననే అతనికి నిజమైన శిక్షణ, యథార్థమైన వికాసము ఆరంభమగును. అప్పుడే సత్యాగ్రహము మన కలవడును. కనుక మనమందరమును ఈ భావనను మన హృదయములలో అంకితము చేసికొనుట అవసరము. దేహము కేవలము నిమిత్తమాత్రము, సాధనము, ఈశ్వరదత్తమైన ఒక పనిముట్టు. దాని యవసరము తీరిననాడు దానిని విసరిపారవేయవలె. చలికాలములో ధరించు దుస్తులను వేసవికాలములోను, రాత్రి కప్పుకొన్న కంబళ్ళను ఉదయమునను తీసివేయుదుము. ఉదయము వేసికొన్న దుస్తులను మధ్యాహ్నము మార్చెదము. ఆ విధముగనే ఈ దేహమునుకూడ వదలివేయవలెను. శరీరముతో పనియున్నంతవరకు దానిని ఉంచుకొందుము. ఏనాడది మనకు పనికిరాదో అప్పుడీదేహ మను వస్త్రమును విసరిపారవేయుదుము. ఆత్మ వికాసముకొఱకు భగవంతుడు మన కీ యుపాయమును చెప్పుచున్నాడు.

## 71. దుండగీండ్రశక్తి అంతరించినది

"దేహముకంటె నేను వేరు" అని మనము తెలిసికోనంత వరకు దుండగీండ్రు మనపై అత్యాచారములు చేయుచునేయుందురు. మనలను బానిసలను చేసికొనుచునే యుందురు. మన కెన్నెన్ని కష్టములను తెచ్చిపెట్టుచుందురో చెప్పలేము. మనము భయపడినపుడే మనపై దుండగీండ్రు విజృంభింతురు. ఒక రాక్షసుడు ఒకనిని పట్టుకొని వానిచేత తెంపులేకుండ పనులు చేయించుకొనుచుండెను. వా డెప్పుడైన పనిచేయక పోయినచో "ఇదిగో! నిన్ను మ్రింగివేయుదును. నాశనము చేయుదును" అని రాక్షసుడు బెదరించు

చుండెను. మొదట ఆమనుష్యుడు భయపడుచుండెను. కాని ఆబెదరింపు దుర్భర మగు నప్పటికి వాడు "ఇదిగో! తినదలచుకొన్నచో తినివేయుము" అనెను. కాని వానిని తినివేయుట రాక్షసుని యుద్దేశమేకాదు. వానికి చాకిరి చేయుటకు ఒక బానిస కావలసియుండెను. రాక్షసుడు వానిని తిని వేసినచో ఇక వాని పనులు చేయువా డెవడు? తినివేయుదునని మాటిమాటికి బెదరించుటయే వాని పని; కాని తినివేయుమని బానిస చెప్పినంతనే రాక్షసునియొక్క దుండగపు చేష్టలు కట్టుబడినవి. మనుష్యులు దేహము నంటిపెట్టుకొని యుందురని దుండగీంద్రకు బాగుగ తెలిసియే వారిని శారీరకముగ బాధపెట్టుదురు. అంతట మనుష్యులు వారికి బానిసలైపోదురు. కాని ఆ దేహాసక్తియే లేకపోయినచో వారు స్వతంత్రులు, సమ్రాట్టులై పోదురు. అపారమైన శక్తిసామర్థ్యములు వారి హస్తగతములగును. అప్పు డెవ్వడును వారిపై అధికారము చూపలేడు. వారి దుండగినితనమునకు ఆధారమేపోవును. దేహమే నేనను భావనగల తావే దుండగీంద్రకు లోకువ యగును.

"దేహము నేను" అని తలచుచుండుటచేతనే ఇతరులకు నాపై అత్యాచారములు జరుపవలెనని, నన్ను కష్టపెట్టవలెనని కోరిక కలుగును. కాని ఆంగ్ల దేశపు ఆత్మత్యాగి 'క్రాన్మరు' ఏ మన్నాడు? "నన్ను తగులబెట్టెదరా? సరే! తగులబెట్టుడు, ఇదిగో! యీ కుడిచేతిని ముందుతగులబెట్టుడు" అనెను. ఈ విధముగనే 'రిడ్లే', 'లాటిమర్' అను త్యాగమూర్తు లేమనిరో చూడుడు—"మమ్ము తగులబెట్టవలెననియా మీ కోరిక? మమ్ముల నెవరు తగులబెట్టగలరు? మేము వెలిగించు ధర్మజ్యోతిని ఎవ్వరును చల్లార్పలేరు. శరీరమను ఈ క్రొవ్వువత్తిని కాల్చివేసి తత్త్వజ్యోతిని ప్రజ్వలింపజేయుటయే మాపని. దేహమునశించిపోవును. అది నశించునదే!" సోక్రటీసునకు విషమిచ్చి చంపుదండన విధింపబడెను. అప్పుడాత డిట్లనెను—"నే నిపుడు వృద్ధుడ నైనాడను. కొలదిదినములలో ఈ శరీరము ఎట్లును రాలిపోవలసినదే. రాలిపోనున్న ఈ శరీరమును చంపి మీ రందరును ఏమి ఘనకార్యము చేయుచున్నట్లు? కొంచెమాలోచించినచో ఈ శరీరమెప్పుడో ఒకప్పుడు తప్పక వదలిపోవునదే యని తెలియగలదు. చనిపోవు దానిని చంపుటలో గొప్పతనమేమున్నది" సోక్రటీసునకు రేపు విషమిచ్చెద రనగా ఆ రాత్రి యతడు శిష్యులకు ఆత్మయొక్క అమరత్వమునుగూర్చి బోధించు చుండెను. శరీరములో విషము ప్రవేశించినతరువాత కలుగు బాధల నతడు ఆనందముతో వర్ణించుచుండెను. అతని కేమాత్రమును విచారము కలుగలేదు.

ఆత్మయొక్క అమరత్వమునుగూర్చిన చర్చ ముగియగానే ఒకశిష్యుడు— "అయ్యా, మీరు చనిపోయినతరువాత మీ యంత్యక్రియలెట్లు జరుపవలెనని మీ కోరిక ?" అని యడిగెను. సోక్రటీసిట్లు జవాబిచ్చెను—"చంపువారు వారా ? పాతిపెట్టువారు మీరా ? బాగుగానున్నది! చంపువారు నా శత్రువులా ? పాతి పెట్టుమీరు నా కాప్తులా! తెలివినెల్లను ఉపయోగించి వారు నన్ను చంపువారును, వివేకముతో మీరు నన్ను పూడ్చిపెట్టువారునా ? నన్ను పూడ్వగలవారా మీరు? మీ రందరును పోయినతరువాత మిగులువాడను నేను. నన్నెట్లు పూడ్వవలెనని యా మీ ప్రశ్న ? మట్టిలోనా ? లేక ముక్కుపొడుములోనా ? అనియా మీ శంక ? నన్నెవరును చంపలేరు, పూడ్చిపెట్టలేరు. ఇప్పటివరకు మీకు నేను చెప్పుచువచ్చినమాటలేమి ? ఆత్మకు చావులేదు, దానిని చంపగలవారుగాని, పాతిపెట్టగలవారుగాని లేరనియేకదా!" రెండున్నరవేల సంవత్సరములనుండి ఎందరో పోయినను సోక్రటీసుమహాత్ముడు మాత్రము నిజముగ సజీవుడయియే యున్నాడు.

## 72. పరమాత్ముని శక్తిపై విశ్వాసము

సారాంశమేమనగా : దేహాసక్తియు, భయమును ఉన్నంతవరకు నిజమైన రక్షణ లేదు. అంతవరకును ఒక విధముగ భయముపట్టుకొని పీడించుచుండును. నిద్రవచ్చి కన్ను మూతపడినదా, పామెక్కడ కాటువేయునో, దొంగలెక్కడ దెబ్బ కొట్టుదురో యను భయమే కలకపెట్టుచుండును. మనుష్యుడు తలక్రింద కఱ్ఱ పెట్టుకొని నిద్రపోవును. ఇది ఎందులకని యడిగిన "దగ్గరనుంచుకొనుట మంచిది. దొంగలువచ్చిన నేమిచేయవలె ?" అనును. ఓరివెఱ్ఱివాడా! వచ్చినదొంగలు ఆ కఱ్ఱతోనే నీతలమీదకొట్టిన నేమగును ? దొంగలు కఱ్ఱతెచ్చుకొనుట ఎక్కడ మరచిపోదురో యని ముందే దానిని సిద్ధపరచి యుంచితి వన్నమాట! నీవెవనిపై భారముంచి నిద్రపోవుచున్నావు ? నీవు నిద్రించునప్పుడు ప్రపంచముయొక్క ఒడిలోనున్నాడవని గుర్తింపుము. నిన్ను నీవు రక్షించుకొగలుగునది మెలకువతో నున్నప్పుడుకదా! నిద్రలో నిన్ను రక్షించువా రెవరు ?

ఒక మహాశక్తిపై విశ్వాసము పెట్టుకొని నేను నిద్రింతును. ఏ శక్తిపై విశ్వాసముంచి పులి, ఆవు మొదలగు జంతువులు నిద్రించుచున్నవో ఆ విశ్వాసము తోడనే నేనును నిద్రించుచున్నాను. పులికి గూడ నిద్రవచ్చును. యావత్ప్రపంచమునకు శత్రువైన కారణముచేత గడియగడియకును వెను దిరిగి చూచుకొను సింహముకూడ నిద్రపోవును. దాని కాశక్తిపై విశ్వాసమే లేక

పోయినచో కొన్ని సింహములు నిద్రించుచుండగా మరికొన్నిసింహములు కావలి కాచునట్టి వ్యవస్థ అవసరమయ్యెడిది. ఏశక్తిమీది విశ్వాసముతో పులి, తోడేలు, సింహము మొదలైన క్రూరజంతువులు కూడ నిద్రించునో విశ్వవ్యాప్తమైన ఆశక్తియొక్క ఒడిలోనే నేనును నిద్రించుచున్నాను. పిల్లవాడు తల్లియొడిలో నిర్భయముగ నిద్రించును. అప్పు డతడు ఈ పృథ్వికి నెల్ల పాదుషా అన్నట్లుం డును. మనము కూడ ఆ విధముగనే ఆ విశ్వమాతయొక్క ఒడిలో ప్రేమ, విశ్వా సము, వివేకములతో నిద్రించు అభ్యాసము చేయుదముగాక! నా జీవిత మంతయు ఏశక్తి నాధారము చేసికొని నడచుచున్నదో ఆశక్తితో నా కంతకంతకు పరిచయము పెరుగవలె. పోనుపోను నా కాశక్తి ప్రస్ఫుటముగ గోచరింపవలె. ఆశక్తిపై నా విశ్వాసము పెరిగినకొలది నా జీవిత మంతకంతకు సురక్షిత మగును. ఈ శక్తినిగూర్చిన నా యనుభవముతోపాటు నావికాసము కూడ వృద్ధి పొందుచుండును. వీని క్రమవికాస మీ యధ్యాయములో కొంతవరకు చిత్రింప బడినది.

## 73. పరమాత్ముని శక్తినిగూర్చి క్రమక్రమముగ పొందు అనుభవము

దేహస్థితమైన ఆత్మయొక్క విచారణ మనసులోనికి రానంతవరకు మను ష్యుడు సాధారణక్రియలలోనే లీనుడై యుండును. ఆకలి యైనప్పుడు తినుట, దప్పికయయినప్పుడు నీరుత్రాగుట, నిద్రవచ్చిన తఱి నిద్రించుట – ఇంతకు మించి వాని కేమియు తెలియదు. వీనిని తృప్తిపరుచుకొనవలెనను లోభము అతనిలో మెండుగానుండును. అవసరమైనచో వానికై అతడు పోరాడును. ఈ విధముగ దేహావసరములను తృప్తిపరచుకొనుటలోనే అతడు నిమగ్నుడై యుండును. అటుతరువాతనే అతనిలో వికాసము ప్రారంభమగును. ఇంతవరకు ఆత్మ కేవలము తటస్థముగ చూచుచుండును. నూతివైపునకు ప్రాకిపోవు శిశువును వెనుకనుండి వివేకముతో చూచుచుండు తల్లివలెనే ఆత్మకూడ మనపై దృష్టినిలిపి ఓర్పుతో మనపనుల నన్నిటిని చూచుచుండును. ఈ స్థితియందున్న ఆత్మను ఉపద్రష్ట – లేక-సాక్షి – లేక – సర్వమును చూచువాడని యందుము.

ఈ స్థితిలో ఆత్మ చూచుచుండునే కాని సమ్మతినీయదు. అంతవరకు దేహమే నే ననుకొనుచు ప్రవర్తించుచున్న జీవుడు క్రమక్రమముగ జాగరూకు డగును. "అయ్యో! నేనింతవరకు పశువువలె జీవితము గడుపుచున్నానే" యను వివేకము వానికి కలుగును. మానవునిలో ఈ విధమైన వివేకము ఉద యించినప్పుడు అతని జీవితమున కొక నైతికభూమిక యేర్పడును. అప్పుడు

అడుగడుగునకును అతడు ఉచితానుచితములను యోజించి వివేకముతో పనులు చేయ నారంభించును. అతనిలో ఆత్మవివేచన ప్రారంభమగును. స్వేచ్ఛా విహారము కట్టువడి దానిస్థానే సంయమవర్తనము ప్రారంభమగును. జీవునియం దీ నైతికభూమిక యేర్పడిన తరువాత ఆత్మ కేవలము తటస్థముగ చూచు చుండక లోపలినుండి తన ఆమోదమును తెలుపుచుండును. "సెబాస్! బాగుగా నున్నది!" అను వాణి లోపలినుండి వినబడుచుండును. ఇప్పుడది కేవలము "ఉపద్రష్టగ" నుండదు. అనుమంత యగును. అనగా ఆమోదమును తెల్పునది యగును.

ఆకలిగొన్న అతిథి యింటికివచ్చినపుడు నీవు నీకు వడ్డించిన విస్తరిని అత నికి సమర్పించి రాత్రి పరున్నపుడు ఆవిషయము జ్ఞప్తికివచ్చినచో ఎంతఆనం దింతువో చూడుము. లోపలినుండి అంతరాత్మ మెల్లగా 'మంచిపనిచేసితివి' అనును. బిడ్డ వెన్నునిమిరి "నాయనా! మంచిపని చేసితివి" అని తల్లి హెచ్చ రింపగానే ప్రపంచమంతయు తనకొక గొప్పకానుక నిచ్చుచున్నట్లు వాని కని పించును. ఈ విధముగనే "మంచిపని చేసినాడవు" అని హృదయస్థితుడైన పరమాత్మ అను మాట మనలను ప్రోత్సహించును. అట్టి స్థితిలో ఈ జీవుడు భోగమయ జీవితమును విసర్జించి నైతిక జీవితమును పునాదిగ చేసికొనును.

దీని తరువాతిదశ యేమనగా నైతిక జీవితములో మానవుడు తన కర్తవ్య కర్మద్వారా హృదయ మాలిన్యమునెల్ల కడిగివేసికొనుటకు ప్రయత్నించును. కాని మానవుడు ఈపని చేయుచు చేయుచు అలసిపోవుసమయమొకటి వచ్చును. అప్పుడు జీవుడు "ఓయీశ్వరా! నా ప్రయత్న మింతకుమించి పైకిపోలేకున్నది. నాకు శక్తిని, బలమును మరికొంత ప్రసాదింపుము" అని ప్రార్థించును. "యావ చ్ఛక్తిని వినియోగించినను నే నొక్కడనే ఏమియు చేయలేను" అను అనుభవము మనుష్యునికి కలుగనంతవరకు ప్రార్థనలోని రహస్యము నతడు తెలిసికొనలేడు. తనశక్తినెల్ల వినియోగించినను అది చాలదన్నుజ్ఞానము కలిగినప్పుడు ఆర్తభావ ముతో ద్రౌపదివలె పరమాత్మను పిలువవలెను. పరమేశ్వరునికృప, సహకారము అనుస్రోతస్సు నిత్యమును ప్రవహించుచునేయున్నది. దప్పిగొన్నవారు తమ హక్కుగ భావించి దానినుండి నీరు త్రాగుదురు. లోటుపడినవారు అడిగి తీసి కొనవచ్చును. ఈ మూడవస్థితిలో నున్న సంబంధమిట్టిది. ఇట పరమాత్మ మరింత సన్నిహితుడగును. ఇప్పు డతడు బాగుగానున్నదనుటతో ఆగక సాహా య్యముచేయుటకే పరుగెత్తుకొనివచ్చును.

మొదట పరమేశ్వరుడు దూరముగ నిలిచి చూచుచుండును. ప్రశ్నకు సమాధానమువ్రాయుమని శిష్యునకుచెప్పి గురువు దూరముగవెళ్ళి నిలుచుండు నట్లే జీవుడు భోగమయజీవితములో మునిగి యున్నంతవరకు పరమాత్మ దూర ముగ నిలబడియుండి, "సరే! సాగనిమ్ము నీ సంసారపు జంజాటము" అనును. తదుపరి జీవుడు నైతిక భూమికలోనికి ప్రవేశించును. అప్పుడు పరమేశ్వరుడు కేవలము తటస్థుడై యుండలేడు. జీవునిద్వారా సత్కర్మలు జరుగుచుండగా భగ వంతుడు మెల్లగా తొంగిచూచి "సెబాస్" అనును. ఈవిధముగ సత్కర్మలు జరుగుచున్నచో హృదయమును అంటియున్న స్థూలమాలిన్యము తొలగిపోవును. ఇక సూక్ష్మమాలిన్యమును పోగొట్టుకొనుటకు తనశక్తికొలది ప్రయత్నించి విఫ లుడై విసిగివేసారినప్పుడు జీవుడు పరమాత్మను ఎలుగెత్తిపిలుచును. అప్పుడు భగవంతుడు "ఇదిగో! వచ్చుచున్నా"నని పరుగెత్తుకొనివచ్చును. భక్తునియుత్సా హము తగ్గినంతనే భగవంతు డతని సాహాయ్యార్థము వచ్చి నిలుచును. జగ త్సేవకుడైన సూర్యనారాయణుడు సదా మీ వాకిటిముందు నిలిచియేయుండును. మూసియున్నతలుపులను బ్రద్దలుకొట్టి సూర్యుడు లోపలికిప్రవేశింపడు. ఏల యనగా అతడు సేవకుడు. అతడు స్వామిహద్దులను తనహద్దులను గుర్తెరిగి మెలగును. అతడు తలుపు తట్టనైనతట్టడు. యజమానుడు లోపల నిద్రించు చున్నను ఈ సేవకుడు వాకిలి వెలుపలనే వేచియుండును. యజమానుడు కొంచెము తలుపు తెఱవగానే సూర్యుడు తన పూర్ణతేజస్సుతో లోపలికి చొరబడి అంధకారమును పారద్రోలును. పరమాత్మనిస్థితికూడ ఇట్టిదే! తనసాయము నర్థించినంతనే అతడు చాచినచేతులతో జీవునియొద్దకు వచ్చినాడన్నమాటే! భీమానదియొద్దున (పండరిపురములో) నడుముకట్టుకొని పాండురంగడు సిద్ధ ముగ నిలబడియున్నాడు.

"ఓ ప్రభూ! రమ్మని చేతులెత్తి పిలువుము."

తుకారాము మొదలయినవారు ఇట్టివర్ణన చేసియున్నారు. ముక్కుతెరచిన గాలి లోపలికివచ్చితీరును. తలుపుతెరచిన వెలుగు లోపలికిప్రవేశించుటతథ్యము. ఈ సందర్భములో గాలిని, వెలుగునుగూర్చిన ఈ దృష్టాంతములు నాకు తృప్తి నీయవు. వానికంటెను పరమాత్మ సన్నిహితుడుగనుండి సాయపడవలెనని తహ తహపడుచుండును. అతడు ఉపద్రష్ట, అనుమంతగా గాక భర్తయయి అన్ని విధముల సహాయుడయి యుండును. మనోమాలిన్యమును పోగొట్టుకొనుటకు అగతికులమై 'నీవే నాకు సహాయుడవు. నీయాశ్రయమే నాకవసరము' అని

ప్రార్థింతుము. అప్పుడా దయాధనుడు దూరముగ నెట్లుండగలడు ? భక్తులకు సాయపడు ఆ పరమేశ్వరుడు, అసంపూర్ణమును సంపూర్ణముగ జేయు ఆప్రభువు పరుగెత్తుకొని వచ్చును. రైదాసునకు చర్మములూని బాగుచేయుట, ధర్మ వ్యాధునికి మాంసము అమ్మిపెట్టుట, కబీరునకు బట్టలునేసి పెట్టుట, జనా బాయితో పిండి విసరుట – ఇవి మనకు కొన్ని దృష్టాంతములు.

దీనిపైమెట్టు ఏ మనగా ఈశ్వరప్రసాదముగ మనకు లభించిన ఫలమును కూడ మనము స్వీకరింపకుండ అతనికి అర్పణ చేయుటయే! ఈ భూమికలో జీవుడు "నీవిచ్చిన ఫలమును నీవే యనుభవింపుము" అని భగవంతునితో అనును. నామదేవుడు "ప్రభూ! ఈ పాలుత్రాగక తప్పదు" అని పట్టుపట్టి కూర్చుండెను. ఇదెంత మధుర ప్రసంగము! కర్మఫలరూపమైన ఆ పాలను నామదేవుడు భగవంతునికి సమర్పించెను. ఈ విధముగ ఈశ్వరప్రసాదముగ లభించిన సమస్తజీవిత మూలధనము, సమస్తసంపద ఆయనకే అతడర్పించి వేయును. ధర్మరాజు స్వర్గములో అడుగుపెట్టబోగా అతనివెంటనున్న కుక్కను దేవతలు లోపలికి రానీయరైరి. అప్పుడతడు యావజ్జీవిత పుణ్యఫలమైన స్వర్గ మునే ఒక్కక్షణములో వలదని నిరాకరించెను. ఈ విధముగనే భక్తుడు కూడ సమస్తపుణ్యఫలములను భగవంతునికే అర్పించివేయును. ఉపద్రష్టగా, అను మంతగా భర్తగా ఇంతవరకు గోచరించిన భగవంతు డిప్పుడు భోక్తకూడ అగును. పరమేశ్వరుడే శరీరముతో భోగములనుభవించు చున్నాడని గుర్తించు భూమికలోనికి జీవుడు వచ్చును.

దీనితరుఫాత సంకల్పములనే విసర్జింపవలె. కర్మకు మూడు మెట్లున్నవి. మొదట సంకల్పముచేయుదుము. తరువాత కర్మనాచరింతుము. అటుపైని ఫలము లభించును. కర్మనాచరించుటకు ప్రభువు యొక్క సాయమునర్థించి పొందినఫలమునుకూడ అయనకే అర్పింతుము. కర్మము నాచరించినవాడు పరమేశ్వరుడు; ఫలము ననుభవించువాడును పరమేశ్వరుడే! ఇక ఆ కర్మను సంకల్పించువాడు కూడ పరమేశ్వరుడే యని గ్రహింపుము. ఈవిధముగ కర్మ యొక్క ఆది మధ్యాంతములలో సర్వత్ర ప్రభువునే యుండనిమ్ము. జ్ఞానదేవుడు

> 'తోటమాలి నీటి నేవైపునకు నడుపవలెననుకొనునో ఆ వైపునకే నిరా ఘాటముగ నీరు నడచును. ఓసోదరా! నీవును ఈ నీటివలెకమ్ము'

అని యన్నాడు. ఏ పూల మొక్కలను, ఫలవృక్షములను పెంచవలెనను కొనునో వానికే అతడు నీరుపెట్టి పోషణచేయును. ఈ విధముగనే నీచే జరుగ

వలసిన పనులన్నిటిని ఆ పరమేశ్వరునే నిర్ణయించుకొననిమ్ము. నా చిత్తమున కలుగు సమస్త సంకల్పముల బాధ్యతను వానిపైనే ఉంతునుగాక! నా బరువంతయు గుఱ్ఱమే మోయుచున్నపుడు దానిపై కూర్చుండి కొంతబరువు నాతలపై పెట్టుకొనుట యెందులకు? దానిని కూడ గుఱ్ఱము మీదనే యెందులకు పెట్టరాదు? ఈ విధముగ జీవితములో కలుగు మోసములు, సమస్తజీవితపు ఒడుదుడుకులు, లాభనష్టములు, అస్థిరత్వము, విసుగుదల మొదలగునవన్నియు చివరకు పరమాత్మస్వరూపమే అయిపోవును. భగవంతుడు నా జీవితమునకు మహేశ్వరుడగును. ఈ విధముగా వికాసము వృద్ధిపొంది జీవితమంతయు పరమేశ్వరమయమగును. దేహమను తెరయొకటి మాత్రము మిగిలిపోవును. అది కూడ తొలగిపోగానే జీవుడు–శివుడు, ఆత్మ–పరమాత్మ ఒకటే యగుదురు. ఈ ప్రకారముగా "ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తామహేశ్వరః."

ఈ స్వరూపములలో పోనుపోను అధికాధికముగ పరమేశ్వరానుభవమును మనము పొందవలసి యున్నారము. మొదట ప్రభువు తటస్థుడుగ నుండి చూచుచుండును. తరువాత నైతిక జీవితారంభమయి మనము సత్కర్మము లాచరించుచున్నచో మనల నతడు 'సెబాస్!' అని మెచ్చుకొనును. తరువాత చిత్తమునంటియున్న సూక్ష్మమాలిన్యమును కడిగివేసికొనుటకు మన ప్రయత్న బలముచాలక భక్తులమైపిలిచినప్పుడు ఆయనాథనాథుడు మనసాహాయ్యార్థము పరుగిడుచువచ్చును. అటుతరువాత ఫలములనుగూడ భగవంతునికే యర్పించి అతనిని భోక్తగాచేయవలె. చివరకు సంకల్పములన్నిటిని అతనికే అర్పించి జీవితమంతయు హరిమయము చేసికొనవలె. ఇదే మానవుని అంతిమలక్ష్యము. కర్మయోగము భక్తియోగము అను రెండురెక్కలతో విహరించుచు సాధకు డీ తుదిమజిలీని చేరుకొనవలెను.

## 74. నమ్రత. దంభశూన్యత మొదలగు మూలభూత జ్ఞానసాధనలు

వీని నన్నిటిని సాధించుటకొఱకు నైతికసాధన యను బలీయమైన పునాది కావలెను. సత్యాసత్యవివేచనచేయుచు ఎల్లపుడును సత్యమునే గ్రహింపవలెను. సారాసారవిచారణద్వారా సారమునే గ్రహించుచుండవలెను. చిప్పలను పారవైచి ముత్యములనే సేకరింపవలెను. ఈ విధముగ జీవితము ప్రారంభముకావలె. అటుపై స్వప్రయత్నము, ఈశ్వరుని కృప–వీనిబలముతో పురోగమించవలె. ఈ సాధనలన్నిటిలో మనము దేహమునుండి ఆత్మను వేరుచేయు అభ్యాసము చేసి

నచో అది మనకు చాలసహకారి యగును. ఈ సందర్భమున ఏసుప్రభువుయొక్క బలిదానము నాకు జ్ఞప్తికివచ్చుచున్నది. అయనను సిలువపైబెట్టి మేకులుకొట్టి చంపుచుండిరి. ఆ సమయమున అతనిముఖతః ఈ మహావాక్యములు వెలువడెనని చెప్పుదురు–"భగవానుడా! ఇన్నికష్టములు నాకెందులకు కల్పించుచున్నావు?" కాని అంతలోనే జీసను ప్రభువు మనస్సును కుదురుపరుచుకొని "మంచిది! నీ యిచ్ఛయేదో అదియే నెరవేరుగాక! ఈ మానవులను రక్షింపుము. వీ రేమిచేయు చున్నారో వీరికి తెలియదు" అన్నాడు. జీసను ప్రభువును గూర్చిన ఈ యుదాహరణలో గొప్పరహస్య మిమిడియున్నది. దేహమునుండి ఆత్మను ఎంతగా వేరుచేయవలెనో దానికి సిలువ చిహ్నము. దేహాత్మలపృథక్కరణను ఎంతయెత్తునకు లేపవలెనో అది జీసనుజీవితమునుండి మనకు సువిదితమగుచున్నది. దేహమొక కవచము. అది యొక తొడుగువలె వేరుకాగలదు. ఈ యున్నతాదర్శమును జీసను జీవితము నిరూపించుచున్నది. దేహమునుండి ఆత్మను వేరుచేయవలెనన్న ఆలోచన నాకు కలిగినపుడెల్ల ఏసుప్రభువు జీవితమును, ఈ సిలువదృశ్యమును నా కన్నులకు కట్టినట్లుండును. దేహమునుండి తాను పూర్తిగ వేరని, దానికిని తనకును ఉన్నసంబంధము తెగిపోవునదేయని క్రీస్తుజీవితము స్పష్టము చేయుచున్నది.

సత్యాసత్య వివేకముతో ప్రవర్తింపనంతవరకు దేహాత్మల పృథక్కరణ శక్యముకాదు. ఈ వివేకము, ఈ జ్ఞానము మనరోమరోమమునకును వ్యాపింపవలెను. జ్ఞానమనగా తెలిసికొనుట యని మన మర్థము చెప్పుదుము. కాని ఊరక బుద్ధితో తెలిసికొనుట జ్ఞానముకాదు. ముద్దనోటిలో పెట్టుకొనుట భోజనముచేయుట కాదు. నోటిలో పెట్టుకొన్నముద్దను నమలవలె. అది గొంతునుండి జఠరమునకు పోయి, జీర్ణముకావలె. దానిరసములు రక్తముగామారి శరీరమునందెల్ల వ్యాపించి దేహమును పుష్టిమంతము చేయవలె. అప్పుడే అది నిజమైనభోజనమగును. అట్లే కేవలము బుద్ధిగతజ్ఞానమువలన ప్రయోజనములేదు. ఆ వివేకము, ఆ జ్ఞానము జీవితమందెల్లను వ్యాపింపవలెను. దానిసంచారము హృదయములో కనబడవలెను. ఆ జ్ఞానము చేతులు, కాళ్ళు, కన్నులు మొదలైన ఇంద్రియములద్వారా ప్రకటితము కావలెను. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు అన్నిపనులను వివేకముతో చేయుస్థితి కలుగవలెను. ఇందుచేత భగవంతుడు ఈ యధ్యాయములో జ్ఞానమునకు చాలచక్కని నిర్వచనము నిచ్చినాడు. స్థిత ప్రజ్ఞునిలక్షణములవంటివే జ్ఞానముయొక్క లక్షణములుకూడ.

"నమ్రతా, దంభశూన్యత్వ, మహింసా, ఋజుతా, క్షమా"

మొదలైన ఇరువది గుణములు భగవంతుడు చెప్పినాడు. ఈ గుణములను జ్ఞాన మందురని చెప్పి అతడు ఊరకుండలేదు. వీనికి విరుద్ధమైనదంతయు అజ్ఞాన మనికూడ స్పష్టీకరించెను. జ్ఞానోపార్జనకు చెప్పబడినసాధననే జ్ఞాన మందురు. కాని వట్టిపాండిత్యము జ్ఞానమనబడదు. 'సద్గుణమునే నేను జ్ఞాన మందును' అని సోక్రటీసు చెప్పెను. సాధన, సాధ్యము–రెండు ఒకటే.

గీతలోని ఈ యిరువదిసాధనలను జ్ఞానదేవుడు పదునెనిమిదిగా చేసెను. అతడు వీనిని చాల అభిమానముతో వర్ణించెను. ఈ గుణములకు సంబంధించిన శ్లోకములు భగవద్గీతలో అయిదుమాత్రమే యున్నవి. కాని జ్ఞానదేవుడు తన జ్ఞానేశ్వరిలో వీనిమీద ఏడువందల పద్యములను వ్రాసినాడు. సమాజములో సద్గుణములు వికసింపవలెనని, సత్యస్వరూపుడైన పరమేశ్వరునిమహిమ వ్యాపకము కావలెనని అతని యాతురత. ఈ గుణములను వర్ణించుచు అతడు తన జీవితానుభవము నెల్లను ఈ పద్యములలో చొప్పించెను. మహారాష్ట్రభాషలో దానిని చదివినవారందరు ఆయనకు ఋణపడియున్నారు. జ్ఞానదేవుని రోమరోమములోను ఈ గుణములు వ్యాపించియున్నవి. దున్నపోతు నొకడు కొట్టిన కొరడాదెబ్బలు జ్ఞానేశ్వరుని వెన్నుమీద తేలినవి. భూతకోటియెడల అతని సానుభూతి అంతటిది. అట్టి జ్ఞానదేవుని కరుణాపూర్ణహృదయమునుండి జ్ఞానేశ్వరి వెలువడినది. ఈ గుణముల నతడు పరిశీలించెను. ఆయన వర్ణించినగుణములు పఠనయోగ్యములు. మననముచేసి, హృదయాంకితము చేసికొనదగినవి. జ్ఞానదేవుని ఈ మధురభాషను చవిచూడగలిగినందులకు నేను ధన్యుడ ననుకొనుచున్నాను. ఆయన మధురభాషను నేనలవరచుకొనుటకు తిరిగి జన్మమెత్తవలసి వచ్చినను నేను ధన్యుడననియే యనుకొందును. సరే! సారాంశమిది—

అంతకంతకు వికాసమును పెంచుకొనుచు దేహముకంటె ఆత్మవేరని తెలిసికొనుచు అందరును తమజీవితములను ఈశ్వరమయములను చేసికొను ప్రయత్నము చేయుదురుగాక! (15–5–32)

# పదునాల్గవ అధ్యాయము

## గుణముల విస్తరణ, వానినుండి విమోచన

### 75. ప్రకృతి పరిశీలన

సోదరులారా! నేటి పదునాల్గవ అధ్యాయము ఒక దృష్టిలో వెనుకటి అధ్యాయమును పూర్తిచేయునదే! నిజమునకు ఆత్మ చేయవలసినపనులేవియు లేవు. అది స్వయం సంపూర్ణము. స్వభావముచేత ఆత్మ ఊర్ధ్వగామియే. కాని దేనికైనను క్రింద నొక పెద్దబరువును కట్టినచో అది దానినెట్లు క్రిందికి లాగునో ఆ విధముగనే ఈ శరీరమనుబరువు ఆత్మను క్రిందికి లాగుచుండును. ఏ యుపాయము చేతనైనను దేహాత్మలను వేరుచేయగలిగినచో మనకు ప్రగతికలుగునని పదుమూడవ అధ్యాయములో చూచితిమి. ఈపని కఠినమైనదేయైనను దీనినుండి కలుగుఫలముమాత్రము చాలగొప్పది. ఆత్మయొక్క పాదములను బంధించిన దేహమను సంకెళ్ళను మనము త్రెంపగలిగితిమా గొప్ప ఆనందము ననుభవింతుము. ఇక మానవుడు శారీరకక్లేశమువలన దుఃఖపడడు. అతడు స్వతంత్రుడగును. మనుష్యుడు ఈ దేహమును జయింపగలిగినచో ఇక నీ ప్రపంచమున వానిపై అధికారము చలాయించగలవారెవరు ? తన్నుదా శాసించుకొనగలవాడు విశ్వమునకు సమ్రాట్టగును. కనుక ఆత్మపై దేహము చలాయించు అధికారమును అతడు తొలగించుకొనును. దేహమునకున్న సుఖదుఃఖములన్నియు విదేశీయములు, పరకీయములు. ఆత్మతో వానికి తిలమాత్ర సంబంధముకూడ లేదు.

ఈ సుఖదుఃఖముల నేపరిమాణములో వేరుచేయవలసి యుండునో దాని కల్పనను ఏసుప్రభువుయొక్క ఉదాహరణద్వారా తెలిపియుంటిని. దేహము తునుకలై పోవుచున్నను మనస్సును శాంతముగను, ఆనందమయముగను ఎట్లు ఉంచుకొనవచ్చునో ఆయన చూపించెను. కాని ఈ విధముగా ఆత్మనుండి ఈ దేహమును వేరుచేయుటకు ఒకవైపున వివేకము, రెండవవైపున నిగ్రహము అవసరము.

> వివేకము వెంట వైరాగ్యముయొక్క రక్షణ కావలెను.

అని తుకారాము అన్నాడు. వివేకము, వైరాగ్యము రెండును అవసరమే. వైరాగ్యమనగా ఒక విధమైన నిగ్రహము, తితీక్ష. ఈ పదునాల్గవ అధ్యాయములో నిగ్రహమార్గము చూపబడినది. నావను నడుపుపని తెడ్లది. కాని దిశను

చూపించుపని చుక్కానిది. తెడ్లు, చుక్కాని-రెండును కావలె. ఆ విధముగనే శారీరక సుఖదుఃఖములనుండి ఆత్మను వేరుచేయుట కొఱకు వివేక నిగ్రహములు రెండును అవసరము.

వైద్యుడు రోగియొక్క ప్రకృతినిబట్టి ఔషధమిచ్చినట్లే భగవంతుడు పదునాల్గవ అధ్యాయములో ప్రకృతినెల్ల పరీక్షించి పృథక్కరణచేసి అందు దేనికేయేరోగము లున్నవో నిరూపించెను. ఈ యధ్యాయములో ప్రకృతివిభజన చక్కగా చేయబడినది. రాజనీతిలో విభాజక సూత్ర మని ఒక గొప్ప సూత్ర మున్నది. ఎదుటనున్న శత్రుదళమును చీలదీయగలిగినచో దానిని త్వరలో ఓడించవచ్చును. భగవంతుడు చేసినపని యదియే.

నాయొక్క, మీయొక్క, జీవులన్నిటియొక్క సర్వచరాచరముల యొక్క ప్రకృతిలో మూడుగుణము లున్నవి. ఆయుర్వేదములో కఫ, పిత్త, వాతము లున్నట్లే ఇక్కడ సత్వరజస్తమములను మూడుగుణము లున్నవి. ఈ మూడు గుణముల చేరకతోనే అంతయు నిండియున్నది. ఒక దానిలో ఒక గుణము తక్కువైన మరొకటిహెచ్చు. ఇదే భేదము. ఈ మూటినుండి ఆత్మను వేరు చేసినచో దేహమునుండి ఆత్మను వేరుచేసినట్లే! ఈ మూడు గుణములను పరీక్షించి వానిని జయించుటయే దేహమునుండి ఆత్మను వేరుచేయు విధానము. నిగ్రహముద్వారా రజస్తమోగుణములను జయించి చివరకు సత్వగుణమును చేరవలె.

## 76. తమోగుణము : దానిని జయించుట కుపాయము శరీరపరిశ్రమ

మొదట తమోగుణమును తీసికొందము. ఆధునిక సామాజిక స్థితిలో తమోగుణముయొక్క భయానకపరిణామములు మనకు కనిపించుచున్నవి. దీని ముఖ్యపరిణామము సోమరితనము. దీనినుండియే నిద్ర, మరపు పుట్టును. ఈ మూడు విషయములను జయించినచో తమోగుణమును జయించినట్లే భావింపుము. వీనిలో సోమరితనము మిక్కిలి భయంకరమైనది. ఉత్తమోత్తములు కూడ ఈ సోమరితనమువలననే పనికిమాలినవా రగుచున్నారు. ఇది సమాజము యొక్క శాంతిసుఖములను పూర్తిగ నశింపజేయు శత్రువు. చిన్నవారినుండి పెద్దవారి వఱకు అందఱను ఇది పాడుచేయును. ఈ శత్రువు అందఱను తిని వేయును. మనలను వశపరచుకొనుటకు అది పన్నాగములు పన్నుచుండును. ఏకొంచెము అవకాశము చిక్కినను ఈసోమరితనము మనలో ప్రవేశించితీరును. తినవలసినదానికంటె నెక్కువ తింటివా నడుము వాల్చుమని నిన్నది ఒత్తిడి

చేయును. అట్లు కొంచెము ఎక్కువసేపు వాల్చితివా కనులలో సోమరితనము తాండవ మాడుచుండును. దీనిని మనము వశపరచుకోనంత వరకు మన ప్రయత్నము లన్నియు వ్యర్థమే! కాని మనము సోమరితనమును హెచ్చుగా వాంఛించుచునేయుందుము. అహర్నిశము విరామములేని పనిచేసి ధనమును కూడబెట్టి తరువాత విశ్రాంతితో జీవితము గడపవచ్చు ననుకొందుము. ధనము నధికముగ కూడబెట్టుట యనగా భవిష్యత్తులో సోమరిగా జీవించుటకు తయా రగుటయని యర్థము. వార్ధకములో విశ్రాంతి చాలఅవసరమని సామాన్యముగ మన మనుకొందుము. కాని ఈభావనతప్పు. మానవులు జీవితమును సరిగానడుపు కొన్నచో వృద్ధత్వములో కూడ పనులు చేయుచునే యుందురు. హెచ్చుగా అనుభవములు సంపాదించినందువలన ముదిమిలో మిగుల ఉపయోగకరమైన సేవచేయుటకే చూచుచుందుము. కాని మనము సోమరితనమున కలవాటుపడి నందువలన వృద్ధత్వమురాగానే విశ్రాంతి కావలెనందుము.

సోమరితనమున కేమాత్రమును తావులేని జాగరూకతను మనము సంపా దింపవలెను. నలమహారాజునంతటి మహాపురుషుడు పాదములు కడుగుకొను నప్పుడు పాద మొకమూల కొంచెము తడియనంతమాత్రముచేత అక్కడినుండి కలి యతనిలో ప్రవేశించెనని చెప్పుదురు. నలు డత్యంతపరిశుద్ధుడు. అన్నివిధ ముల నిష్కళంకుడు. కాని పాదములు బాగుగ కడుగుకొనని అలసత్వము వలన అంతలో నతనిలోనికి కలి చొరబడెను. ఇక మనశరీరము ఏదోయొకమూల కాక అ పాదమస్తకము కలి ప్రవేశించుటకు తగినస్థితిలోనే యుండును. ఎక్కడి కక్కడనే సోమరితనము మనలో ప్రవేశించగలదు. శరీరమునకు సోమరితన మబ్బినచో మనోబుద్ధులకుకూడ అది సోకును. ఈనాటి సమాజనిర్మాణము ఈ సోమరితనము మీదనే ఆధారపడియున్నది. దీనివలన మితిలేని దుఃఖములు ఉత్పన్నమైనవి. మన మీ సోమరితనమును పోగొట్టుకొనగలిగినచో మనదుఃఖ ములను అన్నిటిని కాకపోయినను పెక్కింటిని దూరము చేసికొనగలము.

సమాజమును సంస్కరింపవలెనను ఆలోచన లిప్పుడు నలుదిశలకు వ్యాపించుచున్నవి. ప్రతిమానవునికిని కనిష్ఠ ప్రమాణములో కొంతసుఖముం డుట, దాని కనుకూలమైన సమాజవ్యవస్థ నిర్మింపబడుట – ఈ మొదలగువానిని గూర్చిన చర్చలు జరుగుచుండును. ఒకప్రక్కను మితిమీరినసుఖము, మరి యొకవంక అపారమైన దుఃఖము ప్రపంచమునం దున్నవి. ఒక ప్రక్కను కుప్పతిప్పలుగ సంపదలు, రెండవవైపున దారిద్ర్యమను లోతైనగోతులు సమాజ

ములో వ్యాపించినచో ఈ విషమస్థితి తొలగిపోవు టెట్లు? అవసరమగు సుఖము లన్నిటిని సహజముగ పొందవలె ననిన ఒకటే యుపాయమున్నది. అదేమనగా సోమరితనమును వదలి అందరును శ్రమచేయుటకు తయారగుటయే! దుఃఖము ముఖ్యముగ మన సోమరితనమువలన కలుగుచున్నది. అందరును శరీరశ్రమ చేయ నిశ్చయించుకొన్నచో ఈ దుఃఖము తొలగిపోగలదు.

కాని నేడు సమాజమున కనబడుచున్నదేమి! ఒక వైపున త్రుప్పుపట్టి పనికిరాని మనుష్యులు కనబడుచుందురు. ఈ శ్రీమంతుల ఇంద్రియములు త్రుప్పుపట్టుచున్నవి. వారు తమశరీరము నేమాత్రమును ఉపయోగింపరు. రెండవవైపున మితిమీరినపని చేయవలసినవారు కలరు. ఈ శ్రమ చేయలేక బీదల శరీరములు అరిగి శిథిలము లైపోవుచున్నవి. సమాజమునందెల్ల శరీర శ్రమనుండి తప్పించుకొను ప్రవృత్తియే కనబడుచున్నది. విరిగి తునుకలై పని చేయువారు దానిని సంతోషముతో చేయుటలేదు; విధిలేక చేయుచున్నారు. చదువుకొన్నవారు, వివేకవంతులు శరీరశ్రమనుండి తప్పించుకొనుటకు రకరకము లగు పన్నాగములను పన్నుచుందురు. "శరీరశ్రమలో కాలము నెందులకు వృథాపుచ్చవలె?"అని కొంద రందురు. కాని "వృథాగా నిద్రయెందులకుపోవలె? భోజనముచేయుటలో సమయము నెందులకు పాడుచేసికొనవలె ?" నని మాత్రము ఎవ్వరును ప్రశ్నింపరు. ఆకలియైనచో తినుటయే, నిద్రవచ్చినచో పండుకొనుటయే పని. కాని శరీరశ్రమ చేయవలెనను సమస్య వచ్చినప్పుడు మాత్రము ఇందులో మన సమయము నెందులకు వృథాపుచ్చవలె ? శరీరమున కింత కష్టము నెందుల కీయవలె ? మానసిక శ్రమ చేయుచునే యున్నారము కదా ?" అని నిస్సంకోచముగ అనుచుందురు. సరే! బాగుగానున్నది. శ్రమ మానసికముగ చేయుచున్నారు. కనుక మీరు భోజనముకూడ మానసికముగనే చేయుడు. మానసికముగనే నిద్రకూడ పొందు. మనోమయనిద్ర, మనోమయ భోజనము చేయు ఉపాయ మేదైన యోజింపుడు.

ఈ విధముగ సమాజములో రెండు తెగల మనుష్యులు తయారైనారు. ఎంతెఱపిలేకుండ కష్టించి మరణించురక మొకటి; ఇక్కడి పుల్లతీసి అక్కడపెట్టని రకమొకటి. నా మిత్రుడొకడు "మొండెములు వేరు, తలలువేరు" అన్నాడు. ఒక వైపున కేవలము మొండెములు, రెండవవైపున తలలు. మొండెములకు కేవలము అరిగిపోవుటయేపని. తలలకు కేవలము ఆలోచించుటయేపని. ఈ విధముగ సమాజ ములో రాహుకేతువులవలె మొండెములు, తలలు వేరయిపోయినవి. కాని నిజము

నకు మొండెములు, తలలు వేరువేరుగ నుండినచో బాగుగా నుండెడిది. అప్పుడు అంధ–పంగున్యాయముగ ఏదే నొక యేర్పాటు చేయుటకు వీలుండెడిది. కుంటి వాడు అంధునికి దారి చూపించును. గ్రుడ్డివాడు కుంటివానిని భుజములపై కూర్చుండ బెట్టుకొనును. కాని మొండెములు, తలలు వేనికవి వేరుగా లేవు. ప్రతివానికిని ఒకమొండెము దానిపై తల రెండును కలిసియేయున్నవి. ఈ విధముగ ఎక్కడ చూచినను తలలు, మొండెములు కలసినజంటలే. ఏమిచేయవలె ? ఇదే వచ్చిన చిక్కు. కనుక ప్రతివాడును సోమరితనమును తప్పక వదలవలెను.

సోమరితనము పోవలెనన్న శరీరపరిశ్రమ చేయవలె. సోమరితనమును జయించుటకు ఇదొకటే యుపాయము. దీనిని ఆచరణలో నుంచకపోయినచో ప్రకృతి దండించక మానదు. రోగముద్వారా గాని లేక మరొకరూపమునగాని శిక్ష ననుభవింపవలసినదే! శరీరధారులము కనుక శ్రమచేయవలసినదే! శరీర శ్రమలో గడపినసమయము వ్యర్థముగపోదు. దానికి ప్రతిఫలము తప్పక లభించును. ఉత్తమమైన ఆరోగ్యము చేకూరును. బుద్ధితేజస్వంతము, నిశితము, పరిశుద్ధము అగును. చాలమంది మేధావుల ఆలోచనలలో కూడ తమ తలనొప్పి, కడుపునొప్పి మొదలగు శారీరకరుగ్మతల ప్రభావము కనబడుచునే యుండును. ఈ స్థితిని తొలగించుటకు మేధావులు కూడ ఆరుబయట ఎండలో, ప్రకృతిమాత యొడిలో పరిశ్రమచేసినచో వారిభావములుకూడ తేజస్వంతములగును. శారీరక రుగ్మతయొక్క ప్రభావము మనస్సుమీద పడినట్లే శరీరారోగ్యము యొక్క ప్రభావము కూడ మనస్సుమీద పడును. ఇది యనుభవసిద్ధము. క్షయవ్యాధి ప్రవేశించిన తరువాత పరిశుద్ధమైనగాలి వీచు మదనపల్లికో మరి యే కొండ ప్రదేశమునకో పోవుటకు, లేక సూర్యకిరణ చికిత్సపొందుటకు పూర్వమే ఆరు బయట గడ్డపారతో త్రవ్వుటయో, తోటలోనిచెట్లకు నీరుపోయుటయో, లేక కట్టెలు కొట్టుటయో చేసిననష్ట మేమి ?

## 77. తమోగుణమును జయించుటకు మరియొక ఉపాయము

సోమరితనమును జయించువిషయము తెలిసికొన్నాము. నిద్రను జయించుట రెండవవిషయము. నిద్ర వస్తుతః పవిత్రమైనది. సేవచేసి అలసిపోయిన సాధుసజ్జనులనిద్ర యోగమే! ఇట్టి శాంతినిచ్చు గాఢనిద్ర అదృష్టవంతులకే లభ్యమగును. నిద్ర గాఢమైనదిగా నుండవలె. నిద్రయొక్క మహత్త్వము దానికాలపరిమాణముపై ఆధారపడియుండదు. నిద్ర సెజ్జయొక్క వైశాల్యము మీదను, దానిపై మనుష్యుడు పరుండుకాలముమీదను ఆధారపడియుండదు.

నూయి యెంతలోతుండునో నీరు అంతపరిశుభ్రముగ నుండును. ఆ విధముగనే నిద్రపోయినసమయము కొంచెమైనను ఆ నిద్ర గాఢనిద్రయైనచో ఉత్తమపరిణామము కలుగును. చంచలత్వముతో మూడుగంటలు చదివినదానికంటె తదేక నిష్ఠతో అరగంటసేపు చదువుటే ఎక్కువఫలము నిచ్చును. నిద్రవిషయము కూడ నింతే! చాలసేపు సాగిననిద్ర మంచిపరిణామమునే కలిగించునని చెప్పలేము. రోగి ఇరువదినాలుగు గంటలును మంచముమీదనే పడియుండును. మంచమునకును వానికిని ఎడతెంపులేని సహవాస మున్నను నిద్రకును వానికిని సంబంధమే యుండదు. గాఢమై, స్వప్నరహితమైన నిద్రనే నిద్ర యందుము. మరణానంతరమువచ్చు యమయాతనల విషయము మనకు తెలియదు. కాని దుస్స్వప్నములు వెంటాడుటచే నిద్రపట్టనివాడు పడు యమయాతన ఇంతంతకాదు. వేదములో ఋషి బాధపడుచు ఇట్లనును:— "పరా దుఃస్వప్న్యంసువ" "అట్టి పనికిమాలిననిద్ర నాకువలదు." విశ్రాంతికొఱకే నిద్ర. కాని నిద్రలో కూడ దుస్స్వప్నములు, చెడ్డభావనలు పట్టి పీడించుచో ఇక విశ్రాంతి యెక్కడ ?

కాగా గాఢనిద్రపట్టుటెట్లు? సోమరితనముపోవుటకు చెప్పిన యుపాయములే నిద్రకుకూడ వర్తించును. శరీరముతో నిరంతరమును ఏదోయొకపని చేయుచుండవలె. అప్పుడు ప్రక్కమీద పండుకొనగానే మనుష్యుడు మైమరచి శవమువలె పడి నిద్రపోవును. నిద్రయనగా చిన్నమృత్యువే! ఇట్టి కమ్మని నిద్ర పట్టవలెనన్నచో పగలంతయు దానికి తగినకృషి బాగుగ జరిగియుండవలెను. శరీరము అలసిపోవలెను. ఆంగ్లకవి షేక్స్పియర్ — "రాజు తలమీద కిరీటముండునేకాని ఆ తలలోపల అన్నియు చింతలే" అన్నాడు. అట్టిరాజునకు నిద్రరాదు. శరీరశ్రమ చేయకపోవుటయే దానికి ముఖ్యకారణము. మెలకువతో నుండవలసిన సమయములో నిద్రపోవువాడు నిద్రించు సమయమున మేల్కొనియుండును. పగటివేళ బుద్ధిని, శరీరమును ఉపయోగింపనివాడు నిద్రపోయినట్లుకాక మరేమి? ఇక నిద్రవేళ వానిబుద్ధి పరిపరి ఆలోచనలలో తిరుగుచుండును. శరీరముకూడ నిజమైన సుఖనిద్రకు దూరమగును. కాని యతడు గంటలకొలది ప్రక్కమీదపడి దొర్లుచుండును. పరమపురుషార్థమును సాధింపవలసిన ఈ జీవితమును నిద్రయే మ్రింగివేసినచో ఇక పురుషార్థమును సాధించునదెప్పుడు? జీవితములో సగభాగము నిద్రలోనే గడచిపోయినచో ఇక మనము పొందగలుగునదేమి ?

చాలసమయము నిద్రయందే ఖర్చుపడినచో తమోగుణముయొక్క మూడవ లక్షణమైన మరపు సహజముగనే వచ్చిపడును. నిద్రాసక్తునిలో దక్షత, జాగ

రూకత మృగ్యము. అందువలన అజాగ్రత్త ఉత్పన్నమగును. అధికనిద్రవలన మరల సోమరితనము, సోమరితనమువలన మరపు పెరుగును. విస్మృతి పరమార్థమును నశింపజేయును. ప్రాపంచిక దృష్టిలోసైతము విస్మృతివలన ముప్పవాటిల్లును. కాని యిప్పటిసమాజములో మరపు సర్వసామాన్యవిషయమై పోయినది, ఎవ్వరికిని మరపు పెద్దదోషమనియే తోచదు. ఎవరినో కలిసికొనవలెనని నిశ్చయించుకొందుము. కాని ఆపనికి వెళ్ళమనుకొనుడు. వెళ్ళలేదేమని ఎవరేని ప్రశ్నింపగా "అరే! ఆ విషయమే బొత్తిగా మరచిపోయితిమి!" అని యందుము. ఇట్లు సమాధానముచెప్పుటలో ఒక పెద్దతప్పుచేయుచున్నా మను భావనయే మనకు కలుగదు. ప్రశ్నించువాడుకూడ ఈ సమాధానముతో తృప్తి పడును. మరపునకు చికిత్సయే లేనట్లు ప్రజలు వర్తించుచుందురు. కాని యీ పొరపాటు పారమార్థికముగను, ప్రాపంచికముగనుకూడ చాల హానికరము. నిజమునకు మరపొక పెద్దజాడ్యము. దానివలన బుద్ధిలో పురుగుపుట్టి జీవితమును డొల్లచేయును.

మానసికమైన అలసత్వము మరపునకు కారణము. మనస్సు జాగరూకతతో నున్నచో మరపుండదు. సోమరియై పడియుండువాని చిత్తమునకు మరపనురోగము రాకమానదు. కావుననే బుద్ధభగవానుడు 'ప్రమాదము-లేక-మరపు మృత్యువుయొక్క పర్యాయపదమే!' అనెను. ఈ మరపును జయింపవలెననిన సోమరితనమును, నిద్రను వశపరుచుకొనవలె. శరీరశ్రమచేయుచు సతతమును మెలకువతో నుండవలెను. చేయుపనులన్నియు యోజించి చేయవలె. ఆలోచింపకుండ నేపనిని ప్రారంభింపరాదు. పనికిముందు ఆలోచన, పనితరువాత ఆలోచన సాగింపవలెను. ముందు వెనుక సర్వత్ర ఆలోచన యను పరమేశ్వరుడు దర్శన మిచ్చుచుండవలె. ఈ యలవాటు చేసికొన్నచో అజాగ్రత్తయను రోగము తొలగిపోవును. నీ సమయమునెల్ల ఒక నిర్దిష్ట కార్యక్రమమునకు బంధించి యుంచుము. ప్రతిక్షణమునకును లెక్కచెప్పు జాగ్రత్తలో నీవున్నచో సోమరితనము ప్రవేశించుటకు సందే యుండదు. ఈరీతిగ తమోగుణమునెల్ల జయించు ప్రయత్నము చేయుము.

**78.** రజోగుణము : దానిని జయించుట కుపాయము స్వధర్మమునకు కట్టుపడియుండుటయే

రజోగుణముపై దాడిసలుపవలె. ఇదికూడ ఒక భయంకరమైన శత్రువు. ఇది తమోగుణముయొక్క రెండవవైపే! ఈ రెండును పర్యాయపదములే యన

వచ్చును. మితిమీరి నిద్రపోవువాడు నిద్రనుండి లేవగానే ఇష్టమువచ్చినట్లు తిరుగ నారంభించును. పరుగులెత్తి, తిరిగి పండుకోవలెననుకొనును. ఇట్లు తమో గుణమునుండి రజోగుణము, రజోగుణమునుండి మరల తమోగుణము కలుగు చుండును. ఒకటి యున్నదనిన రెండవదికూడ వచ్చినదన్నమాటే! ఇటు అటు నిప్పు, మధ్య రొట్టె యున్నట్లే మానవుడు తమోగుణ రజోగుణములమధ్య పడి యుండును. "ఇటురమ్మా! నిన్ను తమోగుణము వైపునకు తన్నుదును" అని రజోగుణ మనును. "నాయొద్దకు రమ్మా! నిన్ను రజోగుణమువైపునకు ఎగుర వేయుదును"అని తమోగుణ మనును. ఈవిధముగ రజస్తమోగుణములు రెండును పరస్పరసహకారముతో మనుష్యుని నాశనము చేయును. 'ఫుట్‌బాల్' నలు వైపులనుండి తన్నులు తినుటకే పుట్టినట్లు మానవునిజీవితముకూడ రజస్తమో గుణములచే తన్నులుతినుటలోనే గడచిపోవును.

పెక్కురకములపనులు చేయవలె ననుపేరాస, మానవాతీతమైన అద్భుత కార్యములు చేయవలె నను అపారమైన ఆసక్తి రజోగుణమునకు ప్రధానలక్షణ ములు. రజోగుణమువలన అపారమైన కర్మాసక్తి మనుష్యునిలో ఆవహిల్లును. లోభాత్మకమైన కర్మాసక్తి ఉత్పన్నమగును. తదుపరి వాసనావికారములవేగము హెచ్చును. అది అరికట్టనలవికాదు. ఇక్కడనున్న పర్వతమును తీసికొనివెళ్ళి అక్కడనున్నగోతిని పూడ్చవలె ననుకోరిక పుట్టును. మట్టిపోసి సముద్రమును పూడ్చవలెనని, నీరునింపి సహారాయెడారిని సముద్రమును చేయవలెనని బుద్ధి పుట్టును. ఇక్కడ సూయజ్‌కాలువ త్రవ్వవలెనని అక్కడ 'పనామా' కాలువ నిర్మింపవలెనని మానవుడు వెఱ్ఱియాలోచనలు చేయుచుండును. ఏదోయొకటి నిర్మించుట, ఒకటి నాశనముచేయుట లేనిచో వానికి తోచదు. ఈ పనులు చిన్న పిల్లవాడు గుడ్డపీలికలను తీసికొని వానిని ఇంకను సన్నగా చింపుటవలె లేక అతుకులు పెట్టుటవలె నుండును. దీనిని దానిలో కలుపుము, దానిని దీనిలో కలు పుము, దానినిముంచుము, దీనినెగురగొట్టుము — రజోగుణముయొక్క మితిలేని చేష్ట లీ విధముగ నుండును. పక్షి అకాశములో నెగురుచున్నట్లు మనముకూడ ఎగురవలెను. చేప నీటిలోనున్నట్లే మనముకూడ జలాంతర్గామిని నిర్మించుకొని నీటిలో నుండవలెను. ఈ విధముగ నరజన్మమెత్తి పశుపక్షుల ననుకరించుట లోనే కృతార్థత కలదని భావింతుము. పరకాయప్రవేశముచేసి ఇతరజంతువుల వింతవింత అనుభవములను పొందవలెనను గొంతెమ్మకోరికలు ఈ నరజన్మ ములో కలుగుచుండును. "పదండి! అంగారక గ్రహముకడకు పోయివత్తము, అక్కడి జనసంఖ్య యెంతయో తెలిసికొందము" అని యొకడనును. అనేకవాసన

లనెడి పెనుభూతము మనలో కుదురుకొనియున్నదా యన్నట్లు చిత్తము అదే పనిగా తిరుగుచుండును. రజోగుణముకలవాడు ఉన్న దున్నట్లుండుట సహింప లేడు. అంతయు తారుమారైపోవలె. ''ఇంతమానిసిని నేను జీవించియుండగా ఈ సృష్టి ఉన్నదున్నట్లుండుటయా !'' అని వాని కనిపించును. పైల్వాన్ అవయవ ములు బలప్రదర్శనముచేయవలెనని పెరపెరలాడుచుండును. అందులకై ఒక గోడను తన్నికాని, ఒకచెట్టును గ్రుద్దికాని అతడు తృప్తిపడుచుండును. రజో గుణముగలవాని యొక్క ఉద్రేకము ఈ విధముగ నుండును. మనుష్యుడీ యుద్రేకమునకు వశుడై భూమిలో లోతైన గనులు త్రవ్వును. భూగర్భమునుండి కొన్నిరాళ్ళు పైకితీయును. వానికి రత్నములు, మాణిక్యములు అని పేరుపెట్టును. ఆ యుత్సాహమునకు వశుడై అతడు సముద్రములో దుముకును. సముద్రగర్భ ములోనున్న చెత్తను చెదారమును పైకితీసి వానికి ముత్యములని పేరుపెట్టును. కాని ముత్యములో రంధ్రముండదు. కనుక దాని కతడు చిల్లిపొడుచును. ఆముత్యములను ధరించుట యెక్కడ ? కంసాలిని పిలిచి ముక్కునకు, చెవులకు రంధ్రములు పొడిపించును. మనుష్యుడివి యన్నియు ఎందులకు చేయును ? ఇదంతయు రజోగుణప్రభావము.

రజోగుణముయొక్క రెండవపరిణామ మేమనగా మనుష్యుని బుద్ధికి స్థిర త్వము లేకుండుట. రజోగుణము గలవాడు తాత్కాలిక ఫలమునే కోరుకొనును. కనుక ఏకొంచెము విఘ్నము కలిగినను వెంటనే వాడు అంగీకృత మార్గమును వదలివేయును. అతడు నిరంతరమును ఒకదానిని సేకరించుచు వేరొకదానిని విసర్జించును. అతని నిర్ణయములు దినదినమును మారిపోవుచుండును. చివర కతని కేమియు చేజిక్కకపోవుటయే దీని పరిణామము. ''రాజసం చల మధ్రువం''

రజోగుణ ప్రధానుని పనులన్నియు చంచలములు, అనిశ్చతములు. చిన్నపిల్లలు గోదుమగింజలను పాతిపెట్టి అప్పుడే మరల వానిని పెల్లగించి చూతురు. ఆ విధముగనే రాజసికుడు కూడ ఫలమంతయు అప్పటి కప్పుడు కనిపించవలెనని కోరుకొనును. అంతలో నతడు అధీరుడై పోవును. ఒక్కచోట కాలూని గట్టిగా నిలబడుట వానికి తెలియనేతెలియదు. ఇక్కడ నొక చిన్నపని నెరవేర్చును. అక్కడ నొక గౌరవమును పొందును. వెంటనే మూడవచోటికి ప్రయాణ మగును. ఈ రోజు మద్రాసులో సమ్మానపత్రము; రేపు కలకత్తాలో, ఎల్లుండి బొంబాయిలోను, నాగపురములోను. ఎన్ని మ్యునిసిపాలిటీ లున్నవో అన్నిటి సమ్మానపత్రములను స్వీకరించులాలస వానికుండును. గౌరవ ప్రతిష్ఠలు

మాత్రమే వానికి కనబడును. ఒక్కచోట కూర్చుండి పనిచేయు అలవాటే వానికుండదు. ఇందువలన రజోగుణము గలవానియొక్క స్థితి చాలభయంకరముగ నుండును.

రజోగుణమువలన మనుష్యుడు "అన్నిపనులలో నేనున్నాడ" ననును. స్వధర్మమనునది వాని కుండదు. ఇతర కర్మముల నన్నిటిని వదలిపెట్టుటయే నిజమైన స్వధర్మాచరణ. గీతలోని కర్మయోగము రజోగుణమునకు రామబాణము. రజోగుణములో నంతయు చంచలత్వమే. పర్వతాగ్రముపై బడుచున్న వర్షము నలువైపులకును ప్రవహించినచో అది నామరూపములు లేకుండ నిరర్థకమైపోవును. కాని ఏదోయొకదిశకు ప్రవహించినచో పోనుపోను అదియొక నదియగును. దానినుండి యొకశక్తియు ఉత్పన్నమగును. దానివలన దేశమునకు లాభము చేకూరును. ఆ విధముగనే మానవుడు తన శక్తినెల్ల వివిధ కార్యములలో ప్రవేశపెట్టక దానిని ఏకముఖమునకు తెచ్చి ఒక కార్యములోనే చక్కనిపద్ధతిలో వినియోగించినచో కొంతపనిజరుగును. ఇందువలననే స్వధర్మములో చాలమహత్త్వమున్న దన్నారు.

నిరంతరమును స్వధర్మమును గూర్చి చింతనచేయుచు దానియందే సమస్తశక్తిని చొప్పించవలె. మఱి యేవిషయము వైపునకును దృష్టిని పోనీయరాదు. స్వధర్మమునకిదియే ఒరపిడిఱాయి. కర్మయోగ మనగా అపరిమితమైన–అనేక–అద్భుతమైనపనులు చేయుటకాదు. గీతలోని కర్మయోగము ఇందులకు భిన్నము. దాని విశిష్టత యిది :- ఫలమువైపు చూడకుండ కేవలము సహజప్రాప్తము, విసర్జింపరానిది అయినస్వధర్మము నెరవేర్చుచు తద్ద్వారా చిత్తశుద్ధి కలిగించుకొను చుండవలె. అట్లుగాక చిత్తశుద్ధి నపేక్షింపని కర్మకలాపము ఈ సృష్టిలో ఎంతజరిగిన నేమి? కర్మయోగ మనగా విశిష్టమైన మనోవృత్తితో సమస్తకార్యములను చేయుటయే! పొలములో విత్తనములు చల్లుట, గుప్పెడు గింజలను చేతబట్టుకొని ఎక్కడనో విసరిపారవేయుట – ఈ రెండును పూర్తిగా పరస్పరభిన్నమైనకర్మలు. రెంటిలో చాల నంతరమున్నది. విత్తనములు నాటుటవలన ఎంతఫలము వచ్చునో వానిని ఊరక విసరిపారవేయుటవలన ఎంతనష్టి కలుగునో మనకు తెలియును. కర్మనుగూర్చి గీతచేయు ఉపదేశము విత్తనములునాటుటవంటిది. ఇట్టి స్వధర్మరూపమైన కర్తవ్యము యొక్క శక్తి అమితముగ నుండును. ఎంతశ్రమచేసినను చాలు ననిపించదు. అందువలన గంతులతో పరుగులతో అవసరమే లేదు.

**79. స్వధర్మ మిదియని నిశ్చయించు టెట్లు ?**

స్వధర్మమును నిశ్చయించుటెట్లని ఎవరైనను ప్రశ్నించినచో 'స్వాభావిక మైనదే స్వధర్మము' అని సులువుగ సమాధానము చెప్పవచ్చును. స్వధర్మము సహజమైనది. దానిని వెదకవలె నను ఆలోచనయే చాల విచిత్రమైనది. మనుష్యుని జన్మతోనే వాని ధర్మముకూడ జన్మించును. తల్లి బిడ్డకొఱకు వెదకవలసినయవసరము లేనట్లే స్వధర్మముకొఱకు ఎవ్వరును వెదక నవసరముండదు. అది మొదటినుండియు ప్రాప్తమైయుండును. మనము జన్మించకమునుపే సృష్టి యుండెను. మనయనంతరముకూడ అది యుండును. మనకు పూర్వమునుండి ఒక మహాప్రవాహము వచ్చుచున్నది. మన తరువాతకూడ అది యుండును. ఇట్టి ప్రవాహములో మనము జన్మించుచున్నాము. ఏ తల్లిదండ్రులకడుపున మనము జన్మించితిమో వారిసేవ, ఏ యిరుగుపొరుగువారిమధ్య మనము బ్రతుకుచున్నామో వారిసేవ—ఈ రెండుకర్మలును మనకు సహజముగనే లభించుచున్నవి. ఇక మనవృత్తులు మన నిత్యానుభవములోనివేకదా! నాకు ఆకలి యగును. దప్పికయగును; కనుక ఆకలిగొన్నవారికి అన్నముపెట్టుట, దప్పిగొన్నవానికి నీరిచ్చుట నాకు సహజప్రాప్తమైన ధర్మములు. ఈ విధముగ సేవారూపము, భూతదయారూపము అయిన స్వధర్మమును వెదకవలసినపని మనకు లేదు. ఎవడైన 'నా ధర్మమేమి ?' యని వెదకుచున్నాడనిన కొలదిగనో గొప్పగనో పరధర్మములోగాని లేక అధర్మములోగాని వాడు పడుచున్నాడని నిశ్చయముగ చెప్పవచ్చును.

సేవకుడు సేవకొరకు వెదకుకొనవలసిన పనిలేదు. సేవ దాని కదే అతని యొద్దకు వచ్చును. కాని అనాయాసముగ ప్రాప్తమైనదెల్ల ఎప్పుడును ధర్మమే యని భావింపరాదు. ఇది మఱవరాని విషయము. ఎవడైన నొకరైతు రాత్రివేళ వచ్చి నాతో "పోదమురా! నా చేనిగట్టు నాలుగైదుబారలు ముందునకు జరుపుదము; నా చేనియొక్క విస్తీర్ణత పెరుగును. ఇప్పుడైనచో ఎవరికంటను పడము. వెల్లడికాకుండ పనిజరిగిపోవును" అని యన్నాడనుకొనుడు. ఈపని నా పొరుగువాడు కోరినదేయైనను, సహజప్రాప్తమైనదే యైనను అది యసత్యము కనుక నా కర్తవ్యము కాజాలదు.

చాతుర్వర్ణ్యవ్యవస్థ స్వాభావికము, ధర్మము అయినందువలన నాకు చాల ప్రియము. ఈ స్వధర్మమును వదలినచో పనియేసాగదు. నాకు ప్రాప్తించిన జననీజనకులే నా తల్లిదండ్రులు. వారు నాకు నచ్చలేదనుటలో అర్థమే

మున్నది ? తల్లిదండ్రులు చేయువృత్తి స్వాభావికముగ పిల్లవానికి ఔరసత్వముగ లభించును. తన పెద్దలనుండి లభించిన వృత్తి నీతివిరుద్ధము కాకున్నచో దానిని సాగించుట చాతుర్వర్ణ్యవ్యవస్థలోనున్న విశిష్టత. ఇట్టి వర్ణవ్యవస్థ ఈనాడు తారుమారయిపోయినది. దానిని పాలించుట నే డతికఠినమైపోయినది. కాని దీనిని సరియగు పద్ధతిలోనికి తీసికొని రాగలిగినచో చాల బాగుగానుండును. లేనిచో జీవితములో మొదటి పాతిక, ముప్పది సంవత్సరములు ఒక క్రొత్తపనిని, నూతనవృత్తిని నేర్చుకొనుటలోనే గడచిపోవును. పని నేర్చుకొనినపిమ్మట మనుష్యుడు తన సేవాక్షేత్రమును, కార్యక్షేత్రమును వెదకుకొనవలసివచ్చును. ఈ విధముగ మొదటి పాతికసంవత్సరములును అతడు నేర్చుకొనుచునేయుండును. ఈ శిక్షణకును అతని జీవితమునకును ఏమియు సంబంధముండదు. అతడు "భవిష్యజ్జీవితమునకు సిద్ధపడుచున్నా"ననును. అనగా శిక్షణ పొందుచున్న సమయములో అతడు జీవించిలేడని, జీవించుట ఆ తరువాత నని అన్నమాట. మొదట అన్నియు నేర్చుకొనవలెనని, బ్రతుకుట తరువాతయని అతడనును. బ్రతుకుట, నేర్చుకొనుట రెంటికిని సంబంధములేకుండ చేసికొన్నాడా యన్నట్లుండును. కాని జీవితముతో సంబంధములేని స్థితిని మరణ మందుము. భారతదేశములో మనుష్యుని సరాసరి ఆయుర్దాయము ముప్పదిమూడు సంవత్సరములు. ఇందు పాతికయేండ్లు జీవితమునకు తయారగుటలోనే అనగా క్రొత్తపని, వృత్తి నేర్చుకొనుటలోనే గడచిపోవును. అప్పుడెక్కడనైన అతడు పనిని ప్రారంభించవలెను. ఈ విధానములో మహత్త్వపూర్ణమైన, ఉత్సాహకరమైన కాలమంతయు నిరర్థకముగ గడచిపోవుచున్నది. లోకసేవలో సార్థకము కావలసిన జీవితము వృధాగా పాడగుచున్నది. మానవజీవితము పిల్లల ఆటవంటిది కాదు. జీవించుటకు వృత్తిని వెదకుకొనుటలోనే అమూల్యమైన మొదటికాలమంతయు ఖర్చుపడిపోవుట చాలదుఃఖకరమైన విషయము. ఇందుచేతనే హిందూధర్మము వర్ణవ్యవస్థను ఏర్పరచినది.

కాని చాతుర్వర్ణ్యవ్యవస్థమాట నటుంచినను, అన్ని దేశములలోను – ఈ వ్యవస్థ లేనిచోట్లకూడ – స్వధర్మమనునది అందఱకును ఉండనేయున్నది. ఒక ప్రవాహములో అందఱమును ఒక్కొక్క పరిస్థితిలో జన్మించినందువలన స్వధర్మాచరణ మను కర్తవ్యము దానియంతట నదే మనకు లభించినది. ఒకనికి తనపరిస్థితినిబట్టి ముఖ్యకర్తవ్యమైనది, మరొకనికి దూరస్థము, అనగా అప్రధానముకావచ్చును. అందువలన ఆ కర్తవ్య మెంత మంచిదిగా కనబడు

చున్నను రెండవవాడు దానిని గ్రహింపరాదు. అది తన కర్తవ్య మనుకొనుట సరికాదు. తఱచుగా దూరముననుండు వస్తువులు అందముగా కనబడును. వానిని చూచి మనుష్యుడు మోహితు డగును. మనుష్యుని ప్రక్కనే దట్టమైన పొగమంచు వ్యాపించియున్నను వాని కది కనిపించదు. కొంతదూరములో కన బడు మంచును వ్రేలితో చూపి "అక్కడ మంచు ఎంత దట్టముగ నున్నదో చూడుము''అనును. అక్కడనున్న మరొకడు ఇక్కడ దట్టముగ పడుచున్న దనును. నిజమునకు మంచు అంతటచు వ్యాపించియేయున్నది. కాని దగ్గరలో నున్నది కనబడదు. మనుష్యునికి దూరవస్తువులు రమణీయములుగా కన్పిం చును. దగ్గరదాని నతడు నిర్లక్ష్యము చేయును. దూరపు దానికొఱకు కలలు గనును. ఇది మోహము. దీనిని వదలవలె. తనకు లభించిన స్వధర్మము సాధా రణమైనదైనను, కొలదిపాటిదైనను, రసహీనమైనను, అది సహజప్రాప్తమైనది కనుక అదే నాకు సుందరము, శ్రేయోదాయకము. సముద్రములో మునిగిపోవు వానికి చేజిక్కిన వంకరటింకర కొయ్యముక్కయే ఆధారమగును. అది సుందర ముగా లేదని, మెరుగుపెట్టబడలేదని దానిని వాడు త్రోసివేయడు. వడ్రంగి కర్మా గారములో మనోహరమైన, నగిషీచెక్కిన చెక్కలనేకము లుండును. కాని అవి యక్కడనే యున్నవి. ఇత డిక్కడ సముద్రములో మునిగిపోవుచున్నాడు. అందువలన ఆ వంకరటింకర చెక్కయే వానికి తారకము. దానినే యతడు పట్టుకోవలె. ఆ విధముగనే నాకు సహజప్రాప్తమైనసేవయే, అది అప్రధానముగ కనబడుచున్నను నాకుపకరింపవలె. ఆ సేవలో నిమగ్నుడనై యుండుటయే నాకు శోభాకరము. అదే నన్నుద్ధరింపగలదు. అట్టిసేవను వదలి మరియొకసేవ కొరకు వెదకుభ్రమలో పడినచో మొదటిది జారిపోవును. రెండవది చేజిక్కదు. అపుడు మనుష్యుడు సేవావృత్తికే దూరమైపోవును. కాన స్వధర్మ మను కర్త వ్యమునకే మనము కట్టుబడియుండవలెను.

మనము స్వధర్మములో నిమగ్నులమైయున్నచో రజోగుణము నీరసించి పోవును. చిత్తమున కేకాగ్రత కుదురుటయే దీనికి కారణము. అప్పుడు మాన వుడు స్వధర్మమును వదలి ఎక్కడికినిపోడు. దీనివలన చంచలమైన రజో గుణముయొక్క బలమంతయు తగ్గిపోవును. నదిలోతుగను శాంతముగను ప్రవ హించుచున్నప్పుడు వరద నీ రెంత వచ్చినను దానినెల్ల తనలోనే ఇముడ్చు కొనును. ఈ విధముగనే స్వధర్మమను నది మానవునిబలమును, వేగమును, శక్తినెల్లను అనాయాసముగ ఇముడ్చుకొనును. స్వధర్మనిర్వహణముపట్ల ఎంత

శక్తిని వినియోగించినను అది తక్కువయే యగును. మనశ్శక్తినంతయు స్వధర్మనిర్వహణములో వినియోగించినచో పరుగులు, గంతులువేయు రజోగుణముయొక్క వృత్తియే నశించును. దాని చంచలత్త్వమున్నంతయు కాలి క్రిందబెట్టి రాచిన ట్లగును. రజోగుణము నీవిధముగ వశపరుచుకొనవలెను.

## 80. సత్వగుణము : దానిని వశపరుచుకొను ఉపాయము

ఇక సత్వగుణము మిగిలియున్నది. దీనివిషయములో మనము చాల జాగరూకతతో వ్యవహరింపవలె. సత్వగుణమునుండి ఆత్మను వేరుచేయుట యెట్లు? సూక్ష్మముగా పరిశీలన చేయవలసిన విషయ మిది. సత్వగుణము నొక్కసారిగ నిర్మూలనము చేయరాదు. రజస్తమోగుణములను పూర్తిగ నాశనము చేయవలెను. కాని సత్వగుణముయొక్క భూమిక కొంచెము వేరు. ఎక్కడనైనను పెద్దగుంపును చెదరగొట్టవలసివచ్చినప్పుడు నడుము పైభాగమున దెబ్బ తగులకుండ కాళ్ళపై తుపాకులను ప్రేల్చుడని సిపాయీలకు అజ్ఞనిత్తురు. ఇట్లు చేసినచో మనుష్యుడు చావడు. గాయములుమాత్రము తగులును. ఇట్లే సత్వగుణమును గాయపరుపవలెనేకాని చంపరాదు. రజస్తమోగుణములు రెండును పోయినమీదట శుద్ధసత్వము మిగిలియుండును. శరీర మున్నంతవరకు మనము ఇందేదో యొకభూమికలో-స్థితిలో నుండక తప్పదు. ఇట్లు రజస్తమములు రెండును వదలినతరువాత మిగిలెడు సత్వగుణమునుండి వేరగుట యనగా అర్థ మేమి ?

నేను సాత్వికుడ నను దురభిమానము మానవునిలో ప్రవేశించినప్పుడు అది ఆత్మను శుద్ధసత్వమునుండి క్రిందికిలాగును. లాంతరుయొక్క ప్రకాశము బాగుగ బయటవ్యాపింపవలెనన్న అద్దము లోపలిమసినెల్ల పూర్తిగా తుడువవలె; ఇంకను అద్దముపైని దుమ్మున్నచో దానినికూడ శుభ్రముగ కడిగివేయవలె. ఈ విధముగనే ఆత్మప్రభను కప్పివేయుచు చుట్టును జేరుకొన్న తమోగుణ మను మసిని చక్కగా తుడిచివేయవలె. అటుపైని రజోగుణ మను పై దుమ్మునుగూడ తుడిచి శుభ్రముచేయవలె. ఈ విధముగ రజస్తమో గుణములను తుడిచివేయగా సత్వగుణ మను నిష్కళంకమైన అద్దము మిగిలియుండును. ఈ సత్వగుణమునుకూడ దూరము చేయవలెనినిన అద్దమునుకూడ బ్రద్దలుకొట్టుమనియా అర్థము? కాదు. అద్దమునే బ్రద్దలుకొట్టిన లాంతరుయొక్క పని నెరవేరదు. జ్యోతియొక్క ప్రకాశము వ్యాపింపవలెనినిన అద్దము అవసరమేకదా! కనుక పరిశుభ్రమైన అద్దమును పగులగొట్టము. కన్నులు మిరుమిట్లుగొనకుండ ఒక

కాగితపుముక్కను అద్దముపై అడ్డుపెట్టుకొందుము. కావలసినదెల్ల కన్నులు మిరుమిట్లు గొనకుండ చేసికొనుటయే! సత్వగుణమును జయించుట యనగా దానియెడల మనకుండు దురభిమానమును – ఆసక్తిని తొలగించుకొనుటయే! సత్వగుణమును మనము ఉపయోగించుకొనవలె. కాని, దానికొక పద్ధతి, ఉపాయము ఉండవలె. సత్వగుణమును అహంకార రహితముగ చేసికొనవలె.

కాగా ఈ సత్వగుణమువలన కలుగు అహంకారమును జయించు టెట్లు? దీనికొక ఉపాయమున్నది. మనలో సత్వగుణమును స్థిరపరుచుకొందముగాక! సాతత్యమువలన (అనగా సత్వగుణమును అంత్యసమయమువరకును అవలంబించుటవలన) దురభిమానము తొలగిపోవును. సాత్వికకర్మమునే మనము సతతమును చేయుచుండవలె. అది స్వాభావికమయిపోవలె. సత్వగుణము కొంచెముసేపు మనతోనుండి పోవు అతిథివలె నుండరాదు. అది మన యింటిమాని సిగామాఱవలె. ఎప్పుడైన అరుదుగ మన మొక మంచిపనిని చేసినచో దానివలన దురభిమాన మేర్పడును. మనము ప్రతిదినము నిద్రపోదుము. కాని ఈవిషయమునుగూర్చి యితరులతో చర్చింపము. కాని పదునైదురోజులు నిద్రపట్టనిరోగి కాసంత నిద్రపట్టినచో "నిన్న కొంచెము రెప్పవాల్చితిని" అని యందఱితో చెప్పకొనును. వాని కదియొక ఘనకార్యముగ కనబడును. ఉచ్ఛ్వాస నిశ్వాస క్రియ యింతకంటెను మంచియుదాహరణ. ఇరువదినాలుగు గంటలును మనము ఊపిరి పీల్చుచునే యుందుము. కాని ఎల్లవారితో దీనినిగూర్చి చర్చింపము. "నే నూపిరిపీల్చుజీవి"నని ఒక డొకనితో నెప్పుడైన సగర్వముగ చెప్పకొనునా ? హరిద్వారమునొద్ద గంగలోపారవేసిన గడ్డిపోచ వేయిన్నరమైళ్ళు ప్రయాణముచేసి కలకత్తాకు చేరినందులకు అదేమైన గర్వించునా ? అది యా ప్రవాహముతోబాటు సహజముగ కొట్టుకొనివచ్చుటచే గర్వపడుటకు కారణము లేదు. వేగము గల ప్రవాహమున కెదురుగ పది, యిరువది బారలు ఈదినవా డెంతగా ప్రగల్భములు కొట్టును! ఇంతకును సారాంశ మిది: స్వాభావికముగ జరుగు మంచిపనులవలన మనలో అహంకారము పుట్టదు.

మానవుడు ఏదేని మంచిపని చేసినచో అప్పుడు "నేను కాబట్టి యిది చేసితి" నను అభిమాన మతనికి నేర్పడును. ఎందువలన ? మంచిపనులు చేయుట అతనికి సహజము కాలేదు కాబట్టి. ఎప్పుడును తల్లిచేత దెబ్బలుతిను కుఱ్ఱవాడైనను ఏదో మంచిపనిచేసినచో, తల్లి వానివెన్ను తట్టి మెచ్చుకొనును. రాత్రి గాఢాంధకారములో నెక్కడనైన ఒక మిణుగురుపురుగున్నచో దానిగర్వ

మెంతో చూడుడు! ఒక్కసారిగ అది తనవెలుగును చూపదు. ఉండియుండి మినుకుమినుకుమనుచుండును. కొంతసేపు ఆగి తిరిగి మినుకుమినుకుమను చుండును. వెలుతురును కొంతసేపు కప్పి పెట్టును. కొంతసేపు ప్రసరింపజేయు చుండును. అట్లుగాక దాని వెలుగు ఎల్లపుడును ప్రసరించుచుండినచో దాని కప్పుడు గర్వముండదు. అనగా సాతత్యమువలన తనలో ఒకవిశిష్టత ఉన్నట్లే దాని కనిపించదు. ఈ విధముగ మన పనులలో సత్వగుణము నిరంతరమును ప్రకట మగుచున్నచో అది మనకు స్వభావసిద్ధమైపోవును. సింహమునకు తన శౌర్యముపట్ల అభిమాన ముండదు. అప్పృహయే దాని కుండదు. ఈ విధముగనే నేను సాత్వికవృత్తి కలవాడ"నను స్మృతికూడ లేనంతగా నీ సాత్వికవృత్తిని సహజమును చేసికొనుము. వెలుతురునిచ్చుట సూర్యునికి సహజమైనపని. దీనికి సూర్యు డేమియు గర్వపడడు. సూర్యుడు చేయుపని కెవరైన సమ్మానపత్రము నీయబోయినచో అత డిట్లనును : "నేను చేయు పనిలో విశేషమేమున్నది ? వెలుగునిచ్చుచున్నాను. ఇంతకంటె నధికముగ నేమిచేయుచున్నాను ? వెలుగు నిచ్చుటయే నా జీవితకార్యము. వెలుతురు నీయకపోయినచో నేను చనిపోయి నట్లే! ఇంతకంటె నా కేమియు తెలియదు." సాత్వికవృత్తి కలవా డిట్లుకావలె. సత్వగుణ మతని రోమరోమమునందును వ్యాపించవలె. ఈవిధముగ మన స్వభావము సత్వగుణమయమై పోయినప్పుడు 'నేను సాత్వికకర్మమును చేయుచున్నా' నను అభిమానముండదు. సత్త్వగుణముయొక్క తీక్ష్ణతను తగ్గించుటకు, దానిని వశపరుచుకొనుటకు ఇది యొక ఉపాయము.

ఇక రెండవ యుపాయ మేమనగా సత్వగుణమునుగూర్చిన ఆసక్తిని కూడ వదలుట. అహంకారము, ఆసక్తి – ఈ రెండును వేరువేరువిషయములు. వీనిలోనిభేదము కొంచెము సున్నితమైనది. అందువలన దృష్టాంతముద్వారా ఇది త్వరగా తెలియగలదు. "నేను సత్వగుణుడను" అను అహంకారము పోయిన తరువాతకూడ ఆసక్తిమాత్రము నిలిచియుండును. తిరిగి శ్వాసోచ్ఛ్వాసముల యొక్క ఉదాహరణనే తీసికొందము. ఊపిరి పీల్చుచున్నా మను అభిమానము మాత్రము ఉండదు కాని ఆవనియం దాసక్తిమాత్రము మెండుగానుండును. అయిదునిమిషములపాటు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు కట్టిపెట్టుమనినచో అది సాధ్యమగుపని కాదు. శ్వాసోచ్ఛ్వాసములను గూర్చిన అభిమానము ముక్కున కేమియు లేకపోయినను అది విడువకుండ గాలిని పీల్చుచునేయుండును. సోక్రటీసునుగూర్చిన మనోరంజకమైన కథ యొక టున్నది. అతనిది చట్టిముక్కు. దానినిచూచి ప్రజలు నవ్వుచుండెడివారు. కాని హాస్యమున పేరందిన సోక్రటీసు

"నాముక్కే మంచిది. పెద్దనాసాపుటము లున్నముక్కు ఎక్కువగాలిని పీల్చు కొన గలదు. కనుక యీముక్కే అందఱముక్కులకంటెను సుందరమైనది" అనెడువాడు. ముక్కునకు శ్వాసోచ్ఛ్వాసములను గూర్చిన అభిమానము లేక పోయినను ఆసక్తిమాత్ర ముండునని దీని తాత్పర్యము. సత్వగుణమునెడల కూడ ఇట్టి యాసక్తియేయుండును. ఉదాహరణకు భూతదయను తీసికొనుడు. ఈ గుణము చాల ఉపయోగకరమైనది. కాని దీనియందుకూడ ఆసక్తి యుండ రాదు.

మహాత్ము లీ సత్వగుణమువలననే ఇతరులకు మార్గదర్శకు లగుదురు. వానిలోని భూతదయవలన వారిశరీరము ఎల్లరకును ఉపయోగపడుచుండును. బెల్లపుగడ్డకు ఈగలు ముసిరినట్లే ప్రపంచ మంతయు తన ప్రేమతో మహాత్ము లను కప్పివేయును. విశ్వమంతయు తమ్ము ప్రేమించునంత ప్రేమాతిశయము మహాత్ములలో నుండును. మహాత్ములు దేహాసక్తిని విడిచిపెట్టుదురు. అందు వలన యావత్ప్రపంచమును వారిపై ఆసక్తి చూపును. జగత్తంతయు వారి యోగ క్షేమమునుగూర్చి జాగ్రత్త తీసికొనును. కాని మహాత్ములదృష్టి దానిపై ఏమాత్రమును ఉండరాదు. ప్రపంచము చూపు ప్రేమ యను గొప్ప ఫలము నుండికూడ మహాపురుషుడు తనయాత్మను వేరు చేసికొనవలెను. " నేనొక విశిష్ట వ్యక్తిని " అని అత డెన్నడును తలపరాదు. ఈ విధముగ సత్వగుణము తనలో ఇంకునట్లు చేసికొనవలె.

మొదట అహంకారమును, తరువాత ఆసక్తిని జయింపుము. సాతత్యముచే అహంకారము జయింపబడును. ఫలాసక్తిని వదలి, సత్వగుణమువలన లభిం చిన ఫలమునుకూడ ఈశ్వరార్పితమును చేయుటవలన ఆసక్తిని జయింప వచ్చును. జీవితములో సత్వగుణము స్థిరపడిన తరువాత ఒకప్పుడు సిద్ధి రూపములోను, వేరొకప్పుడు కీర్తి రూపములోను దాని ఫలము కనబడు చుండును. కాని ఆ ఫలమును గూడ తుచ్ఛముగ భావింపుము. మామిడిచెట్టు తన ఫలమును తాను తినదు. పండెంత సుందరముగను, మధురముగను, రస వంతముగను ఉన్నను చెట్టు దానిని తినుటకంటె తినకుండుటలోనే మాధుర్య మున్నది. భోగముకంటె త్యాగమే ఎక్కువ మధురమైనది. ధర్మరాజు తన యావజ్జీవితపుణ్యఫలమైన స్వర్గసుఖమునుగూడ చివరకు తన్ని పారవేసెను. అతని త్యాగములలోనికెల్ల ఈ త్యాగము తుది మెట్టునకు చేరును. స్వర్గఫలము ననుభవించుటకు అతని కధికారమున్నది. కాని యతడు దాని ననుభవించినచో

అది ఖర్చుపడి యుండును. తదుపరి తిరిగి జన్మమెత్తవలసివచ్చెడిది. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" ఈ జననమరణచక్ర మతనిని వెన్నంటి యుండెడిది. ధర్మరాజు ఈ ప్రలోభమును జయించుటలో నెంతో త్యాగమున్నది. ఇది యెల్లపుడును నా కనులయెదుట నిలిచియే యుండును. ఈ విధముగ సత్వగుణమును ఎల్లపుడును ఆచరణలో నుంచుటద్వారా "నేను సత్వ గుణుడను" అను అహంకారమును జయింపవలెను. తటస్థముగనుండి ఫలము నెల్లను ఈశ్వరార్పణచేసి, దానియాసక్తినుండికూడ విముక్తిని పొందవలె. అప్పుడు సత్వగుణముపైనికూడ విజయము కలిగిన దని చెప్పవచ్చును.

## 81. చివరి విషయము : ఆత్మజ్ఞానము, దాని కాధారమైన భక్తి

ఇక చివరకు చెప్పవలసిన దొకటియున్నది. నీవు ఉత్తమ సత్వగుణుడవు కావచ్చును. అహంకారమును జయింపవచ్చును. ఫలాసక్తిని వదలవచ్చును. అయినను శరీర మున్నంతవరకు మధ్యమధ్య రజస్తమముల దాడి నీపై జరుగుచునేయుండును. ఈ గుణములను జయించినట్లే కొంతసేపు తోచును. కాని తిరిగి వాని తీవ్రత పెరుగుచుండును. అందువలన నిరంతరమును జాగరూకులమై యుండవలె. సముద్రజలము వేగముతోవచ్చి గట్టును కోసికొనుచు లోపలికి ప్రవేశించినట్లే రజస్తమోగుణము లను ప్రవాహపువేగము మన మనోభూమిలో ప్రవేశించి ఆఘాతములను కలుగజేయుచుండును. అందువలన నీలో ఏమాత్రపుతూట్లును పడకుండ గట్టిబందోబస్తు చేసికొనుము. రజస్తమోగుణములపై పహరా నుంచుము. ఎంతయవధానముతోను, దక్షతతోను ప్రవర్తించినను, ఆత్మజ్ఞానము కలుగనంతవరకు, ఆత్మదర్శనము కానంతవరకు ప్రమాదము కలదని తెలిసికొనుము. కనుక అన్నివిధముల ప్రయత్నించి ఆత్మజ్ఞానమును సంపాదింపుము.

మెలకువతో మెలగినంతమాత్రమున ఆత్మజ్ఞానము కలుగదు. మఱి అదెట్లు కలుగును ? అభ్యాసముచేతనా ? కాదు. దానికొకటే యుపాయము. అది నిజమైన హృదయముతో, హృదయపూర్వకమైన వ్యాకులతతో భగవద్భక్తి కలిగి యుండుట. రజస్తమోగుణములను జయింపవచ్చును. సత్వగుణమును స్థిరపరచుకొని దాని ఫలాసక్తినికూడ వదలిపెట్టవచ్చును. కాని ఇంతమాత్రముననే ఆత్మజ్ఞానము కలుగదు. అది కలుగనంతవరకు జీవితమేలేదు. చివరకు కావలసినది భగవత్కృపయే ! సత్యహృదయముతో చేయు భక్తి సాధనద్వారా భగవంతుని కృపకు పాత్రులము కావలె. ఇది వినా మార్గమే కనబడదు. ఈ యధ్యా

యము చివర అర్జును డిదే ప్రశ్న అడుగగా భగవంతు డిట్లు సమాధానము చెప్పినాడు – "ఏకాగ్రబుద్ధితో, నిష్కామభావముతో నా భక్తుడవు కమ్ము, నా సేవ చేయుము. ఈ ప్రకారము నా సేవచేసిననాడు మాయయొక్క అవతలి యొడ్డు వకు చేరగలుగును. లేనియెడల దుర్భేదమైన ఈ మాయను దాటుట సులభము కాదు" – ఇది భక్తియొక్క సరళమార్గము, ఏకైక మార్గము. (22-5-32)

# పదునైదవ అధ్యాయము

## పూర్ణయోగము : సర్వత్ర పురుషోత్తమ దర్శనము

### 82. ప్రయత్నమార్గమునుండి భక్తి వేరుకాదు

సోదరులారా ! ఒకవిధముగ ఈ నాటితో గీతయొక్క కొసకు చేరుకొన్నా మనవచ్చును. చెప్పదలచిన విషయము లన్నియు సమగ్రముగ పదునైదవ అధ్యాయములో చెప్పబడినవి. పదునాఱవ, పదునేడవ అధ్యాయములు అను బంధములు. పదునెనిమిదవ అధ్యాయము ఉపసంహారము. ఈ కారణము వలననే భగవంతు డీ యధ్యాయాంతమున దీనికి శాస్త్ర మని నామకరణము చేసెను. "ఇతి గుహ్యతమం శాస్త్ర మిదముక్తం మయాఽనఘ !" తుదిని భగ వంతు డిట్లన్నాడు: జీవితశాస్త్రమును గుఱించి, దాని సిద్ధాంతములను గురించి చెప్పవలసిన దంతయు పూర్తియైనది. కనుక దీనిని శాస్త్రమని భగవంతు డన్నాడు. అంతేకాని ఇది చరమాధ్యాయ మని మాత్రము కాదు. ఈ అధ్యాయ ములో పరమార్థము పూర్తిగ బోధింపబడినది. వేదసారమంతయు ఇందులో వచ్చి నది. పరమార్థముయొక్క చైతన్యమును మానవునిలో కలిగించుటయే వేదముల పని. ఈ యధ్యాయము చేసినపని యదే. అందువలననే దీనికి వేదసార మను గౌరవప్రదమైన పదవి లభించినది.

పదుమూడవ అధ్యాయములో దేహమునుండి ఆత్మను వేరు చేయ వలసిన అవశ్యకమునుగూర్చి తెలిసికొన్నారము. పదునాల్గవ అధ్యాయములో తత్సంబంధమైన ప్రయత్న వాదమును పరిశీలించినారము. రజస్తమోగుణము లను నిగ్రహముతో త్యజింపుము. సత్వగుణమును వికసింపజేసి దానియందలి ఆసక్తిని జయింపుము. దాని ఫలమును త్యజింపుము. ఈ విధముగ ప్రయ త్నము చేయవలె. ఈ ప్రయత్నములు పూర్తిగ సఫలమగుటకు ఆత్మజ్ఞాన మవ

పరమని, భక్తిలేనిచో ఆత్మజ్ఞానము అసంభవమని ఈ అధ్యాయము చివర చెప్పబడినది.

కాని భక్తిమార్గము ప్రయత్నమార్గమునుండి వేరైనది కాదు. దీనిని సూచించుటకు ఈ యధ్యాయ ప్రారంభమునందే ప్రపంచము ఒక మహా వృక్షముతో పోల్చబడినది. త్రిగుణములచే పోషింపబడు ప్రచండశాఖలు ఈ వృక్షమున కున్నవి. అనాసక్తి, వైరాగ్యము అను శస్త్రములతో ఈ వృక్షమును కొట్టివేయవలెనని ఆరంభములోనే చెప్పబడినది. వెనుకటి యధ్యాయములోని సాధనమార్గము ఇక్కడ ప్రారంభములోనే తిరిగి చెప్పబడినది. రజస్తమములను నశింపజేయుటద్వారా, సత్వగుణమును పుష్టిమంతమును చేయుటద్వారా స్వవికాసమును పొందవలె. ఇందొకటి వినాశకము, రెండవది విధాయకము. రెంటిని కలిపినచో పరిణామముగ వచ్చున దొకటేమార్గము. గడ్డికోయుట, విత్తనముల నాటుట – రెండును ఒక క్రియయొక్క భిన్న రూపములే! రజస్తమములను గూర్చియు సత్వగుణమును గూర్చియు చెప్పినవికూడ నిట్టివే! రామాయణములో రావణ, కుంభకర్ణ, విభీషణులు ముగ్గురు సోదరులు. కుంభకర్ణుడు తమోగుణము, రావణుడు రజోగుణము, విభీషణుడు సత్వగుణము. మన శరీరములో నీ మూడు గుణములతో రామాయణము రచింపబడుచునే యున్నది. రామాయణములో రావణ కుంభకర్ణుల నాశము ఉచితమైన విషయము. ఇక మిగిలిన విభీషణతత్త్వము హరిచరణముల నాశ్రయించుచో ప్రగతికి సాధనము, పోషకము కాగలదు. ఇందువలన నది అలవరచుకొనదగినది. పదునాల్గవ అధ్యాయములో ఈ విషయమును మనము తెలిసికొన్నారము. ఈ పదునేనవ అధ్యాయము.మొదట తిరిగి ఆ విషయమే వచ్చినది. సత్వరజస్తమోభరితమైన ఈ ప్రపంచమును అసంగ మను శస్త్రముతో ఛేదింపుము. రజస్తమములను విరోధింపుము. సత్వగుణమును వికసింపజేసి పవిత్రుడవు కమ్ము. ఇప్పట్లి కమలముయొక్క యాదర్శమును భగవద్గీత విశదీకరించుచున్నది. భారతీయ సంస్కృతిలో జీవితాదర్శములు, ఉత్తమోత్తమములు అయిన వస్తువులు కమలముతో పోల్చబడినవి. కమలము భారతీయసంస్కృతికి చిహ్నము. ఉత్తమోత్తమములైన భావములను ప్రకటించుటకు కమలము నొక చిహ్నముగ తీసికొందురు. ఎందుల కనగా కమలము స్వచ్ఛము, పవిత్రము అయ్యు నిర్లిప్తముగ నుండును. పవిత్రత, నిర్లిప్తత అను శక్తిద్వయము కమలమున కున్నది. భగవంతుని వివిధావయవములను కమలముతో పోల్చెదరు. నేత్రకమలము,

పదకమలము, కరకమలము, ముఖకమలము, నాభికమలము, హృదయ కమలము, శిరఃకమలము మొదలగు ప్రయోగములు కలవు. సర్వత్ర సౌంద ర్యము, పవిత్రత – వీనితోపాటే నిర్లిప్తతకూడ ఉన్నదను భావము ఈ ప్రయోగ ములద్వారా మనహృదయములో అంకిత మగుచున్నది.

వెనుకటి అధ్యాయములో చెప్పబడిన సాధనకు పూర్ణత్వము కలుగుట కొఱకు ఈ యధ్యాయము చెప్పబడినది. ప్రయత్నముతో ఆత్మజ్ఞానమును, భక్తిని జోడించినప్పుడు పూర్ణత్వము సిద్ధించును. భక్తి ప్రయత్నమార్గములో ఒక బాగమే. ఆత్మజ్ఞానము, భక్తి ఆ సాధనకు అంగములు. వేదములలో ఋషులు

"యోజాగార తం ఋచః కామయంతే ।
యోజాగార తం సామానియాంతి" ॥

అని యన్నారు. "జాగరూకుని వేదములు ప్రేమించును; వానిని కలియుట కవి వచ్చును" అనగా జాగ్రత్తకలవారి యొద్దకు వేదనారాయణుడు వచ్చును. వారియొద్దకు జ్ఞానమును భక్తియు వచ్చును. ప్రయత్న మార్గము నుండి భక్తి జ్ఞానములు వేరుకావు. ఈ రెండు తత్త్వములును, ప్రయత్న మార్గమునకు మాధుర్యమును చేకూర్చున వని మన మీయధ్యాయములో చూడగలము. కనుక ఏకాగ్రచిత్తముతో భక్తిజ్ఞానముల స్వరూపమును చిత్రించు ఈ యధ్యా యమును విందురు గాక ।

## 83. భక్తివలన ప్రయత్నము సులు వగును

జీవితమును నేను ముక్కలుగ చేయజాలను. భక్తి జ్ఞానకర్మములను నేను వేరువేరుగ భావింపను. నిజమున కవి వేరుకానేకావు. చెఱసాలలో జరుగు వంటపనినే ఉదాహరణముగ తీసికొందము. అయిదారు వందలమందికి మనలో నే కొలదిమందియో వంటచేయుదురు. ఇందులో సరియైన పాకశాస్త్రజ్ఞానము లేనివా డొక డున్నచో వాడు వంటను పాడుచేయును. చేసినరొట్టెలు పచ్చివిగా నైన నగును, లేక మాడినవిగానైన నగును. అందువలన ఉత్తమమైన జ్ఞానాను భవముతోనే ఇక్కడ వంట జరుగుచున్నదనుకొందము. అయినను ఆ వ్యక్తి హృదయములో ఆపనియెడల అభిరుచి, భక్తిభావము లేకపోయినచో "వీనిని భుజించువారు నాసోదరులు, నారాయణస్వరూపులు; ఈ రొట్టెలను చక్కగా నొత్తి కాల్చవలెను, ఇది ప్రభుసేవ" అను భావము హృదయములో లేకపోయి నచో, శాస్త్రజ్ఞాన ముండికూడ వా డీ పనికి యనర్హుడని తేలిపోవును. కనుక

వంటపనికి జ్ఞానమెట్లు అవసరమో అట్లే అభిరుచికూడ అవసరము. హృదయములో భక్తిరసము లేనంతవరకు పాకము రుచిగా నుండనేరదు. ఇందువలననే తల్లి చేయని వంటకు రుచి యుండదందురు. తల్లి తప్ప ఎవ రీపనిని ఇంత భక్తి శ్రద్ధలతో చేయగలరు ? దీనికితోడు తపశ్చర్యకూడ కావలెను. తాపమును సహింపకుండ, కష్టపడకుండ వంటపని యెట్లు జరుగును ? ఏ పనిగాని సఫలము కావలెననిన ప్రేమ, జ్ఞానము, కర్మ ఈ మూడును అవసరమని దీని వలన రుజువగుచున్నది. మనము చేయు పనులన్నియు ఈ మూడు గుణములపై ఆధారపడియున్నవి. ముక్కాలి పీటకు ఏ కాలు విరిగినను అది నిలువజాలదు కదా ! మూడు కాళ్ళును ఉండవలె. దాని నామములోనే దాని స్వరూపమిమిడియున్నది. జీవిత విషయముకూడ నిట్టిదే ! జ్ఞానము, భక్తి, కర్మము ఈ మూడును జీవితమునకు మూడుకాళ్ళు. ఈ మూడు స్తంభముల మీదను జీవిత మను సింహద్వారమును నిలబెట్టవలె. ఈ మూడు కాళ్ళును కలిసి ఒక వస్తువేయగును. ఇక్కడ ముక్కాలిపీట దృష్టాంతము అక్షరశః సార్థక మగుచున్నది. తర్కదృష్టిలో భక్తి, జ్ఞాన, కర్మములను మీరు వేరు వేరుగా చూడవచ్చును ; కాని ప్రత్యక్షముగ వీనిని మనము విడదీయలేము. మూడును కలిసి ఒక విశాలవస్తువే యగును.

ఇది యిట్లున్నను భక్తిలో గుణాధిక్యములేదని నే నసను. ఏకర్మతోనైన భక్తి కలిసినప్పుడే అది సులభ మనిపించును. " సులభ మనిపించు " ననగా అందు కష్టము లేదనికాదు. కాని ఆకష్టము కష్ట మనిపించదు. మీదుమిక్కిలి ఆనందదాయక మగును. అపుడు శూలము పుష్పమువలె తోచును. కనుక భక్తిమార్గము సులభ మనుటలో భక్తివలన కర్మ బరువనిపించదని తాత్పర్యము. భక్తిచే కర్మలోని కాఠిన్యము పోవును. ఎన్ని కర్మల నాచరించినను వానిని చేయనట్లుగనే యుండును. ఏసుప్రభు వొకచోట ఇట్లనెను – " నీవు ఉపవాసము చేయునప్పుడు ఉపవాసముయొక్క బడలిక నీముఖములో కనబడరాదు. అంతే కాదు, నీదౌడలు, నీముఖము సుగంధమును పూసికొన్నవానివలె ఆనంద వికాసములను వెదజల్లుచుండవలె. ఉపవాసమువలన కష్టముకలుగుచున్నట్లు కనబడరాదు " తాత్పర్య మేమనగా నీమనోవృత్తి కష్టమును మరచిపోవునట్లుగా భక్తిమయము, భక్తివిలీనము కావలె. ఒక వీరపురుషుడు, దేశభక్తుడు నవ్వుచు నవ్వుచు ఉరికంబ మెక్కినాడని మన మనుకొనుచుందుము. సుధన్వుడు సల సలక్రాగుచున్న నూనెపాత్రలోనుండికూడ నవ్వుచునే యుండెను. కృష్ణా, విష్ణా హరీ, గోవిందా ! యని నామస్మరణ చేయుచుండెను. దీనియర్థ మేమనగా,

అంతులేనికష్టములువచ్చి పైబడినను భక్తిప్రభావమువలన అవి బాసింపనేలేదు. నీటిపై తేలునావను గెంటుట కష్టముకాదు; కాని దానిని భూమిమీద ఈడ్వవలసి వచ్చిన నెంతోకష్టమగును. నావక్రింద నీ రుండినచో మనము సులువుగా దాటి పోగలము. ఈ విధముగనే మనజీవిత నౌకకు అడుగున భక్తి యను నీ రున్నచో దానిని ఆనందముతో నడుపుకొనిపోగలము. కాని జీవితము శుష్కమైనచో మార్గ మంతయు సికతామయము శిలాకంటకమయము అయినచో, గోతులతో గొప్పులతో నిండియున్నచో నావ నీడ్చుకొనిపోవుట చాల దుష్కరమగుపని యగును. భక్తి తత్త్వము నీటివలె మన జీవితనౌకను సులభముగ ఒడ్డుచేర్చును.

భక్తిమార్గమువలన సాధనలో సౌలభ్య మేర్పడును. కాని ఆత్మజ్ఞానము లేకుండ, సాధకుడు త్రిగుణములను దాటిపోవగలడను ఆశ యెన్నటికిని లేదు. ఇక ఆత్మజ్ఞానమునకు సాధనయేమి ? నిరంతర సత్వగుణసాధనవలన సాధ కుడు దానితో నేకరూపమయి నేను సత్వగుణుడ నను అహంకారమును, సత్వ గుణఫలాసక్తిని భక్తిద్వారా జయించు ప్రయత్నమే ఆసాధన. ఈ సాధనద్వారా నిరంతరప్రయత్నము చేయుచున్నచో ఎపుడో యొకనాడు ఆత్మదర్శన మగును. అంతవరకును మన ప్రయత్నము పూర్తికానేరదు. ఇందు పరమ పురుషార్థ మిమిడియున్నది. ఆత్మదర్శన మనగా నవ్వులాటకాదు. ఆడుచు పాడుచు పోవుమార్గములో దొరకు వస్తువుకాదు. దానికై నిరంతరప్రయత్నము ప్రవాహముగ పారుచుండవలె. "నేను నిరాశకు అవగింజంత చోటీయను; నిరాశతో నే నొక్కక్షణముకూడ కూర్చుండను." పరమార్థమార్గమునకున్న షరతేయిది. ఇదివినా పరమార్థమునకు వేరొకసాధనయేలేదు. అప్పుడప్పుడు సాధకుడు అలసి 'ప్రభూ ! నేను నీకొఱ కెంతాక తపించుచుందును ?' అని యనును. కాని ఇట్లనుకొనుట గౌణము. తపస్సును, సంయమమును స్వాభా వికమైపోవునంతగ అభ్యసింపవలె. "ఎందాక సాధనచేయుచుందును ?" ఇట్టి భాష భక్తిమార్గమునకు శోభనీయదు. అధీరతా, నిరాశలనుండి భక్తి యెన్నడును ఉద్భవింపనేరదు. భక్తిమార్గములో విసుగుదలకు తావేయుండరాదు. భక్తి సాధనలో పోనుపోను ఉల్లాసమును ఉత్సాహమును కలుగుటకు చక్కని భావములు ఈయధ్యాయములో వ్యక్తపరుపబడినవి.

## 84. సేవాత్రిపుటి : సేవ్యుడు, సేవకుడు, సేవాసాధనములు

ఈ విశ్వములో మన కసంఖ్యాకములైన వస్తువులు కనబడుచుండును. వీనిని మూడుభాగములుగ చేయుదుము. భక్తుడు నిద్రనుండిలేవగనే మూడు

వస్తువులే అతనియెదుట గోచరించును. మొదట అతనిదృష్టి భగవంతునివైపునకు మరలును. అప్పు డతడు పూజకు కావలసినవన్నియు సిద్ధముచేసికొనును. నేను సేవించుభక్తుడను, అతడు సేవ్యుడైన భగవంతుడు, ప్రభువు—ఈ రెండుభావము లెల్లపుడును అతని మనస్సునకు పట్టియేయుండును. ఇక మిగిలినది సృష్టి; అది యతనిపూజకై యుపయోగించుసాధనసామగ్రి. పుష్పములు, గంధము, ధూపదీపములు — వీనికొఱకే ఈ సృష్టియంతయు. ఉన్నవి మూడేవస్తువులు — సేవకుడైనభక్తుడు, సేవ్యుడైనపరమాత్మ, సేవకు సాధనభూతమైన ఈసృష్టి. ఈ శిక్షణయే ఈ యధ్యాయములో గఱపబడినది. మూర్తిపూజచేయు సేవకునకు సృష్టిలోనిపదార్థములన్నియు పూజాసాధనములుగ గోచరింపవు. తోటకువెళ్ళి నాలుగుపుష్పములు కోసితెచ్చును. ఎక్కడినుండియో యొక అగరువత్తినికూడ తెచ్చును. కొంచెమునైవేద్య మర్పించును. ఎరికోరితెచ్చినవస్తువులనే వాడవలె ననుకొనును. కాని పదునేనవఅధ్యాయములోని విశాలశిక్షణ ననుసరించి ఈవిధముగ ఎరితేవలసిన అవసరములేదు. తపశ్చర్యకు సాధనములైనవి, కర్మకు సాధనములైనవి యన్నియు పరమేశ్వరుని సేవకు సాధనములే. వానిలో కొన్నిటిని మనము పుష్పములని, కొన్నిటిని గంధమని, మరికొన్నిటిని నైవేద్య మని యనుకొనవలె. ఈవిధముగ మన మాచరించు కర్మలన్నిటిని పూజాద్రవ్యములుగ భావింపవలెను. ఈయధ్యాయములోని దృష్టియిది. ఇట్లీప్రపంచములో నున్నవెల్ల ఈమూఁడువస్తువులే. గీత మనహృదయములకు అంకితముచేయగోరు వైరాగ్యమయసాధనమార్గమునకు ఈయధ్యాయము భక్తిరూపము నిచ్చు చున్నది. కర్మల నాచరించుటలోగల భారమును తొలగించి సౌలభ్యము కూర్చుచున్నది.

ఆశ్రమములో హెచ్చుపనులు చేయవలసిన యవసరము ఏ యాశ్రమవాసికైనను కలిగినపుడు "ఇంతమందియుండగా ఎక్కువపని నేనే యెందులకు చేయవలె" నన్నభావమే వానికి కలుగదు. ఈదృష్టిలో చాలసార మున్నది. రెండు గంటలపూజకు బదులు నాలుగు గంటలపూజ చేయవలసిన అవసరము కలిగినట్లైన విసుగుజెంది "అరే రామ! ఈ రోజున నాలుగు గంటలపూజ చేయవలసి వచ్చినదే" యని ఏ భక్తుడును తలపోయడు. మీదు మిక్కిలి అందువలన వానికి మరింత ఆనందమే కలుగును. ఇట్లే సేవాకార్యము లధికమైన కొలది ఆశ్రమ వాసికి ఆనంద మధికమగుచుండును. ఈ యనుభవమే సర్వత్ర మనకు కలుగుచుండవలె. జీవితము సేవాపరాయణమై పోవలె. అతడు సేవ్య పురుషోత్తముడు, ఆయనసేవకై నిరంతరతత్పరుడ నగు అక్షర పురుషుడము

నేను. అక్షరపురుష డనగా ఎన్నడును అలసిపోనివాడు, సృష్ట్యారంభము నుండియు సేవచేయుచున్న సనాతన సేవకుడు. రాముని యెదుట నిరంతర మును చేతులుమోడ్చి నిలువబడు హనుమంతు డిట్టివాడే. సోమరితన మతని దగ్గరకైనను పోలేదు. హనుమంతునివలెనే చిరంజీవియైన ఈ సేవకుడు సేవాతత్పరుడై నిలచియుండును.

ఇట్టి ఆజన్మసేవకునే అక్షరపురుష డందుము. "పరమాత్మ" యను వ్యవస్థ సదా సజీవమైనది. ఇక అపరమాత్మ సేవకుడనైన నేనుకూడ సదా స్థిరుడనే. ప్రభువు స్థిరుడైన నేనును స్థిరుడనే. నా సేవను పొందుచు అతడే అలసిపోవునో లేక వానిసేవచేయుచు నేనే యలసి పోదునో చూచెదనుగాక! అతడు పది యవతారము లెత్తియుండిన నాకును పది యవతారములైనవి. అతడు రాముడైన నేను హనుమంతుడను; అతడు కృష్ణుడైన నే నుద్ధవుడను. అతని కెన్నియవతారములో నాకును అన్ని కలవు. మా యిరువురమధ్యను ఇట్టి మదురమైనపోటీ జరుగుచుండును. ఈవిధముగ యుగయుగములనుండి పర మేశ్వరుని సేవచేయువాడును, ఎన్నడును నాశములేనివాడును అయిన ఈజీవు డక్షరపురుషుడు. ఆ పురుషోత్తముడు ప్రభువు; నే నతనిదాసుడను, సేవకు డను. ఈ భావమును సదా హృదయమునం దుంచుకొనవలెను. ఇక అనుక్షణ మును మార్పుచెందునది, అనంతరూపములచే అలంకృతమైనదియైన ఈ సృష్టిని పూజాసాధనముగ, సేవాసాధనముగ చేసికొనవలె. మనముచేయు ప్రతి కార్యమును పురుషోత్తముని పూజయే యన్నట్లుండవలె.

సేవ్యపరమాత్మ — పురుషోత్తముడు, సేవకుడైన జీవుడు — అక్షరపురు షుడు; కాని సాధనరూపమైన సృష్టిమాత్రము క్షరము. ఇది యిట్లు క్షరమగు టలో చాల అర్థమున్నది. సృష్టికిది దూషణము కాదు, భూషణమే! దీనివలన సృష్టికి నిత్య నూతనత్వము ప్రాప్తించును! నిన్నటి పుష్పములు నేడు పూజకు ఉపకరింపవు; అవి నిర్మాల్యములగును. సృష్టి నశ్వరమైన దగుట మిక్కిలి శుభ సూచకము. సేవ కిది వైభవము నిచ్చును. రోజురోజును క్రొత్తపుష్పములు సేవకై దొరకుచునేయుండును. ఆ విధముగనే నేను నూతన శరీరములను ధరించుచు ఈశ్వరసేవ చేయుచుందును. నా సాధనలకు నేను నిత్యనూతన రూపముల నిచ్చుచు వానిద్వారా ఆయన పూజచేయుచుందును. ఈ నశ్వరత్వము వలననే సృష్టి కీ సౌందర్యము వచ్చినది. చంద్రుని కీరోజున నున్నకళ నిన్న లేదు. దినదినాభివృద్ధి నొందుచంద్రుని లావణ్యమును, విదియమొదలుకొని

క్రమాభివృద్ధి నొందు చంద్రుని చూచిన నెంతఆనందము కలుగును! విదియ నాటి చంద్రుడు శంకరుని లలాటముమీద నెంతగా ప్రకాశించును! అష్టమినాటి చంద్రుని సౌందర్యము ఇంకను ఎక్కువ. ఆ రోజున ఆకాశములో లెక్కింపదగి నన్నిచుక్కలే ముత్యములవలె మెరయుచు కనబడును. పూర్ణిమరోజున వెన్నె లలో నక్షత్రములు కనిపించవు. ఆ రాత్రి కేవలము పరమేశ్వరుని ముఖ చంద్రుడే మనకు దర్శనమిచ్చును. అమావాస్యనాటి రాత్రి కలుగు ఆనందము చాల గంభీరముగ నుండును. ఆ రాత్రి యెంత పూర్ణమైనశాంతి వ్యాపించి యుండును! తమ కపచార మొనర్చిన చంద్రుని కాంతి మఱుగుపడుటచే అసంఖ్యాకములైన చిన్న, పెద్ద చుక్కలు ఆ నాడు కావలసినంత స్వేచ్ఛతో ప్రకాశించును. వాని స్వతంత్రత ఆ యమావాస్యనాడు కొలదులు పెట్టరానిదై యుండును. వెలుగునిచ్చుచున్నానని గర్వించు చంద్రు డీ రోజున అక్కడలేడు. తనకు ప్రకాశదాతయైన సూర్యునితో ఏకరూపమైనాడు. అతడు పరమేశ్వరు నిలో కలిసిపోయినాడు. జీవు డాత్మార్పణచేసి ప్రపంచమున కేపాటి దుఃఖము నేని కల్గింపడను విషయమును అమావాస్య వెల్లడించుచున్నదా యేమి? చంద్రుడు క్షురుడు, పరివర్తనశీలుడు. అయినను అతడు భిన్నభిన్న రూపము లలో మనకానందము నిచ్చును.

సృష్టియొక్క నశ్వరత్వములోనే దాని యమరత్వమున్నది. సృష్టియొక్క రూపము నదీప్రవాహమువలె ఎప్పటికప్పుడు మారుచుండును. ఈ విధముగ రూప మను నదికి చలనమే లేకపోయిన అది యొక మురుగుగుంట యగును. నదీ జలము అఖండముగ ప్రవహించుచు నిరంతరము మారుచుండును. ఒక బిందువుపోగా మరొకటి దానిస్థాన మాక్రమించును. అందుచేతనే ఆ ప్రవాహము జీవనది యగును. వస్తువులో మనకు కలుగు ఆనందమునకు కారణము దాని నవీనతయే! వేసవిలో దొరకు పుష్పములను వేసవిలో పరమాత్మకు అర్పింతుము. వర్షకాలములో ఆకుపచ్చని గరికపోచలు అర్పింతుము. శరదృతువులో రమ్య మైన కమలపుష్పముల నర్పింతుము. ఆయా ఋతువులలో వచ్చు ఫలపుష్పము లతో భగవంతునిపూజ జరుపబడుచుండును. ఇందువలననే ఆ పూజ నిత్యము నూతనత్వముతో ప్రకాశించుచుండును. అందువలన ప్రాణము విసుగుజెందదు. చిన్నపిల్లవానికి 'క' అనుఅక్షరమును వ్రాసియిచ్చి దానిని బాగుగా లావగునట్లు దిద్దుమని చెప్పుదుము. కాని అపని వానిని మిక్కిలి విసిగించును. దాని నెందు లకు లావుగ చేయవలెనో వాని కర్థముకాదు. వాడు బలపమును అడ్డముగత్రిప్పి

అక్షరము నొక్కసారియే లావుగా చేసివేయును. అయినను తదుపరి క్రొత్త అక్షరములను వాని సముదాయములను చూచి నేర్చుకొనును. నానావిధ సాహిత్య గ్రంథముల అనుభవమును అతడు పొందును. తద్వారా అత డపారానందమును అనుభవించును. సేవాక్షేత్రములో కూడ ఈ ధర్మమే వర్తించును. సాధనలయొక్క నిత్యనవీనతవలన సేవలో ఉత్సాహము పెరుగును. సేవావృత్తి వికాసము నొందును.

సృష్టియొక్క ఈ నశ్వరస్వభావము నిత్యనూతన పుష్పములను వికసింపజేయుచుండును. గ్రామమునకు సమీపములో శ్మశానమున్నది. కావున గ్రామము రమణీయముగ కనబడును. వృద్ధులు చనిపోవుచుందురు. నూతన శిశువులు జన్మించుచుందురు. సృష్టికి నిత్యనూతనత్వము కలుగుచుండును. బయటనున్న ఆ శ్మశానమును తీసివేసినచో అది యింటిలోనికే వచ్చి కూర్చుండును. చూచిన వ్యక్తులనే దినదినమును చూచుచుండుటవలన విసుగుచెందెదవు. వేసవికాలములో ఎండవేడిమి యెక్కువ. భూమి ఆ వేడికి కాలును, దీనికి నీవు భయపడవలదు. ఏలయన ఈ వేడి ఎన్నాళ్ళో ఉండదు. వర్షకాలపు సుఖమును పొందుటకు భూమికాలుట అవసరము. అది బాగుగ కాలకపోయినచో వాన కురియగానే భూమి బురదమైపోవును. పైరుపచ్చలతో అది శోభిల్లదు. నేనొకసారి వేసవికాలపుటెండలలో తిరుగుచుంటిని. ఎండవేడిమికి తల మాడుచుండెను. కాని నా కది ఆనందమునే కలిగించెను. "తల వేడి యెక్కును. తరువాత బాధ పడెదవు" అని యొకమిత్రు డనెను. "క్రింద భూమికూడ కాలుచున్నది కదా! ఈమట్టిబొమ్మనుకూడ కొంచెము కాలనిమ్ము" అని నేనంటిని. ఆహా! ఎండవేడిమికి తల కాలుట, తరువాత వర్షపుజల్లునకు తడియుట – ఇదెంత బాగుండును! కాని యెండలో తపించనివాడు వర్షము పడినప్పుడుకూడ పుస్తకములలో తలదాచుకొని కూర్చుండును. తన గదినే గోరీగాచేసికొని కూర్చుండును. ఇంటి వెలుపల ఈవిశాలమైన అభిషేక పాత్రక్రింద నిలుచుండి అత డానందముతో నృత్యము చేయడు. కాని మహర్షియైన మనువు సృష్టిని ప్రేమించు గొప్పరసికుడు. "వర్షము కురిసినప్పుడు సెలవిమ్ము" అని యతడు తన స్మృతిలో వ్రాసినాడు. వర్షము కురియునప్పుడు ఆశ్రమములో కూర్చుండి సంధ్యావార్చుటయా మనపని? వర్షములో గానము, నృత్యము చేయవలె. సృష్టితో ఏకరూపము కావలె. వర్షములో భూమి, ఆకాశము ఒక దానితో నొకటి కలిసిపోవును. ఈభవ్యదృశ్యమెంత ఆనందదాయకము! ఈసృష్టి స్వతః మనకు శిక్షణ నిచ్చుచున్నది.

సారాంశమిది : సృష్టియొక్క క్షరత్వము, నశ్వరత్వము అనగా సాధన ములయొక్క నూతనత్వమనియే అర్థము. ఈ విధముగ క్రొత్తక్రొత్త సాధన సామగ్రినిచ్చు ఈసృష్టి, నడుముగట్టుకొని సేవకై నిలిచిన సనాతన సేవకుడు, సేవ్యపరమాత్మ – ఈమూడే మనకు కనుపించునవి. ఇక వీని మధ్య ఆటసాగ నిమ్ము. ఆ పరమపురుషుడు – పురుషోత్తముడు, క్రొత్తక్రొత్త సేవాసాధనముల నిచ్చి, నావలన ప్రేమపూర్వకమైన సేవను పొందుచున్నాడు. పలువిధములైన సాధనలనిచ్చి నాచేత ఆట ఆడించుచున్నాడు. రకరకములైన ప్రయోగములను నాచేత చేయించుచున్నాడు. ఇట్టి భావనతో జీవితయాత్ర సాగించినచో ఎంత ఆనందము లభింపగలదు !

## 85. అహంకారములేని సేవయే భక్తి

మనము చేయు ప్రతికార్యమును భక్తిమయము కావలెనని గీతయొక్క ఉద్దేశము. గంటయో, అరగంటయో మన మీశ్వరపూజ చేయుచుండుటమంచిదే. ఉదయము, సాయంకాలము సుందరమైన సూర్యప్రభ శోభిల్లుచుండగా చిత్త మును స్థిరపరచుకొని, కొంతసేపు ప్రపంచమును విస్మరించి, ఆ యనంతుని గూర్చి చింతనచేయుట ఉత్తమమైన కార్యము. ఈసదాచారమును నెన్నడును విడువరాదు. కాని గీత యింతమాత్రమున సంతోషింపదు. ఉదయము మొదలు సాయంకాలము వరకును జరుగు కార్యము లన్నియు భగవంతుని పూజగా జరుగవలెను. స్నానము చేయుచు, భోజనము చేయుచు, నడచుచు, ఊడ్చుచు అతని స్మరణ చేయవలె. ఊడ్చుసమయములో "నాప్రభువు, నా జీవనదేవత – యొక్క అంగణమును పరిశుభ్రము చేయుచున్నా" ననుభావన యుండవలె. మన సమస్తకర్మలును ఈవిధముగ పూజాకార్యములయిపోవలె. ఈదృష్టి యేర్ప డినచో నీవ్యవహారములలో ఎంత వ్యత్యాసము కనబడునో నీవే చూడగలవు. మన మెంతో శ్రద్ధతో పూజకు పుష్పములను ఏరుకొని పత్తుము. వానికి ఒత్తిడి తగులకుండ, అవి వాడిపోకుండ ఎంతో శ్రద్ధతో వానిని పళ్ళెములో భద్రపర తుము. అవి యెక్కడ మలినములై పోవునోయని వానిని వాసనచూడవలెనని కూడ అనుకొనము. ఈదృష్టియే, ఈభావనయే అనుదిన జీవితకార్యము లన్నిటి లోను ఉండవలెను. ఈ నాగ్రామములో నా నారాయణుడే, నాప్రభువే నాపొరుగు వాని రూపములో దర్శనమిచ్చుచున్నాడు. కనుక నేనీగ్రామమును పరిశుభ్రము గను, నిర్మలముగను ఉంచెదను. మన కీదృష్టిని కలిగింపవలెననియే గీత కోరునది. మన కర్మలన్నియు ప్రభుపూజయగుట గీతకు అత్యంత ప్రియమైన

విషయము. గంట, అరగంటచేయు పూజలతో గీతవంటి గ్రంథరాజమునకు తృప్తి లేదు. జీవితమంతయు హరిమయము కావలె. పూజారూపముకావలె. ఇది గీత యొక్క ఉత్కృష్టమైనకోరిక.

గీత పురుషోత్తమయోగమును బోధించి, కర్మమయ జీవితమును పూర్ణత్వమునకు చేర్చుచున్నది. అతడు సేవ్యపురుషోత్తముడు, నే నతని సేవకుడను, ఈ సృష్టియంతయు సేవకు సాధనభూతము – ఈ విషయమును ఈ రూపములో ఒక్కసారి మనము దర్శింపగలిగినచో ఇక కావలసినదేమున్నది ?

"ప్రభూ ! నీదర్శనమయినచో సేవచేయుచుందును. ఇంకేమియు కోరను" అని యన్నాడు తుకారాము.

అప్పుడు మనవలన అఖండమైన సేవ జరుగును. అప్పుడు "నేను" అనున దేమాత్రమును మిగులదు. "నేను, నాది" తుడిచి పెట్టుకొని పోవును. ఇక యున్నదంతయు భగవంతునికొరకే. పరహితార్థము జీవించుటతప్ప మరి యితర మేదియు ఉండదు. అహంకారమును వదలుకొని, జీవితమును హరిపరాయణము గావించుకొనుమని, భక్తిమయ జీవితమును గడపుమని గీత పదే పదే మనకు బోధించుచున్నది. సేవ్య పరమాత్మ యతడు, సేవకుడను నేను, ఈ సృష్టి సాధనరూపము – అను భావము కలిగినతరువాత "నేను, నాది" అను దానికి తావెక్కడ ? జీవితములో మరే విషయమును గూర్చిన చింతయు ఉండదు.

## 86. జ్ఞానలక్షణము : నేను పురుషుడను, అతడు పురుషుడు, అదియు పురుషుడే !

కర్మతో భక్తిని జోడించవలెనని ఇంతవరకును మనము తెలిసి కొన్నారము. కాని దానిలో జ్ఞానముకూడ కలిసియుండవలెను. లేకున్న గీతకు తృప్తి లేదు. దీనినిబట్టి కర్మ, భక్తి, జ్ఞానములు వేరువేరని తలపరాదు. మనకు బోధపడుటకు వేరువేరు మాటలతో చెప్పుకొందుము. కర్మయనిననే భక్తి. భక్తి నెక్కడనుండియో తెచ్చి కర్మముతో కలుపవలసిన పనిలేదు. జ్ఞానము విషయము కూడ నింతే ! ఈ జ్ఞాన మెట్లుగలుగును ? "సర్వత్ర పురుషదర్శనము వలన" అని గీత చెప్పెను. సేవ చేయు సనాతన సేవకుడవు, సేవాపురుషుడవు నీవు; ఆ పురుషోత్తముడు సేవ్యపురుషుడు. అనంతరూపధారిణి, ప్రవాహరూపిణి, వివిధ సాధనదాయిని యైన ఈ సృష్టికూడ పురుషుడే !

ఇట్టి దృష్టి కలిగియుండుట యనగానేమి? సర్వత్ర, దోష రహితమైన నిర్మలసేవాభావము కలిగియుండుట. మీ చెప్పులజోడు కిఱ్ఱుమనుచున్నచో దానిలో కొంచెమునూనె వేయుడు. అదికూడ పరమాత్మయొక్క అంశమే! కనుక దానిని బాగుచేసి మంచిస్థితిలో నుంచవలె. సేవకు సాధనమైన రాట్న ములోకూడ నూనెవేయుడు. అది చప్పుడుచేయుచునే యున్నది చూడుడు. "నేతి, నేతి" — "అట్లయిన నేను దారము నీయను చుమా!" అని యది అనును. ఈ రాట్నము – ఈ సేవాసాధనముకూడ పురుషుడే. దీని వడిదార మును అనగా యజ్ఞోపవీతమును మంచిస్థితిలో నుంచుము. ఈ సృష్టి యంతయు చైతన్యమయమని తెలిసికొనుము. ఇది జడమని యనుకొనవలదు. ఇంపైన ఓంకారనాదము చేయు ఈ రాట్నము జడమా? ఇది పరమేశ్వరుని మూర్తియే. శ్రావణమాసపు – అమావాస్య రోజున మనము అహంకారమును విడిచి పెట్టి వృషభమును పూజింతుము. ఇది చాల గొప్ప విషయము. దీని విశిష్టతను నిత్య మును స్మరించుచు ఎద్దులను చక్కని స్థితిలోనుంచి, వానిచే ఉచితమైన పనిని చేయించుకొనుడు. * ఉత్సవ దినమున కనబరుచు భక్తి ఆ రోజుతోనే సమా ప్తము కారాదు. ఎద్దుకూడ పరమాత్మయొక్క మూర్తియే! నాగలి, ఇతరము లైన వ్యవసాయపు పనిముట్లు – అన్నిటిని మంచిస్థితిలో నుంచుము. సేవ కుపయోగపడు సాధనములన్నియు పవిత్రములే! ఈ దృష్టి యెంత విశాల మైనది! పూజయనగా బుక్కాపొడి, గంధాక్షతలు, పుష్పములు వేయుటకాదు. పాత్రలను అద్దమువలె తోమి శుభ్రపరుచుట పాత్ర పూజ యగును. లాంతరును శుభ్రముగ తుడుచుట లాంతరుపూజ. కొడవలికి పదునుబెట్టి గడ్డికోయుటకు సిద్ధ పరచుట కొడవలిపూజ. తలుపుబందులకు త్రుప్పుపట్టినచో వానికి నూనెవేసి మెత్త పరుచుట వానిపూజ. మానవుడు సర్వత్ర ఇట్టి దృష్టితో పనిచేయించుకొనవలె. మానవుడు సేవాసాధనములను ఉత్కృష్టములుగాను, నిర్మలములుగను ఉంచి, వానిచేత పనులు జరుపుకొనవలెను. నేను అక్షరపురుషుడను. అతడు పురు షోత్తముడు, సాధనరూపమైన ఈ సృష్టి కూడ పురుషుడే, పరమాత్మయే! సర్వత్ర ఒక చైతన్యమే నిండియున్నది. ఈ దృష్టి కలిగినప్పుడు మన కర్మము లోనికి జ్ఞానముకూడ వచ్చిచేరినట్లే!

మొదట కర్మలో భక్తిని కలుపుము. తరువాత జ్ఞానమును కూడ గలిపి నచో దానినుండి అపూర్వమైన జీవనరసాయనము తయారగును. గీత మనలను

* మహారాష్ట్రమున 'పోలా' యను ముఖ్యమైన పండుగు దిన మిది.

తుట్టతుదకు అద్వైతమయమగు సేవామార్గములో పెట్టును. ఈ సర్వసృష్టిలో ఎక్కడ చూచినను ముగ్గురు పురుషులు ప్రత్యక్షమైయున్నారు. ఒక్కడైన పురుషోత్తముడు ఈ మూడు రూపములను ధరించియున్నాడు. వాస్తవమునకు ఈ మూడును కలిసి ఒక్కపురుషుడే! ఇది కేవలము అద్వైతస్థితి. ఇక్కడ గీత మనలను అత్యున్నతశిఖరమునకు చేర్చును. కర్మ, భక్తి, జ్ఞానములు మూడును ఏకమైపోవును. జీవుడు, శివుడు, సృష్టి ఇవన్నియు ఏకరూపమే! కర్మ, భక్తి. జ్ఞానములమధ్య ఎట్టి వైరుధ్యమునులేదు. జ్ఞానదేవుడు "అమృతానుభవము"లో తన ప్రియమైన దృష్టాంతమును ఇట్లు ఇచ్చియుండెను.

> 'ఒకకొండలోనే దేవుని, దేవళమును, భక్తులను మలచిరి. భక్తిమార్గము మాత్ర మిట్లేల యుండరాదు?'

ఒక జాతినే తొలచి దేవళము నిర్మించిరి. ఆ దేవళములోని భగవద్విగ్రహమును ఆ జాతిలోనే సృష్టించిరి. ఆ విగ్రహము నెదుటనున్న భక్తుని, ఆ భక్తుడు సమర్పించుపండ్లను కూడ ఆ జాతిలోనే ఏర్పరచిరి. ఒక మహాశిల లోనే యిన్ని రూపములను నిర్మించిరి. భక్తుని విషయమున సైతము ఇట్లే యేల కాగూడదు? స్వామి, సేవకుడు అను సంబంధములో నున్నప్పటికిని ఏకత్వ మెందుకుండరాదు? పూజా ద్రవ్యమగు ఈ బాహ్యసృష్టి వేరుగ నున్నప్పటికిని అది ఆత్మరూపము నేలపొందరాదు? ముగ్గురుపురుషులు నొకరేగదా! జ్ఞానము, కర్మము, భక్తి – ఈ మూటిని కలిపి యొకవిశాల జీవనప్రవాహమును చేయవచ్చును. ఇట్టి పరిపూర్ణ పురుషోత్తమయోగ మిది. స్వామి, సేవకుడు, సేవాద్రవ్యము – అన్నియు నేకరూపమే. ఇక భక్తి – ప్రేమల ఆటసాగవలె.

ఇట్లు పురుషోత్తమయోగమును హృదయమునకు అంకితము చేసికొన్నవాడే నిజమైన భక్తుడు.

> "స సర్వవిద్ భజతిమాంసర్వభావేన భారత!"

ఇట్టి పురుషుడు జ్ఞానియైయున్నను పదునారణాల భక్తుడై యుండును. ఎవనిలో జ్ఞానమున్నదో వానిలో ప్రేమకూడ నుండును. పరమేశ్వరుని గూర్చిన జ్ఞానము, ప్రేమ – ఈ రెండును వేరువేరు వస్తువులుకావు. 'కాకరకాయ చేదు' అను మనోవృత్తి యున్నచోట దానిపై ప్రేమపుట్టదు. ఇట్టి స్థితిలో కూడ ప్రేమను నిలబెట్టుకొనువారు కొందఱుండనేయుందురు. చేదు ననుభవించుపట్ల మనస్సు విసుగుచెందును. కాని పటికిబెల్లముమాట స్ఫురించగనే చేదునెడల

గల వైమనస్యము తొలగిపోవును. వెంటనే ప్రేమప్రవాహము వెల్లివిరియును. పరమేశ్వర సంబంధమైన జ్ఞానము కలుగుట, ప్రేమ యుత్పన్నమగుట రెండును ఒకటే. పరమేశ్వరుని రూపములో నుండు మాధుర్యమును పనికిమాలిన పంచదారతో నెందులకు పోల్చవలె? పరమేశ్వరుని గూర్చిన జ్ఞానము కలిగిన తత్క్షణమే ప్రేమభావము కూడ పుట్టుకొనివచ్చును. జ్ఞానముకలుగుట, ప్రేమకలుగుట ఈ రెండును భిన్నక్రియలు కావని తెలిసికొనుము. అద్వైతములో భక్తికి స్థానమున్నదా లేదాయను చర్చతో పనిలేదు. జ్ఞానదేవుడు

'భక్తి - జ్ఞానము, ఇవి యొకవస్తువు యొక్క రెండు పేరులే!' అనెను.

జీవితమందెల్ల ఉత్తమమైనభక్తి వ్యాపించినప్పుడు జరుగు కర్మలన్నియు భక్తిజ్ఞానములకు విరుద్ధముగ నుండవు. కర్మ, భక్తి, జ్ఞానము — ఈమూడును కలిసి ఒకరమణీయమైన రూపమగును. ఈరమణీయ రూపమునుండి ప్రేమమయము, జ్ఞానమయము అయిన అద్భుతసేవ సహజముగ ఉత్పన్నమగును. తల్లియెడల బిడ్డకున్నప్రేమ బిడ్డచేయుపనులద్వారా ప్రకటితము కావలె. ప్రేమ యెల్లప్పుడును ఎంత కష్టమునైనను సహించును. సేవద్వారా అది ప్రకటమగు చుండును. ప్రేమయొక్క బాహ్యరూపము సేవయే. ప్రేమ అనంత సేవాకర్మలరూపమున అలంకృతమై నృత్యము చేయును. ప్రేమ యున్నచోట జ్ఞానముకూడ ఉండితీరును. ఎవరికి నేను సేవ చేయవలసి యున్నదో, వాని కెట్టిసేవ ప్రియమో, అవసరమో అది నాకు తెలియవలె. అది లేకపోయినచో ఆసేవ అసేవ–లేక–దుస్సేవ అయిపోవును. సేవ్యవస్తువునుగూర్చిన జ్ఞానము ప్రేమకుండవలె. ప్రేమయొక్క ప్రభావమును కార్యములద్వారా వ్యాపింపజేయుటకు జ్ఞానము అవసరము. కాని దాని మూలములో ప్రేమ యుండవలె. అది లేక పోయినచో జ్ఞానము నిరుపయోగ మగును. ప్రేమతో చేయుకర్మ సామాన్యకర్మకంటె భిన్నముగా నుండును. పొలముపనిచేసి అలసి వచ్చిన కుమారునిచూచి తల్లి ప్రేమభావముతో "నాయనా! అలసిపోయితివా?" అని యనును. ఈ పని చిన్నదేయైనను ఇందెంత సామర్థ్యమున్నదో చూడుడు. మీ జీవిత కార్యము లన్నిటియందును భక్తి జ్ఞానములను ఓతప్రోతము చేయుడు. దీనినే పురుషోత్తమయోగ మందురు.

## 87. సర్వవేదసారము నా చేతిలోనే యున్నది

ఇదంతయు వేదములసారము. వేదము లనంతములు, కాని ఆ యనంత వేదములయొక్క సారసంగ్రహము ఈ పురుషోత్తమ యోగము. ఈ వేద

మెక్కడనున్నది ? వేదముల చరిత్ర చాల విచిత్రము. వేదములసార మెక్కడ మున్నది ? ఈ యధ్యాయ ప్రారంభములోనే "దేని పత్రములు వేదములో" అని చెప్పబడినది. సోదరా ! వేదము లీ వృక్షముయొక్క ప్రతి పత్రములోను నిండియున్నవని తెలిసికొనుము. మీ గ్రంథములలోను, సంహితలలోను వేద ములు దాగియుండలేదు. అవి విశ్వమందెల్లను వ్యాపించియున్నవి.

"ప్రవహించు సెలయేళ్ళలో సద్గ్రంథము లభించును. ఱాయి రప్పలలో ప్రవచనములు వినబడును." అని షేక్స్పియర్ అన్నాడు. వేదములు సంస్కృతములోను, సంహితలలోను గాక సృష్టిలోనున్నవని దీని భావము. సేవచేసినవారి కవి గోచరించును. "ప్రభాతే కర దర్శనం" ఉదయమున నిద్రనుండి లేవగానే నీ యఱచేతిని చూచుకొనవలె. వేదములన్నియు నీ చేతి లోనే యున్నవి. వేదము సేవచేయు మనును. నిన్నటి దినము చేయి పని చేసి నదా లేదా ? ఈ రోజున పని చేయుటకు సిద్ధముగ నున్నదా లేదా ? పని చేసిన గుర్తులు దానిలో నున్నవా లేవా? ఇవి మనము చూడవలసినవి. సేవచేసి చేయి అరిగినప్పుడు బ్రహ్మలిఖితము గ్రాహ్యమగును. "ప్రభాతే కర దర్శన" మనగా అర్థమిది.

వేదము లెక్కడనున్నవందురు ? సోదరా ? అవి నీ చేతిలోనే యున్నవి. శంకరాచార్యుడు ఎనిమిదవ యేటనే అన్ని వేదములలోని జ్ఞానమును సంపా దించినట్లు చెప్పుదురు. పాపము ! అతనిది మందబుద్ధి. అతని కెనిమిదేండ్లు పట్టినది ! కాని మీకును నాకును అవి జన్మసిద్ధముగనే ప్రాప్తమైనవి. ఎనిమి దేండ్లు పట్టవలసినపని యేమున్నది ? నేను సజీవమగువేదమనే. ఇంతవరకు వచ్చిన వేదపరంపర యంతయు నాతో ఏక రూపమయినది. నేనా పరంపర యొక్క ఫలమనే. ఆ వేద బీజమునుండి వచ్చిన ఫలమనే నేను. అట్టి ఫల స్వరూపుడనైన నేను సమస్త వేదములను బీజరూపమున నాయందు పొందు పరచి యుంచినాడను. నాయుదరములో అవి పెక్కు రెట్లుగ వృద్ధిపొందినవి. వేదముల సారము మన చేతిలోనే యున్నదని దీని సారాంశము. సేవ, ప్రేమ, జ్ఞానము అను పునాదిమీద మనము జీవితసౌధమును నిర్మించుకొనవలె. మన చేతులలో వేదము లున్నవను దానికి అర్థమిదే. అప్పుడు నేనేది చెప్పినను అదే వేదమగును. వేదము బయట నెక్కడనులేదు. సేవామూర్తులైన మహా త్ములు "వేదార్థమును గ్రహించిన వారము మేమే!" అని యందురు. "వేదము లన్నియు నన్నే యెరిగి యున్నవి. సమస్త వేదసారరూపుడ నైన పురుషోత్తము

డను నేనే." అని భగవంతు డన్నాడు. వేదముల సారమైన ఈ పురుషోత్తమ యోగముతో మన జీవితము నేక రూపము చేసికొన గలిగినచో ఎంతబాగుగా నుండును! అప్పుడిట్టి పురుషుడు చేయు పనులద్వారా వేదమే ప్రకటిత మగునని గీత సూచించుచున్నది. గీతయొక్క సారమంతయు ఈ యధ్యాయములో వచ్చినది. గీతచేయుబోధ పూర్ణరూపములో ఇందు ప్రకటితమైనది. దానిని మనజీవితములో అనుష్ఠించుటకు అహర్నిశము ప్రయత్నింపవలె. ఇంతకంటె చెప్పవలసిన దేమున్నది? (29—5—32)

# పదునారవ అధ్యాయము

## అనుబంధము 1: దైవాసుర వృత్తుల సంగ్రామము

### 88. పురుషోత్తమ యోగముయొక్క పూర్వప్రభ దైవసంపద

సోదరులారా! జీవితప్రణాళిక యెట్లుండవలెనో, మనజన్మము నెట్లు సఫలపరుచుకొనగలమో గీతలోని మొదటి యైదు అధ్యాయములలోను మనము చూచియున్నారము. దాని తరువాత ఆఱవ అధ్యాయము మొదలు పదునొకొండవ యధ్యాయమువరకు భక్తితత్త్వమును అనేకరీతుల విచారణ చేసినారము. పదునొకొండవ అధ్యాయములో భక్తియొక్క స్వరూపమును దర్శించినారము. పండ్రెండవ అధ్యాయములో సగుణ, నిర్గుణ భక్తిరూపములనుపోల్చి భక్తుని ఉత్తమ లక్షణములను తెలిసికొన్నారము. పండ్రెండవ అధ్యాయము తుదివరకు కర్మ, భక్తి—ఈ రెంటిని గూర్చిన నిజస్థితిని పరిశీలించినారము. ఇక జ్ఞాన మను మూడవ విభాగము మిగిలిపోయినది. దానిని మనము పదుమూడవ, పదునాల్గవ, పదునైదవ అధ్యాయములలో చూచినారము. దేహమునుండి ఆత్మను వేరు చేయుట, దానికొఱకై త్రిగుణములను జయించి చివరకు సర్వత్ర ప్రభువును దర్శించుట యెట్లో చూచినారము. పదునైదవ అధ్యాయములో సంపూర్ణ జీవిత శాస్త్రమును అవగతము చేసికొన్నారము. పురుషోత్తమయోగములో జీవితము పూర్ణత్వమును పొందినది. దాని తరువాత మిగిలిన దేమియునులేదు.

కర్మ, జ్ఞానము, భక్తి—వీనిని మూడుగా విడదీయుట నేను సహించలేను. కొందరు సాధకులనిష్ఠ కేవలము కర్మవైపునకే మ్రొగ్గి యుండును. కొందరు భక్తికే ప్రాధాన్యమునిచ్చి దానియందే దృష్టినెల్లను కేంద్రీకరింతురు. మరి

కొందఱఘోరణి జ్ఞానము వైపునకే మరలును. జీవిత మనగా కేవలము కర్మయే, కేవలము భక్తియే, కేవలము జ్ఞానమే యనుకొను ఈ 'కేవల' వాదమును ఒప్పుకొనుట నా కిష్టముగాదు. దీనికి విరుద్ధముగ కర్మ, భక్తి, జ్ఞానయోగముల సముచ్చయవాదమును గూడ నే నంగికరింపను. కొంతభక్తి, కొంత జ్ఞానము, కొంత కర్మ – ఇట్టి అవసరవాదముకూడ నాకు గిట్టదు. మొదటకర్మ, తరువాత భక్తి, తరువాత జ్ఞానము అను క్రమవాదమును కూడ నే నంగికరింపను. ఈ మూటిని కలుపుట సమంజసమను వాదముకూడ నా కంగీకృతము కాదు. కర్మయే భక్తి, భక్తియే జ్ఞానము, జ్ఞానమే కర్మ యను అనుభవమును పొందవలెనని నా కోరిక. బర్ఫీ ముక్క యొక్క మాధుర్యము, దానియాకారము, దానిబరువు, మూడును వేరువేరుకావు. మన మా ముక్కను నోటిలో వేసికొన్న వెంటనే దాని యాకారమును తినివేసినారము. దాని బరువును జీర్ణము చేసికొన్నారము. మాధుర్యమును గూడ రుచిచూచి నారము. ఆ మూడుపనులును కలిసి యొక సారియే జరుగుచుండును. బర్ఫీయొక్క ప్రతికణములోను ఆకారము, బరువు, మాధుర్యము కలిసియే యున్నవి. ఒక కణములో కేవలము ఆకారము, మరొక దానిలో కేవలము మాధుర్యము, మరొకదానిలో వట్టిబరువు లేదు. ఆ విధముగనే జీవితములోని ప్రతి క్రియయందును పరమార్థము నిండియుండవలెను. ప్రతి కార్యమును సేవామయము, ప్రేమమయము, జ్ఞానమయము కావలె. జీవితము యొక్క విభాగములన్నిటిలోను కర్మ, భక్తి జ్ఞానములు నిండియుండవలె. దీనినే పురుషోత్తమయోగమందురు. జీవితమునెల్ల పరమార్థమయము చేయవలె నను మాటను చెప్పుట చాల సులభము. కాని ఈ భావము ఆచరణములోనికి రావలె ననిన శుద్ధమైన భక్తిజ్ఞానములతో హృదయమును వికసింపచేసికొని సాధనచేయ వలెను. కావున కర్మభక్తిజ్ఞానముల రూపము అక్షరశః ఒకటే! ఈ యుత్కృష్ట స్థితినే పురుషోత్తమయోగ మన్నారు. దీనితో జీవితము చరమదశను పొందును.

ఇప్పు డీ పదునాఱవ అధ్యాయములో చెప్పబడిన విషయమేమి ? సూర్యోదయము కాబోవుముందు సూర్యునిప్రభ ఆకాశమును నింపినట్లుగానే కర్మ, భక్తి, జ్ఞానములతో గూడిన పూర్ణపురుషోత్తమయోగము జీవితాకాశములో నుద యించుటకు ముందు సద్గుణముల ప్రభ బహిర్గతమగును. పూర్ణజీవితమును సూచించుచు ముందుగా వచ్చు ఈ ప్రభయొక్క వర్ణనము ఈ పదునాఱవ అధ్యాయములో చేయబడినది. ఏ యంధకారముతో పోరాడి యీ ప్రభ బయలు వెడలునో దానివర్ణనకూడ ఇక్కడ చేయబడినది. ఏదేని ఒకవిషయమును రుజువు

చేయుటకొఱకు మరికొన్నిటి సాహాయ్యము అవసరమగుచుండును. సేవా, భక్తి, జ్ఞానములు మనజీవితములోనికి వచ్చినట్లు మనము తెలిసికొనుట యెట్లు? పొలములో మనము కృషిచేసినందులకు ప్రతిఫలముగ ధాన్యమును కొలిచి యింటికి తెచ్చుకొందుము. ఈ విధముగనే మనము చేసిన సాధనలేవో, వాని నుండి మనకు కలిగిన అనుభవములేవో, ఎన్నిసద్వృత్తులు మనలో లోతుగ నాటుకొన్నవో, ఎన్నిసద్గుణములు మనలో ప్రవేశించినవో, జీవితము నిజముగ నెంత సేవామయమైనదో – వీనిని పరిశీలించుటకు ఈ యధ్యాయము దారి చూపును. జీవితకళ యెంతపురోగమించి వృద్ధిచెందినదో కొలిచి చూచుకొనుడని ఈ యధ్యాయము మనకు చెప్పుచున్నది. వికాసయుతమగు ఈ జీవితకళను గీత దైవసంపదయనును. ఇందులకు విరుద్ధమైన వృత్తులను అసురసంపద యనును. ఈ యధ్యాయములో దైవసంపదకు అసురసంపదకుమధ్య జరుగు సంఘర్షణ చెప్పబడినది.

## 89. హింసాఽహింసల సేనలు

మొదటి యధ్యాయములో ఒకవైపున కౌరవసేనయు, రెండవ వైపున పాండవసేనయు ఎదురెదురుగ నిలిచియున్నట్లే ఇక్కడ సద్గుణములనెడి దైవ సేన, దుర్గుణములనెడి అసురసేన ఒక దానియెదుట నొకటి నిలిచియున్నవి. మానవహృదయములో సత్యాసత్య ప్రవృత్తులమధ్య జరుగుచుండుపోరాటమును బహుప్రాచీన కాలమునుండియు రూపకాలంకారముద్వారా వర్ణించుట పరిపాటి యైనది. వేదములలో ఇంద్రునికిని వృత్రునికిని, పురాణములలో దేవతలకును దానవులకును, అట్లే రామరావణులకును, పారసీకధర్మ గ్రంథములలో అహుర్మజ్దునకును అహరిమానునకును, క్రైస్తవమతములో భగవంతునికిని సైతానునకును, ఇస్లాములో అల్లాకును ఇబ్లీసునకును ఉన్నపోరాటముల వంటివి అన్ని ధర్మగ్రంథములలోను కనబడుచున్నవి. కావ్యములలో స్థూల విషయములవర్ణన సూక్ష్మవస్తువులద్వారా చేయబడుచుండగా ధర్మగ్రంథము లలో సూక్ష్మమనోభావములు బ్రహ్మాండమైన వస్తువులతో పోల్చబడి వర్ణింపబడు చుండును. కావ్యములలో స్థూలవస్తువులవర్ణన సూక్ష్మవస్తువుల ద్వారా జరుగగా, ఇక్కడ సూక్ష్మవస్తువుల వర్ణన స్థూలవస్తువుల ద్వారా జరుగును. గీతకు ప్రారంభములో చేయబడినయుద్ధ వర్ణన కేవలము కల్పితమని నేను సూచించుట లేదు. అది చరిత్రాత్మక విషయమే కావచ్చును. కాని యిక్కడ వ్యాసుడు తన యభీష్టమును నెరవేర్చుకొనుటకు ఈ యుద్ధము నుపయోగించు కొనుచున్నాడు.

కర్తవ్యనిర్వహణములో మనస్సునందు మోహము జనించినప్పుడు మనుష్యుడెట్లు సంచరింపవలెనన్న విషయము యుద్ధమను రూపకముద్వారా నచ్చజెప్పబడినది. ఈ పదునారవ అధ్యాయములో మంచి చెడుగుల నడుమ కలుగు పోరాటము చిత్రింపబడినది. గీతయందు యుద్ధముయొక్క రూపకముకూడ చూపబడినది.

కురుక్షేత్రము మన వెలుపలను మనలోపలను ఉన్నది. సూక్ష్మముగ చూచిన మన లోపల జరుగుచున్న సంగ్రామమే బాహ్యప్రపంచములోకూడ మూర్తీభవించి కనబడుచున్నది. బయట కనబడుచుండు నా శత్రువులు నా మనోవికారముల సాకారరూపములే. నా ముఖములోని మంచి చెడుగులు అద్దములో ప్రతిబింబించినట్లే నా మనస్సులోని మంచి, చెడ్డ తలంపులు బయటనున్న మిత్రులుగ, శత్రువులుగ కనబడుచుండును. జాగ్రదవస్థలోని విషయములనే మనము స్వప్నములో దర్శించినట్లు మన మనస్సులోనున్న భావనలనే వెలుపల చూచుచుందుము. బయట జరుగు యుద్ధమునకును లోపల జరుగు యుద్ధమునకును భేద మేమియులేదు. నిజము చెప్పవలెనన్నిన ముఖ్యమైన యుద్ధము లోపలనే జరుగుచుండును.

మన అంతఃకరణములో ఒకవైపున సద్గుణములు, మరియొక వైపున దుర్గుణములు నిలిచియున్నవి. అవి తమతమ వ్యూహములను చక్కగా పన్నుకొని సంసిద్ధముగ నున్నవి. సేనకు సేనాపతి అవసరమైనట్లే ఇక్కడకూడ సద్గుణము లొక సేనాపతిని యెన్నుకొన్నవి. ఆ సేనాపతిపేరు 'అభయము'. ఈ యధ్యాయములో అభయమునకు ప్రథమస్థాన మీయబడినది. ఇది అనాలోచితముగా నీయబడిన స్థానముకాదు. బాగుగా యోజించియే అభయమునకీ ప్రథమస్థాన మీయబడియుండును. అభయమువినా మరి యే గుణమును రాణింపజాలదు. సత్యములేనిచో సద్గుణమున కేమియు విలువలేదు. కాని సత్యమునకు నిర్భయత్వ మావశ్యకము. భీతవాతావరణములో సద్గుణములు వికసింపజాలవు. అట్టి వాతావరణములో సద్గుణములుకూడ దుర్గుణములై పోవును. సద్వృత్తులుకూడ బలహీనములై పోవును. నిర్భయత్వము సద్గుణము లన్నిటికిని ముఖ్యనాయకుడు. కాని సేనకు ముందును వెనుకను కాపుదల యుండవలె. సరళమైనదాడి యెదుటి నుండియే వచ్చును. కాని వెనుకనుండి దొంగపోటుగ దాడి జరుగ వచ్చును. సద్గుణములకుముందు 'అభయము' దేరా వేసికొని నిలిచి యుండును. ఇక వెనుకనుండి 'నమ్రత' సేనను రక్షించుచుండును. ఈ విధ

ముగ మిక్కిలి చక్కని రీతిని దైవి యగు సంపద రక్షింపబడు చున్నది. ఇందు మొత్తము 26 గుణములు చెప్పబడినవి. వీనిలో 25 గుణములు మాత్రమేయుండి, వానిని గూర్చిన యహంకారము ప్రవేశించిన యెడల వెనుక నుండి దొంగపోటుగ దాడిజరిగి సద్గుణము లన్నిటిని కోల్పోయెడు భయము కలదు. ఇందుచే నమ్రత యను సద్గుణము రక్షణకై వెనుకవైపున ఉంచబడి నది. ఆ నమ్రత యే లేకున్నచో జయ మెప్పుడు పరాజయముగ మారునో చెప్ప లేము. ఈ విధముగ ముందర నిర్భయత, వెనుక నమ్రత వెన్నంటియున్నపుడే సద్గుణము లన్నిటిని వికసింప జేసికొనవచ్చును. ఈ రెండు మహాగుణముల మధ్య నున్న ఇరువదినాలుగు గుణములు అహింసకు పర్యాయ పదము లనుటలో అనుచితమేమియులేదు. భూతదయ, మార్దవము, క్షమ, శాంతి, అక్రోధము, అహింస, అద్రోహము – ఇవన్నియు అహింసకు పర్యాయపదములే. అహింస, సత్యము అను నీ రెండు గుణములలో సద్గుణము లన్నియు ఇమిడి యున్నవి. సద్గుణము లన్నిటిని సంక్షిప్త పరచినచో చివరకు సత్యాహింసలు రెండే మిగులును. తక్కిన సద్గుణము లన్నియు ఈ రెంటియందే ఇమిడి యుండును. కాని నిర్భయత, నమ్రత – ఈ రెంటి విషయమును వేరు. నిర్భ యత సత్యము యొక్కయు, నమ్రత అహింసయొక్కయు చిహ్నములు. సత్యాహింసలను మూలధనముగ పెట్టుకొని నిర్భీతితో పురోగమించవలెను. జీవితము విశాలమైనది. దానియందు మనము నిరాతంకముగ సాగి పోవలెను. నమ్రత నంటియుండినచో అడుగు ఇటునటు బెసగనేరదు. మరి యే యితర ప్రమాదమును ఉండజాలదు. ఇక సంతోషముతో సర్వత్ర సత్యాహింసల ప్రయోగములు జరుపుచు ముందునకు సాగిపొండు. తాత్పర్యమేమనగా సత్యా హింసల వికాసము నిర్భయత, నమ్రత వలననే కలుగుచుండును.

ఈ విధముగ నొకవైపున సద్గుణములసేన నిలిచియున్నట్లే, రెండవ వైపున దుర్గుణముల సేనకూడ మోహరించి యున్నది. దంభము, అజ్ఞానము మొదలగు దుర్గుణముల విషయమున అధికముగ చెప్ప నవసరములేదు. ఇవి మన నిత్య పరిచయములో నున్నవే. దంభమునకు మన మలవాటు పడిన ట్లున్నారము. జీవితము సర్వమును దంభమను పునాది మీదనే నిలిచియున్న ట్లున్నది. ఇక అజ్ఞానమన్ననో, దానిని అడుగడుగునకును సాకుగాపెట్టుకొని బ్రతుకుట మనకు పరిపాటియైపోయినది. ఇదెంత హాస్యాస్పదము! అజ్ఞానము పాపమే కాదన్నట్లు మెలగు చుందుము. కాని అజ్ఞానము పాపమనియే భగవంతు

డనును. సోక్రటీసు చెప్పినది దీనికి వ్యతిరేకము. "మీరు పాపమని తలచునది అజ్ఞానమని నే నందును. అజ్ఞానము క్షంతవ్యము. అజ్ఞానములేనిచో పాపమెట్లు జరుగగలదు ? అజ్ఞానమునకు మీరు శిక్ష నెట్లు విధింతురు ?" అని సోక్రటీ సనెను. కాని అజ్ఞానముకూడ పాపమేయని భగవంతు డనును. రాజశాసనమును గూర్చిన అజ్ఞానము క్షంతవ్యముకాదని న్యాయశాస్త్రము చెప్పును. ఈశ్వరశాసనమును గూర్చిన యజ్ఞానముకూడ పెద్ద దోషమే. భగవంతుడు, సోక్రటీసు – ఇరువురు చెప్పిన వాని లోని భావార్థము ఒక్కటే! మానవుడు తన యజ్ఞానముపట్ల తానెట్లు వర్తింపవలెనో భగవంతుడు బోధించుచున్నాడు. మరియొకని పాపము నే దృష్టితో చూడవలెనో దానిని సోక్రటీసు చెప్పుచున్నాడు. ఇతరుల పాపములను క్షమింపవలెను. కాని తన యజ్ఞానమును క్షమించుకొనుట పాపమగును. మనలో అజ్ఞానమున కేమాత్రమును తావీయరాదు.

## 90. అహింసయొక్క వికాసమునకు నాలుగంచెలు

ఈ విధముగ నొక వైపున దైవసంపద, రెండవ వైపున అసుర సంపద– ఈ రెండు సేనలును నిలిచియున్నవి. ఇందు అసురసంపదను విడిచి దైవ సంపదను పట్టుకొనవలె. సత్యము, అహింస మొదలైన దైవగుణముల వికాసము ఆదికాలమునుండియు ప్రకటమగుచునే యున్నది. మధ్య యుగములో కూడ అది చాలవరకు వికాసము పొందెను. అయినను ఇంకను చాల వికాసమును పొందవలసియే యున్నది. వికాసము పరిపూర్ణమయినదని చెప్పలేము. మానవ సమాజ మున్నంతకాలము వికాసమునకు అంతులేని అవకాశముండును. వ్యక్తి వికాసము కలిగిన తరువాతగూడ సామాజిక, రాష్ట్రీయ, జగద్వికాసమునకు అవకాశము మిగిలియేయుండును. వ్యక్తి తన వికాసమును ఎరువుగావేసి సామాజిక వికాసమును అనగా రాష్ట్రమందలి లక్షలకొలది యితర వ్యక్తుల వికాసమును వండించుటకు ప్రయత్నింప వలసి యుండును. ఉదాహరణ కొక్కమాట. ఆదికాలమునుండియు అహింసయొక్క వికాసము మానవుని ద్వారా పెంపొందుచు వచ్చినను, ఆవికాసక్రియ యిప్పటికిని సాగిపోవుచునే యున్నది.

అహింస యెట్లు వికాసముపొందినదో మనము పరిశీలింపదగి యున్నది. పారమార్థిక జీవితము క్రమ వికాసమునెట్లు పొందుచు వచ్చునో, దాని పరిపూర్తికి ఇంకను ఎంతయవకాశమున్నదో దీనినికూడ మనము గ్రహింప గలము. ఆదికాలములో అహింసాపరుడు 'హింసాపరుల దాడిని ఎట్లు తప్పించు

కొన వలెనా' అని యోజింప నారంభించెను. మొదట సమాజ రక్షణ కొరకు క్షత్రియ వర్గము నిర్మింప బడెను. కాని కాలక్రమమున రక్షకవర్గము భక్షక వర్గముగ తయారయ్యెను. అప్పుడిట్టి ఉన్మత్త క్షత్రియులబారినుండి సమాజ మును తప్పించుటెట్లని అహింసావ్రతులగు బ్రాహ్మణులు యోజింప మొదలిడిరి. పరశురాముడు అహింసాపరుడైనప్పటికిని హింసనవలంబించి క్షత్రియుల వినాశమునకు పూనుకొనెను. క్షత్రియులను హింసావిధానము నుండి తప్పించుటకై అతడు స్వయముగ హింసాకాండకు దిగెను. ఇదంతయు అతనిదృష్టిలో అహింసా ప్రయోగమే! కాని అది ఫలించలేదు. ఇరువదియొక్క సార్లు అతడు క్షత్రియ సంహారము చేసెను. క్షత్రియులింకను మిగిలియేయుండిరి. ఏలయన ఈ ప్రయోగము మూలములోనే దోషయుతమై యుండెను. హింసావృత్తిగల క్షత్రియవర్గమును నిర్మూలింప దలచి చివరకు తాను ఆ వర్గములోనే చేరి పోయెను. ఇక క్షత్రియవర్గము నశించుటెట్లు? తానే హింసచేయు క్షత్రియు డయ్యెను. హింసాబీజము స్థిరముగనేయుండెను. బీజమును స్థిరముగనుంచి ఆకులను, కొమ్మలను కొట్టివేసినను చెట్టుమరలమరల చిగురించుచునే యుండును. పరశురాముడు గొప్పవాడే! కాని యతడు చేసిన ప్రయోగము బహువిచిత్రమైనది. తాను క్షత్రియుడుగ మారి పృథ్విని క్షత్రియరహితమును చేయదలచెను. తాను తనమీదనే ప్రయోగము ప్రారంభించి యుండిన బాగుం డెడిది. ముందతడు తనశిరస్సును ఛేదించుకొని యుండవలసినది. కాని నే నతనికంటె మిక్కిలి బుద్ధికలవాడనై అతని దోషమును చూపుచున్నానని భావింప రాదు. నేను బాలకుడను; కాని నేనతని భుజములపై నిలిచియున్నందు వలన సులువుగా ఎక్కువదూరము చూడగలుగుచున్నాను. పరశురాముని ప్రయోగము మూలములోనే దోషయుతమైనది. హింసామయుడై హింసను నివారించుట సంభవముగాదు. ఇందువలన హింసకుల సంఖ్యా క్షీణించుటకు బదులు విధిగా వృద్ధిచెందును. కాని ఆ సమయమున అతని కీ విషయము స్ఫురింపలేదు. ఆ కాలపు పెద్దలు, ప్రసిద్ధులయిన అహింసా వ్రతులు తమకు స్ఫురించిన రీతిని ప్రయోగములు చేసిరి. పరశురాము డానాటి అహింసావాదులలో మేటి. హింసింపవలెనను ఉద్దేశముతో అతడు హింసచేయలేదు. అహింసను స్థాపించుట కతడు హింసామార్గము నవలంబించెను.

కాని యతని ప్రయోగము నిష్ఫలమాయెను. తరువాత శ్రీరాముని యుగ ములో మరల బ్రాహ్మణులు ఆలోచింప మొదలిడిరి. వారు హింసను విడవాడిరి. 'స్వయముగ హింసాకాండకు దిగము' అని నిశ్చయించుకొనిరి. కాని రాక్షసుల

దురాక్రమణనుండి రక్షణకలుగు టెట్లు ? 'క్షత్రియులు హింసచేయువారే కదా! వారి చేతనే రాక్షససంహారము చేయించవలెను. ముల్లును ముల్లుతోనే తీయవలె. మనముమాత్రము ఆ జోలికి పోవలదు'' అని తలచిరి. అందువలన విశ్వామిత్రుడు యజ్ఞరక్షణార్థము రామలక్ష్మణులను తీసికొని వెళ్ళి వారిచే రాక్షస సంహారము చేయించెను. ''తన్నుతాను రక్షించుకోలేని అహింస నడువ కాళ్ళు లేనిది. అట్టి కుంటియహింస ఎట్లు నిలువగలదు !'' అని ఈ నాటివారి యుద్దేశము. కాని క్షత్రియబలము ద్వారా తమ్ము రక్షించుకొనుటలో దోషమున్నదని విశ్వామిత్ర వసిష్ఠాదులకు తోచలేదు. కాని రామునివంటి క్షత్రియుడు వారికి లభించి యుండనిచో వారిగతి యేమికావలెను ? ''నేను మరణించుట కైనను సమ్మతింతునుగాని హింసమాత్రము చేయను'' అని విశ్వామిత్రు డనియుండెడివాడు. ఎందువలన ననగా హింసకవృత్తి నవలంబించి శత్రువులను హింసించు ప్రయోగములు చేసిచూచినవే. కనుక 'అహింసను విడనాడము' అను నిశ్చయము మాత్రమప్పటికి జరిగియుండెను. క్షత్రియులెవ్వరును లభించనిచో ఆ యహింసావాదులు 'మరణించుటయే మంచి'దను స్థితికివచ్చిరి. రాముడు విశ్వామిత్రుని వెంట వెళ్ళుచు ఈ యెముకలప్రోగు లెవరివి ?'' అని ప్రశ్నించెను. ''అహింసావ్రతులైన బ్రాహ్మణులు హింసావృత్తిగల రాక్షసులపై ప్రతీకారముచేయక చనిపోయిరి. ఇవి వారియెముకల ప్రోగులు'' అని విశ్వామిత్రుడు బదులు చెప్పెను. ఈ యహింసలో బ్రాహ్మణుల త్యాగముమాత్రము ఉన్నది. కాని తమకు కావలసిన రక్షణను వారితరుల నుండి అపేక్షించిరి. ఇట్టి దుర్బల స్థితిలో నున్నంతవరకు అహింసకు పూర్ణత్వము సిద్ధింపనేరదు.

తరువాత మహాత్ములు మూడవప్రయోగము చేసిరి. ''మా రక్షణకై ఇతరుల సాయమును మే మెప్పటికిని తీసికొనము. మా అహింసయే మమ్ము రక్షించును. ఇదే నిజమైన రక్షణ'' అని వారు నిశ్చయించుకొనిరి. వీరుచేసిన ఈ ప్రయోగములో వ్యక్తినిష్ఠ కనబడును. వారీవ్యక్తిగత ప్రయోగమును పరిపూర్ణస్థితికి తీసికొని వెళ్ళిరి. కాని చివర కది వ్యక్తిగత సాధనగనే నిలిచి పోయెను. హింసాపరులు సమాజముపై దాడిసలిపినప్పుడు ఆ సమాజ మీ మహాత్ముల యొద్దకువచ్చి ''ఇప్పుడు మాకర్తవ్యమేమి ?'' అని యడిగినచో బహుశః నిశ్చితమైన సమాధాన మేదియు వారిచ్చియుండ లేకపోదురు. వ్యక్తిగత జీవితములో పరిపూర్ణమగు అహింసను సాధించిన ఈ మహాత్ములు ''సోదరులారా! మీ సమస్యను తీర్చగల శక్తి మాకులేదు'' అని సమాధాన మిచ్చియుందురు. ఈ విధముగ మహాత్ములలోని బలహీనతను చూపుట నా బాల సాహసమే! కాని

వారి భుజములపై కూర్చుండి చూచుచున్న దానినే నేను చెప్పుచున్నాను. దీనికి వారు నన్ను క్షమించెదరుగాక! క్షమింతురుకూడ. ఏలయన వారు మహా క్షమాశీలురు. అహింసాసాధనముల ద్వారా సాముదాయిక ప్రయోగములు చేయవలెనను ప్రేరణ వారికి కలుగలేదనికూడ చెప్పలేము. కాని ఆనాటిపరిస్థితి అట్టి సాధనకు అనుకూలమని వారు తలచియుండక పోవచ్చును. వారుమాత్రము తమవఱకు తాను భిన్నభిన్న ప్రయోగములను చేసిరి. ఇట్టి వేరువేరు ప్రయోగముల వలననే శాస్త్ర మేర్పడును. ఇట్టి యనుభవముల సమ్మేళనమే శాస్త్రమగును.

మహాత్ముల వ్యక్తిగత ప్రయోగముల తరువాత ఈనాడు మనము నాల్గవ ప్రయోగమును చేయుచున్నాము. అదేమనగా, సమాజమంతయు కలిసి అహింసాసాధనలద్వారా హింసను ప్రతిఘటించుటయే! ఈ విధముగ నింతవరకు నాలుగు ప్రయోగములు జరిగినవి. ప్రతి ప్రయోగములోను అసంపూర్ణత ఉండనేయున్నది. వికాసక్రమములో నిది యనివార్యమే. కాని ఆయాకాలముల కాయాప్రయోగములు పూర్ణములేయని తలపవలెను. పదివేల సంవత్సరముల తరువాతి వారికి ఈనాటి అహింసాయుద్ధములో హింసాభాగము చాల గోచరింపగలదు. పరిశుద్ధమైన అహింసాసాధనలో నూతన ప్రయోగములు జరుగుచునేయుండును. భక్తి, జ్ఞాన, కర్మలకే కాక సమస్త సద్గుణములకును వికాసము కలుగుచునే యుండును. పూర్ణవస్తు వొక్కటే. అది పరమాత్మ. భగవద్గీతలోని పురుషోత్తమయోగము పూర్ణమైనది. కాని వ్యక్తిగత, సాముదాయిక సాధనలలో పూర్ణవికాస మింకను కలుగవలసియేయున్నది. ఋషివాక్యములకు గూడ నూతన వికాసము కలుగుచుండును. ఋషులు మంత్రద్రష్టలుగనే భావింపబడుచుండిరి. కాని కర్తలుకారు. ఏలయన, వారికి స్ఫురించినదే మంత్రముల కర్థమని చెప్పలేము. దర్శించినది మాత్రమే వారు చెప్పగలిగిరి. తరువాత కొంతకాలమునకు దానియర్థము మరింత స్పష్టముగ గోచరింపగలదు. వారికంటె ఇప్పుడు మనకు కొంత విశేషార్థము కనబడుచున్నదనిన ఇది మన ప్రయోజకత్వముకాదు. ఏలయన వారిని ఆధారముగా చేసికొనియే మనము ముందునకు సాగిపోవుచున్నాము. సద్గుణములన్నిటి యొక్క నిగ్గు తీసినచో అహింస వెలువడును. కనుకనే అహింసయొక్క వికాసమును గూర్చి ఇక్కడ వింతగా చెప్పుచున్నాను. ఇంతేకాక, మన మీరోజున అహింసాత్మకయుద్ధమున నియుక్తులమై యున్నాము. అందువలన ఈ యహింసాతత్త్వమెట్లు వికాసము చెందినదో మీకు విశదపరచితిని.

## 91. అహింసలో నొక మహాప్రయోగము మాంసాహార పరిత్యాగము

హింసకుల వలన దురాక్రమణ కలిగినప్పుడు అహింసాపరుడు తన్నుదానెట్లు రక్షించుకొనవలెనను విషయమును మనమింతవరకు చూచియున్నారము. ఇది యహింసా సాధనలో నొక భాగము. వ్యక్తులలో పరస్పర కలహములు బయలుదేరినప్పుడు అహింస యెట్లు వికాసమును బొందునను విషయమునుగూడ మనము చూచితిమి. కాని జగడములు మానవులకును పశువులకును మధ్య జరుగుచుండును. మనుష్యు లింతవరకు తమ పరస్పర కలహములను అంతరింపజేసికొనలేదు సరికదా, మీదుమిక్కిలి పశువులను తమ పొట్టను బెట్టుకొని బ్రతుకుచున్నారు. తమకంటె దుర్బలములగు జీవులను చంపి తినకుండ నుండలేక పోవుచున్నారు. వేలకొలది సంవత్సరములనుండి మానవుడు జీవించుచు వచ్చినను, తా నెట్లు జీవించవలెనో ఇంతవరకు ఆలోచన చేయలేదు. తాను మానవుడుగ బ్రతుకలేక పోవుచున్నాడు. కాని ఈ విషయమున గూడ కొంతవికాసము కలుగకపోలేదు. మనుష్యుడు పశువులను మాత్రమే చంపి తినిన కాల మొకటి యుండెను. కాని ఉత్తములు, బుద్ధిమంతులు అయిన వారికిది నచ్చక ఒక కట్టుబాటు చేసిరి. మాంసమే తినక తప్పనిచో యజ్ఞమున బలియీయబడిన పశువుల మాంసమునే తినవలెననిరి. హింసను నివారించుటయే దీనియుద్దేశము. పలువురు పూర్తిగ మాంసాహారమును వర్జించిరి. కాని పూర్తిగ వదలివేయలేనివారు భగవత్ప్రార్థనచేసి యజ్ఞములో భగవంతునికి నైవేద్యముగా నీయబడిన మాంసమును తినవచ్చు నను అనుమతిని పొందిరి. యజ్ఞములో మాత్రమే మాంసము తినవచ్చునను కట్టుబాటు చేయుటచేత హింస నిలిచిపోవునని ఆనాటిపెద్దలు తలచిరి. కాని అట్లుగాక కాలక్రమమున యజ్ఞమొక నిత్యకార్యక్రమ మాయెను. తమకు తోచినపు డెల్ల యజ్ఞములు చేయుచు మాంసభక్షణచేయ మొదలిడిరి. అప్పుడు బుద్ధభగవానుడు రంగమున ప్రవేశించి "మీరు మాంసము తినదలచినచో తినుడు. ఆ తినునది భగవంతుని పేర మాత్రము తినవలదు" అనెను. యజ్ఞముచేసి మాంసము తినుమన్నను, తినదలచినచో దేవునిపేర వలదన్నను — ఈ రెంటికిని మూలమున నున్న యుద్దేశ మొక్కటే! హింస నిలిచిపోవలెనని, ఏదో యొక విధమున ప్రజలు సంయమమార్గమునకు రావలెననియే ఇందలి భావము. యజ్ఞముచేసినను లేక మానినను, క్రమక్రమముగ మాంసభక్షణము త్యజించుటే మనము నేర్చుకొంటిమి.

ప్రపంచ చరిత్రలో నొక్క భారతదేశమునందే ఈ మహా ప్రయోగము చేయబడినది. కోట్లకొలదిగ ప్రజలు మాంసాహారమును విడిచి పెట్టిరి. మన మీనాడు మాంసభక్షణ చేయకుండుటలో మన గొప్పతనమేమియు లేదు. మన పూర్వుల పుణ్యమువలన మనము మాంస విసర్జనకు అలవాటుపడితిమి. కాని ఆదిఋషులు మాంసము తినెడివారని మనమిప్పుడు చెప్పుకొన్నను, ఎక్కడ నైన చదివినను మనకు ఆశ్చర్యము కల్గి "ఏమి యీ ప్రలాపము! ఋషులు కూడ మాంసము తినెడివారా? వట్టిమాట!" అని యందుము. కాని మాంస భక్షణచేయుచునే సంయమసాధనవలన వారు దానిని విడిచిపెట్టిరి. ఇది వారి పుణ్యము. ఆ కష్టానుభవములు నేడు మనకు లేవు. దాని పుణ్య మనాయాస ముగ మనకు లభించినది. భవభూతి – ఉత్తర రామచరిత్రలో ఒక ప్రసంగ మున్నది. వాల్మీకి – ఆశ్రమమున కొకనాడు వసిష్ఠుడు వచ్చెను. అతని కాతిథ్య మిచ్చుటకు ఒక లేగదూడ చంపబడెను. దీనినిగూర్చి ఒక చిన్న బాలుడు ఒక పెద్దపిల్లవానితో "ఈ రోజున మన యాశ్రమమున కొక గడ్డపులి వచ్చి మన ఆవుదూడను తినివేసినది తెలియునా?" అనెను. అంతట పెద్దవాడు "నోటికి వచ్చినట్లు వాగకు; అయన వసిష్ఠమహర్షి" అని జవాబిచ్చెను. మన పూర్వులు మాంసభక్షణ చేసినను మనమిప్పుడు చేయుటలేదనిన మనము వారి కంటె గొప్ప వారమని అర్థముకాదు. వారి యనుభవ లాభము అనాయాసముగ మనకు లభించినది. మనము వారి యనుభవ లాభమున కింకను వికాసమును కలిగింపవలెను. మనము పాలను పూర్తిగ వర్జించు ప్రయోగమునుకూడ చేయ వలెను. మనుష్యుడు జంతువుల పాలను త్రాగుట అనుచితమే. పదివేల సంవత్సరముల తరువాత జన్మించువారు మనలను గూర్చి 'మనపూర్వులు 'పాలుత్రాగము' అనువ్రతము తీసికొనవలసి వచ్చెనా? రామ, రామ! వారసలు పాలెట్లు త్రాగెడివారో! ఇంత అడవిమనుష్యులా వారు?" అని యందురు. సారాంశమిది: మనము నిర్భయులమై నమ్రతా పూర్వకముగ మన ప్రయోగము లను చేయుచు, నిరంతరమును ముందునకు సాగిపోవుచుండవలెను. సత్యము యొక్క ఆవరణను విశాలము చేసికొనుచు పోవలె. ఏసద్గుణమైనను పూర్ణవికాస మును పొందలేదు. వికాసమునకింకను అపారమైన అవకాశమున్నది.

**92. అసురసంపదయొక్క బలిష్ఠమైన మూడు కోరికలు : సత్త, సంస్కృతి, సంపద**

మనము దైవసంపదను వికసింపజేయవలె. అసురసంపదకు దూరముగా నుండవలె. అసురసంపదనుండి మనము దూరముగ నుండగలందులకే భగ

వంతుడు దాని నిక్కడవర్ణించినాడు. ఇందు మూడు విషయములే ముఖ్యమైనవి. అసురులచరిత్రయొక్క సారమంతయు 'సత్త, సంస్కృతి, సంపద'- ఈ మూటిలో నున్నది. తమసంస్కృతి యొక్కటే గొప్పదని, దానినే ప్రపంచ మందందఱు మీదనువేసి రుద్దవలెనని వారు గట్టిగ కోరుచుందురు. "తమసంస్కృతిని ఇతరులపై ఎందులకు రుద్దవలె ?" అని యన్నచో అది యన్నిటికంటెను మంచిది కనుక" అని యందురు. "ఇదే మంచిదని యెందులకనవలె ? నన్నచో "అది మాది కనుక" అని యందురు. అసురత్వము ఒకవ్యక్తిలోనిదైనను, వ్యక్తులకూటమైన ఒక సామ్రాజ్యములోనిదైనను అది వర్ధిల్లుటకు పై మూడు వస్తువులును అవసరము.

తమ సంస్కృతి సర్వశ్రేష్ఠమని, జ్ఞానమంతయు తమవేదములో నిండియున్నదని, వైదికసంస్కృతి సర్వప్రపంచమునను విజయము పొందవలెనని బ్రాహ్మణు లనుకొందురు.

"అగ్రతశ్చతురో వేదాన్ పృష్ఠతః సశరం ధనుః"-

ఇట్లుండి ప్రపంచమం దెల్ల నీ సంస్కృతి యొక్క జెండాను ఎగురవేయుము. కాని ధనుస్సును అమ్ములపొదిని ధరించి ప్రచారముచేయుట, చేతనున్న వేదములను హత్యచేయుటయే యని తెలిసికొనుము. మునల్మానులు కూడ ఖురాన్‌షరీఫ్‌లో వ్రాయబడినదే సత్యమని నమ్ముదురు. క్రైస్తవులును తమ మతముపట్ల ఇట్లే తలచెదరు. అన్యమతస్థు డెంత ఉత్తముడైనను, ఏసు ప్రభువుపై విశ్వాసము కలిగినకాని స్వర్గమునకు పోజాలడని వారి మతము. దేవుని మందిరమున కొక్కటే ద్వారమని, అది యేసుద్వారమని వారిభావన. మనుష్యులు తమయిండ్లకు అనేక ద్వారములు, కిటికీలు పెట్టుకొందురు. కాని, పాపము! దేవుని మందిరమునకు మాత్రము వారు పెట్టుకొన్నది ఒకద్వారమే! 'నే నే కులీనుడను. నే నే శ్రీమంతుడను నాకుసాటి యెందునులేరు' అందరును ఇట్లే భావింతురు. 'నే నెవడను? భరద్వాజ సంతతివాడను. ఈ నా వంశపరంపర అఖండముగ నడచిపోవుచున్నది." అని యనును. పాశ్చాత్యులస్థితి కూడ ఇట్టిదే. తమ రక్తనాళములలో 'నార్మను'లరక్తము ప్రవహించుచున్నదని వారందురు. మనసంప్రదాయములో గురుపరంపర ఉన్నదేకదా! అదిగురువు శంకరుడు, తరువాత బ్రహ్మదేవుడు, లేక మరొకడు, తరువాత నారదుడు, వ్యాసుడు, తరువాత మరియొకఋషి, తరువాత పదునైదుపేర్లను స్మరించి, చివరకు తనగురువు, అతని శిష్యుడైన తాను ఈ విధముగ తనపరంపరను

వి కరువుపెట్టును. వంశావళి నిట్లు చెప్పుకొని తాను ఘనుడనని, తన సంతతి గొప్పదని స్థిరపరుచుటయే వాని యుద్దేశము. సోదరా! నీ సంస్కృతియే గొప్ప దైనచో దానిని నీ యాచరణలో చూపరాదా! దాని ప్రభావమును నీ జీవితములో వ్యాపింపజేయరాదా! కాని అట్లు జరుగుటలేదు. మన జీవితములోను, మన గృహములోను వాడుకలోనికిరాని ఈ సంస్కృతిని ప్రపంచమందెల్ల వ్యాపింప జేయవలెనను కాంక్షనే అసురసంపద యందుము.

నా సంస్కృతి సుందరము, శ్రేష్ఠము అని తలచినట్లే ప్రపంచములోని సంపదకెల్లను అధికారిని నేనే యని తలచుట అసురవృత్తి లక్షణము. "లోకము లోని ఐశ్వర్యము సర్వము నాకు కావలె, దానిని నేను పొంది తీరుదును. ఎందు లకు ? అందరికిని సమానముగ పంచిపెట్టుటకు ఇదంతయు నా కవసరము" అని యతడు తలచును. అక్బరుకూడ ఇట్లే యనెను–"ఈ రాజపుత్రులింకను నా సామ్రాజ్యములో కలియరేమి ? అంతయు మహాసామ్రాజ్యమగుచో ప్రపంచ మున శాంతి సుస్థిరమగును కదా!" పాప మత డట్లు నమ్మియుండును. ఈ నాటి అసురుల అభిప్రాయముకూడ ఇట్టిదే. ప్రపంచ సంపదనెల్ల నొకచోటికే యేల ప్రోగుచేయవలె ? నని యన్నచో దాని నందరికిని పంచిపెట్టుటకే యని వా రందురు.

"ఇందులకు నాకు సత్త (అధికారము) అవసరము. అధికారమంతయు ఒక్కని హస్తగతమై యుండవలె. ప్రపంచమంతయు నా చేతిలోనికి రావలెను. స్వ-తంత్రము–నా తంత్రము ననుసరించి నడువవలెను. నా వశములోనుండి, నా తంత్రము ననుసరించి నడచునదే స్వతంత్రము"–ఈ విధముగ సంస్కృతి, సత్త, సంపద-ఈమూడును అసురసంపదలో ముఖ్యములుగ పరిగణింపబడును.

ఒకప్పుడు సమాజములో బ్రాహ్మణుల ప్రభుత్వము చలామణి యగు చుండెను. వారు ధర్మశాస్త్రములలోని శాసనములను రచించుచుండిరి. రాజులు వారిని గౌరవించుచుండిరి. ఆ యుగము మారి క్షత్రియ యుగము వచ్చెను. క్షత్రి యులు అశ్వమేధయాగములనుచేసి దిగ్విజయమును పొందుచుండిరి. ఈ క్షత్రియ సంస్కృతికూడ కొంతకాలమునుండి అంతరించినది. "నేను విద్యను ప్రసాదించువాడను, ఇతరులు విద్యను గ్రహించువారు. నేనుతప్ప మరి గురు వెవరు ?" అని బ్రాహ్మణు డనుచుండెను. తమ సంస్కృతిపట్ల బ్రాహ్మణుల కింత అభిమానముండెడిది. క్షత్రియులశక్తి అధికారముపై నాధారపడియుండెను. "ఈ రోజున ఇతనిని చంపితిని, రే పతనిని చంపుదును"–ఇదే వీరిధోరణి. తదు

వరి వైశ్యులయుగము వచ్చెను. సంపదను సేకరించుటయే వీరిమతము. "వెన్ను మీద కొట్టుడు; కాని పొట్టమీదమాత్రము కొట్టవలదు" – ఇదే వారికి తెలిసిన తత్త్వజ్ఞానము. వారి తత్త్వజ్ఞానము, తెలివితేటలు అన్నియు పొట్టకొఱకే. "ఈ ధనమునాది, అదికూడ నాది కాగలదు" – వారి కిదే సంకల్పము, ఇదే జపము. "స్వరాజ్యము కావలసినచో తీసికొనుడు; కాని మేము తయారుచేసిన వస్తువుల నమ్ముకొనుసౌకర్యము మాకిచ్చి, తదుపరి మీ సంస్కృతి విషయము మీరు చూచుకొనుడు. మీరు కౌపీనము ధరించి 'మా సంస్కృతి, మా సంస్కృతి' యని జపించుచు కూర్చుండుడు" అని ఆంగ్లేయులు మనతో చెప్పలేదా? ఈ నాడు జరుగు యుద్ధములన్నియు వ్యాపారముకొరకే. ఈ యుగముకూడ మారి పోవును. మార్పుకూడ ప్రారంభమయినది. అసురసంపదయొక్క విధానము లిట్లుండును.

**93.** కామక్రోధములనుండి విముక్తికై శాస్త్రీయ సంయమ మార్గము

మనము అసురసంపదను దూరముగ త్రోసివేయుదముగాక! క్లుప్తముగ చెప్పవలెనన్న అసురసంపదయొక్క అర్థము "కామము క్రోధము, లోభము." ఈ మూడే ప్రపంచమునెల్లను ఆడించుచున్నవి. ఈ ఆట కట్టించవలె. దీనినుండి మనము తప్పుకొనవలసియున్నారము. క్రోధలోభములు కామమునుండి ఉద్భవించును. కామమునకు అనుకూలపరిస్థితి యేర్పడినప్పుడు లోభమును, ప్రతికూలత యేర్పడినప్పుడు క్రోధమును జనించును. ఈ మూటినుండియు తప్పించుకొనుమని గీత అడుగడుగునను హెచ్చరించుచున్నది. కామ, క్రోధ లోభములే నరకమునకు మూడు పెద్దద్వారములని పదునారవ అధ్యాయముచివర చెప్పబడినది. వీనిలో పెక్కుబాటలుకలవు. వీనిద్వారా చాలమందివచ్చుచు పోవుచునుందురు. నరకమునకున్నబాట చాల విశాలమైనది. దానియందు మోటారులు పోవుచుండును. దారిలో చాలమంది సహయాత్రికులుకూడ లభించుచుందురు. కాని సత్యమార్గము ఇరుకైనది.

కాగా ఈ కామ క్రోధ లోభములనుండి తప్పుకొనుటకు శాస్త్రీయమైన సంయమమార్గమును పట్టుకొనవలె. మహాత్ముల అనుభవమే శాస్త్రము. ప్రయోగములద్వారా మహాపురుషులకు లభించిన అనుభవమునుండియే శాస్త్ర మేర్పడును. కనుక ఈ సంయమ సిద్ధాంతము నాశ్రయింపుము. ఊరక కుశంకలు పెట్టుకొనకుము. "కామక్రోధములు నశించిపోయినచో ప్రపంచము గతి యేమికావలె. లోకవ్యవహారము జరుగుచుండవలెగదా! కామ క్రోధములు

కొంచెమైనను ఉండవలదా !" అనెడి కుశంకలు మాత్రము దయచేసి పెట్టుకొనకుడు. సోదరులారా ! కామ క్రోధములు అదినుండియు పుష్కలముగనే యున్నవి. అవి మనకు కావలసినయంతకంటె ఎంతో ఎక్కువగ నున్నవి. ఇక వ్యర్థముగ బుద్ధిభేద మెందులకు కల్పించెదరు ? కామ క్రోధ లోభములు కావలసినంతకంటె బెత్తెడు హెచ్చుగనే ప్రపంచమున నున్నవి. కామము నశించినచో సంతానమెట్లు కలుగునని చింతింపకుడు. మీరు సంతానము నెంతగా వృద్ధిపరచినను, మనుష్యు డీ పృధ్వినుండి నామరూపములు లేకుండ నశించిపోవురోజు రానేవచ్చునని శాస్త్రజ్ఞులు, విజ్ఞానవేత్తలు చెప్పుచుందురు. భూమి నెమ్మది నెమ్మదిగా చల్లబడి పోవుచున్నది. ఒకప్పు డీ భూగోళము చాల ఉష్ణముగ నుండెను. అప్పుడు దానిమీద జీవరాసు లేవియు ఉండెడివి కావు. అప్పటి కీ ప్రాణికోటి పుట్టనేలేదు. పృధ్వి పూర్తిగా చల్లబడిపోయి జీవరాసు లన్నియు లయమై పోవు సమయము ఎప్పుడో రానున్నది. కాని దీనికి లక్ష సంవత్సరములు పట్టును. మీ రెంతగా సంతానమును వృద్ధిచేసినను చివరకు ఈ ప్రళయము తప్పదు. పరమేశ్వరుడు అవతార మెత్తుట ధర్మ సంరక్షణ కొరకుకాని జనసంఖ్యను నిలువబెట్టుటకుకాదు. ధర్మపరాయణుడు, పాపభీతి సత్యనిష్ఠకలవాడు ఒక్కడైనను ఉన్నంతవరకు చింతింపవలసిన పనిలేదు. ఈశ్వరదృష్టి వానిపై ఉండనేయుండును. ధర్మచ్యుతులు వేలకొలదిమంది ఉన్ననేమి ? పోయిననేమి ? రెండును సమానమే.

పై విషయమును జ్ఞప్తియందుంచుకొని నియమానుసారము సంయమముతో జీవితయాత్రను గడపుడు. హద్దుమీరి అవివేకముతో పరుగెత్తకుడు. లోకకళ్యాణమనగా లోకులెట్లు చేయుమనిన అట్లు చేయుటకాదు. మానవ సంఘమును పెంపొందించుట, సంపదను కుప్పతిప్పలుగ ప్రోగుచేయుట సంఘసంస్కరణ కానేరదు. వికాసము సంఖ్యాబాహుళ్యముపై ఆధారపడి యుండదు. సమాజము హద్దుమీరి పెరిగిపోయినచో ప్రజ లొకరినొకరు హత్య చేయ నారంభింతురు. మొదట పశుపక్ష్యాదులను తిని మనుష్యుడు బలిష్ఠుడగును. తరువాత తన బిడ్డలనే తిని జీవింపవలసివచ్చును. కామ క్రోధములలో కొంత సారమున్నదని మనము ఒప్పుకొనినచో చివరకు మానవు లొకరి నొకరు చీల్చుకొని తినెద రనుటలో తిలమాత్రమైన సందేహములేదు. సుందరమును విశుద్ధమును అయిన నీతి మార్గమును తోడి మానవులకు చూపుటయే లోక కళ్యాణ మనబడును. కామక్రోధములు లోపించిన కారణముచే పృధ్వినైగల

మానవజాతి అంతరించి పోవుచో చింతింప బనిలేదు. కావలెననిన భగవంతుడు మానవజాతిని ఏ యంగార గ్రహమునందో పుట్టించగలడు. అవ్యక్తుడైన పరమేశ్వరుడు సర్వత్ర వ్యాపించియే యున్నాడు. మన యోగక్షేమము నతడు విచారించును. కనుక ముందు మనము వ్యక్తులమయ్యెదముగాక! భవిష్యత్తును గురించి మనము బెంగపడవలసిన పనిలేదు. మానవజాతిని, సృష్టినెల్లను గూర్చిన చింత మీరు పెట్టుకొనవలదు. మీ నైతికశక్తిని పెంచుకొనుడు. మిమ్మాశ్రయించిన కామక్రోధములను విదిలించి పారవేయుడు.

"మీ కంఠమున చుట్టుకొనిన ఉరిత్రాటిని మొదట విడిపించు కొనుడు." ఇంతవరకు సాధింపగలిగినచో చాలవరకు నెగ్గినట్లే.

సంసారమనెడు సముద్రమునకు దూరముగ గట్టుపై నిలబడి ఆ సముద్రముయొక్క సౌందర్యమును దర్శించుటలో ఆనందమున్నది. సముద్రములో మునిగినవానికి, ముక్కున, నోట నీరు నిండినవానికి సముద్ర మేమి ఆనంద మిచ్చును? మహాత్ములు ఈ సంసార సాగరపు టొడ్డున నిలబడి ఆనందమును చూరగొందురు. సంసారమున నుండియు నిర్లిప్తముగ నుండు ఈ పుణ్యవృత్తి జీవితమున వ్యాపించనిచో ఆనందము కలుగనేరదు. కనుక తామరాకుపై నీటి బొట్టువలె నిర్లిప్తులుగ నుండుడు. బుద్ధు డిట్లన్నాడు:– "మహాత్ములు పర్వత శిఖరముపై నిలబడి క్రింది ప్రపంచమును చూచుచుందురు. అప్పుడు ప్రపంచము వారికి క్షుద్రముగ తోచును. మీరుకూడ పైకెక్కి చూచినచో ఈ విశాల ప్రపంచము క్షుద్రముగ కనబడును. మరల ప్రపంచ విషయముల మీదికి మీ మనస్సు పోనేరదు."

సారాంశమిది : అసురసంపదను తొలగించుకొని దైవసంపదను లభింపజేసికొనుడని భగవంతు డీయధ్యాయములో నొక్కి చెప్పినాడు. రండు! మన మట్లే ప్రయత్నించెదముగాక! (5–6–32)

# పదునేడవ అధ్యాయము

## అనుబంధము 2 : సాధకుని కార్యక్రమము

### 94. కట్టుబాటుగల నడవడి

ప్రియసోదరులారా! మనము మెల్లమెల్లగా భగవద్గీత చివరకు చేరుకొన్నారము. పదునేడవ అధ్యాయములో జీవితముయొక్క సంపూర్ణశాస్త్రమును

అవలోకించితిమి. పదునారవ అధ్యాయములో మొదటి యనుబంధమును చూచితిమి. మానవుని మనస్సులోను, మనస్సుయొక్క ప్రతిబింబమైన సమాజములోను రెండువృత్తుల, రెండు సంస్కృతుల లేక రెండుసంపదల నడుమ పోరాటము జరుగుచుండును. ఈ రెంటిలో దైవసంపదను మనము వికసింపజేసికొనవలె. ఈ శిక్షణ అనుబంధరూపమైన పదునాఱవ అధ్యాయములో మనకు లభించినది. ఈ రోజున పదునేడవ అధ్యాయములో మనము రెండవ అనుబంధమును చూడనున్నారము. ఒక దృష్టిలో ఇందు కార్యక్రమయోగము చెప్పబడినదని యనుకొనవచ్చును. గీత యీ యధ్యాయములో అనుదిన కార్యక్రమమును సూచించుచున్నది. నేటి యధ్యాయములో మనము నిత్యమును ఆచరించు క్రియలను గూర్చి ఆలోచింపవలెను.

మన మనోవృత్తి నిర్లిప్తముగను, ప్రసన్నముగను ఉండవలెనినచో మనవ్యవహారములన్నియు ఒక క్రమవిధానమునకు కట్టువడి యుండవలెను. మన నిత్యకార్యక్రమము ఏదోయొక నిర్దిష్టమైన సూత్రముపై నడువవలెను. మనజీవితము నిశ్చితమైన నీతి నియమములకు కట్టువడి నడచుచున్నపుడే మనసు నిర్లిప్తముగ నుండగలదు. నది స్వేచ్ఛగా ప్రవహించుచుండును. కాని దాని ప్రవాహము కట్టల నడుమ బంధింపబడియుండును. అది యట్లుండనిచో దాని స్వాతంత్ర్యము వ్యర్థమైపోవును. జ్ఞానుల నిచట నుదాహరణగా గుర్తునకు తెచ్చుకొనుడు. సూర్యుడు జ్ఞానులకు ఆచార్యుడు. భగవంతుడు ప్రప్రథమమున కర్మయోగమును సూర్యునకు నేర్పెను. తరువాత సూర్యునినుండి మనువునకు—అనగా ఆలోచన చేయగల మనుష్యునకది ప్రాప్తమయ్యెను. సూర్యుడు స్వతంత్రుడు, ముక్తుడు. అతడు నియమబద్ధుడు. అతని స్వాతంత్ర్యముయొక్క సారము ఇందులోనే యున్నది. తెలిసినమార్గమున వాహ్యాళికి పోవుచో దారితప్పుదుమను భయములేకుండ, మనసుతో నేదైన విషయమును గూర్చి చింతన చేయుచు గూడ మనము తిరిగి రాగలము. ఇది మనకు అనుభవసిద్ధమైన సత్యము. అట్లుగాక ఎప్పటికప్పుడు నూతనమార్గమున వాహ్యాళికి వెళ్ళుచో, మనదృష్టియంతయు మార్గముమీదనే కేంద్రీకరింపవలసి వచ్చును. ఇక మనస్సుతో స్వతంత్రముగ ఆలోచించుటకు అవకాశమెక్కడ? కావుననే జీవితము భారముకాకుండ ఆనందమయము కావలెనినచో మన వ్యవహారములను కట్టుబాటులో పెట్టుకొనవలె.

ఇందుచే భగవంతుడీ యధ్యాయములో కార్యక్రమమును తెలియబరుచు చున్నాడు. జన్మసిద్ధముగనే మనము మూడు సంస్థలను వెంట దీసికొని ఈ లోకములోనికి వచ్చుచున్నాము. ఈ మూడు సంస్థలకును సంబంధించిన కార్యములను చక్కగ నెరవేర్చి మానవుడు తన జీవితమును సుఖమయము చేసికొనగల్గుటకై గీత ఈ కార్యక్రమము నేర్పరచినది. ఆ మూడు సంస్థలేవి? మనలను గట్టిగా అంటిపెట్టుకొనియున్న ఈ శరీరమే అందు మొదటిసంస్థ. మన చుట్టును వ్యాపించియున్న ఈ విశాల బ్రహ్మాండము రెండవసంస్థ. ఇందు మన మొక అంశము మాత్రమే! మనము జన్మించిన ఈ సమాజము, మన జన్మకై నిరీక్షించి మనలగన్న తల్లిదండ్రులు, సోదరీ సోదరులు, ఇరుగు పొరుగువారు–వీరందరును మూడవసంస్థ. మనము ప్రతిదినమును ఈ మూడు సంస్థలనుండి ఉపకారమును పొందుచున్నాము. ఇట్లే మూటికిని మనవలన అరుగుదల కలుగుచున్నది. మనవలన ఈ సంస్థలకు కలుగుచున్న లోటును పూర్తిచేయుటకు మనము సతతమును ప్రయత్నింపవలెననియు, జీవితమును సఫలపరుచుకొనవలెననియు గీత కోరుచున్నది. జన్మసిద్ధముగ మనకీ సంస్థల యెడల నేర్పడిన ఈ కర్తవ్యమును నిరహంకార భావముతో నెరవేర్చవలెను.

ఈ కర్తవ్యములను మనము పూర్ణముగ నెరవేర్చవలెను. కాని దీని ప్రణాళిక ఎట్లుండవలెను? యజ్ఞము, దానము, తపస్సు – ఈ మూడింటి సంయోగమువలననే ఆ కార్యక్రమము ఏర్పడుచున్నది. ఈ మూడు శబ్దములును మనకు పరిచితమైనవే యైనను వీని యర్థము మనకు బాగుగా తెలియదు. మనము వీని యర్థమును తెలిసికొని, వీనిని మన జీవితములో ఆచరించినచో ఈ సంస్థలు సఫలీకృతములు కాగలవు. మన జీవితములుకూడ నిర్లిప్తములు, ప్రసన్నములు అగును.

**95.** నియమబద్ధమైన వ్యవహారమువలన మనోవృత్తి నిర్లిప్తమగును; ఇందులకై త్రివిధ క్రియాయోగము

యజ్ఞ, దాన, తపస్సుల అర్థము తెలియవలెననిన యజ్ఞమన నేమో ముందుగా మనము గ్రహించవలెను. సృష్టి సంస్థనుండి మన మనుదినమును ఉపకారమును పొందుచున్నాము. వందమంది యొకచోట కలిసియున్నచో మరునాటికి అక్కడి వాతావరణమంతయు కలుషితమగును. అక్కడి గాలినెల్లను మనము మైలపరచెదము. ఆ ప్రదేశమునెల్ల మలినమును గావింతుము. ఆహార పదార్థములను భుజించి సృష్టికిగూడ కొరత వాటిల్ల జేయుచున్నాము. ఇట్లు సృష్టి

సంస్థకు కలుగు లోటును మనము తొలగింపవలెను. ఇందుచేతనే యజ్ఞ సంస్థ నిర్మితమైనది. యజ్ఞముయొక్క ఉద్దేశమేమి ? సృష్టికి కలిగిన లోటును తొలగించుటయే యజ్ఞము. వేలకొలది సంవత్సరములనుండి మనము భూమిని దున్ని సేద్యము చేయుటవలన దానిసారము క్రమేణ తగ్గిపోవుచున్నది. "భూమియొక్క సారము తిరిగి దానికిమ్ము; భూమినిదున్ని దానికి సూర్యరశ్మి బాగుగా తగులనిమ్ము. మంచి యెరువు వేయుము" అని యజ్ఞమనును. లోటును తొలగించుటయే యజ్ఞములోని ఒక యుద్దేశము. ఉపయోగింప బడిన వస్తువుల శుద్ధపరచుట రెండవ యుద్దేశము. మనము నూతిని ఉపయోగించుకొందుము. దాని చుట్టును నీరునిలిచి బురదయగును. ఈ విధముగ మలినమైన ప్రదేశమును పరిశుభ్రము చేయవలెను. బురదగుంటలోని నీటిని తీసివేసి బురద లేకుండ చేయవలెను. కలిగిన నష్టమును తొలగించి, పరిశుభ్రము చేయుటతో పాటు ప్రత్యక్షముగ కొంత నిర్మాణ కార్యమునుకూడ చేయవలెను. ఈ మూడవ విషయముకూడ యజ్ఞములో అంతర్భాగమే. మనము వస్త్రములను ధరింతుము. కనుక మనము అనుదినమును నూలు వడికి నూతన నిర్మాణము చేయవలెను. ప్రత్తి పండించుట, ధాన్యము పండించుట, నూలు వడుకుట — ఇవికూడ యజ్ఞకార్యములే. యజ్ఞముద్వారా మనముచేయు నిర్మాణము స్వార్థముకొరకుకాదు. మనము సృష్టికి కలిగించు నష్టమును తొలగింపవలెనను కర్తవ్యభావన దానిలో నిండియుండవలె. ఇది పరోపకారముకాదు. మనము ఆదినుండియు సృష్టికి ఋణపడియున్నారము. జన్మసిద్ధముగనే మనము ఋణస్థులమై ఈ ప్రపంచములోనికి వచ్చితిమి. ఈ ఋణవిముక్తికొరకు మనము చేయు నిర్మాణకార్యమే యజ్ఞము — లేక సేవ. అది పరోపకారముకాదు. ఆ సేవ ద్వారా మనము మనఋణమును తీర్చుకొనుచున్నాము. మనము అడుగడుగునను సృష్టి సంస్థను ఉపయోగించుకొనుచున్నాము. కనుక తన్మూలమున సృష్టికి జరుగు హానిని తొలగించుటకును, సృష్టిని పరిశుద్ధముచేయుటకును, నూతన వస్తునిర్మాణముకొఱకును యజ్ఞము నాచరింపవలసియున్నది.

రెండవసంస్థ మానవసమాజము. తల్లిదండ్రులు, గురువు, మిత్రుడు— వీరందరును మనకొఱకు శ్రమచేయుచున్నారు. ఈ ఋణమును తీర్చుకొనుటకు దానమను వ్యవస్థ యేర్పరుపబడినది. సమాజఋణమును తీర్చుకొనుటకు చేయబడు ప్రయోగమునే దానమందురు. దానమనిన పరోపకారముకాదు. సమాజమునుండి నేను అపారముగా సేవను పొందియుంటిని. నే నీ ప్రపంచములోనికి

దుర్బలుడుగను, అసహాయుడుగను వచ్చియుంటిని. పసిపాపగ వచ్చిన నన్ను ఈ సమాజము పోషించి పెద్దవానిని చేసినది. ఇందుచేత నేను సమాజసేవ చేయ వలసియున్నాను. ఇతరులనుండి ఏమియు పొందకుండ చేయుసేవనే పరోపకార మందురు. కాని యిక్కడ మనము బాల్యముననే సమాజమునుండి పుష్కల ముగ సేవను పొందియుంటిమి. ఈ సమాజ ఋణమును తీర్చుకొనుటకు చేయ బడుసేవయే దానమనబడును. మానవసమాజము పురోగమించుటకు సాయపడు టయే దానము. సృష్టికి కలుగు హానిని తొలగించుటకు చేయుశ్రమను యజ్ఞ మనియు, సమాజ ఋణమును తీర్చుటకు శరీరము, మనస్సు, ధనము మొద లగు సాధనములచేత చేయు సాహాయ్యమును దానమనియు తెలియనగును.

ఇవిగాక మూడవసంస్థ మరియొకటి కలదు. అది శరీరము. శరీరముకూడ దినదినము అరిగిపోవుచుండును. మనస్సు, బుద్ధి, ఇంద్రియములు మన పను లకై ఉపయోగపడుచు అరిగిపోవుచుండును. శరీరమను సంస్థకు కలుగు వికారములను, దోషములను తొలగించి, శరీరమును పరిశుద్ధము చేసికొనుటకు తపస్సు చెప్పబడినది.

ఈ విధముగ సృష్టి, సమాజము, శరీరము—ఈ మూడువ్యవస్థల కార్యము లను ఉత్కృష్టమగురీతిని జరుపుకొనుట మన కర్తవ్యము. మనము యోగ్య ములు అయోగ్యములు అయిన అనేక సంస్థలను నిర్మించుచుందుము. కాని ఈ మూడుసంస్థలు మాత్రము మానవ నిర్మితములుకావు. ఇవి స్వభావసిద్ధముగనే మనకు ప్రాప్తమైనవి. ఈ సంస్థలు కృత్రిమములుకావు! కనుక ఈ మూడు సంసలకును కలుగుహానిని యజ్ఞదానతపము లను సాధనలవలన తొలగించుట మనకు సహజ ప్రాప్తమైన ధర్మము. మన మీ మార్గము ననుసరించినచో మన శక్తియంతయు దీనిలో వినియోగపడును. సృష్టి, సమాజము, శరీరము — ఈ మూటిని ఉచితస్థితిలో నుంచుటకు యావచ్ఛక్తిని వినియోగపరుపవలసి యున్నది. కబీరువలెనే మనముకూడ "ఓ ప్రభూ! నీవు నాకు శరీర మనెడు సుందరమగు దుప్పటిని అనుగ్రహించితివి. దానిని అస్థితిలోనే తిరిగి నీకిచ్చి పోవుచున్నాను. ఇక దీనిని గూర్చిన జాగ్రత్తనీదే" అని చెప్పకొనగలిగినచో జీవితమెంతో సఫలమైనట్లు. కాని ఇట్టి సఫలతను పొందుటకు యజ్ఞ, దాన, తపము లను త్రివిధ కార్యక్రమమును యథావిధిగ నెరవేర్పవలెను.

యజ దానతపములను మనమిక్కడ వేరువేరువస్తువులుగ భావించితిమి. కాని నిజమునకు వీనిలో భేదమేలేదు. ఎందువలన ననగా సృష్టి, సమాజము,

శరీరము భిన్నభిన్నసంస్థలు కానేకావు. ఈ సమాజము సృష్టికి వెలుపలలేదు. శరీరముకూడ సృష్టికి వెలుపలిదికాదు. ఈ మూడును కలియుటచే ఒక భవ్యమైన సృష్టి సంస్థ నిర్మితమగుచున్నది. ఇందుచేతనే మనముచేయు నిర్మాణాత్మక శ్రమయంతయు, ఇచ్చు దానము లన్నియు, చేయు తపస్సంతయు కలిపి విశాలదృష్టిలో యజ్ఞమనియే అనవచ్చును. గీత నాల్గవ అధ్యాయములో ద్రవ్య యజ్ఞము, తపోయజ్ఞము మొదలైన యజ్ఞములనుచెప్పి యజ్ఞముయొక్క అర్థమును విశాలపరచినది.

ఈ మూడు సంస్థల కొఱకును మనము చేయు కర్మలన్నియు యజ్ఞరూపమునే పొందును. ఆ సేవా కార్యములలో మనము ఫలాపేక్షను ఏ మాత్రమును రానీయరాదు. ఏలయన ఫలమును మనము మొదటనే పొందితిమి. కాన మొదటనే ఆ ఋణము మనపై బడియున్నది. ఆ ఋణమును తీర్చుకొనుటయే మన కర్తవ్యము. యజ్ఞమువలన సృష్టి సంస్థలో సమత్వము ప్రాప్తించును. దానమువలన సమాజములో సమత్వమేర్పడును. తపస్సువలన శరీరములో సమత్వము సిద్ధించును. ఈ విధముగ మూడు సంస్థలలో సమత్వమును నెలకొల్పుటకు ఈ కార్యక్రమము తోడ్పడును. దీని వలన దోషములు తొలగి శుద్ధి కలుగును.

మనము సేవచేయగల్గుటకు కొంతభోగమునుకూడ అనుభవింప వలయును. భోగముకూడ యజ్ఞములో నొక భాగమే. ఈ భోగమును గీత ఆహారమనును. శరీర మను యంత్రమునకు అన్న మను బొగ్గు వేయవలె. ఈ యాహారము యజ్ఞము కాకపోయినను, యజ్ఞమును సిద్ధింపజేయుట కిదియొక ముఖ్య సాధనము. కావుననే మనము 'ఇది యుదరపోషణకాదని, యజ్ఞకర్మయని తెలిపికొనుము' అని యందుము. తోటనుండి పుష్పములను తెచ్చి దేవుని శిరస్సుపై నుంచుటను పూజయందురు. కాని పువ్వులు పూచుటకు తోటలోచేయు పరిశ్రమకూడ పూజయే. యజ్ఞపూర్తికి చేయు పనులుకూడ ఒకవిధమైన పూజయే. శరీరమునకు కావలసిన ఆహారము నిచ్చినప్పుడే అది చేయవలసిన పనులను చేయగలుగును. యజ్ఞసాధన రూపములైన కర్మలుకూడ యజ్ఞమే! గీత యీ కర్మలను 'తదర్థీయకర్మ', 'యజ్ఞార్థకర్మ' అని యనును. సేవకై శరీరము నిలుచుటకుగాను దానికి వేయబడు ఆహుతికూడ యజ్ఞమే. సేవకొఱకు గ్రహింపబడు ఆహారము పవిత్రమైనది.

ఈ విషయములన్నిటికిని ముఖ్యముగా శ్రద్ధయుండవలె. సేవ నెల్లను ఈశ్వరార్పణచేయు భావము మనసులో నుండవలెను. ఇది చాల గొప్ప విషయము. సేవామయులము కానంతవరకు ఈశ్వరార్పణ బుద్ధి కలుగదు. ఈశ్వరార్పణయను ఈ ప్రధానవస్తువును విస్మరించిన యెడల పురోగమింప జాలము.

## 96. సాధన సాత్వికము కావలెను

కాని మనము మన కార్యము లన్నిటిని ఈశ్వరుని కెప్పుడు అర్పించ గలము ? అవి యన్నియు సాత్వికములైనప్పుడే ! యజ్ఞ దాన తపములు మూడును సాత్వికములుకావలె. క్రియల నెట్లు సాత్వికములను చేయవలెనో ఆ విషయమును మనము పదునాల్గవ అధ్యాయములో చూచియుంటిమి. గీత యీ యధ్యాయములో ఆ తత్త్వమును ఆచరణలో పెట్టు విధానమును చెప్పుచున్నది.

గీత యీ సాత్వికప్రణాళికను సూచించుటలో రెండు ఉద్దేశములున్నవి. బాహిరముగా యజ్ఞ, దాన, తపోరూపములో జరుగుచున్న సేవ లోతుగా విచారించినచో ఆధ్యాత్మిక సాధన యగును. ఇది యొక ప్రయోజనము. సృష్టికి సేవ చేయుట ఆధ్యాత్మికసాధన. ఈ రెంటి కార్యక్రమములును వేరువేరుగ నుండ రాదు. ఈ రెండును భిన్న వస్తువులు కానేకావు. ఈ రెంటికిని ప్రయత్న మొకటే. కర్మకలాప మొకటే. ఈ విధముగా చేయు కర్మనెల్లను చివరకు ఈశ్వరార్పణము చేయవలె. సమాజసేవ, సాధన, ఈశ్వరార్పణము – ఈ మూటి సంయోగము ఒక క్రియచేతనే సిద్ధించవలెను.

యజ్ఞమును సాత్వికము చేయుటకు రెండు విషయము లవసరము. 1 నిష్ఫలత్వములేకుండుట 2 కామములేకుండుట. ఈ రెండును యజ్ఞమున కుండవలసినలక్షణములు. యజ్ఞము సకామమైనచో అది రాజసమగును. అందు నిష్ఫలత్వము గోచరించినచో అది తామసయజ్ఞమగును.

నూలు వడుకుట యజ్ఞము. కాని నూలువడుకునప్పుడు ఏకాగ్రతతో మన హృదయమును అందు చొప్పించకపోయినచో ఆ సూత్రయజ్ఞము జడమగును. వెలుపల మనచేయి పనిచేయుచున్నపుడు, ఆపని కనుగుణమగు మానసిక సహయోగము లోపలినుండి రానిచో ఆపని యంతయు విధిరహితమగును. ఇట్టి విధిరహితమైనకర్మ జడమగును. విధిహీన కర్మలో తమోగుణము ప్రవేశించును. అట్టిపనినుండి ఉత్కృష్టమైన వస్తునిర్మాణము కాజాలదు. దానినుండి ఫలసిద్ధి కలుగనేరదు. యజ్ఞము కామరహితముగనున్నను దానినుండి ఉత్కృష్ట

ఫలము కలిగితీరును. ఏకాగ్రతతోను, అంతఃకరణశుద్ధితోను జరుగనికర్మ భార మనిపించును. ఇక దానినుండి ఉత్కృష్టఫలమెట్లు లభించును? బాహ్యమగు పని చెడిపోయినచో దానికి మానసికసహాయోగము లేకపోయెననుట తథ్యము. కనుక కర్మలో నీయాత్మను చొప్పింపుము. ఆంతరిక సహాయోగమును జోడించుము. సృష్టి సంస్థయెడల మనకున్న ఋణమును తీర్చుకొనుటకు ఉత్కృష్టమైన ఫలమును ఉత్పత్తిచేయవలెను. కర్మలలో ఫలహీనతరాకుండ జేయుటకు విధియుక్తమైన ఆంతరిక సహాయోగము అవసరము.

ఈ విధముగ మనలో నిష్కామత్వము ప్రవేశించి విధిపూర్వకమైనకర్మలు సఫలమైనప్పుడే చిత్తశుద్ధి కలుగును. కాని ఈ చిత్తశుద్ధి కలిగినట్లు గుర్తేమి? నీ బాహ్యకర్మను పరిశీలించి చూచుకొనుము. అది నిర్మలము, సుందరము కాకున్నచో మనస్సులోకూడ మాలిన్యమున్నట్లే భావింపవలయును. కర్మ సుందరమైన దెప్పుడగును? విశుద్ధహృదయముతో కష్టించి చేయుకర్మపై ఈశ్వరుడు తన అమోద ముద్రవేయును. ప్రసన్నుడయిన పరమేశ్వరుడు కర్మపై ప్రేమముద్రను వేసినపుడు, దానియందు సౌందర్య ముత్పన్న మగును. సౌందర్యమనగా పవిత్రశ్రమనుండి లభించు ఈశ్వర ప్రసాదము. శిల్పి విగ్రహముచేయుచు తన్మయుడై "ఈ సుందరమూర్తిని నా చేతులతో చేయుటలే" దనుకొనును. విగ్రహమును చెక్కుచుండగా చివరగడియలో సౌందర్యము తనకై తాను ఎక్కడినుండియో వచ్చి ప్రవేశించును. చిత్తశుద్ధిలేకయే ఇట్టిదివ్యకళ ప్రకటమగునా? ఆ మూర్తిలోని సారస్యమును, మాధుర్యమును ఎక్కడివి? శిల్పి తన అంతఃకరణములోని సౌందర్యమునెల్లను దానిలో ప్రవేశపెట్టుటవలన వచ్చినవే! చిత్తములోని ప్రతిమయే మూర్తియగును. మనము చేయుకర్మలన్నియు మన హృదయమునుండి వచ్చినమూర్తులే! హృదయము సుందరమగుచో కర్మయనెడి మూర్తికూడ సుందరమేయగును. బాహ్యకర్మల పారిశుధ్యమును మనఃపారిశుధ్యమునుబట్టియు, మనఃపారిశుధ్యము బాహ్యకర్మలనుబట్టియు పరీక్షించుకొనవలె.

మరియొకమాట చెప్పవలసియున్నది. ఈ యన్ని కర్మలకును మంత్రము కూడ అవశ్యకము. మంత్రహీనమైన కర్మ వ్యర్థము. నూలు వడుకుసమయమున "ఈ సూత్రమువలన నేను దరిద్రప్రజానీకముతో బంధింపబడుచున్నా" నను మంత్రమును హృదయములో జపించుచుండుము. ఈ మంత్రములేకుండ గంటలకొలది వడికినను అదంతయు వ్యర్థమైపోవును. అట్టిపనివలన చిత్తము

పరిశుద్ధము కానేరదు. 'ఏకు' అనెడు అవ్యక్త పరమాత్మ సూత్రరూపములో ప్రకటమగుచున్నాడను మంత్రమును వడుకుపనిలో చొప్పించి చూడుము. అప్పు డావని అత్యంతసుందరమును సాత్వికమును అగును. అది పూజా కార్యమును, యజ్ఞరూపమగు సేవయు నగును. ఆ చిన్న నూలు పోగుచే మనము ప్రజానీకముతోను పరమేశ్వరునితోను బంధింపబడుదుము. బాలకృష్ణుని చిన్న నోటిలో తల్లియగు యశోదకు విశ్వమంతయు కనబడినది. నీవు వడుకునట్టి ఈ మంత్రమయమగు దారములోకూడ విశాలమగు విశ్వము గోచరించును.

## 97. ఆహారశుద్ధి

ఇట్టి సేవకు ఆహారశుద్ధికూడ అవసరము. ఆహారమునుబట్టియే మనస్సుండును. ఆహారము మితముగ నుండవలె. ఆహారమెట్టిదను దానికంటె ఎంత యనునది ఎక్కువ ముఖ్యము. ఎట్టి యాహారము తినుచున్నామను విషయము ముఖ్యము కాకపోలేదు. కాని అది తగిన పరిమాణములో నున్నదా లేదా యనునది అంతకంటెను ముఖ్యము. భుజించు ఆహారమునకు తగిన పరిణామము కలిగి తీరును. ఇంతకు మనము భుజించు టెందులకు ? ఉత్కృష్టమైనసేవ చేయగలందులకు. ఆహారముకూడ యజ్ఞములో నొకభాగమే ! సేవ యను యజ్ఞమును ఫలప్రదము చేయుటకు ఆహార మవసరము. ఆహారము నీ దృష్టితో చూడుము. ఆహారము పరిశుద్ధముగను, స్వచ్ఛముగను ఉండవలెను. ఆహార పరిశుద్ధత విషయమై మానవు డెంతో శ్రద్ధ చూపవలెను. మన సమాజము ఆహార శుద్ధి విషయమున చాల తపస్సు చేసియున్నది. ఈ విషయమున చాల ప్రయత్నములు జరిగినవి. ఈ ప్రయత్నములు వేలకొలది సంవత్సరములనుండి జరుగుచున్నవి. వీనికై ఎంత తపస్సు ధారవోయబడెనో చెప్పలేము. భూమండలములో తెగలకు తెగలు మాంసాహారమును వర్జించుట ఒక్క హిందూదేశములోనే ! మాంసాహారమును భుజించు తెగలవారు కూడ మాంసమును నిత్యమును ముఖ్యవస్తువుగవాడరు. మాంసభక్షకులుకూడ దానిని కొంతవఱకు నీచముగ భావింతురు. అట్టివారు మానసికముగ దానిని వర్జించినట్లే. మాంసాహార ప్రవృత్తిని నిరోధించుటకే యజ్ఞము ప్రచారముచేయ బడెను. తిరిగి దాని కొఱకే జన్నము నాపుటయు చేయబడెను. శ్రీకృష్ణభగవానుడు యజ్ఞముయొక్క నిర్వచనమునే మార్చివేసినాడు. అతడు పాలలోనుండు మహిమను బాగుగ తెలియజెప్పెను. శ్రీకృష్ణుడు చేసిన ఘనకార్యము లేవియు తక్కువవికావు. కాని కృష్ణుని యే రూపమునుచూచి హిందూప్రజలు తన్మయు లగుదురు ?

గోవులను పాలించిన గోపాలకృష్ణుని జూచియే! అతడే హిందువులకు ప్రియుడు. గోవులమధ్యనే యుండి మురళి వాయించుచు గోసేవా తత్పరుడైన గోపాల కృష్ణుడే అబాలగోపాలమునకును పరిచితుడు. ఇట్లు మాంసభక్షణను విరోధించు టలో గోరక్షణ చాల ఉపయోగపడెను. గోక్షీరముల మహిమ బాగుగ గుర్తింప బడినంతనే మాంసభక్షణ తగ్గినది.

అంతమాత్రమున ఆహారశుద్ధి పూర్ణమయ్యెనని చెప్పలేము. ఈ వికాస క్రమమును పెంపొందించు బాధ్యత మనపై నున్నది. వంగ దేశస్థులు చేపలను తినుట చాలమందికి ఆశ్చర్యమును కలిగించును. కాని దీనికై వారిని నిందిం చుట పాడికాదు. వంగభూమిలో కేవలము వరిధాన్యమే పండును. దానివలన శరీరపోషణ పూర్తిగా జరుగ నేరదు. ఇందుచేత ఈ విషయములో నూతన ప్రయోగములు చేయవలసియున్నది. అపుడు చేపలకు మాఱుగా అంతపుష్టి నిచ్చు శాకాహారమేది ? అను ఆలోచన ప్రారంభమగును. ఇందులకై మహా త్యాగులు జన్మించి ప్రయోగములు జరిపెదరు. అట్టి మహాత్ములే సమాజమును ముందునకు నడుపగలరు. సూర్యుడు అంత వేడిమితో మండుచుండుట చేతనే శరీరమునకు వలసిన 98 డిగ్రీల ఉష్ణము మనకు లభించుచున్నది. అట్లే మానవ సమాజములో విరాగులనెడి ప్రజ్వలద్భాస్కరు లుదయించి, శ్రద్ధాళువులై బాహ్య పరిస్థితులనెడి బంధములను ఛేదించి తమ ధ్యేయాకాశములో రెక్కలు లేకుండనే విహరించుచుందురు. అట్టి వారి యునికి వలననే ఈ స్వల్ప వైరాగ్య మైనను మనలో ప్రసరించి మనము సమాజమున కుపయోగపడ గలుగు చున్నాము. మాంసాహారమును నిరోధించుటకు ఋషు లెంత తపస్సు చేయ వలసి వచ్చెనో, పుష్టికరమైన శాకాహారము లభించక ఎందరు ప్రాణములు కోల్పోయిరో యనుభావము ఈ సందర్భమున నాలో పొడకట్టు చుండును.

సారాంశమిది : నేడు మనలో ఆహారశుద్ధి సాముదాయికముగ నింత వరకు జరిగినది. మన పూర్వులు మితిలేని త్యాగముచేసి సంపాదించిన దానిని మనము కోల్పోరాదు. భారతీయ సంస్కృతిలోని ఈ విశిష్టతను గంగపాలు చేయవలదు. ఏదో యొక విధముగ జీవింపవలె ననుకొనుట సరికాదు. అట్లు జీవించుట చాలసులువే. పశువులుకూడ అట్లు జీవించుటలేదా ? కాని పశువు లెంతో మనమును అంతే యందురా ? పశువునకును మనకును అంతరమున్నది. ఈ యంతరమును పెంచుకొనుటయే సంస్కృతిని పెంపొందించుట యగును. మాంసాహారమును త్యజించుటకు మనదేశముచాలగొప్ప ప్రయోగములు చేసినది.

వాని నింకను ముందునకు సాగింపుడు. ఈ పరిశోధనలో మన మింతవరకు లేచిన యెత్తునుండి జారపోరాదు.

ఇటీవల అనేకులలో మాంసాహారము పొది కోరిక పెరిగిపోవుచుండుటచేత ఇంతగా దీనినిగూర్చి చెప్పవలసివచ్చినది. ఈ నాడు పూర్వ పశ్చిమ సభ్యతల ప్రభావములు ఒకదానిపై నొకటి పనిచేయు చున్నవి. చివరకు దీని పరిణామము మంచిదేయగునని నా విశ్వాసము. పాశ్చాత్య సంస్కృతివలన జడత్వమును పొందిన మన శ్రద్ధ ఇప్పుడు కదల నారంభించినది. శ్రద్ధ నావరించిన అంధత్వము తొలగిపోయినచో వచ్చు నష్ట మేమియులేదు. మంచిదేదో అది నిలబడును. చెడుగు కాలి భస్మమగును. అంధ శ్రద్ధ తొలగిపోయి దాని స్థానమును అంధ అశ్రద్ధ ఆక్రమింపరాదు. అంధత్వమును పొందునది ఒక్క శ్రద్ధ మాత్రమే కాదు. 'అంధ' యను విశేషమును కేవలము శ్రద్ధయే గుత్తకు తీసికొనలేదు. అశ్రద్ధకూడ అంధత్వమును పొందగలదు.

మాంసాహారమును గూర్చిన చర్చలు నేడు తిరిగి ఆరంభమగుచున్నవి. ఏది యెట్లున్నను, నూతనభావ మేదైన ప్రజ లాలోచింప మొదలిడినచో నాకు చాల ఆనందము కలుగును. ప్రజలు మేల్కొని సమస్య నెదుర్కొను చున్నారని దీనినిబట్టి తేలుచున్నది. ఈ చైతన్యము నాకు ప్రియము గొల్పుచున్నది. కాని మెలకువ వచ్చినంతనే కనులు నలుపుకొనుచు నడువ నారంభించినచో పడిపోగలము. అందువలన పూర్తిగ మెలకువ రానంతవరకు, కనులు తెరచి బాగుగ చూడ నంతవరకు చేతులను కాళ్ళను కదలింపకుండుట మంచిది. బాగుగ ఆలోచింపుడు. పక్షవిపక్షములు, తిరుగుమరుగులు – అన్నివైపుల నుండియు బాగుగ యోజింపుడు. ధర్మవిషయములపై విచారణయను కత్తెరను నడపుడు. పరిశీలన యను ఈ కత్తెరతో ఏ ధర్మము ఛేదింపబడునో అది గవ్వకైనను పనికిరాదని తెలిసికొనుము. ఈ విధముగ తునకలై పోయెడు ధర్మములను పోనిండు. ఏ ధర్మము నీ కత్తెరకు లొంగక కత్తెరనే విరిచివేయునో అదే సత్యమని నమ్ముము. ధర్మము విమర్శలకు భయపడదు. అందువలన ఏ విషయము నైనను బాగుగ యోజింపుము. కాని పనిమాత్రము తొందరపడి చేయకుము. వచ్చియు రాని మెలకువతో పనులు చేయబూనినచో దఢాలున పడిపోగలవు. విచారణ యెంత తీవ్రముగ సాగుచున్నను, ఆచరణను మాత్రము అదుపులో నుంచుకొనుము. సంయమముతో నీ పనులను చేయుచుండుము. పూర్వమునుండియు ఆర్జించిన పుణ్యమును కోల్పోకుము.

## 98. నిర్విరోధ జీవనమునకు గీత యిచ్చు ప్రణాళిక

ఆహారశుద్ధివలన చిత్తశుద్ధి కలుగును. శరీరమునకుకూడ బలము చేకూరును. సమాజసేవ బాగుగా జరుగగలదు. వ్యక్తికి మనశ్శాంతి కలుగును. సమాజమున సంతోషము వ్యాపించును. యజ్ఞ దాన తపః క్రియలు విధి పూర్వకముగను, మంత్రసహితముగను జరుగు సమాజములో విరోధభావము గోచరింపదు. రెండద్దములను ఎదురెదురుగ పెట్టినప్పుడు ఒకదానిలోని ప్రతిబింబము రెండవదానిలో కనబడినట్లే వ్యక్తియందును సమాజమునందును బింబ ప్రతిబింబ న్యాయము ననుసరించి పరస్పర సంతోషము వెల్లడియగును. నాకు సంతోషకారకమైనదే సమాజమునకును, సమాజమునకు సంతోషకారకమైనదే నాకును ఇంపగును. ఈ రెండు విధములగు సంతోషములను పరిశీలించి చూచినచో రెండును ఒకటేయని తేలగలదు. ఎటుచూచినను అద్వైతానుభవమే కలుగును. ద్వైతము, ద్రోహము అస్తమించును. ఇట్టి సువ్యవస్థకు మనలను చేర్చగల ప్రణాళికనే గీత ప్రతిపాదించుచున్నది. మన దైనిక కార్యక్రమములను గీతాప్రణాళిక ననుసరించి ఏర్పరచు కొన్నచో ఎంతబాగుగా నుండును !

కాని నేడు వ్యక్తి, సమాజ జీవితములమధ్య విరోధభావ ముత్పన్నమైనది. ఈ విరోధము నెట్లు నిర్మూలింపగల మను విషయమే సర్వత్ర చర్చింపబడుచున్నది. వ్యక్తి, సమాజముల కుండుహద్దులేవి ? ఇందు శ్రేష్ఠమేది ? గౌణమేది ? వ్యక్తివాదమును సమర్థించువారు సమాజము జడమని భావింతురు. సేనాధిపతి తన యొద్దకువచ్చిన సిపాయితో మాటలాడునపుడు సౌమ్యమైన భాష నుపయోగించును. సిపాయిని 'మీరు' అనికూడ సంబోధించును. కాని యతడు సైన్యమునకు ఇచ్చవచ్చినట్లు ఆజ్ఞలిచ్చును. సైన్య మొక అచేతన పదార్థమా – కొయ్య బొమ్మయా యన్నట్లు వర్తించును. సైన్యము నటునుండి ఇటు, ఇటునుండి యటు పొరల్చును. అతని దృష్టిలో వ్యక్తి చైతన్య స్వరూపుడు, సమాజము జడము. చూడుడు; ఇక్కడను మనకు ఆ యనుభవమే కలుగుచున్నది. ఇక్కడ నా యెదుట రెండు మూడువందల మంది వ్యక్తులున్నారు. కాని, మీ కిది రుచించినను లేకున్నను, మీరు జడవస్తువులా యన్నట్లు భావించి నాకు తోచినట్లు మాటలాడుచున్నాను. కాని నా యెదుటికే వ్యక్తియైన వచ్చినచో అతడుచెప్పు విషయమును శ్రద్ధగా వినవలసి యుండును. ఆలోచించి తగిన ప్రత్యుత్తర మీయవలసి యుండును. అట్లుగాక ఇప్పుడు గంటలకొలది మిమ్ములను కూర్చుండబెట్టి మాట్లాడుచున్నాను.

"సమాజము జడము, వ్యక్తి చైతన్య స్వరూపుడు" అని చెప్పుచు కొందరు 'వ్యక్తి చైతన్యవాదము' ను ప్రతిపాదింతురు. మరికొందరు సమాజమునకే మాహాత్మ్యము నిత్తురు. ఒకనికి తలవెంట్రుకలు రాలి పోయినవి, కన్నులుపోయినవి, చేయివిరిగినది, దంతములూడినవి, వీనికితోడు ఒక యూపిరి తిత్తికూడ చెడిపోయినది. అయినను అతడు జీవించియే యుండును. ఏలయన ఏ యవయవమున కా యవయవము జడము. ఇందేదైననొకటి శిథిలమైపోయినను సర్వనాశము కాజాలదు. మొత్తముమీద శరీరము నడచుచునేయుండును. ఈ విధముగ పరస్పర విరుద్ధములైన దృష్టికోణములివి. మీ దృక్పథమున కనుకూలమగు అంచనాలనే మీరు వేయుచుందురు. మన సులోచనముల రంగును బట్టియే సృష్టిరూపము గోచరించును.

ఒకడు వ్యక్తికి ప్రాముఖ్యమునిచ్చిన మరియొకడు సమాజమునకిచ్చును. "పొట్టకొఱకు పోరాటము అవసరము." (స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్సు) అను సిద్ధాంతము సమాజమునందు వ్యాపించియుండుటయే ఈ భేదబుద్ధికి కారణము. కలహము కొఱకా మానవుడు జీవించుట ? కలహముయొక్క పరిణామము మరణమేయగును కాని జీవించుట యెట్లగును ? ఇట్లు కలహించుటకంటె మరణించరాదా ? ఈ భేదబుద్ధివలన మనము స్వార్థమును పరమార్థమును వేరుచేయుచున్నాము. అవి వేరువేరు అను సిద్ధాంతమును మొదట నెవడు కల్పించెనోగాని వాడొక వింతమనుష్యుడై యుండవలె ! ఇదేమి వింతయోకాని, లేని వస్తువు ఉన్నట్లు నిరూపించువాని బుద్ధిని గౌరవించుట మనకు పరిపాటియైనది. లేని భేదమును తెచ్చిపెట్టి దానిని ప్రజలకు బోధించుట ఏమిపని ? చైనాచుట్టును గోడగట్టిన పనివంటిదే యిది. నేలయు నింగియు కలిసినట్లు తోచుతావున (దిగ్వలయమున) హద్దులుపెట్టి దాని వెలుపల భూమ్యాకాశములు లేవని తలంచుటవంటిదే యీ పని. నేడు యజ్ఞమయ జీవితము సమాజమున లోపించుటయే దీని కెల్లను కారణము. ఇందుచేతనే వ్యక్తికిని సమాజమునకును నడుమ భేదము బయలు దేరినది.

కాని వ్యక్తిసమాజముల మధ్య భేదమేమియు కల్పింపరాదు. ఒకగదిని రెండుగ చేయుటకు నడుమ నొకతెర కట్టినచో గాలివలన ఆ తెర ఇటునటు ఎగురుచుండును. అప్పు డొకసారి ఒకభాగమును, మరియొకసారి రెండవ భాగమును పెద్దదిగ కనబడును. గదిలోని పెద్ద చిన్న భాగముల వైశాల్యము గాలి విసురుడుపై ఆధారపడి యుండును. కాని అది స్థిరమైనదికాదు. గీత

యిట్టిభేదముల కవ్వలిది. ఈ భేదారోపణ కృత్రిమమైనది. అంతశ్శుద్ధిని గూర్చిన శాసనమును పాలింపుడని గీత యనును. అప్పుడు వ్యక్తి, సమాజ యోగక్షేమ ముల మధ్య ఎట్టి వైరుధ్యమును బయలుదేరనేరదు. పరస్పర క్షేమమునకు ఏ పక్షమునుండియు అంతరాయము కలుగనేరదు. ఇట్లు అంతరాయములను, వైరుధ్యమును తొలగించుటలోనే గీతయొక్క విశిష్టతకలదు. ఈ గీతానియ మమును పాటింపగలవా డొక్కడున్నను అయొక్కని వలననే రాష్ట్రమెల్లను సంపన్నమగును. రాష్ట్రమనగా రాష్ట్రములోని వ్యక్తులసముదాయమే. ఇట్టి యనుష్ఠానపరులగు జ్ఞానులులేని రాష్ట్రమును రాష్ట్రమని యెట్లనదగును? హిందూస్థానమనగావేమి? హిందూస్థానమనగా రవీంద్రనాథుడు, హిందూస్థాన మనగా గాంధి; లేక ఇటువంటి అయిదారుగురు సుప్రసిద్ధులు. పేరందిన ఈ యైదారుగురను బట్టియే బయటి ప్రపంచము హిందూదేశముయొక్క స్వరూప మును ఊహించుకొనును. ఒకరిద్దరు ప్రాచీనులు, నలుగు రయిదుగురు మధ్య కాలికులు, అయిదారుగురు అధునికులు, వీరితో హిమాలయము, గంగ మొద లైన వానిని కలిపినచో అది హిందూస్థానమగును. ఇదే హిందూస్థానముయొక్క నిర్వచనము. ఇక మిగిలినదంతయు ఈ నిర్వచనమునకు భాష్యము. భాష్య మనగా సూత్రముల విపులీకరణము. పాలనుండి పెరుగు, పెరుగునుండి మజ్జిగ, వెన్న వచ్చును. పాలకు, పెరుగునకు మజ్జిగకు, వెన్నకు మధ్య జగడములేదు. పాలయొక్క శక్తి దానినుండివచ్చు వెన్ననుబట్టి నిర్ణయింప బడును. ఇట్లే సమాజమునందుండు వ్యక్తులనుబట్టియే సమాజముయొక్క శక్తి నిర్ధారణయగును. వ్యక్తి–సమాజములమధ్య వైరుధ్యమేమియులేదు. వైరుధ్య మెట్లుండగలదు? వ్యక్తికిని వ్యక్తికిని మధ్య కూడ విరోధముండరాదు. ఒకని కంటె మరియొకడు అధికసంపన్నుడైనచో వచ్చెడు హానియేమి? ఎవ్వడును లేమి ననుభవింపకుండ, కలవారిసంపద సమాజమున కుపయోగపడుచుండిన చాలును. పైకము నాకుడిజేబులో నుండిననేమి? ఎడమజేబులో నుండిననేమి? రెండుజేబులును నావేకదా! ఒకడు సంపన్నుడైనచో వానివలన నేనును సంపన్నుడనే. రాష్ట్రమును సంపన్నమే. ఈ స్థితి సాధింపదగినదే.

కాని మనము భేదమును పాటింతుము. బొందిని, తలను వేరుచేసినచో రెండును మరణించును. కనుక వ్యక్తిని, సమాజమును వేరుచేయవలదు. స్వార్థమును, పరమార్థమును సాధింపగల యేకైక క్రియావిధానమునే గీత బోధించుచున్నది. ఈ గదిలోని గాలికిని, బయటనున్నగాలికిని విరోధములేదు.

ఒకవేళ రెంటికిని వైరుధ్యమును కల్పించి వెలుపలిగాలి రాకుండ గదితలుపులు మూసినచో ఊపిరియాడక మరణింతుము. ఈ రెంటియొక్క అవిరోధభావమును గుర్తించి గదితలుపులను తెరచియుంచినచో అడ్డులేకుండ వాయువు లోనికి ప్రవేశించుమ. ఇతరుల సంపదనుండి నాభూమిని, ఇంటిని వేరుచేసికొన్నంతనే అనంతసంపదకు నేను దవ్వగుచున్నాను. నా చిన్న గృహము అగ్నిపాలైనను కూలిపోయినను నా సర్వస్వమును కోల్పోయినట్లు భావించి తల్లడిల్లుదును. కాని యిట్లేల కావలె? ఏల విలపింపవలె? మొదట సంకుచితముగ భావించు టెందులకు? తదుపరి దుఃఖించు టెందులకు? ఈ యైదువందల రూపాయలును నావి" యనుకొనుటచే సృష్టియొక్క అపారసంపదకు నేను దూరమై పోవుచున్నాను. "నా కిరువురు సోదరులు" అని భావించినంతనే ప్రపంచములోని అసంఖ్యాకులైన సోదరులకు నేను దూరమై పోవుచున్నాను. ఈ విషయమును మనము గమనించుటలేదు. అయ్యో! మానవుడు తన్నుతా నెంతగ సంకుచితపరుచుకొనుచున్నాడు! నిజమునకు మానవుని స్వార్థము పారమార్థికమయిపోవలె. వ్యక్తికిని సమాజమునకును చక్కని సామరస్యము కుదురుటకు గీత ఇట్టి సరళమైన, సుందరమైన మార్గమును చూపుచున్నది. నాలుకకును, పొట్టకును మధ్య విరోధమేమిటి? పొట్టకు అవసరమైనంత ఆహారమునే నాలుకకు అందించవలెను! పొట్ట "చాలు" అనినంతనే నాలుక ఆహారమును గైకొనరాదు. పొట్ట యొకసంస్థ. నాలుక మరియొకసంస్థ. నేనీ రెండు సంస్థలకును అధిపతిని. ఈ యన్నిసంస్థలలోను అద్వైతభావమే యున్నది. అమంగళమైన ఈ వైరుధ్యము ఎక్కడ దాపురించినది! ఒక దేహములోనే ఈ భిన్నభిన్న 'సంస్థలు' వైరుధ్య మేమియులేక పహకారభావముతో మెలగుచున్నట్లే సమాజములోకూడ సామరస్య మేర్పడవలెను. సమాజములో ఈ సహకారమును పెంపొందించుటకే గీత చిత్తశుద్ధిపూర్వకమైన యజ్ఞ, దాన, తపములనెడు క్రియావిధానములు బోధించుచున్నది. ఇట్టి కర్మలవలన వ్యక్తికిని పమాజమునకును కల్యాణము చేకూరును.

యజ్ఞమయ జీవితమును గడపువాడు అందఱకును ఆప్తుడగును. తల్లి ప్రేమను తానే పొందుచున్నట్లు ప్రతిపుత్రుడును భావించును. అ విధముగనే ఇట్టి వ్యక్తిని ప్రతివ్యక్తియు తన వానినిగ భావించును అట్టివాడు సర్వప్రపంచమునకును ప్రియుడుగను ఆత్మీయుడుగను భాసించును. "ఇతడు మన ప్రాణము, మనమిత్రుడు, మనసఖుడు" అని యందరును అనుకొందురు.

'ప్రజలెవనిని ఆత్మీయునిగా భావింతురో అతడు ధన్యుడు' అని సమర్థ రామదాసు అనెను. అట్టిజీవితమును గడపగల ఉపాయమును గీత ప్రతిపాదించుచున్నది.

## 99. సమర్పణ మంత్రము

జీవితమును యజ్ఞమయము చేసికొనుటకు దానినెల్లను ఈశ్వరార్పణము చేయవలెనని గీతయొక్క మరియొక ప్రతిపాదన. జీవితము సేవామయమైన తరువాత ఇక ఈశ్వరార్పణ మెందులకు? జీవితము నెల్లను సేవామయము చేయవలెననుట సులువే కాని అట్లుచేయుట మాత్రము చాల కష్టమైనపని. అనేక జన్మల సాధనమీద అట్టిస్థితి కొంతవరకు సాధ్యము కావచ్చును. కర్మలన్నియు కేవలము సేవామయము లయినప్పటికిని అవి పూజామయములైనవని చెప్ప లేము. ఇందుచేతనే "ఓం తత్ సత్" మంత్రముతోపాటు కర్మలన్నిటిని ఈశ్వ రార్పణము చేయవలె.

సేవాకర్మ నూటికినూరుపాళ్ళు సేవామయమగుట కష్టసాధ్యము. ఎందువలన ననగా పరమార్థములోకూడ స్వార్థము ఇమిడియేయుండును. కేవలపరమార్థము సంభవమేకాదు. కొంచెమైనను స్వార్థములేని పని యుండనేరదు. అందువలన అనుదినమును అధికతరమైన నిష్కామ, నిస్స్వార్థసేవను తాను చేయుచుండవలెనని ప్రతివ్యక్తియు కోరుకొనవలెను. నీవు చేయుసేవ అంత కంతకు పరిశుద్ధము కావలెననిన నీ పనులన్నిటిని ఈశ్వరార్పణము చేయు చుండుము. 'యోగి జీవితకళను సాధించును. భక్తుడు భగవన్నామమును ప్రేమించి కీర్తించును' అని జ్ఞానదేవుడనెను. నామామృతముయొక్క మాధుర్యమును, జీవితకళయు వేరుకావు. నామముయొక్క ఆంతరికఘోషకును, బాహ్య జీవితకళకును సామరస్యమున్నది. యోగి, వైష్ణవుడు—ఇరువురును ఒకరే! క్రియలను ఈశ్వరార్పణము చేసినమీదట స్వార్థము, పరార్థము, పరమార్థము అన్నియు ఏకరూపమైపోవును. ఇంతవరకు "నీవు, నేను వేఱు" అనుకొనుచు వచ్చినభేదబుద్ధిని తొలగించుకొని ఏకముకావలె. 'నీవు, నేను కలియుటవలన' 'మనము' అగుదుము. ఇక 'మనము' 'అతడు' ఏకముకావలె. నేను మొదట ఈ సృష్టితోను, తదుపరి పరమాత్మతోను సామరస్యమును సాధించవలె. 'ఓంతత్సత్' మంత్రమునందు ఈ భావమే సూచింపబడినది.

పరమేశ్వరుని నామము లనంతములు. వ్యాసుడు వీనిని 'విష్ణు సహస్రనామములు' గ చేసెను. మనము కల్పించు నామము లన్నియు

ఆయనవే. మన హృదయములో స్ఫురించు నామముల కనురూపముగ మన మతనిని సృష్టిలో దర్శింపవలె. దర్శించినదాని కనుగుణముగ జీవితమును దిద్దుకొనవలె. దీనిని 'త్రిపద గాయత్రి' యని నేనందును. 'ఈశ్వరుడు దయామయుడు' అను దానిని ఉదాహరణగ తీసికొందము. అట్లు భావించి సాధన చేయుచు దయాసాగరుడగు పరమేశ్వరుని ఈ సృష్టిలో దర్శింతముగాక! భగవంతుడు ప్రతి – బిడ్డకును సేవ నిమిత్తము తల్లి నిచ్చినాడు. బ్రతుకుటకు గాలిని ప్రసాదించినాడు. ఈ విధముగ సృష్టిలోనున్న ఈశ్వరుని దయామయ విధానమును దర్శించి, మన జీవితములనుకూడ దయామయములుగ చేసికొందముగాక! భగవద్గీత కాలమున ప్రసిద్ధినొందిన భగవన్నామమును గీత బోధించినది. అదే 'ఓమ్‌తత్సత్' అనునది. 'ఓమ్' అనగా 'అవును పరమాత్ముడున్నాడు' అని యర్థము.

ఈ యిరువదవ శతాబ్దములోకూడ పరమాత్ముడున్నాడు.

"స ఏవ అద్య స ఉశ్వః" నేడున్నదియు అదే, నిన్న ఉండినదియు అదే, రేపుండునదియు అదే. అది స్థిరవస్తువు. సృష్టి స్థిరమైనది. నడుము బిగించి నేనుకూడ సాధనచేయుటకు సిద్ధముగనున్నాను. నేను సాధకుడను, అతడు భగవానుడు. ఈ సృష్టి పూజాద్రవ్యము, పూజాసాధనము. ఇట్టి భావనతో మన హృదయము నిండినప్పుడే 'ఓమ్' మనకు హృద్గతమైనట్లు. అత డున్నాడు, నే నున్నాను, నా సాధనకూడ ఉన్నది. ఇట్లీ ఓంకారభావము మనసులో నాటుకొని సాధనలో ప్రకటితముకావలె. సూర్యుని మన మెప్పుడు చూచినను అతడు కిరణములతో సైతము కనబడును. కిరణములనుండి విడివడి అత డుండలేడు. కిరణముల నతడు మరచియుండడు. ఇట్లే ఎవడును, ఏ పరిస్థితులలోను సాధనను విడిచి యుండరాదు. ఇట్లు నిరంతరసాధన చేయుచున్నపుడే మనము 'ఓమ్' తో ఏకరూపమయినట్లు చెప్పనగును.

దీని తరువాతి విషయము 'సత్'. పరమేశ్వరుడు 'సత్'. అనగా 'శుభము', 'మంగళము'. ఈ భావన కలవాడవై భగవంతుని మంగళ స్వరూపమును సృష్టిలో దర్శింపుము. ఉదాహరణకు కుండను నింపి పైకి తీసినపుడు నీటిలో నేర్పడు గుంట ఒక్క క్షణములో ఎట్లు పూడిపోవునో చూడుము. ఇదెంత మంగళకరము! ఎంత హృదయ రంజకము! నది తన గర్భములో గుంటలుండుట సహింపలేదు. గుంటలను నింపుటకు అది పరుగిడుచు వచ్చును. "నదీ వేగేన శుధ్యతి".

ఈ సృష్టి యనెడు నది వేగముచే పరిశుద్ధమగుచున్నది. సృష్టియంతయు శుభకరము, మంగళకరము అయియున్నది. మీరుచేయు కర్మలుకూడ అట్లే యుండునుగాక! పరమేశ్వరుని 'సత్' అను నామముతో మనయాత్మ ఏక రూపమగుటకుగాను మన పనులన్నియు నిర్మలములుగను, భక్తి మయములు గను ఉండవలె. సోమరసమును 'పవిత్రము' (దర్భ) తో వడపోసినట్లే మనము చేయు కర్మలను, సాధనలను అన్నిటిని నిత్యపరిశీలనచేసి నిర్దుష్టము లుగ చేసికొనవలె.

ఇక 'తత్' ఉన్నది. 'తత్' అనగా 'అది'. ఈ 'అది' ఈ సృష్టినుండి కొంతభిన్నము, నిర్లిప్తము అయినది. సారాంశమేమనగా పరమాత్మ ఈ సృష్టి నుండి భిన్నమైనది, అనగా నిర్లిప్తమైనది. సూర్యోదయము కాగానే కమలములు వికసించును, పక్షులెగురును, అంధకారము తొలగిపోవును. కాని సూర్యుడు దూరముననే యుండును. ఈ పనులన్నిటి నుండియు అతడు వేరుగ నున్నట్లే యుండును. మనము కర్మలను అనాసక్తితో నాచరించినప్పుడు అందు నిర్లిప్తత వచ్చును. అప్పుడు జీవితములో 'తత్' ప్రవేశించినట్లు గ్రహింపనగును.

ఇట్లు గీత 'ఓమ్‌తత్సత్' అను వైదికమంత్రముతో మనసమస్త కర్మలను ఈశ్వరార్పణచేయు విధానమును బోధించుచున్నది. వెనుక తొమ్మిదవ అధ్యాయ ములో కర్మల నన్నిటిని ఈశ్వరార్పణచేయు విషయము వచ్చినది. "యత్క రోషి యదశ్నాసి" అను శ్లోకములో చెప్పబడినదిదియే! ఆ విషయమే మరల పదునేడవ అధ్యాయములో వివరింపబడినది. పరమేశ్వరున కర్పింపబడు క్రియలు సాత్వికమైనవి కావలె. అప్పుడే అవి ఈశ్వరుని కర్పింపబడగలవు. ఈ విషయ మిక్కడ ముఖ్యముగ చెప్పబడినది.

## 100. పాపమును హరించునది హరినామము

ఇదంతయు సరే! కాని 'ఓమ్‌తత్సత్' అనుమంత్రము పవిత్రాత్ములకే యైనచో ఇక పాపులగతియేమి? అనుప్రశ్న సహజముగ ఉదయించును. పాపులుకూడ ఉచ్చరింపయోగ్యమైన మంత్రమేదైన కలదా లేదా? పాపులను తరింపచేయగల శక్తికూడ 'ఓమ్‌తత్సత్'లోనే యున్నది. ఈశ్వరుని ప్రతి నామములోను అసత్యము నుండి సత్యమువైపునకు తీసికొనిపోగల శక్తికలదు. అది పాపమునుండి పుణ్యమునకు తీసికొనిపోగలదు. జీవితమును మెల్లమెల్లగా పరిశుద్ధ పరుచుకొనవలె. పరమాత్మ తప్పక సాయముచేయును. నీ బలహీనా వస్థలో అతడు నీకు సహకరించును.

పుణ్యమయమైనను అహంకారపూరితమగు జీవిత మొకవైపునను, పాప మయమైనను వినమ్రజీవితము మరియొక వైపునను ఉంచి ఈ రెంటిలో నేదో యొకటి కోరుకొనుమని ఎవరైన నాతో అనినచో నేను నోటిమాటలతో నేమియు చెప్పలేక పోయినను హృదయములో మాత్రము ఇట్లనుకొందును. "ఏపాపజీవితము వలన నాకు పరమేశ్వర స్మరణకలుగునో అదే నాకు లభించునుగాక!" పుణ్యమయజీవితము వలన పరమాత్మను మరచిపోవుస్థితి కలుగుచో ఏ పాప మయజీవితము వలన ఆయనస్మృతి కలుగునో దానినే కోరుకొనుమని నాహృదయము ప్రబోధించుచుండును. పాపమయ జీవితమును నేను సమర్థించుచున్నానని దీనియర్థముకాదు. కాని పుణ్యము చేయుచున్నానను అహంకారమును మించినపాపము మరొకటిలేదు.

> 'నేను సుకృతము నార్జించుచున్నానని గర్వించుటకంటె మహాపాపము వేరొండులేదు. ఓ భగవానుడా! నే నీ జ్ఞానము పొందకుండ అడ్డు పెట్టకుము.'

అని తుకారాము అనెను. ఆ గొప్పతనముతో నిమిత్తము లేదు. అంతకంటె పాపినై దుఃఖము ననుభవించుటయే మంచిది.

'నేను జ్ఞానిని' అనుకొనుబిడ్డను తల్లికూడ దూరముగ నుంచును.' కాని అజ్ఞానులైన బిడ్డలను తల్లి తనయొడిలోనికి తీసికొనును. నేను స్వావలంబియైన పుణ్యాత్ముడను కాగోరను. పరమేశ్వరావలంబియైన పాపినగుటయే నా కిష్టము. పరమేశ్వరుని పవిత్రత నా పాపమును శమింపజేసి నన్ను రక్షింపగలదు. పాపములను నిరోధించుటకు మనము ప్రయత్నింతముగాక! అవి నిరోధింపబడనిచో మనస్సు తహతహపడును. హృదయము విలపించును. అప్పు డీశ్వరస్మృతి కలుగును. ఈశ్వరు డీ విలాపమును చూచుచునే యుండును. 'నేను పాపిని, కావున నీద్వారమునొద్దకు వచ్చితిని' అని యెలుగెత్తి కేకపెట్టుము. పుణ్యాత్మున కీశ్వరుని స్మరించు అధికారము కలదు. ఏలయనగా అతడు పుణ్యాత్ముడు కాబట్టి. పాపికిని ఈశ్వరుని స్మరించు అధికారమున్నది. ఎట్లనగా అతడు పాపి కనుక. (12-6-32)

# పదునెనిమిదవ అధ్యాయము

## ఉపసంహారము-ఫలత్యాగముయొక్క పరిపూర్తి-ఈశ్వర ప్రసాదము.

### 101. అర్జునుని అంతిమ ప్రశ్న

సోదరులారా! ఈశ్వరకృపవలన నేడు పదునెనిమిదవ అధ్యాయమునకు చేరుకొన్నారము. అనుక్షణమును మార్పుచెందుచుండు ఈ విశ్వములో ఏ సంకల్పమేని నెరవేరుట ఈశ్వరేచ్ఛపై ఆధారపడి యుండును. ఇక చెఱ సాలలో అడుగడుగునను అంతయు అనిశ్చితమే. ఇక్కడ ఏపని ప్రారంభించి నను దానిని ఇక్కడనే పూర్తిచేయగలమను నమ్మకములేదు. మనము ప్రారం భించినప్పుడు ఈ గీత ఇక్కడ పూర్తికాగలదను నమ్మక మేమాత్రమునులేదు. కాని ఈశ్వరేచ్ఛ వలన మనము చివరకు రాగలిగితిమి.

పదునాల్గవ అధ్యాయములో జీవితము – లేక – కర్మ సాత్వికమని, రాజస మని, తామసమని మూడుగ విభజింపబడినది. ఈ మూటిలో రాజసమును, తామసమును త్యజించి సాత్వికమును గ్రహింపవలెననికూడ మనము చూచి తిమి. తరువాత పదునేడవ అధ్యాయములో ఈ విషయమే మరియొకరీతిని చెప్ప బడినది. అది యజ్ఞము, దానము, తపస్సు. ఒక్కమాటలో చెప్పవలెనసిన యజ్ఞమే జీవితసారము. యజ్ఞమున కుపకరించు ఆహారాదికర్మలను సాత్విక రూపమును, యజ్ఞరూపమును పొందించి గ్రహింపవలెననియు, యజ్ఞరూపము, సాత్వికము అయిన కర్మనే స్వీకరించుచు మిగిలిన కర్మనెల్లను త్యజించుటయే ఉచితమనియు సూచనగా పదునేడవ అధ్యాయములో మనము గ్రహించితిమి. 'ఓం తత్సత్' మంత్రమును ఎందులకు నిరంతరమును స్మరింపవలెనో అదికూడ మనము తెలిసికొన్నారము. 'ఓం' అనగా సాతత్యము, 'తత్' అనగా నిర్లిప్తత, 'సత్' అనగా సాత్వికత. మనసాధనలో సాతత్యము, నిర్లిప్తత, సాత్వికతఉండ వలె. అప్పుడే సాధన ఈశ్వరార్పణము కాగలదు. దీనినిబట్టి కొన్నికర్మలు చేయ వలసినవనియు, కొన్ని త్యజింప వలసిన వనియు విశదమగుచున్నది.

గీతాబోధను పరిశీలించి చూచినచో కర్మత్యాగము చేయవలదని అందు అడుగడుగునను మనకు కానవచ్చును. గీత కర్మఫలత్యాగ విధానమును బోధించుచున్నది. కర్మను నిరంతరమును చేయుచుండవలెనని - ఫలమును మాత్రము త్యజించుచుండవలెనని గీతయందు దెచ్చుటచూచినను ఈ శిక్షణయే

ఈయబడినది. ఇదియొక దృష్టి. కాని కొన్నికర్మలు చేయవలె, కొన్నికర్మలు త్యజింపవలెననెడి దృష్టి మరియొకటికలదు. అందువలన చివరకు పదునెనిమిదవ అధ్యాయము మొదట అర్జునుడిట్లు ప్రశ్నించును. "ఒకవైపున ఫలత్యాగపూర్వకముగ కర్మలన్నిటిని చేయవలెనని, రెండవవైపున కొన్ని కర్మలను విధిగా త్యజింపవలెనని, కొన్నిమాత్రమే చేయదగినవని యన్నప్పుడు ఈ రెంటికిని సామరస్యముకుదుర్చుటెట్లు ?" సాధనమార్గమును స్పష్టముగా తెలిసికొనుటకును, ఫలత్యాగముయొక్క రహస్యమును గ్రహించుటకును ఈ ప్రశ్న అడుగబడినది. శాస్త్రమునుబట్టి సంన్యాసమనగా సర్వకర్మపరిత్యాగము. ఫలత్యాగమనగా కర్మఫలమును త్యజించుట. గీతలోని ఫలత్యాగమును సాధించుటకు ప్రతికర్మను త్యజించుట అవసరమా యనునదే ఇప్పుడుప్రశ్న. ఫలత్యాగమను లక్ష్యమును చేరుటకు సంన్యాసము (సర్వకర్మత్యాగము) ఏమైన ఉపకరించునా ? సంన్యాసముయొక్క హద్దులేవి ? సంన్యాసము, ఫలత్యాగము ఈ రెంటి హద్దులెవ్వి ? అవి యెంతవరకు ? ఇదే అర్జునుని ప్రశ్న.

## 102. ఫలత్యాగము ఉత్కృష్టమైన ఒరపిడి ఱాయి

ఫలత్యాగము ఉత్కృష్టవస్తువను విషయమును భగవంతుడు తన ప్రత్యుత్తరములో స్పష్టపరచినాడు. ఫలత్యాగతత్త్వమును సర్వత్ర ప్రయోగింపవచ్చును. సర్వకర్మఫలత్యాగము, రాజస తామస కర్మల త్యాగము - ఈ రెంటిమధ్యను వైరుధ్యములేదు. ఫలత్యాగదృష్టితో చూచినచో కొన్ని కర్మలు వానికవే చేయరానివిగా స్పష్టమగును ! ఫలత్యాగ పూర్వకముగ కర్మలను చేయవలెననగా కొన్ని కర్మలను వదలివేయవలెననియే అర్థము.

దీనినిగూర్చి కొంచెములోతుగ విచారింతము. కామ్యకర్మలను (కోరికతో కూడినకర్మలను) ఫలత్యాగపూర్వకముగ చేయుమని యనినంతనే వాని పునాదియే సడలిపోవును. ఫలత్యాగము ముందర కామ్య, నిషిద్ధకర్మలు నిలువనే నిలువవు. ఫలత్యాగపూర్వకముగ చేయుకర్మలు కృత్రిమముగను, తాంత్రికముగను యంత్రమువలె నుండవు. ఏకర్మలు చేయవలెను, ఏవిచేయరాదు – అను విషయము ఈ యొరపిడిఱాతిద్వారా సులభముగా తెలియును. గీత ఫలత్యాగపూర్వకమైన కర్మలు చేయుమని మాత్రమే చెప్పెననియు, ఏవి చేయవలెనో ఏవి మానవలెనో స్పష్టీకరించలేదనియు కొందరందురు. ఇది అభాసము మాత్రమేకాని యదార్థముకాదు. ఎందులకన ఫలత్యాగ పూర్వకముగ కర్మలనాచరింపుమని చెప్పుటలోనే ఏ కర్మలు చేయ వలసినవో,

ఏవి చేయరానివో స్పష్టమగుచునే యున్నది. హింసాత్మక కర్మలు, అసత్య మయ కర్మలు, చౌర్యమువంటి కర్మలు ఎన్నటికిని ఫలత్యాగ పూర్వకముగ చేయబడవు. ఫలత్యాగమను ఒరపిడి ఱాతిపై ఒరసినంతనే ఈ కర్మలు గాలిలో నెగిరిపోవును. సూర్యకాంతి వ్యాపించినంతనే వస్తువులన్నియు ధగధగ ప్రకాశించును. అట్లని వానితోపాటు అంధకారముకూడ ప్రకాశించునా ? అది మాత్రము అదృశ్యమై పోవును. నిషిద్ధ, కామ్యకర్మలగతికూడ ఇంతే. మనము సమస్త కర్మలను ఫలత్యాగమను ఒరపిడిఱాతిపై ఒరసిచూడవలె. మనము చేయదలచిన కర్మలను అనాసక్తి పూర్వకముగ, లేశమాత్రమేని ఫలాపేక్ష లేకుండ చేయుట సాధ్యమగునా కాదా యని మొదటనే తేల్చుకొనవలెను. ఫలత్యాగమే కర్మాచరణకు ఒరిపిడిఱాయి. ఈ విధమైన పరీక్షలో కామ్యకర్మలు నిరాక్షేపణగా త్యాజ్యములగుచున్నవి. అట్టి కర్మలను విడుచుటే ఉచితము. ఇక మిగులునవి శుద్ధసాత్త్విక కర్మలు. వానిని అనాసక్తి పూర్వకముగను, అహంకార రహితముగను చేయవలెను. కామ్యకర్మలను త్యజించుట కూడ కర్మయే యగును. ఫలత్యాగమను కత్తెరను కామ్యకర్మలపైగూడ నడుపుము. కామ్య కర్మలను త్యజించుటకూడ సహజముగ జరుగవలెను.

ఇట్లు మూడువిషయములను మనము గమనించినారము. మనముచేయు కర్మలన్నిటిని ఫలత్యాగపూర్వకముగ చేయవలెననునది మొదటిది. రాజసతామస కర్మలు అనగా నిషిద్ధ, కామ్యకర్మలు ఫలత్యాగమను ఒరపిడిఱాతిమీద ఒరసి చూచి నంతనేవాని యంతట నవే రాలిపోవును. ఇది రెండవది. ఈ విధముగ చేసిన త్యాగముపైకికూడ ఫలత్యాగమను కత్తెరను పోనిచ్చి చూడుము. నేనింతత్యాగ మును చేసితి నని గర్వపడరాదు. ఇది మూడవది.

రాజస తామసకర్మలు ఎందువలన త్యాజ్యములు ? అవి పరిశుద్ధములు కావు కనుక। పరిశుద్ధములు కానందున కర్తయొక్క చిత్తముపై వాని సంస్కారము పడును. లోతుగ యోజించినమీదట సాత్త్వికకర్మలుకూడ దోషయుత ములు కాగలవని తేలుచున్నది. కర్మలన్నిటిలోను ఏదో కొంతదోషముండనే యుండును. సేద్య మను స్వధర్మమును చూడుడు. ఇది శుద్ధసాత్త్వికక్రియ. కాని యజ్ఞమయమును స్వధర్మమును అగు ఈ సేద్యములోకూడ హింసయున్నది. దున్నుట మొదలగుపనులలో ఎన్నోజీవులు చచ్చుచుండును. నూతిచుట్టునున్న మురికిగుంటలు బాగుచేయునప్పుడుకూడ చాల కృమికీటకములు చచ్చిపోవును. ఉదయమున తలుపు తెరచినంతనే సూర్యరశ్మిలోపలికి ప్రవేశించును. అసంఖ్యా

కములైన జీవాణువులు నశించును. శుద్ధీకరణము (స్టెరలైజేషన్) లో నున్నది కృమినాశనమేకదా ? స్వధర్మరూపమైన సాత్విక కర్మకూడ దోషయుతమైనచో ఇక చేయవలసినదేమి ? యనునదే చివరకు మిగులు ప్రశ్న.

మానవునిలో సద్గుణము లింకను వికాసమును పొందవలసియే యున్నవని నేను ముందే చెప్పియున్నాను. జ్ఞానము, భక్తి, సేవ, అహింస – వీనిలో మన మిప్పటికి పొందిన యనుభవములు అతిస్వల్పములే. సంపూర్ణానుభవమును పొందితిమని చెప్పలేము. ప్రపంచము అనుభవములను పొందుచు పురోగమించుచుండును. సేద్యములో హింసయున్నది కనుక అహింసాపరులు అవృత్తిని చేయరాదని, వ్యాపారము చేయవచ్చునని ఒక వాదము మధ్య యుగములో బయలుదేరెను. అన్నోత్పత్తి పాపమని, ధాన్యము విక్రయించుట పాపముకాదని వారిమతము. కాని యీ విధముగ పనులను తప్పించుకొనుటలో మనకు శ్రేయస్సులేదు. మనుష్యులు కర్మల నాచరించు విషయమున ఇట్లు వెనుకముందాడుచున్నచో చివరకు ఆత్మనాశము తప్పదు. కర్మలనుండి తప్పించుకొను ఆలోచనలు పెరుగుచున్నకొలది కర్మభారము అధికమగుచుండును. ఒకడు ధాన్యపువ్యాపారము చేయవలెననిన మరియొకడు భూమిని దున్ని సేద్యము చేయవలదా ? అప్పుడు సేద్యమువలన కలుగు హింసలో బేరగాడుమాత్రము భాగస్వామికాడా ? ప్రత్తి పండించుట పాపమైనచో ప్రత్తిని అమ్ముటకూడ పాపమే. ప్రత్తిని పండించుటలో దోషమున్నదని ఆపనినే వదలుట అవివేకము. ఈ కర్మవలదు, ఆ కర్మవలదు, ఏ కర్మయును చేయరాదని సమస్తకర్మలను బహిష్కరించుదృష్టి గలవానికి నిక్కమగు ప్రేమభావము నశించును. అట్టివాడు మృతప్రాయుడగును. ఆకులు కోయుటవలన చెట్టు చావదుసరికదా క్రొత్తచిగురుపట్టి అది కడుంగడు శోభిల్లును. సాత్వికకర్మలు చేయుటలో వెనుకముందాడుట ఆత్మను సంకుచితపరుచుకొనుటయే !

## 103. క్రియలనుండి విముక్తికి సరియగు మార్గము

క్రియ లన్నిటిలోను దోషమున్నచో అన్నిక్రియలను ఏల వదలివేయరాదు? అనునది తరువాతిప్రశ్న. దీనికి ప్రత్యుత్తర మిదివరకు ఒకసారి యీయబడియే యున్నది. "సర్వకర్మత్యాగ" మను భావన చాలసుందరము ఆకర్షణీయము అయినది. కాని అసంఖ్యాకములైన ఈ కర్మలనన్నిటిని వదలుట యెట్లు? రాజస తామసకర్మలను వదలుటకున్న పద్ధతియే సాత్వికకర్మల వదలుటకుకూడ వర్తించునా ? దోషయుతమగు సాత్వికకర్మలనుండి తప్పించుకొనుటయెట్లు ?

ఇందున్న చమత్కారమిది: "ఇంద్రాయతక్షకాయస్వాహా" అన్నట్లు మనుష్యుడు ప్రపంచమున మెలగ నారంభించినపుడు ఇంద్రు డమరుడగుటవలన చనిపోడు. తక్షకుడుకూడ చనిపోడుసరికదా అతడు మరింత బలమును చేకూర్చుకొని సురక్షితుడగును. సాత్వికకర్మలలో పుణ్యమున్నదికాని కొంచెము దోషమును కలదు. కాని కొంచెముదోష ముండుటవలన ఆదోషముతోపాటు పుణ్యమును కూడ ఆహుతిచేయ దలచినచో పుణ్యక్రియలు బలిష్ఠములు కాన నశించవు. దోష క్రియలు అవశ్యము వర్ధిల్లుచుండును. మిశ్రితము, వివేకహీనము అగు ఇట్టి త్యాగమువలన పుణ్యస్వరూపు డగు ఇంద్రుడు మరణించడు. దోషయుతుడగు తక్షకుడుకూడ చావదగియుండియు చనిపోడు. కాగా సాత్వికకర్మలను త్యజించు విధాన మెట్టిది ? పిల్లి హింసచేయునని దానిని త్యజించినచో ఎలుకవలనిహింస పెరిగిపోవును. పాములు హింసచేయునని వానిని నిర్మూలించినచో కోట్లకొలది జంతువులు పంటలను నాశనము చేయును. ఆహారధాన్యములు నష్టమగుటవలన వేలకొలదిజనులు చనిపోవుదురు. కనుక త్యాగము వివేకయుక్తముగ నుండ వలెను.

"ఇస్ లడకేకో థోలా ?" అని మచ్ఛీంద్రనాథుడు తన శిష్యుడగు గోరక నాథునితో అనెను. అప్పుడు గోరకనాథుడు కుఱ్ఱవానికాళ్ళను పట్టుకొని వానిని జాతిబండపై ఉతికి దండెముపై ఆరవేసెను. "కుఱ్ఱవానిని శుభ్రపరచి తీసికొని వచ్చితివా ?" యని మచ్ఛీంద్రనాథు డడిగెను. "ఆహా ! ఉతికితెచ్చి ఆరవేసితి" నని గోరకనాథుడు జవాబిచ్చెను. పిల్లవానిని కడుగవలసిన దిట్లేనా? గుడ్డలను, మనుష్యులను శుభ్రపరచుపద్ధతి యొకటికాదు. ఈ రెండు పద్ధతులలోను చాల వ్యత్యాసమున్నది. ఇందువలననే రాజస, తామసకర్మలను త్యజించుటలోను సాత్వికకర్మలను త్యజించుటలోను చాల వ్యత్యాసమున్నది. సాత్విక కర్మల త్యజించుపద్ధతి వేరు.

వివేకహీనులమై కర్మనాచరించుటవలన వ్యవహారము కొంత తారుమారు కాక తప్పదు. 'త్యాగమునుండి భోగముకల్గును. ప్రభూ ! అపుడు నేనేమి చేయ వలెను' అని తుకారాము అనెను.

అల్పత్యాగముచేసినను అధికభోగమువచ్చి పైబడును. అందువలన ఆ చిన్నత్యాగముకూడ మిథ్యయైపోవును. అల్పత్యాగము చేసిన వానికి గూడ పెద్దపెద్ద ఇంద్రభవనములను కట్టించి యిత్తుము. ఈ భవనములకంటె

* "థో" అనుక్రియకు శుభ్రపరుచుట, ఉతుకుట అని రెండర్థములు కలవు.

ముందుండిన గుడిసెయే మంచిది. అదే చాలును. కౌపీనము ధరించి చుట్టుపట్లనున్న వారిసంపదను సేకరించు కొనుటకంటె చొక్కా, కోటు వేసికొని యుండుటయే మంచిది. ఇందుచేతనే సాత్వికకర్మలను త్యజించుపద్ధతియే వేరని భగవంతుడు చెప్పినాడు. సాత్వికకర్మ లన్నిటిని చేయవలసియే యున్నాము. కాని వాని ఫలమును త్యజించవలెను. కొన్ని కర్మలు మూలములోనే త్యాజ్యములు. మరికొన్నిటిలో ఫలములనే త్యజింపవలయును. శరీరమున కేదైన మసి యంటినచో దానిని కడిగి శుభ్రపరుపవచ్చును. కాని మొదలు శరీరము రంగే నలుపైనచో దానికి తెలుపుపట్టించిన నేమిలాభము? ఆ నలుపురంగు నట్లే యుండనిమ్ము. దానివంక చూచు టెందులకు? అది యమంగళమని తలపకుము.

ఒకానొకడు తన యింటిలో నుండుట అమంగళమని తోచి మరొక గ్రామమునకు వెళ్ళిపోయెను. అదికూడ అతనికి అశుభముగనే కనబడినందున అరణ్యములోనికి పోయెను. అక్కడ అతడొక మామిడి చెట్టుక్రింద కూర్చుండి యుండగా పక్షి యొకటి వాని తలమీద రెట్టవేసెను. "ఈయడవి కూడ అమంగళమే" అని తలంచి వాడు వెళ్ళి నదిలో నిలబడెను. నదిలోకూడ పెద్ద చేపలు చిన్నచేపలను తినుచుండుటచూచి అతడు చాల దుఃఖించెను. "అరే! ఏమిది? ఈ సృష్టియంతయు అమంగళమేనా? ఇక మరణమే తరణోపాయము" అని తలచి అతడు నీటినుండి బయటికివచ్చి చితిపేర్చి నిప్పుముట్టించెను. ఒక సజ్జను డటుపోవుచు, "సోదరా! ఎందుల కీ చనిపోవు ప్రయత్నము?" అని యడిగెను. "ఈ సృష్టియంతయు అమంగళము కనుక" అని యతడు జవాబిచ్చెను. అప్పు డా సజ్జను డిట్లనెను- "యీ మురికి శరీరమును, అందున్న క్రొవ్వుపదార్థమును అగ్నిపాలు చేసినచో ఎంత దుర్గంధము వ్యాపించును? మే మీ సమీపముననే నివసించుచున్నాము. మే మేమి కావలెను? ఒక్కతల వెంట్రుక కాలినచో ఎంత దుర్గంధము బయలుదేరును? ఇక నీ శరీరములోని క్రొవ్వంతయు తగులబడినచో ఎంత దుర్గంధము వ్యాపించునో కొంచెము యోజింపుము". అప్పుడా మనుష్యుడు— "ఈ ప్రపంచములో బ్రతుకుట కవకాశములేదు, మరణించుటకును లేదు. కాని ఇప్పుడేమి చేయవలె!" అని వివశుడై బదులు చెప్పెను.

తాత్పర్యమిది : అశుభమని చెప్పి మన మన్నిటిని బహిష్కరించినచో జీవితమే నడువదు. చిన్నపనులనుండి తప్పుకొనవలెనని నీవు తలచినచో మరి

కొన్ని పెద్దపనులువచ్చి పైబడును. కర్మలను బాహిరముగ చేయనంత మాత్రమున అవి నిన్ను వదలిపోవు. సహజప్రాప్తమగు కర్మను త్రోసివేయుటలో తనశక్తిని వెచ్చించి ప్రవాహమున కెదురీదువాడు అలసి ఆ ప్రవాహముతోపాటు కొట్టుకొనిపోవును. ప్రవాహమున కనుకూలమగు క్రియలతోనే తాను తరించు ఉపాయమును మానవు డన్వేషించవలె. దీనివలన మానసిక బంధనములు తగ్గి చిత్తశుద్ధి పెరుగును. తరువాత మెల్లమెల్లగా క్రియలు వానియంతటనవే లుప్తములగును. కర్మలను త్యజింపకుండనే క్రియలు లుప్తములగును. కర్మలు వదలి పోవు; క్రియలు మాత్రము లోపించును.

కర్మలకును క్రియలకును భేద మున్నది. ఉదాహరణకు ఒకచోట జరుగుచున్న గందరగోళమును ఆపవలెననుకొనుడు. సిపాయి యొకడు పెద్ద పెట్టున అరచుచు "అల్లరి చేయకుడు" అనును. ఆగల్లంతును మాన్పుటకు బిగ్గరగ కేకవేయునట్టి తీవ్రకర్మను అతడు చేయవలసి వచ్చెను. ఆపరిస్థితిలోనే మరియొకడువచ్చి ఏమియు మాటలాడక వ్రేలు చూపినంతనే ప్రజలు శాంతించి రనుకొనుడు. విశేషయోగ్యతకల మూడవవాడు మరియొకడు అక్కడ ఊరక ఉన్నంతమాత్రముననే శాంతి యేర్పడినదనుకొనుడు. మొదటివాడు తీవ్రమైనక్రియను చేయవలసివచ్చెను. రెండవవాని క్రియ అంతకంటె కొంత సౌమ్యముగ నుండెను. ఇక మూడవవాని క్రియ కేవలము సూక్ష్మము. ఇట్లు క్రియలస్వరూప మంతకంతకు తగ్గుచు వచ్చినది. కాని ప్రజలను శాంతిపరచు కర్మను ముగ్గురును సమానముగనే యాచరించిరి. మనుష్యునిలో చిత్తశుద్ధి పెరిగినకొలది క్రియల తీవ్రత తగ్గుచుండును. తీవ్రమునుండి సౌమ్యము, సౌమ్యమునుండి సూక్ష్మము, సూక్ష్మమునుండి శూన్యము అగుచు పోవును. కర్మ యొక వస్తువు, క్రియ మరియొకటి. కర్తకు ఇష్టతమమైనదే కర్మ. ఇదే కర్మకు నిర్వచనము. (వ్యాకరణ శాస్త్రమున) కర్మకు ప్రథమా ద్వితీయా విభక్తులు వాడినచో క్రియకు స్వతంత్ర క్రియాపదమును వాడవలసి యుండును.

కర్మకును క్రియకును రెండు వ్యత్యాసములు గమనింపుడు. కోపము వచ్చినపుడు ఒకడు బిగ్గరగా అరచియు మరియొకడేమియు మాటలాడకయు తమ కోపమును ప్రకటింతురు. జ్ఞాని క్రియలను లేశమాత్రమును చేయడు. కాని కర్మల ననంతముగ చేయుచుండును. తన అస్తిత్వమాత్రముచేతనే లోకసంగ్రహము నపారముగ చేయగలుగును. అట్టి జ్ఞానియొక్క ఉనికియే చాలును.

చేయి, కాలు మొదలగు అవయవములతో నేమియు చేయకున్నను అతడు కర్మ లను చేయుచునేయుండును. క్రియలు సూక్ష్మమగుచున్నకొలది కర్మ లధిక ముగ జరుగుచుండును. ఈ దృష్టిని పొడిగించి చిత్తపారిశుధ్యమును పూర్ణము గావించుకొన్నచో చివరకు క్రియలు శూన్యమై కర్మలు మాత్రము అనంతముగా జరుగుచుండునని చెప్పనగును. మొదట తీవ్రము, తరువాత తీవ్రమునుండి సౌమ్యము, సౌమ్యమునుండి సూక్ష్మము, సూక్ష్మమునుండి శూన్యము – ఇట్లు క్రమముగ క్రియాశూన్యత దానియంతట అదే ప్రాప్తమగును. కాని అప్పుడు కర్మ లనంతములుగ వానియంతట నవే జరుగుచుండును.

బాహ్యముగ కర్మలను దూరము చేసినందువలన అవి దూరము కావు. నిష్కామబుద్ధితో కర్మలుచేయుచుపోగా మెల్లమెల్లగా వాని వలన అనుభవము కలుగుచుండును. "మిథ్యాచారుడగు మతాధికారి" అను పద్య మొకటి బ్రౌనింగుకవి వ్రాసెను. "మీ రెందుల కింతగా అలంకారము చేసికొందురు ? ఈ పెద్ద అంగరకా యెందులకు ! ఈ వేష మేమిటి ? గంభీరమగు ఈ వాలక మెందులకు ?" అని యొకడు మతాధికారి నడిగెను. దాని కతడిట్లు జవా బిచ్చెను : "ఇదంతయు నే నెందులకు చేయుచున్నానో చెప్పెదను వినుము. ఈ నాటకమును, ఈ యనుకరణను జరుపగా జరుపగా ఎప్పుడో ఒకప్పుడు నాకు తెలియకుండగనే నాలో శ్రద్ధ ప్రవేశింపవచ్చునని నా యాశ." కనుక క్రియ లను నిష్కామముగ చేయుచుండవలె. రానురాను నిష్క్రియత్వముకూడ ప్రాప్తమగును.

## 104. సాధకునికి స్వధర్మమే పరిష్కార మార్గము

సారాంశ మేమనగా : రాజసకర్మలను పూర్తిగ వదలివేయవలె, సాత్త్విక కర్మలను చేయుచుండవలెను. సహజ స్వాభావికరూపమున ఎదుటికివచ్చు సాత్త్వికకర్మలు దోషయుతములైనప్పటికిని అవి త్యాజ్యములు కావనువివేకము మనలో నుండవలెను. దోషము లున్నచో ఉండనిండు. ఆ దోషములనుండి తప్పించుకొన గోరినచో అసంఖ్యాకములైన ఇతర దోషములు వచ్చి పైబడును. చట్టి ముక్కును ఉన్నట్లే యుండనిమ్ము. దానిని కోసి సుందరముగ చేయ యత్నించినచో, అది మరింత భయంకరమును వికృతమును కాగలదు. దానిని యథాస్థితముగానే ఉంచుట మంచిది. సాత్త్వికకర్మలు దోషయుతము లైనప్పటి కిని సహజప్రాప్తములగుటచే వానిని వదలరాదు. వాని నాచరింపవలెను. కాని వాని ఫలమును మాత్రము వదలివేయవలెను.

మరియొకమాట చెప్పవలసియున్నది. సహజముగను, స్వాభావికముగను ప్రాప్తముకాని కర్మలు అవశ్యాచరణీయములుగ నీకు కనిపించినను వానిని చేయరాదు. సహజముగ ప్రాప్తించిన కర్మలను మాత్రమే ఆచరింపుము. తొందరపడి పరుగులెత్తి ఇతరనూతన కర్మలను చేయవలె నను జంజాటములో చిక్కుకొనకుము. ఎంతమంచివైనను పెనగులాడి చేయవలసిన కర్మలకు దూరముగ నుండుము. వాని మోహములో పడవలదు. సహజప్రాప్తమైన కర్మల ఫలమే త్యజింపబడగలదు. మానవుడు లోభమువలన 'ఈకర్మమంచిదే, ఆ కర్మయు మంచిదే' అని నలుదిశల పరుగిడుచో ఫలత్యాగమెట్లు సంభవము ? ఇందువలన జీవితమంతయు దుర్గతిపాలగును. ఫలాశచేతనే వాడు పరధర్మ రూపమైన కర్మలను చేయగోరి ఫలమును కూడ కోల్పోవును. వానికి జీవిత ములో నెచ్చటను స్థిరత్వము లభింపదు. కర్మాసక్తి వాని మనస్సునంటుకొని పోవును. సాత్వికకర్మల నాచరించెడుపట్లగూడ లోభముకలిగినచో ఆ లోభ మును కూడ దూరము చేయవలె. సమస్తసాత్విక కర్మలను చేయబూనినచో దానిలో కూడ రాజసము, తామసము వచ్చిపడును. అందువలన సాత్వికము, స్వాభావికము, సహజప్రాప్తము, స్వధర్మము అయిన కర్మలనే చేయు చుండుము.

స్వధర్మములో స్వదేశీయధర్మము, స్వజాతీయధర్మము, స్వకాలిక ధర్మము ఇమిడియున్నవి. ఈ మూడును కలిసి స్వధర్మమగును. ఈ పని నా వృత్తి కనుకూలమా, అనురూపమా, కర్తవ్యకర్మగా నాకు ప్రాప్తించినదా అను ప్రశ్నలను స్వధర్మమును నిశ్చయించుకొనువేళ ప్రతివ్యక్తియు ఎదు ర్కొనవలసి యున్నది. నీలో "నీవు" అనునొక ప్రత్యేకత యుండుటవలననే 'నీవు' అయితివి. ఇట్లే ప్రతివ్యక్తిలోను తన ప్రత్యేక వ్యక్తిత్వముండును. మేకయొక్క వికాసము మేకయై యుండుటలోనే ఉన్నది. అది మేకగా నుండియే వికాసమును పొందవలెను. మేక తాను ఆవుగా కావలెనని కోరుకొనినచో అది సంభవమగునా ? తనకు సహజప్రాప్తమైన రూపమును, వృత్తిని మేక త్యజింపజాలదు. అట్లుకావలెనన్నచో ఈ శరీరమును వదలి తిరిగి అది గోవుగా జన్మించవలె. అది నూతనజన్మమునుపొంది నూతనధర్మమును స్వీకరింపవలె. కాని ఈజన్మలో మాత్రము దానికి మేకగా నుండుటయే పవిత్రమైన ధర్మము. "ఎద్దు-కప్ప" కథ మనము విన్నదేకదా! కప్ప తనశరీరమును పెంచుకొనుటకు ఒకహద్దుకలదు. తాను ఎద్దంతకావలెనని ప్రయత్నించినచో అది చచ్చిపోవును.

ఇంకొకరి రూపమును అనుకరించుట ఉచితముకాదు. ఇందువలననే పరధర్మము భయావహ మని చెప్పబడినది.

స్వధర్మములో ఇంకను రెండుభాగము లున్నవి. మార్పుచెందు నదొకటి, మారనిది యొకటి. నేడు నేనేదైయున్నానో రేపు అదికాను. రేపేదో ఎల్లుండి అదికాను. నేను నిరంతరమును మార్పుచెందుచుందును. పెరుగు చుండుటయే బాల్యావస్థయొక్క స్వధర్మము. యౌవనములో కర్మశక్తి పుష్క లముగ నుండును. అందువలన తద్ద్వారా సమాజసేవ చేయుదును. ప్రౌఢావస్థలో నేనుపొందిన జ్ఞానలాభము ఇతరులకు కూడ లభించును. ఇట్లు స్వధర్మములో నొకభాగము మార్పుచెందుచుండును. మరియొకభాగము ఏ మాత్రమును మార్పుచెందదు. వీనిని శాస్త్రీయపరిభాషలో వర్ణధర్మము, ఆశ్రమధర్మము అని యందుము. మారనిదివర్ణధర్మము. మార్పుచెందునది ఆశ్రమధర్మము.

ఆశ్రమధర్మములు మారుట యనగా బ్రహ్మచర్యావస్థను వదలి గృహస్థా శ్రమములో ప్రవేశించుట; గృహస్థాశ్రమము నుండి వానప్రస్థములోను, వాన ప్రస్థమునుండి సంన్యాసములోను ప్రవేశించుట. ఇట్లు ఆశ్రమధర్మములు మారుచున్నను వర్ణధర్మములు మార్పుచెందనేరవు. మానవుడు తనకు నైసర్గికములగు హద్దులను దాటజాలడు. అట్టి ప్రయత్నమే కృత్రిమమైనది. నీది యనదగు వ్యక్తిత్వమును నీవు వదలలేవు. ఇదే వర్ణధర్మమునకు పునాది. వర్ణధర్మము యొక్క భావన చాలమధురమైనది. అట్లని వర్ణధర్మమున కేమియు చలనములేదా? మేకలోని మేకతనము, గోవులోని గోవుతనమువంటి దేనా బ్రాహ్మణుని బ్రాహ్మణత్వము, క్షత్రియుని క్షత్రియత్వము? అని కొందరు ప్రశ్నింతురు. వర్ణధర్మమింత గట్టిపారినది కాదు. కాని ఇందలి స్వారస్యమును మనము గమనింపవలెను. సమాజవ్యవస్థా నిర్మాణమునకు వర్ణ ధర్మమును ప్రయోగించుపట్ల కొన్ని తగ్గింపులుండకతప్పదు. అట్టి తగ్గింపులను స్వీకరింపవలసియే యుండును. గీతకూడ వీనిని ఆమోదించును. ఈ రెండు విధములగు ధర్మములను మనము గుర్తింపవలెను. అవాంతరముగ వచ్చు ఇతర ధర్మములు ఎంత సుందరముగను, మోహజనకముగను భాసించినను వానిలో చిక్కుకొనరాదు.

**105.** ఫలత్యాగమువలన గల్గు ఫలితార్థముల సముదాయము

ఫలత్యాగముయొక్క భావనను విపులీకరింపగా ఈ క్రింది ముఖ్య విషయ ములు తేలుచున్నవి :

1. రాజసతామస కర్మల సంపూర్ణ త్యాగము.

2. ఆ త్యాగమువలన కలుగు ఫలమునుకూడ త్యజించుట; అనగా ఆ త్యాగమును గూర్చిన అహంకారముకూడ లేకుండుట.

3. సాత్విక కర్మలను త్యజింపకుండ వాని ఫలములను మాత్రమే త్యజించుట.

4. సాత్వికకర్మలు దోషయుతములైనను వానిని ఫలత్యాగ పూర్వకముగ ఆచరించుట.

5. ఫలత్యాగపూర్వకముగ ఆ సాత్వికకర్మలను నిరంతరమును ఆచరించుచుండుటవలన చిత్తశుద్ధి కలుగుచుండును. తీవ్రమునుండి సౌమ్యము, సౌమ్యమునుండి సూక్ష్మము, సూక్ష్మమునుండి శూన్యము – ఇట్లు క్రియల యొక్క స్వరూపము లుప్తమగుచుండును.

6. క్రియలు లుప్తమయినను లోకసంగ్రహ రూపమైన క్రియలు జరుగుచునే యుండును.

7. సహజప్రాప్తములగు సాత్వికకర్మలనే చేయవలెను. సహజ ప్రాప్తములు కానివి ఎంత మంచివైనను వానికి దూరముననే యుండవలె. అట్టికర్మల యెడ మోహము ఉండరాదు.

8. సహజప్రాప్తమైన స్వధర్మముకూడ రెండు విధములుగ నుండును– మార్పు చెందునది, మార్పు చెందనిది. వర్ణధర్మము మార్పు చెందదు. కాని ఆశ్రమధర్మము మారుచుండును. మార్పుచెందు స్వధర్మము మారుచునే యుండవలె. దాని వలన ప్రకృతి పరిశుద్ధమగుచుండును.

ప్రకృతి ప్రవాహము నిరంతరమును పారుచునే యుండవలె. నది ప్రవహింపనిచో దానినుండి దుర్గంధము బయలుదేరును. ఆశ్రమ ధర్మముయొక్క స్థితియు ఇంతే! మనుష్యునకు మొదట లభించునది కుటుంబము. అతడు తన వికాసముకొరకు తన్ను కుటుంబముయొక్క బంధనలతో బంధించుకొనును. అత డిక్కడ వివిధములైన అనుభవములను పొందును. కాని అతడు కుటుంబియైన పిమ్మట కుటుంబమునందే చిక్కుకొనిపోయినచో వినాశము నొందును. మొదట ధర్మయుతమైన కుటుంబజీవనమే ఇప్పుడు అధర్మరూపమును పొందును. ఎందువలన ననగా ఇప్పుడా కుటుంబధర్మము బంధన కారణ

మైనది. మార్పు చెందెడు ధర్మమును ఆసక్తిచే వదలని యెడల దాని పరిణామము భయానక మగును. మంచి పనుల యెడలగూడ ఆసక్తి పనికిరాదు. ఆసక్తివలన ఘోరమైన అనర్థము వాటిల్లును. క్షయ కీటాణువులు పొరపాటున నైనను ఊపిరితిత్తులలో ప్రవేశించినచో అవి లోపలినుండి జీవితమును తిని వేయును. ఆ విధముననే ఆసక్తి యను కీటాణువులు కూడ మన యజాగ్రత్త వలన సాత్విక కర్మలో ప్రవేశించెనేని : వానివలన స్వధర్మము క్రుళ్ళ నారంభించును. ఆ సాత్విక స్వధర్మములందుగూడ రాజసతామసే దుర్గంధము బయలుదేరును. అందువలన మార్పు జెందు ఈ కుటుంబ స్వధర్మము సమయోచితముగ వదలిపోవలెను. రాష్ట్ర ధర్మమునకుగూడ ఇదే వర్తించును. రాష్ట్ర ధర్మమునందుగూడ ఆసక్తి పొడచూపి స్వరాష్ట్రహితమునే మనము కోరుకొన్నచో, అట్టి రాష్ట్రభక్తి చాలభయంకర రూపమును దాల్చును. దీని వలన ఆత్మవికాసము ఆగిపోవును. చిత్తమునందు ఆసక్తి స్థిరపడి జీవితము అధఃపతనము నొందును.

## 106. సాధనయొక్క తుదిమెట్టే సిద్ధి

సారాంశము : జీవితమును సఫలము చేసికొనదలచినచో ఫలత్యాగమను చింతామణిని చేపట్టుము. అది నీకు మార్గదర్శకమగును. ఈ ఫలత్యాగ తత్త్వము తన హద్దులనుకూడ అదే సూచించును. మన మీ దీపపు వెలుగులో నున్నందువలన ఏ కర్మలు చేయవలెను, ఏవి మానవలెను, ఏవి యెప్పుడు మార్పు చేయవలె నను విషయము దాని యంతట నదే మనకు విదితమగు చుండును. అప్పుడు మరియొక విషయమును యోజింపవలసియున్నది. క్రియలు సంపూర్ణముగ లోపించెడు అంతిమ స్థితివిషయమై సాధకుడు యోజింపవలెనా లేదా ? క్రియ లేమియు చేయకున్నను, జ్ఞానివలన అసంఖ్యాకములగు కర్మలు జరుగుచుండును. కాన సాధకు డీ స్థితిని తన లక్ష్యమునం దుంచుకొనవలెనా ?

అక్కరలేదు; ఇక్కడకూడ ఫలత్యాగ మను ఒరపిడి జాతినే ఉపయోగింపుము. కావలసిన వస్తువుపై మనదృష్టిని పెట్టుకొనక పోయినను మన కది లభించుచుండును. మానవజీవితములో నున్న సౌందర్యమిదియే. మోక్షమే జీవితమునకు సర్వోత్కృష్టమైన ఫలము, మోక్షమన ఈ యకర్మావస్థను గూర్చి కూడ మనకు లోభము లేకుండుట. మనకు తెలియకుండగనే ఆ స్థితి దాని యంత నదే లభించును. సరిగా రెండు గంటల అయిదు నిమిషములకు ఆకస్మి

కముగ వచ్చి పై బడు వస్తువుకాదు సంన్యాసము. అది యంత్రముపై తయారయి వచ్చువస్తువుకాదు. నీ జీవితములో సంన్యాసమెట్లు వికాసమును పొందుచున్నదియు గూడ నీవు తెలిసికొనలేవు. కనుక మోక్షచింతను విడనాడుము.

“నీపై నాకు భక్తికుదిరిన చాలును. మోక్ష మను అంతిమఫలము నాకక్కరలేదు” అని భక్తు డెల్లపుడును భగవంతునితో ననుచుండును. ముక్తి కూడ నొక విధమైన భక్తియే. మోక్ష మొకరకమైన భోగమే. ఒక ఫలమే. ఈ మోక్షమను ఫలముపై కూడ ఫలత్యాగ మను కత్తెరను నడుపుము. ఇందువలన మోక్షము లభించకపోదు. కత్తెరయే విరిగిపోవును. ఫలము మరింత దృఢతర మగును. మోక్షమును గూర్చిన ఆశను వీడినంతనే, తెలియకుండ నీవు మోక్షము వైపునకు సాగిపోదువు. మోక్షమును తలపునకైన రానీయక సాధన యందే నిమగ్నుడవు కమ్ము. అప్పుడు వెదకుకొనుచు మోక్షము నీ యెదుటికి వచ్చి నిలుచును. సాధకుడు తన సాధనలోనే తన్మయుడై యుండవలె.

“మా తే సంగోఽస్త్వకర్మణి”

అకర్మస్థితిని, అనగా మోక్షమును గూర్చిన ఆసక్తిని పెట్టుకొనవలదని భగవంతుడు మొదటనే చెప్పియున్నాడు.

“అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః” అని భగవానుడు ఇప్పుడు చివరకు తిరిగి చెప్పుచున్నాడు. “నేను మోక్షము నీయగల సమర్థుడను. దానిని గూర్చినచింత నీకు వలదు. నీ సాధనను గూర్చి మాత్రమే జాగరూకుడ వగుము”.

మోక్షమును విస్మరించుటవలన సాధన ఉత్కృష్టమగును. అప్పుడు మోక్షమే నిన్ను వరించి నీచెంతకు వచ్చును. మోక్షము నెడల నిరపేక్షవృత్తి గల్గి తనసాధనయందే నిమగ్నుడగు వాని కంఠమున మోక్షలక్ష్మి జయమాల వేయును.

సాధన తుదిమెట్టునకు చేరినచోట సిద్ధి చేతులు జోడించి ప్రత్యక్షమగును. ఇల్లు చేరవలసినవాడు ఏ చెట్టు క్రిందనో నిలిచి, ఇల్లు ఇల్లని జపము చేసిన ఇంటిని సమీపించడు సరికదా, అత డా యడవిలోనే యుండిపోవు దుస్థితి కలుగును. ఇంటిని స్మరించుకొనుచు మార్గమునందే విశ్రాంతి తీసికొన్నచో అంతిమ విశ్రాంతి స్థానము నతడు చేరనేరడు. విరామములేకుండ నడచి పోయినచో అంతలో ఇల్లు చేరగలడు. మోక్షమునుగూర్చి ఊరక స్మరించు

చుండుటచే మానవుని సాధనలో శిథిలత ప్రవేశించి మోక్షము దూరమైపోవును. మోక్షమునుగూర్చి ఉపేక్షవహించి నిరంతర సాధనలో నిమగ్నుడై యుండుటయే మోక్షమును దగ్గరకు తెచ్చుకొను ఉపాయము. అకర్మస్థితిని అనగా విశ్రాంతినిగూర్చిన లోభమును మాత్రము పెట్టుకొనకుము. సాధనమప్రేమతో సాగించినపుడే మోక్షము నీ యెదుటికి రాగలదు. 'ప్రత్యుత్తరము, ప్రత్యుత్తరము' అని కేకలు పెట్టినమాత్రమున ప్రశ్నకు సమాధానము రానేరదు. ప్రత్యుత్తర మిచ్చు పద్ధతి తెలిసినప్పుడే సరియగు జవాబు లభించగలదు. ప్రత్యుత్తరమిచ్చు పద్ధతిని అవగతము చేసికొనుటలోనే సమాధాన మిమిడి యున్నది. సమాప్తికి పూర్వమే సమాప్తి యెట్లు సంభవము ? విషయమును గ్రహించక పూర్వమే ప్రత్యుత్తర మెట్లు రాగలదు ? సాధకావస్థలో సిద్ధావస్థ యెట్లు ప్రాప్తించును ? నీటిలో మునుకలు వేయుచునే, ఒడ్డెక్కిన తరువాత పొందు ఆనందమునుగూర్చి ధ్యానము చేసినచో ప్రయోజన మేమున్నది ? నీటిలోనున్నపుడు బారలువేసి ఒడ్డునకుచేరు ప్రయత్నములోనే శక్తి నెల్లను కడుశ్రద్ధతో వినియోగింపవలెను. మొదట సాధనను పూర్తిచేయుము. సముద్రమును లంఘించుము. తరువాత మోక్షము దానియంతటనదే తప్పక లభించును.

## 107. సిద్ధపురుషునియొక్క త్రివిధభూమిక

జ్ఞానియొక్క అంతిమావస్థలో క్రియలన్నియు లుప్తమై శూన్య రూపమును పొందును. అంతిమస్థితియందు క్రియలుండనేయుండవని దీని యర్థముకాదు. అతనిద్వారా క్రియలు జరుగుచును ఉండును, జరుగకయును పోవును. ఈ అంతిమస్థితి అత్యంత రమణీయము, ఉదాత్తము. ఈ స్థితియందేమి జరిగినను దానినిగూర్చిన చింత అతనికుండదు. జరుగునదంతయు శుభకరము, సుందరము అగును. ఇది సాధనయొక్క తుదిమెట్టు. ఇక్కడ సాధకుడు అన్నియు చేయుచునే ఏమియు చేయనివాడగును. సంహారము చేసినను చేసినవాడు కాడు. కల్యాణమును చేకూర్చియు చేకూర్చినవాడుకాడు.

ఈ మోక్షావస్థయే సాధకుని సాధనకు తుదిమెట్టు. సాధనకు తుదిమెట్టు అనగా సాధనయొక్క సహజావస్థ. అపుడు 'నేనేదో చేయుచున్నా' నను భావన కూడ ఉండదు. ఇది సాధనయొక్క నైతిక స్థితియని నే నందుము. సిద్ధావస్థ నైతికావస్థకాదు. చిన్నకుఱ్ఱవాడు సత్యము పలుకును. కాని యది నైతికకార్యమనబడదు. ఏలయన అసత్యమననేమో వాడెరుగనే యెరుగడు. అసత్యమననేమో తెలిసిన తరువాతకూడ సత్యముపలికినచో అది నైతికకర్మయగును.

సిద్ధావస్థలో అసత్యములేనేలేదు. అక్కడనున్నది సత్య మొక్కటే. అందు వలన అక్కడ నీతియను ప్రశ్నలేదు. నిషిద్ధ విషయము లక్కడ నిలవనేలేవు. విననిచ్ఛగింపనిమాటలు చెవికెక్కనే యెక్కవు. చూడగోరని దృశ్యములను కన్ను చూడనే చూడదు. చేయదగిన పనులనే చేతులు చేయుచుండును. ఇందు లకు ప్రయత్నింపవలసిన పనియే యుండదు. చేయరాని పనులు వానియంతట నవే తొలగిపోవును. పనిగట్టుకొని వానిని వదలనక్కరలేదు. ఇదే నీతి శూన్యా వస్థ. సాధనకు తుదిమెట్టయిన ఈ సహజావస్థ – లేక – అనైతికత – లేక – అతినైతికతలోనే ఉత్కృష్టమగు నైతిక మహత్త్వమున్నది. నాకు స్ఫురించిన 'అతినైతికత' అను నీ శబ్దము చాల బాగుగానున్నది. ఈ స్థితిని సత్వగుణా తీతమైన సాత్విక సాధన యని అనవచ్చును.

ఈ దశనెట్లు వర్ణింపగలము ? గ్రహణమునకు పూర్వము దాని ప్రభా వము కనబడినట్లే మరణానంతరము లభించెడు మోక్షస్థితి యొక్క నీడ దేహము రాలిపోకమునుపే గోచరింప నారంభించును. దేహధారిగ నుండగనే రానున్న మోక్షస్థితియొక్క అనుభవము కలుగును. ఈ స్థితిని భాష వర్ణింపజాలదు. ఈ స్థితియందున్నవాడు ఎంతహింస చేసినను ఏమియు హింస చేసినవాడుకాడు. వాని క్రియలకు విలువ నెట్లు కట్టగలము ? అతనిద్వారా జరుగు పనులన్నియు సాత్విక కర్మలే. క్రియలన్నియు క్షయమైపోయిన పిమ్మట కూడ అతడు విశ్వకల్యాణమును చేకూర్చును. వీనిని మాటలతో నెట్లు వర్ణింపవలెనో తెలియుటలేదు.

ఈ యంతిమావస్థలో మూడుభావము లున్నవి. (1) వామదేవుని దశ : 'ఈ విశ్వమం దున్న దంతయు నేనే యని అతడు భావోద్రేకముతో ప్రకటించెను. జ్ఞాని నిరహంకారుడుగ నుండును. అతనికి దేహాభిమాన మంతయు నశించును. క్రియలన్నియు క్షయమగును. ఇట్టితరి అతనికి ఒకవిధమగు భావావస్థ సంప్రాప్తమగును. ఆ స్థితి ఒక్కశరీరములో ఇముడనేరదు. ఈ భావావస్థ క్రియావస్థకాదు. ఇది ప్రబలమగు భావనతో కూడినయవస్థ. ఇది కొంతవరకు మన అనుభవములో నున్నదే. కుమారుని దోషములవలన తల్లి దుష్టయు, వాని సద్గుణములచేత గుణవతియు, వాని దుఃఖముల వలన దుఃఖవతియు, వానిసుఖముల వలన సౌఖ్యవతియు అగుచున్నది. కాని తల్లియొక్క భావావస్థ తనసంతానమును మించిపోదు. బిడ్డలయొక్క దోషములను ఆమె తనదోషము లుగ స్వీకరించును. అట్లే జ్ఞాని కూడ భావనోత్కృష్టతవలన ప్రపంచములోని దోషములన్నిటిని తనపై వేసికొనును.

జ్ఞాని త్రిలోకముల పాపములవలన తాను పాపిగను, పుణ్యముల వలన పుణ్యవంతుడుగను అగుచుండును. అట్లయినను ఆ పాపపుణ్యము లతనిని స్పృశింపనేరవు. రుద్రసూత్రమునందు ఋషి — 'యవాశ్చమే, తిలాశ్చమే, గోధూమాశ్చమే' అని యనును. "నాకు యవలనిమ్ము, నువ్వులనిమ్ము, గోదుమలనిమ్ము" ఇట్లడుగుచున్న ఋషియొక్క పొట్ట ఎంత పెద్దదయియుండవలె! కాని యిట్లడుగుఋషి మూడున్నర మూరల శరీరధారియేకాడు. అతనియాత్మ విశ్వాకారమును దాల్చి పలుకుచున్నది. దీనిని వైదికవిశ్వాత్మభావ మని నేనందును. వేదములలో ఈ భావనకు చాలవిశిష్టతకలదు. నరసీమెహతా యను గుజరాతి మహాపురుషుడు 'ఓ యీశ్వరా, నిన్ను కీర్తించు సమయమున కూడ నిద్రవచ్చుపాటిపాపము నేనేమిచేసితిని?' అని కీర్తించును. నిద్రవచ్చినది నరసీమెహతాకా? కాదు, శ్రోతలకు. కాని నరసీమెహతా శ్రోతలతో ఏకరూపమై అట్లడిగెను. జ్ఞానియొక్క భావావస్థ యిట్లుండును. ఈ భావావస్థలో సకలపాప పుణ్యములు అతనిద్వారా జరుగుచున్నట్లు గోచరించును. ఈ విషయమునే అతడు స్వానుభవముగ చెప్పుచుండును. "చేయరాని కార్యములెన్నోచేసితిని, చేయుచున్నాను, చేయుదును" అని ఋషి యనలేదా? ఈ భావావస్థ లభించిన మీదట ఆత్మ పక్షివలె ఎగుర నారంభించును. అది ఈ మృచ్ఛరీరమును దాటి పైకిపోవును.

ఈ భావావస్థవలెనే జ్ఞానికొక క్రియావస్థ కూడ నున్నది. జ్ఞాని తన స్వభావమునుబట్టి ఏమి చేయును? అతడు చేయుపనులన్నియు సాత్వికములే! అతడు శరీరముచే బంధింపబడియున్నను అతని శరీరము, ఇంద్రియములు అన్నియు సాత్వికములయినవి. అందువలన అతడుచేయు క్రియలన్నియు సాత్వికములే! వ్యావహారికముగ చూచినచో సాత్వికతయొక్క తుదిమెట్టు అతని అనుష్ఠానములో గోచరించును. కాని విశ్వాత్మభావముతో చూచినచో త్రిభువనముల పాపపుణ్యములు అత డాచరించుచున్నట్లును, అట్లయ్యు నిర్లిప్తుడయియున్నట్లును కనబడును. ఏలయన ఆత్మను అంటుకొనియున్న శరీరమును అతడు విదిల్చిపారవేసెను. క్షుద్రదేహము నట్లు పారవేసిన మీదటనే అతడు విశ్వరూపమును దాల్చును.

జ్ఞానికి భావావస్థ, క్రియావస్థ కాక జ్ఞానావస్థ యను మూడవ స్థితికూడ కలదు. ఈ స్థితిలో అతడు పాపమును సహింపలేడు. పుణ్యమును సహింపలేడు. రెంటిని విదిల్చి పారవేయును. విశ్వమునకెల్ల నిప్పుముట్టించి తగుల

బెట్టుటకు సమర్థుడగును. ఏ యొక పనికిని బాధ్యత వహించుట కతడు సంసిద్ధుడుకాడు. దాని స్పర్శయే అతడు సహింపలేడు. జ్ఞానియొక్క మోక్ష దశలో అనగా సాధనయొక్క చరమస్థితిలో పైమూడు స్థితులును సంభవించును.

ఈ 'నిష్క్రియావస్థ' అనగా అంతిమదశ ఎట్లు ప్రాప్తించగలదు? మనముచేయు కర్మలయొక్క కర్తృత్వమును మనపై వేసికొనకుండుటను అభ్యసింపవలెను. "నేను కేవలము నిమిత్త మాత్రుడను, కర్మలయొక్క కర్తృత్వము నా మీద లేదు" అని మననము చేయుచుండుము. మొదట ఈ 'అకర్తృత్వవాదముయొక్క భూమికను నమ్రతతో గ్రహింపుము. కాని అంత మాత్రముచేత కర్తృత్వము సంపూర్ణముగ తొలగిపోవునని తలంపకుము. మెల్ల మెల్లగ ఈ భావన వికాసమును పొందును. "నే నతితుచ్ఛప్రాణిని. నే నీశ్వరుని చేతిలోని ఆటవస్తువను. కొయ్యబొమ్మను. అతడు నన్నాడించుచున్నాడు." అను అనుభవమును మొదట పొందుము. అటుపిమ్మట చేయబడు కార్యములన్నియు శరీరముండుటచేతనే జరుగుచున్నవని భావింప ప్రయత్నింపుము. 'వానితో నా కేమియు నిమిత్తములేదు. ఆ క్రియ లన్నియు ఈ శవమునకు (బొందికి) సంబంధించినవి. కాని, నే నీ శవమనుకాను. నేను శివుడను' అని భావింపుము. దేహమను తొడుగుచే లేశమాత్రమును బంధింపబడకుము. ఇట్టి సాధన చేసినమీదట దేహముతో నెట్టి సంబంధమును లేనిస్థితి జ్ఞానికి లభించును. ఆ దశయందు పై మూడవస్థలును అతనికి కలుగును. "త్రిలోకములలోని పాపపుణ్యములను నేను చేయుచున్నను వాని స్పర్శ లేశమాత్రమును నాకంటదు" అనెడు భావావస్థ మొదటిది. అత్యంత నిర్మలములు, ఆదర్శప్రాయములు నగు క్రియలు జరుగు క్రియావస్థ రెండవది. కర్మలను లేశమాత్రమును దగ్గరకు చేరనీయక వాని నన్నిటిని భస్మ మొనరించివేయు జ్ఞానావస్థ మూడవది. ఈ మూడవస్థలద్వారా జ్ఞానిని వర్ణింపవచ్చును.

## 108. తుహీ... తుహీ....తుహీ....తుహీ

నీవే .... నీవే .... నీవే .... నీవే

భగవంతు డర్జునునితో ఇంతవరకు చెప్పి, "అర్జునా, నేను నీకు చెప్పిన దంతయు శ్రద్ధతో వింటివికదా! ఇక బాగుగ యోజించి నీ కుచితమని తోచిన రీతిని చేయుము" అనెను. ఈ విధముగ భగవంతుడు ఔదార్యముతో అర్జునునకు స్వేచ్ఛ నొసగెను. భగవద్గీతలోని విశిష్టత ఇదియే. కాని భగవంతునికి

మరల దయగలిగెను. అర్జునున కీయబడిన ఇచ్ఛాస్వాతంత్ర్యమును భగవంతుడు తిరిగి తీసికొని యిట్లనెను. "అర్జునా! నీ యిచ్ఛను, నీ సాధనను అన్నిటినివదలి నీవు తదేకనిష్ఠతో నా శరణు పొందుము." ఇట్లు తన శరణు పొందుమని ప్రేరణను కలిగించి భగవంతుడు తానిచ్చిన ఇచ్ఛాస్వాతంత్ర్యమును తిరిగి తీసికొనెను. దాని భావార్థమిది. "నీ మనసునందెట్టి స్వాతంత్ర్యేచ్ఛయును కలిగియుండకుము. 'నా యిచ్ఛకాదు, అతని యిచ్ఛయే జరుగుగాక' అని యనుకొనుము. 'ఈ స్వాతంత్ర్యము నాకు అక్కరలేదు' అని నీకై నీవు అనుభవమునకు తెచ్చుకొనుము 'నేను లేను; అంతయు నీవే' అనుస్థితిని పొందుము." మేక బ్రతికియుండగా 'మేఁ మేఁ మేఁ – అనగా – నేను, నేను, నేను' అనును. కాని అది చనిపోయిన పిమ్మట దాని వెన్నెముకనుండి తీసిన నరమును దూదినేకు కమానునకు కట్టి నప్పుడు అది 'తుహీ' తుహీ, తుహీ – తుహీ, తుహీ, తుహీ, అని పలుకునని దాదూకవి చెప్పెను. ఇప్పుడంతయు 'తూహీ, తూహీ, తూహీ' – నీవే! నీవే! నీవే! (19–6–32)

ఓం తత్సత్.

# అనుబంధము

'గీతాప్రవచనములు' రెండవ అధ్యాయమున పదునెనిమిదవ పుటలో రజస్తమోగుణముల పోలికలు రూపింపబడినవి. అది పఠించిన యనంతరము తనకు గలిగిన యనుమానముల నొక సజ్జనుడు వినోబాజీకి విన్నవించిరి. హైదరాబాద్ సర్వోదయ యాత్రాపర్యటన సందర్భములో వినోబాజీ ప్రత్యుత్తర మొసంగిరి. ప్రవచన పాఠకులకు శంకాసమాధానముల వలని ఉపయోగము కలుగునను యుద్దేశమున నా రెంటిని ఇందు పొందుపరుచుచున్నాము.

ప్రశ్న : గీతాప్రవచనమున రెండవ అధ్యాయము 18వ పుటలో కర్మ నాచరించువారి ద్వివిధవృత్తులను ప్రవచించుచు రజస్తమోగుణముల తత్త్వ మొకటే యని నిర్వచించియుంటిరి. "కర్మలను స్వీకరించినచో ఫలసమే తముగనే యని రజోగుణ మను నని–ఫలమును వదలినచో కర్మలను సైతము వదలవలెను అని తమోగుణ మనునని" చెప్పియుండిరి. ఈ రెంటియందును భేద మేమియు లేదని మీరును అందురు. ద్వివిధ వృత్తులును రజోగుణము వనే లీనమగునని నా అభిప్రాయము. తమోగుణము-రజోగుణము – సత్త్వ గుణము 1 : 3 : 9 నిష్పత్తిలో ఒకదానినుండి మఱియొకటి దూరమున నున్నవి. రజోగుణము, తమోగుణము ఒక వృత్తియొక్క అన్వయ వ్యతిరేక స్వరూపములు కావు. కర్మనాచరించి ఫలమును త్యజించుట సత్వగుణము. కర్మలను స్వీకరించినచో ఫలసమేతముగనే, ఫలమును త్యజించినచో కర్మ సహితముగనే–యీ రెండును రజోగుణములో లీనము కావలెను. ఫలమును మాత్రము స్వీకరింతును, కర్మనాచరింపననుట తమోగుణముక్రిందకు వచ్చును. దీనికంటె భిన్నమగు మఱియొక వృత్తికూడ నుండగలదు. అయ్యది నిర్లక్ష్యత. (ఇండిఫరెన్సు) కర్మచేసిన చేయును, లేక పని జరిగిన జరుగును. ఫలాపేక్ష, జాగరూకత, అవసరము, మోహము మొదలగునవి యుండవు. అయినను ఫలము సంక్రమించిన స్వీకరించిన స్వీకరించును. కాని కర్మావశ్య కత, బాధ్యత మాత్రము గోచరింపవు. ఇట్టివృత్తి మానసిక పరిస్థితి కనుగుణ్య ముగా అప్పు డప్పుడు త్రిగుణములయందును కలుగుచుండును. జ్ఞాన శూన్య స్థితిలో నీ వృత్తి తమోగుణముకన్నను నికృష్టము. ధ్యాన నిమగ్న స్థితిలో సాత్వికగుణముకన్నను ఉత్కృష్టము.

సమాధానము : మీ విషయ మథనము నాకు నచ్చినది. త్రిగుణము లనేక రీతుల భావింపబడినవి, భావింపబడవచ్చును. తమోగుణముకన్న నికృష్ట మైనది, సత్వగుణముకన్న ఉత్కృష్టమైనదియు నగు వృత్తిని యూహించుట కవకాశము లేదు. జగత్తంతయు త్రిగుణాత్మకముగనే విభజింపబడవలని

యున్నది. త్రిగుణాతీతమై, నిర్లిప్తమైన స్థితి యొకటి గలదు. ఇయ్యది గుణాతీతుని భూమికయని గ్రహింప నగును. అందు ఎవ్విధమైన వృత్తియునుండదు. కావున దానిని నివృత్తి యందుము. అయితే నివృత్తి యనునది ప్రవృత్తికి వ్యతిరేకము మాత్రముకాదు. కాని ప్రవృత్తికి వ్యతిరేక మయిన దానిని కూడ ఒక వృత్తియే యనవలె. అదియే తమోగుణము.

ఇది ప్రస్తావన. ఇక ప్రస్తుతమునకు వత్తము. తత్త్వదృష్ట్యా త్రిగుణములు ప్రకృతి కంతర్గతములు. ప్రకృతిలో నీ మూటికి సమానావసరమేగలదు. స్థితి. గతి, ప్రకాశము — ఈ మూటి కలయికయే జీవితము. ఇది తత్త్వ దృష్టి. ఇందు ఉత్కృష్ట, కనిష్టతల తారతమ్యతలేదు.

దీనినుండి భిన్నమైనది నైతికదృష్టి. ఈ నైతిక దృష్టిలో తమస్సు – రజస్సు - సత్వము నొకదానికంటె నొకటి శ్రేష్ఠమైనది. సామాన్యముగా ప్రజ లీ దృక్పథముననే యోజింతురు.

సృష్టి తత్త్వమును తెలియజేయు ప్రాకృతిక–తాత్త్విక దృష్టులకంటెను, మఱియు నైతిక దృష్టికంటెను భిన్నమైన సాధనాదృష్టి యొకటి కలదు. అద్దానిననుసరించి రజస్తమము లొకదాని కొకటి ప్రతి క్రియారూపములుగానో. పరీక్షారూపములుగానో, లేక పూరకములుగానో కాగలవు. రెండును కలిసి ఒకే వస్తువగును. రజోగుణ మలసి పోయినపుడు తమోగుణమును, తమోగుణ మలసట జెందినపుడు రజోగుణమును వచ్చుచుండును. ఈ రెంటినుండి సత్వ గుణము భిన్నమయినది. ఈ సత్వమే సాధకునికి ఆప్తమిత్రునివలె సాయ పడును. రజస్తమములు ఆసురీసంపద, సత్వము దైవీసంపద. ఇవ్విధమున దైవాసుర సంపదలమధ్య సంఘర్షణము చెలరేగుచుండును.

గీతలో ప్రాకృతిక–నైతిక–సాధనికమగు త్రివిధ వివేచనలు లభించును. నేను ప్రాకృతిక దృక్పథమునగాక, నైతిక, సాధనిక దృక్పథములతోనే ముఖ్యముగా నాలోచించుచుందును. మఱియొకప్పుడు సాధనికముగను ఆలోచింతును. మీ ప్రశ్న సాధనిక దృష్టినుండి యుత్పన్నమయినది. ఇందువలన రజస్తమము లొకటిగా భావింపబడినవి. ఫలత్యాగమును గురించిన భావ నలు '*స్థితప్రజ్ఞదర్శనము'లోను, †గీతాయీకోష్ లోను విపులముగ వివరింపబడినవి.

---

* గీతయందలి స్థితప్రజ్ఞుని లక్షణములకు వ్యాఖ్యానముగా చెప్పబడిన ఉపన్యాస సంపుటి.

† అనష్టూపు చందస్సులో భగవద్గీతకు వినోబాజీ మహారాష్ట్రములో వ్రాసిన 'గీతాయీ' అను పుస్తకమునకు నిఘంటువు. ఇవి ఆంధ్రమున అనువదింప బడలేదు.

# చర్చలు - ఉదాహరణలు

## అ



## ఆ

## ఇ



## ఈ



## ఉ

## ఋ



## ఎ



## ఏ



## ఐ



## ఓ



## ఔ



## క

## ఖ



## గ

## జ్ఞ



## చ



## జ

## ట



## త

## య



## ర

## హ







# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA107B172 |
| పుస్తకం పేరు | గీతాప్రవచనములు |
| తారీఖు | 10 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 303 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | ci/6,BCi |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Jayalakshmi |
| పేజీలు విడదీసినది | Jayalakshmi |
| స్కాన్ చేసినది | Bhanu |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |